# వేంకట రామాయణము



గ్రంథకర్త

శారదాపుత్ర, విద్వాన్

**కసిరెడ్డి పల్లె వేంకటరెడ్డి**

రిటైర్డు తెలుగు పండితుఁడు

ఓరియంటల్ హైస్కూలు

ప్రొద్దటూరు



**1983**

ప్రథమ ముద్రణము     1000 ప్రతులు

జూలై – 1983

ప్రతి వెల     రు **25-00**

ప్రాప్తిస్థానము

గ్రంథకర్త

8/110, శ్రీరాములుపేట వీధి,

ప్రొద్దటూరు–516360



ముద్రణ :

శ్రీ జానకిరమణా ముద్రాక్షరశాల

తిరుపతి

## ACKNOWLEDGMENT

THIS IS TO ACKNOWLEDGE THAT
THIS BOOK IS
PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
UNDER THEIR SCHEME
'AID TO PUBLISH RELIGIOUS BOOKS'

*AUTHOR*



# కృతజ్ఞత

— ౦ —

గీ॥ నాదు వేంకటరామాయణంబు ముద్ర
ణమునకై యైదువేల రూప్యము లొసంగిన
శ్రీ తిరుపతి దేవస్థాన దాతల కవి
రతమును గృతజ్ఞతానమస్కృతు లొనర్తు

గ్రంథకర్త



ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డి
M A Ph D
తిరుపతి

# పీఠిక



శ్రీ కపిరెడ్డి పల్లె వేంకటరెడ్డి చిన్నవాటినుండి మా కుటుంబములో ఒకవ్యక్తిగా మెలగినవాడు దానికి కారణము మేము ఇరుగుపొరుగు ఇండ్లలో నివసించువారమగుటయే శ్రీ వేంకటరెడ్డి విద్వాన్ పరీక్షకు చదువుచు తిరుపతిలో మాయింటనేయుండి అప్పుడప్పుడు నన్ను సలహా లడుగుచున్నందున నాకు గొంత గురుస్థానము లభించినది అతడు బహు గ్రంథావలోకనపరు డగుటయేకాక తిక్కనరచితభారతభాగము నాపోశనము పట్టినవాడౌట అతని సహజకవితాధోరణికి ఆ కవిబ్రహ్మశైలి బాగుగా జతపడినది బాగుగ పరిశీలించి చూచినచో శ్రీ వేంకటరెడ్డి రచనలలో ప్రతిపుటయందును తిక్కనయే కాన్పించును

గ్రంథభాగమున నెచ్చటను చెప్పకపోయినను తాను ఈ రామాయణమును రంగనాథ రామాయణకథానుసారిగా వ్రాసినట్లు శ్రీ వేంకటరెడ్డి నాతో జెప్పియున్నాడు వాల్మీకమున లేని గాధలు–జంబునివధ, కాలనేమివృత్తాంతము, సులోచనాసహగమనము-వంటి వెన్నియో రంగనాథరామాయణమున గలవు రావాపుగా నవియన్నియు నీ నిర్వచనవేంకటరామాయణ మున గలవు శైవమతవ్యాప్తిని ప్రతిఘటించి వైష్ణవమతప్రచారమునకై వ్రాయబడినది రంగ నాథరామాయణము అది ప్రపత్తి, శరణాగతి మాత్రములకు కట్టువడిన భక్తితత్త్వమును ప్రతిపాదించునది శ్రీ వేంకటరెడ్డి రామాయణమునగూడ కొంత అస్పష్టముగానైన ఆలక్షణ ములే కాన్పించును

వాల్మీకిరామాయణకథానుసారిగా వ్రాయబడిన భాస్కరరామాయణము మొదలగువాని యన్నింటియందును గ్రంథమునకు పురాణరూపమునిచ్చు ఉపాఖ్యానములు, పెక్కు గలవు వానినన్నింటిని మన వేంకటరెడ్డి వదలి ఏకధాటిగా కథాగతిని నడపియున్నారు బాల కాండము రంగనాథమున 82 పుటలలో 2480 ద్విపదలవఱకు వ్యాపించియుండగా, ఈ గ్రంథమున నిదికేవలము 15 పుటలలో 114 పద్యములవఱకు మాత్రమే పరిమితమైయున్నది మూలమున గ్రంథవిస్తృతికి కారణములైన ఋశ్యశృంగునికథ, విశ్వామిత్రుని వంశక్రమ వర్ణనము, సగరరాజకుమారుల వృత్తాంతము, అంశుమంతుని గాథ, భగీరథుడు గంగను భూమికిదెచ్చుకథ, విశ్వామిత్రుడు బ్రహ్మర్షియైనవిధము, జనకుని వంశవర్ణనము మున్నగునవెన్నియో ఇందు పరిహరింపబడినవి

రంగనాథరామాయణకథాక్రమముతో పోల్చి చూచినపుడు కొట్టవచ్చినట్లు కన్పించు విషయము లీక్రిందివి

రంగనాథమున పరశురాముడు శ్రీరామునితో హరిహరసత్త్వముల పరీక్షలో హరి సత్త్వము గెలుపొందినవిధము వర్ణించును అది నమకాలమునాటి శైవవైష్ణవమతముల స్పర్ధను, కవి వైష్ణవుడగుటను సూచించును ఈ గ్రంథమున నా విషయము వదలబడినది

రంగనాథరామాయణమున శ్రీరామలక్ష్మణులు సీతాపహరణమునకు పూర్వమే జటాయువు నొకసారి సంధించినట్లు కలదు ఇట్లే వాల్మీకమునను గలదు కాని రంగ నాథమున 'ఈవనంబును నసురేంద్రసేవితము, కావున వైదేహిఁ గావుఁ డేమఱక' యని యా దాశరథులను హెచ్చరించినట్లున్నది కాని పితృసఖుఁడైన యాపక్షిరాజు హెచ్చరికను లక్ష్యపెట్టకపోవుట శ్రీరామునిశీలమున కపకర్షయని కాబోలు మనవేంకటరెడ్డి తన రామాయణ మున వారికి జటాయుదర్శనము సీతాపహరణమునకు తరువాత ఒక్కసారిమాత్రమే కలిగినట్లు కల్పించియున్నారు

హనుమంతుఁడు లంకఁగాల్చినప్పుడు సుందరకాండమున రెండుద్విపదల (సుందర ద్విపదలు 933–34) లో రాక్షసస్త్రీలు రావణుని నిందించినట్లున్నది మఱల సందే రావణునిమూలబలమంతయు నశించినప్పుడు 54 ద్విపదల (యుద్ధ ద్విపదలు 6083-6136) లో రావణమరణమును సూచించు కొన్ని దేవరహస్యములను బయల్పఱుచుచు నిందింతురు ఈరెండు ఘట్టములందలి వానిని ఔచిత్యభంగము కానివిధమున సుందర కాండకథాభాగముననే మన వేంకటరెడ్డి చేర్చి 13 పద్యముల (Pages 181–83) లో వర్ణించెను ఇదియెంతయు నొప్పియున్నది

రంగనాథరామాయణమున–వాల్మీకమునగూడ–శ్రీరాముడు సముద్రమునకు సేతువు గట్టున నున్నప్పుడే–సేతునిర్మాణమునకుపూర్వమే–రావణుడు కుంభకర్ణునితోడను, విభీషణునితోడను, ఇతరమంత్రులతోడను రహస్యాలోచనము జరిపెను, ఆ సందర్భముననే మహాపార్శ్వుడు రావణునితో తాను సీతాదేవిని బలవంతముగా ననుభవించియుండకూడదా? అని ప్రశ్నించినట్లును కలదు అప్పుడే రావణుడు పుంజికస్థలవృత్తాంతమును, బ్రహ్మశాపమును వివరించును కాని యీ నిర్వచనరామాయణమున గ్రంథవిస్తరభీతిచే గాబోలు కుంభకర్ణుని యుద్ధమధ్యమున (తొమ్మిదవనాడు) నిద్రలేపి రావణుడు మాటాడించిన ట్లొకచోటనే వర్ణించియున్నాడు ఇక రావణుని సీతావిషయకబలాత్కారమునచర్చ కుంభకర్ణునితోను తిరిగి ఇంద్రజిత్తు తెచ్చినట్లున్నది ముఖ్యులగు వీరులొక్కరొక్కరే మరణించుచుండగా జయము సందిగ్ధావస్థలో పడినప్పుడు అట్టి ఆలోచనచేయుట మిక్కిలి సహజము

కాలనేమిమరణము తరువాత ఆకాశమార్గమున వచ్చుచున్న హనుమంతుని భరతుడు చూచినట్లును, వేళకానివేళ రాత్రి కోతి కన్పించుట దుర్నిమిత్తముగా భావించి భరతుడతనిపై బాణప్రయోగము చేయబూనినటుల రంగనాథమున గలదు ఇచ్చట ఆ విషయము పూర్తిగా వదలబడినది రంగనాథమున ద్రోణాద్రి హిమవంతమునకంటె ఉత్తరమునమున్నట్లు వర్ణింపబడినది కాని వాల్మీకమున నాపర్వతము మలయగిరిలో నొకభాగమే మలయగిరి దక్షిణమున నున్నందున హనుమంతుని భరతుడు చూచుట అసంభవము అందుకే కాబోలు అది అసంగతవిషయమని మన వేంకటరెడ్డి దానిని పూర్తిగా విస్మరించెను.

రావణుడు అంత్యదశలో తన యగపాటు మందోదరితో చెప్పుకొని దుఃఖించుచు తనకిక దేవుడే (శివుడే) దిక్కని నిర్వేదము పొందును శుక్రునిదగ్గఱకు వెళ్ళి 'తాను బ్రతికియుండు మార్గముపదేశింప' గోరును ఇవి రావణుని ధీరోద్ధతకు వీరత్వమునకు భంగకరములు నిర్వచనరామాయణమున శ్రీ వేంకటరెడ్డి రావణుని ధీరోద్ధతునిగనే చిత్రించెను ఈ భావమే

> ''నిన్నీవిధంబున నిహతుగావించిన యా రాఘవుల ససైన్యముగఁబట్టి,
> హతముసేయుదునొండె నట్లుగాకయెయున్న వారిచే పోరిలో వీరమరణ
> మేను బొందెదనొండె నీ రెండుపద్ధతులందు నొక్కటి సిద్ధమగు''

నను (పుట 270 పద్య 715) పద్యమునగలదు ఇంద్రజిత్తు మరణించినపిదప రావణుడు చేసికొన్న నిశ్చయమది

బ్రహ్మహత్యాదోషపరిహారార్థము శ్రీరాముడు లింగప్రతిష్ఠచేసెనని రంగనాథరామాయణమున గలదు కాని వైష్ణవసంప్రదాయమునకు విరోధమగుట అది కేవలము అర్వాచీనుల చేర్పు కావోలునని వేంకటరెడ్డి భావించి వదలెను

[illegible]

ఇచట 'తప్పొప్పులపట్టిక' నుగూర్చి కొంత చెప్పవలసియున్నది ఈ గ్రంథము చదువువారు పండితులేకాని పాఠశాలలయందలి విద్యార్థులుకారు తప్పులవలె కన్పించు ఒప్పులు' ఎన్నో యిందున్నవి అవగా ౦ 'ట' ఒత్తు 14 చోట్లను, ౢ 'ల' ఒత్తు 19 చోట్లను, ౼ 'ఐ' త్వముగుర్తు 13 చోట్లను ఉండవలసినచోట్ల లేనట్లు కన్పించును కాని బాగుగా పరిశీలించిచూడగా కొన్నిచోట్ల అవి స్పష్టముగాను, కొన్నిచోట్ల అస్పష్టముగాను, కొన్నిచోట్లమాత్రమే లేనట్లును కన్పించును అనగా ముద్రణసమయమున యంత్రముతో బిగింపు సరిగా లేని కారణమున అవి నడుమ– కొన్నిప్రతుల ముద్రణము ఐనపిదప– రాలిపోయినట్లు తెలియును 'ఇట్టులనియె' లో '౦', 'ఎట్లన' లో ' ' ఎగిరిపోయినంత మాత్రమున అర్థము చెడదు అట్లే ఐత్వముగుర్తుకూడ కావున వానిని తప్పొప్పుల పట్టికలో చేర్చలేదు అట్లే కొంతభాగము అఱిగిన ముక్కలు–తప్పొప్పులపట్టికలోచేర్చలేదు అట్టివి 22 ఉన్నవి ఉదా ఇనకుల (పుట 69 పంక్తి 14) లో 'కు' లోని కొమ్ము భాగము అస్పష్టముగా అన్నిప్రతులలో కన్పించును అట్లే 'మారీచుని' (పుట 76 పంక్తి 23) లో 'మా' లోని దీర్ఘము అస్పష్టముగా తెలియుచునేయున్నది 'ఇంద్రారి' (పుట 146 పంక్తి 25) లో ్ర ఒత్తు సగము తెలియుచున్నది అట్టివి తప్పులుకావు కావున వానిని కూడ పైపట్టికలో చేర్చలేదు 'ప–న' అను రెండక్షరములు ఒకదానికొకటి 28 స్థలములలో పడినవి నిజముగా తప్పులని తెలియువాని నన్నింటిని తప్పొప్పులపట్టికలో చేర్చితిని పండితులైన పాఠకులు పైవానిలో వేనినిగూడ తప్పులుగా భావింపరు

శ్రీ వేంకటరెడ్డి ఇదివరకే కొన్ని కృతులు రచించియున్నారు అవి (1) పారిజాతాపహరణనాటకము(ముద్రితము), (2)గాంధిగారి స్తుతిగీతములు (ముద్రితము), (3)వీరభద్రస్వామి జన్మకథాపద్యరత్నమాల (ముద్రితము), (4) బకాసురవధ, (5) దేవచూడామణిశతకము, (6) ద్వితీయనివాహము (సాంఘికనాటకము) కడమ మూడును అముద్రితములు

ఇట్లు
సుధీవిధేయ
శ్రీరెడ్డి చెన్నారెడ్డి

M.A , Ph D
శతావధాని
ప్రొద్దుటూరు–516360

శ్రీమన్నిర్వచనవేంకటరామాయణ మొక యపూర్వ గ్రంథము ఇందు అయోధ్యా కాండము, అరణ్యకాండము, ఆయోధనకాండము అనుమూడు పరిచ్ఛేదము లున్నవి ఈ మూటిలోనే కథయంతయు సంగ్రహింపబడినది అయోధ్యాకాండమున బాలకాండకథ, అరణ్యకాండమునఁ గిష్కింధాసుందరకాండద్వయకథ యిమిడింపఁబడినది మొత్తముమీద షట్కాండకథ త్రికాండపరిమితము చేయబడినదని, అవఁగా గ్రంథభారము సగానికి సగము తగ్గింపఁబడినదని సూచించుట కాఁబోలు

కర్త శ్రీ కసిరెడ్డి పల్లె వేంకటరెడ్డిగారు విద్వన్మతల్లిక మన్మిత్రము ఋజు స్వభావుఁడు పద్యశైలిచూచినచో ఆయార్ణవము కేటపడును పద్యములకూర్పు జిలేబి చుట్టలవలె మృదువుగను మధురముగను నుండుట ఇందలి విశేషము

ఈ శారదాపుత్రుడు దాదా పిరువదియేండ్లక్రితము 'పారిజాతాపహరణ' నాటకము వ్రాసి ప్రకటించిరి నాటకరచనలోఁ జేయిదిరిగినవ్యక్తి శ్రవ్యకావ్యము వ్రాసినచో రూపక లక్షణము లెంత యుట్టిపడినట్లు చిత్రింపఁగలఁడో యీ గ్రంథమునఁ జూడనచ్చును బలిజేపల్లి, చిలకమర్తి వంటి స్టేజినాటకకవులు ముద్దులు మూటగట్టు సీసపద్యములతో సామాజికుల నావర్జించికొనిరి అట్టి సీసముల వల్లుటలో వీరిది యెత్తినచెయ్యి

'ఇదిగో నా ప్రతిజ్ఞ' అని శ్రీ కృష్ణుఁడు చెప్పిన సీసము చూడుఁడు

॥ ఉడుగణంబులవెల్ల నూటాడి ధరణిపైఁ ద్రెళ్ళిన నొకవేళఁ ద్రెళ్ళుఁగాక,
దిక్కులెన్మిదియును నొక్కచోటికివచ్చి చేరిన నొకవేళఁ జేరుఁగాక,
భూమియు నాకసంబును దలక్రిందుగాఁ దిరిగిన నొకవేళఁ దిరుగుఁగాక
భానుబింబము శీతభానుబింబము కాంతిదప్పిన నొకవేళఁ దప్పుఁగాక,
॥ మఱియు నేమైన వగుఁగాక మఘవుఁ డమరవాహినులతోడ వనికిఁ దా వచ్చుఁగాక,
యుగ్రశమంబున నిర్జించి యబ్జవదన! దేవతావృక్షమును నీకుఁ దెచ్చియిత్తు
(పారిజాతాపహరణనాటకము)

ఇట్టి నడకగల సీసము లీ రామాయణమున లెక్కలేనన్ని యున్నవి

అశోకవనమున హనుమతో జానకి యన్నమాటలు సీసపుమూసలో నెంత చక్కఁగా వమరినవో

'పదిమాసములనుండి పంక్తికంఠునివీటఁ బడరానియిడుమలఁ బడితినమ్మ'

(అరణ్యకాండము 759) పద్యముఁ జూచిన దెలియును

రంగనాథరామాయణకథాసూత్రము బట్టికొని, యీ కవి కట్టిన యుత్పలమాలాదు లెంత మనోహరముగ నున్నవో చూడుడు

ఉ॥ అట్టి మహాత్ముఁ గానలకు వక్కటికం బొకయింత లేక నే
నెట్టులఁ బంపఁగోరుదు? మహీశుఁడు దీనికి సమ్మతించునే?
తిట్టరె లోకులెల్ల? నను ద్రెక్కొనదే దురితంబు ఘోరమై?
కట్టా! తలంప నీ కలుషకార్యము సేయఁగఁబాడియే? సఖీ! (అయో 128)

మ॥ అభిమంత్రించి సురాసురుల్ బెగడ బ్రహ్మాస్త్రంబు నా వానర
ప్రభుపై నేయుటయున్ మహాచటులభంభద్రౌద్రకీలాగ్నినా
నభమున్ దిక్కులు నాక్రమించుకొని మంటల్ గ్రక్కుచుం దద్దయున్
రభసంబొప్పఁగ దారుణప్రభలతో రాసాగె నయ్యస్త్రమున్
మత్తేభవిక్రీడితమున ఇంద్రజిద్బ్రహ్మాస్త్రప్రయోగము.—అరణ్య—908

అంటవేయుఁ దనురులచేతికిఁ జిక్కెనని విన్నసీత

'కాయతెగి యేటిలో మున్గిపోయినవట్టి నరునిచంద మయ్యెను గద నాయవస్థ' అనుకొన్నదట (అరణ్య 970) ఇందలి యుపమ పరమ రమణీయము

'తాసె' చర్మవాద్యవిశేషము దీనిని 'తుడుము' అనికూడ అందురు 'తాసె యిందాక నిఘంటువుల కెక్కలేదు ఇది మాండలికము హనుమంతునితోకకు వ[...] ముట్టించి, తప్పెట్లతోఁ, దాసెలతో నూరేగించినారట వేంకటరెడ్డిగారు పల్లెలలో వాడుకలి నున్న మాటలెన్నియో పొసగించి భాషకు వన్నెఁదెచ్చిరి

ఈ గ్రంథము చేతికిఁదీసికొన్నచో వదలుటకు బుద్ధిపుట్టదు తుదిదాకఁ జదుఁ వలెననిపించును ఇది రచనలోనివిశేషము 'రామేశ్వరు చారిత్రము వెంథతెని గతులన్ వర్ధించినం గ్రాలదే' అన్నారు పావరాజు. విభము

సి వి. సుబ్బన్న - శతావధాః
19–6–1983

విశ్రాంతిగైకొనుచున్న తెలుగుపండితుడు శ్రీ కసిరెడ్డి పల్లె వేంకటరెడ్డి విద్వాన్, శారదాపుత్రుడు రచియించిన శ్రీమన్నిర్వచనవేంకటరామాయణము అను గ్రంథమును నేను స్థాలీపులాకన్యాయముగా చదివితిని ఈయన కడపమండలమునకు చెందినవాడగుటచే ఆ సీమకు సహజమైన నిర్గళకవితాధోరణి ఈతనికిని లభించినది ధార మహాధారాళము శైలి చాలుప్రసన్నము నిర్దుష్టములైన సంస్కృతసమాసములతో, తేటతెలుగుపదములతో భావము మరుగుపడక గుణీభూతవ్యంగ్యమర్యాదతో పద్యరచన సాగినది

ఉత్తరరామాయణము తిక్కనచేతిలో నిర్వచనముగా తీరినది పూర్వరామాయణములు కొన్నిమాత్రము ముందే నిర్వచనముగ తీరియున్నవి ఈ వేంకటరెడ్డిగారు గ్రంథ నామకరణములోనే 'శ్రీమన్నిర్వచనవేంకటరామాయణము' అని తీర్మానించినారు వీరి రామాయణములో పూర్వరామాయణమంతా మూడుకాండలలో ముగిసినది అవి 'అయోధ్యా, ఆరణ్య, ఆయోధనకాండములు శ్రీరామాదులు అయోధ్యలో ఉన్నకాలమందు జరిగిన కథంతా అయోధ్యాకాండ దానిలో బాలకాండకథ కలిసిపోయినది సీతారామలక్ష్మణులు ఆరణ్యమువం దున్నప్పుడు జరిగినకథంతా అరణ్యకాండ అందులో కిష్కింధా, సుందర కాండలకథయంతయు చేరినది, ఇక యుద్ధకాండ అన్నిటియందు ఒక్కటే

అయోధ్యాపురవర్ణనముతో ప్రారంభమైనది ఈ రామాయణము వాల్మీకి రామాయణముతో పోల్చిచూచినచో ఈ రామాయణము కాండల విషయమునకేకాక కథాకథన విషయమునను చాల సంగ్రహస్వరూపమే ఉదాహరణమునకు విశ్వామిత్రుడు తనవెంట రామలక్ష్మణులను తీసికొని తన యజ్ఞరక్షణకు వెళ్ళునప్పుడు మార్గమధ్యములో ఆరాజకుమారులకు ఆ మహర్షిసత్తముడు చాలకథలు చెప్పినట్లు శ్రీవాల్మీకమునం దున్నది కాని మనకవిగారు

'చనుచోఁ గౌశికుఁ డచ్చటచ్చటి విశేషంబుల్ కుమారోత్తముల్
వినియం బెంతయుఁబోఁ దవ్వడిగినవ్ వేర్వేర వర్ణించి యుం
పున వాక్రుచ్చుచుఁ గొంతదవ్వరుగుడున్ భూపాత్మజుల్, రాఘవుల్
ఘనమార్గశ్రమమొంది రట్టియెడలం గారుణ్యవారాశియై (అయోధ్య–35)

అని చాల చమత్కారముగ ఒక పద్యముతో సంగ్రహించి చూపినారు ఈ గుణము వీరికే క్రొత్తగా కలిగినదికాదు ప్రథమానువాదకులైన మన భారతగ్రంథకర్తలనుండి వచ్చుచున్నదియే.

కడపమండలమున అధ్యాత్మవిద్యానిధులు, పరమపరాక్రమధనులు, సమఉజ్జీలుగా పుట్టినారనుట నిజము కడపమండలమున పుట్టిన పలువురికి సాహిత్యపుప్రీతి, కవిత్వ విద్యానిర్వహణము, ఉగ్గుబాలతో వచ్చుచున్నట్లు ఊహింపవచ్చు మన ప్రబంధకవులలో పలువురు కడపమండలమున పుట్టినవారే పోతన, అన్నమయ్యవంటి తపోనిధులుకూడ కడపమండలమువారే మనకవిగారు తన సహజమైన ధోరణిలో మందరచే కైకక్కు చెప్పించినమాట

'కుక్షి నవమాసములుమోసి కొడుకునుగని, కరము గారాబమునఁ బెంచు కన్నతల్లి కాత్మజుఁడె యస్పమిడఁ డింక నతివమిన్న, సవతికొడు కెంతపోషించు? జాలినొంద'
(అయోధ్యా 130)

అట్లే కైక మందరతో చెప్పిన పల్కులు

'కౌసల్యానతికిం దదాత్మజునకున్ క్ష్మాజాతకున్ నేమనున్
నా సూనుండును వాదు కోడలును దైన్యంబొప్ప నక్రాంతమున్
దానత్వం బొనరింపకుండఁ గరుణం దప్పించి రక్షించితో
దాసి! నీ ఋణ మీగనేరనుగదా! తథ్యంబు వేయేండ్లకున్' (అయోధ్య 135)

ఎంత లోకసామాన్యములో చూడుడు

విభీషణుఁడు శ్రీరాముని శరణుజొచ్చునపుడు చేసిన దండకస్తోత్రము చాల రమ్యముగా నున్నది శుకసారణులు రావణునకు శ్రీరాముని సైనికులనుగూర్చి చెప్పినమాటల పౌరుషోత్తంసములు

ఇక కవిగారు కైకచే దశరథుని దెప్పిపొడిపించునపుడు "వారు నీవలె నేడ్చియున్నా చెపుమ" "ఈ వరద్వయ మీలేక యేడ్వనేల? (అయోధ్యా 166–167) మొదలగు పద ములలోని పదబంధము అంత ఉదాత్తముగలేదని చెప్పవలసియున్నది అట్లే "వ ప్రాగల్భ్యములు పల్కి తుట్టతుదకు (అయోధ–167) దీనిలో ధర్మధర్మిభావము లోపించె వట్లు కనిపించుచున్నది ఇట్టి చిన్నిచిన్నిపుడకలు ఏరివేస్తే ఈ రామాయణపానకమంత మనోహరమే

ఇట్లు
గౌరిపెద్ది రామసుబ్బశర్మ




శారదాపుత్ర, విద్వాన్

కసిరెడ్డి పల్లె వేంకటరెడ్డి


# కృతజ్ఞతాభివందనములు

1922వ సంవత్సరము జూన్‌నెల 30వ తేదిన కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా పర్లపాడుగ్రామమున నేను జన్మించితిని. చిన్నతనమున ప్రాథమిక పాఠశాలలో నాలుగైదు తరగతులవఱకుఁ జదివితిని. నా చదువు కేవలమల్పమైనది. పూర్వజన్మ సంస్కారమువలనఁ గొంత కవిత్వమబ్బినది.

మా పర్లపాడు గ్రామవాస్తవ్యులైన శ్రీ జీరెడ్డి కొండారెడ్డిగారి కుమారులగు పురాణము కొండారెడ్డిగారును, తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయమున నాంధ్రశాఖలోఁ బనిచేసి ప్రఖ్యాతిగడించిన శ్రీ చెన్నారెడ్డి, ఎమ్ ఎ, పి హెచ్ డి గారును, నాకు సహపాఠియు సహజకవియునైన శ్రీ సుబ్బారెడ్డిగారును విద్యత్కుటుంబమునకుఁ జెందినవారు, సద్బాల్యస్నేహితులును- ఈ ముగ్గురుసోదరుల సాహచర్యము నా కవిత్వమునకు మఱింత దోహదకారియై గ్రంథరచనకు దారిఁజూపినది. ప్రారంభదశలోఁ జిన్నగ్రంథములను గొన్నిఁటిని వ్రాసితిని.

నా కవిత్వశైలినిజూచి నన్ను మంచికవిగాఁ జేయవలయుననిభావించి సదయ హృదయులును, మదీయ గురుతుల్యులునగు శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డిగారును, తద్ధర్మపత్ని శ్రీమతి కమలమ్మగారును నన్ను దమవానిఁగానెంచి, తమయింటియందే నాకన్నపానాది సౌకర్యములను గల్పించి పరీక్షకు వలయు పుస్తకములనన్నింటిని నుచితముగానిచ్చి నాచే విద్వాన్ జదివించి నా భావిజీవనోపాధికిఁ బునాదివేసిరి. ఆపుణ్యదంపతుల మహోపకార [illegible]

మా గ్రామస్థులగు కీర్తిశేషులు 'కవిరత్న' చెమికల చెన్నారెడ్డిగారు చెన్న రామాయణము, కీర్తిశేషులు 'బాలకవి' కసిరెడ్డి వేంకటసుబ్బారెడ్డిగారు బాలరామాయణము రచించుటఁజేసి, నేనును రామాయణ కావ్యరచనాకుతూహలుఁడనై 'శ్రీమన్నిర్వచన వేంకటరామాయణము' ను వ్రాసితిని

నా యీరామాయణము నామూలాగ్రముగాఁ జదివి, సర్వాంగసుందరముగాఁ బరిష్కృతముఁజేసి శ్రమకోర్చి తదీయముద్రణాది కార్యభారములన్నియు నిర్వహించి సద్భావముతోఁ పీఠిక వ్రాసిన మహామేధావులును, మహానుభావులునైన శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి గారికి నేనెంతయో ఋణపడియున్నాడను వారికి నాపైఁగల వాత్సల్యాతిశయమునకు నా కృతజ్ఞతానమస్కృతు లర్పించుచున్నాడను

నా రామాయణ ముద్రణవ్యయమునకై ధనసంపాదనవిషయమునందుఁ దన సంపూర్ణ సహకారమందఁజేసిన గౌరవనీయుఁడు సోదరతుల్యుఁడునైన విద్వాన్ శ్రీ నాగసిద్ధారెడ్డిగారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను

నేను గోరినంతనే నాకోరిక మన్నించి నా రామాయణమునకు సదభిప్రాయముతోఁ దమ శుభాశీస్సులను వ్రాసి పంపిన సుప్రసిద్ధ సాహిత్య కళాపోషకులు, సహజసౌజన్య స్వభావులునైన 'శతావధాని' శ్రీ సి వి సుబ్బన్నగారికి, 'శతావధాని' శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారికిని నా కృతజ్ఞతాభివందనము లొనరించుచున్నాఁడను

నేనింతకుపూర్వము 'పారిజాతాపహరణ' నాటకమును సైతము రచించి ముద్రింపఁజేసియుంటిని తన్ముద్రణమునకుఁ నన్నుఁ బ్రోత్సహించి శ్రద్ధతో సహకరించిన పరమోపకారపారీణులగు శ్రీ సి వి సుబ్బన్నగారికి, ప్రొద్దుటూరు నివాసులగు శ్రీ పై జయరావుగారికి, పర్లపాడు గ్రామవాసులైన శ్రీ కె వి సుబ్బారెడ్డిగారికి నా కృతజ్ఞతా నమోవాకములు

ఇట్లు

కసిరెడ్డి పల్లె వేంకటరెడ్డి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 15 | వార్తము | వార్షము | 41 | 21 | కదలి | కదలిరా |
| 2 | 18 | డుధ్వర | డిధ్వర | 42 | 17 | యున్న | యున్న |
| 5 | 11 | నిర్టర | నిర్ఝర | 42 | 19 | పగిఁన | సఁగిన |
| 6 | 4 | జూన్నకు | జొన్నకు | 42 | 25 | అండు | అందు |
| 9 | 1 | తనచు | తపదు | 45 | 18 | కనుమ | కమచు |
| 9 | 3 | ఛీత | భీత | 52 | 8 | రామవ | రామావ |
| 9 | 10 | అగుగు | అరుగు | 52 | 14 | కొమదుఁ | కొమరుఁ |
| 10 | 24 | నెక్కడి | నెక్కడి | 52 | 18 | లింని | లించి |
| 11 | 11 | గన్నగ | రన్నగ | 55 | 10 | లంజక | రంజక |
| 11 | 27 | నలులు | ఎల్గులు | 57 | 14 | దెపంబు | వెపంబు |
| 13 | 19 | నిస్ఫూర్తి | విస్ఫూర్తి | 60 | 11 | పిర్మించు | నిర్మించు |
| 14 | 3 | ఘూజవ | భూజన | 62 | 7 | శతి | శలి |
| 16 | 18 | వసిసా | వసిషా | 62 | 24 | లేచుఁడు | రేచుఁడు |
| 18 | 4 | విశ్వాసిం | పిశ్వసిం | 63 | 17 | ననచు | ననుచు |
| 18 | 5 | వరవ | వర్తఁ | 67 | 14 | ప్పచ్చ | పృచ్ఛ |
| 19 | 8 | తొడపు | తొడవు | 68 | 23 | దుర్బలు | దుర్బల |
| 20 | 6 | ప్రమూద | ప్రమోద | 68 | 26 | యమ్నల | యన్నల |
| 21 | 6 | దానిపు | దారిపు | 71 | 20 | దీసింప | దీపింప |
| 25 | 28 | వటనుండి | నటనుండి | 73 | 24 | నుక్కక్కి | నుక్కక్కి |
| 27 | 9 | నొవరు | నొనరు | 76 | 20 | గంపితు | గంపితుం |
| 28 | 24 | టెదలి | బెదలి | 77 | 18 | సగ్గుణో | సద్గుణో |
| 37 | 4 | బురగ | బురజ | 77 | 19 | శ్రేష్ట | శ్రేష |
| 38 | 22 | ప్రక్కణ | పక్కణ | 78 | 8 | భావవ | బావన |
| 39 | 17 | గాంగు | గానకు | 80 | 11 | దాల్చ | దాల్చి |
| 39 | 22 | వెల్ట | నెల్ల | 80 | 24 | నారిజ | వారిజ |
| 39 | 25 | టోదు | టోదు | 81 | 24 | కెదర | బెదర |

తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 84 | 10 | పాం(ద్రపు | సాంద్రము | 200 | 24 | బట్టు | బట్టు |
| 87 | 3 | యాయె | యామె | 204 | 6 | ఘావేత | భూనేత |
| 89 | 3 | వచ్పితే | వచ్చితే | 205 | 18 | సేవన్ | సేనన్ |
| 91 | 23 | నిమావా | విమానా | 214 | 9 | బెఱ( | జెఱ( |
| 92 | 6 | రాదట | రాదటు | 216 | 14 | విట్టు | నిట్టు |
| 92 | 11 | ఏంఓంచి | వచించి | 217 | 12 | దాము | రాము |
| 94 | 13 | పీట్రు | పీరు | 218 | 1 | వెగమెన్ | వెగపెన్ |
| 103 | 21 | మిాచేతి | మిాచేతి | 218 | 12 | వాగ్యిపి | వాగ్వి |
| 103 | 23 | హృతయుం | హృదయుం | 220 | 1 | యుద్దార్థు | యుద్ధార్థు |
| 104 | 1 | ఇంటుగ | ఇంబుగ | 220 | 9 | గిశపతి | గిశతతి |
| 108 | 2 | స్పరరో | ప్పరో | 222 | 26 | ప్రాప్తిచు | ప్రాప్తించు |
| 113 | 21 | బ్రాకటం | బ్రాకటం | 230 | 7 | తంబుల్లె | తంబులై |
| 128 | 10 | కేదు | కేగు | 231 | 2 | తడపు | తడవు |
| 128 | 12 | నివయి | వినయ | 257 | 25 | కేపి | జేపి |
| 134 | 26 | ప్రుమోద | ప్రమోద | 259 | 20 | విష్ఠయున్ | నిష్ఠయునే |
| 135 | 24 | నస(గ | నవ( | 261 | 4 | పృవ | పృష్ఠ |
| 151 | 5 | టిర | స్థిర | 262 | 2 | వాకు | నాకు |
| 154 | 2 | వెమ్మ( | వెన్న( | 277 | 21 | వృత్తి(గొవి | వృత్తి(గొని |
| 156 | 1 | యివ్యిధ | యివ్విధి | 280 | 20 | తనను | తనదు |
| 156 | 23 | హనిమం | వానుమం | 293 | 5 | భేద్యంబు | భేద్యంబుగా |
| 160 | 26 | యిచట | యిట | 297 | 2 | అతిమతి | అతిముతి |
| 169 | 19 | రింటుగా | రంబుగా | 308 | 6 | నాదానీదె | నాదానీడ |
| 170 | 6 | పరిఘుయె | పరిఘమె | 310 | 26 | చునుండె | చుంగె |
| 192 | 19 | ఘన | ఘన | 313 | 18 | దొళ్గక | దొ్ఁక |
| 192 | 20 | వాపి | వాని | 315 | 16 | పూర్యము | పూర్వము |
| 194 | 22 | దశావస | దశానన | 338 | 5 | దత్యంన | దత్యంత |
| 198 | 22 | జానాకి | జానకి | 343 | 13 | శబ్దము | శబ్దము |

# విషయసూచిక



## అయోధ్యాకాండము

[illegible]

| విషయము | పుట |
|---|---|
| భరతుఁడు రామునికడకు సపరివారముగా బయలుదేరుట | 51 |
| గుహుఁడు భరతునిపైఁగోపించి నిందించుట | 52 |
| భరతుఁడు భరద్వాజమహాముని దర్శించుట | 53 |
| సపరివారుఁడైన భరతునిజూచి లక్ష్మణుఁడు కోపించుట | 53 |
| భరతుఁడు సపరివారముగా సీతారామలక్ష్మణ సమేతుడైన రాముని దర్శించుట | 54 |
| దశరథుని మరణమునకు సీతారామలక్ష్మణులు దుఃఖించుట | 55 |
| భరతుఁడు శ్రీరామునయోధ్యకు రమ్మని ప్రార్థించుట | 56 |
| భరతుఁడు రామునిపాదుకలనుగొని యయోధ్యకుఁబోవుట | 59 |
| భరతుఁడు రామపాదుకాపట్టాభిషేకము చేయుట | 59 |

## ఆరణ్యకాండము

| విషయము | పుట |
|---|---|

| విషయము | పుట |
|---|---|

| విషయము | పుట |
|---|---|


## అయోధనకాండము

| | |
|---|---|

విషయము | పుట

| విషయము | పుట |
|---|---|
| రావణుఁ డింద్రజిత్తుతోఁ దనకుబ్రహ్మశాపమిచ్చిన వృత్తాంతమును దెలుపుట | 230 |
| మూర్ఛితులగు రామలక్ష్మణులఁజూచి విభీషణాంజనేయులు శోకించుట | 231 |
| హనుమంతుఁడు ద్రోణపర్వతమును దెచ్చుట | 234 |
| రావణుఁ డతికాయుని యుద్ధమునకుఁ బంపుట | 235 |
| అతికాయాదిరాక్షసవీరులు యుద్ధములో హతులగుట | 236 |
| రావణుఁడు నిద్రితుఁడైన కుంభకర్ణుని సభకు రావించుట | 237 |
| రావణకుంభకర్ణుల పరస్పరసంభాషణము | 238 |
| కుంభకర్ణుఁడు యుద్ధమునకు వెడలుట | 240 |
| కుంభకర్ణుఁడు విజృంభించి కపిసేనలతోఁ బోరుట | 243 |
| శ్రీరాముఁడు లక్ష్మణసమేతుఁడై కుంభకర్ణునితోఁ బోరుట | 244 |
| శ్రీరాముఁడు కుంభకర్ణుని వధించుట | 246 |
| రావణుఁడు కుంభనికుంభులను యుద్ధమునకుఁ బంపుట | 247 |
| సుగ్రీవాంజనేయులు కుంభనికుంభులను వధించుట | 248 |
| ఇంద్రజిత్తు మాయాయుద్ధము | 249 |
| ఇంద్రజిత్తు మాయాసీతను రామలక్ష్మణుల యెదుట నఱకుట | 250 |
| మాయాసీతమృతికై రామలక్ష్మణులు వానరులు శోకించుట | 251 |
| మాయాసీతమృతికై శోకించు రాముని విభీషణుఁ డోదార్చుట | 252 |
| ఇంద్రజిత్తు మాయాకల్పితములైన రామలక్ష్మణుల తలలను సీతకు జూపుట | 253 |
| ఇంద్రజిత్తు నికుంభిలయాగము చేయుట | 254 |
| రావణుఁడు సపరివారముగా యుద్ధమునకు వెడలుట | 255 |
| శ్రీరాముఁడు లక్ష్మణుని ఇంద్రజిత్తుపైకి యుద్ధమునకుఁ బంపుట | 257 |
| వానరు లింద్రజిత్తు నికుంభిలయాగమును జెడఁగొట్టుట | 258 |
| ఇంద్రజిత్తు రోషావేశముచే విజృంభించి కపులతోఁ బోరుట | 259 |
| విభీషణమేఘనాదుల పరస్పరప్రతారణము | 260 |
| లక్ష్మణ మేఘనాదుల యుద్ధము | 263 |

ṣయము ఫుట

విషయము

## ఇష్టదేవతాస్తుతి

పుట్టింపం బోషింపన్, గిట్టింప సమర్థులగుచు నెగడు త్రిమూర్తుల్
నెట్టన మద్విబుధులగుట, మొట్టమొదట వారిఁదలచి మొదలిడుదుఁ గృతిస్ 1

## సరస్వతీ, లక్ష్మీ, పార్వతులస్తుతి

అజునిరాణిని హరిరాణి హరునిరాణి, విమలవాక్సిద్ధికొఱకు డెందమునఁ దలఁచి
సులభశైలీప్రబోధవిస్ఫురణఁదోప నవ్యవేంకటరామాయణము రచింతు 2

## వినాయకస్తుతి

శ్రీవేంకటరామాయణ, పావనకావ్యంబు నేను వ్రాయఁగడఁగితిం
గావింపకు విఘ్నము, సేవింతును విఘ్నరాజ! చిత్తమున నినున్ 3

## గురుస్తుతి

ఎన్నన్ నాలుగుభాషలందు ఘనసాహిత్యంబు నార్జించి కాఁ
గన్నాకై విబుధాళిలోఁ దిరుపతిన్ ఖ్యాతిన్ విరాజిల్లు శ్రీ
చెన్నారెడ్డిని సత్కవిత్వగురునిన్ జీరెడ్డివంశోద్భవుం
జెన్నారంగ మహామనీషిని హితైషిన్ భక్తిమై వేడెదన్ 4
పర్లపాడుగ్రామమున విద్వత్కుటుంబ, మందు జన్మించి తిరుపతియందు స్థిరని
వాసుఁడై పెక్కు లున్నతపదవులంది, ఖ్యాతిఁగన్న చెన్నారెడ్డిగారి నెంతు 5
నిత్యానిత్యవివేకశాలిని మహావిత్ప్రబోధున్ దయా
సత్యజ్ఞానరతున్ జితేంద్రియుఁ దపస్స్వాధ్యాయసత్కర్మరున్
నిత్యానందుని సార్థతత్త్వగురునిన్ జీరెడ్డివంశోద్భవున్
దైత్యారిస్తుతిమగ్ను నెంతు శతపత్రగ్రంథకర్తన్ మదిన్ 6

## సుకవిజనస్తుతి

జగతిఁగలయట్టి వరకవీశ్వరుల నెల్ల, భక్తితాత్పర్యములఁ జేసి ప్రస్తుతించి
సతతధర్మార్థకామమోక్షప్రదమగు, రామదేవునిచరితంబు వ్రాయువాఁడ 7

## పూర్వకవిప్రశంస

శా॥ శ్రీరామాయణపుణ్యకావ్యము జగచ్ఛ్రేయోభిలాషంబు గై
వారన్ వాల్మీకి భాస్కరాదిసుకవుల్ విఖ్యాతులై యెందఱో
ధీరుల్ మెచ్చ రచించినారలయినన్ శక్తిన్ దేవుఁ డర్థాపివే
యారూఢస్థితిఁ బ్రోత్సహించుటయు వ్రాయంబూనితిం దత్కృపన్

మ॥ అమితోత్కంఠను బాలకాండము నయోధ్యాకాండ మారణ్యకాం
డముఁ గిష్కింధయు సుందరంబనెడి కాండంబుల్ మహాయుద్ధకాం
డమునన్ వ్రాసిరి పూర్వపుంగవులు షట్కాండంబులైయుండఁ గాం
డములాఱింటిని మూఁడుకాండములుగా వ్రాయంగ నేఁ బూనితిన్

కం॥ కోరిరచియించెదనయో, ధ్యారణ్యాయోధనంబులనుకాండము లొ
ప్పారం ద్రికాండమగునా, యీరామాయణము సుకవిహృద్యంబగుతన్

## కవిస్వీయచరిత్రము

ఉ॥ శ్రీయలరారఁ బల్లె కసిరెడ్డికులంబునఁ బుట్టి మిక్కిలిన్
న్యాయపరుం డమాయకుఁడు నార్యుఁడు వెంకటరెడ్డి, తల్లుతుల్
పాయకనల్వు, రందుఁ బితవంటిగుణాఢ్యుడె బాలిరెడ్డినా
ధీయుతుఁడౌకుమారుఁడు తృతీయుఁడు తాను యథార్థవాదియై

ఉ॥ ఆరయ బాలిరెడ్డి కడు హాస్యకథాచతురుండునాగఁ దాఁ
వేరుగలట్టివాఁ డతఁడు పెంపెసలారఁగ శీలగౌరవో
దారగుణాఢ్యయై తనరు దారమ జేకొనె రామమాంబమన్
వారికి ముప్వురాత్మజులు వావిరఁబుట్టిరి యిద్వురాత్మజల్

గీ॥ వెలయవారలలోన గోవిందురెడ్డి, యుమతి పెద్దవేంకటరెడ్డియును దలంప
సుగుణవతి పెద్దవెంకటసుబ్బమాంబ, చిన్నవేంకటసుబ్బమ్మ శీలధన్య

కం॥ వారలలోన గనిష్ఠుఁడ, సూరివిధేయుండఁ బూర్వసుకృతఫలమునన్
నేరిచితిఁగొంతకవితా, ధారను నే రామదేవుదయ పెంపారన్

గీ॥ ప్రకటితముగ నాపేరు పల్లె కసిరెడ్డి, చిన్నవేంకటరెడ్డినాఁ జెప్పఁబడియెఁ
గాని 'పల్లె' పేరు ప్రసిద్ధిగనుటఁ జేసి పల్లెవేంకటరెడ్డియం చెల్లరంద్రు

గీ॥ నేను విద్వత్కుటుంబములోనివాఁడఁ, గాను కాని మాపల్లెపాడ్ గ్రామమందు
సతతవిద్వజ్జనాళి సంసర్గమునను, జేసి చదువు సంధ్యయును నేర్చితినిఁ గొంత 1

సీ॥ గద్వాలసంస్థాన కవిరత్న చెమికలవంశ దుగ్ధాంబోధివనజవైరి
యైన చెన్నారెడ్డి యార్యఁ 'జెన్న' రామాయణంబును వ్రాసె మిత్రతదీయ
శిష్యుండును మహాశేముషీమంతుండు బసిగానిపల్లె నవాబుగారి
యాస్థానకవులలో నగ్రగణ్యుండును కసిరెడ్డి శ్రీబాలకవియనంగ
ఆ॥ బిఱుదమొందివెలయు వేంకటసుబ్బిరె, డ్డి బహుకావ్యకర్త విబుదవరుఁడు
వ్రాకటముగఁ దాను 'బాల' రామాయణ, మునురచించె సుకవిజనులుమెచ్చ 17

గీ॥ అమ్మహాకవులిర్వుర నాత్మఁదలఁచి, వారియాదేశమునుబొంది నా రచింపఁ
బోవు రామాయణమునకు బుధులుమెచ్చ, నరయ వేంకటరామాయణాఖ్యనిడితి 18

మ॥ ప్రతిభామూలమెకాని లేదు లవమాత్రంబైనవ్యుత్పత్తి, నం
తితమున్ సద్గురుశిక్షఁబొంది పటుశాస్త్రజ్ఞాన మార్జింపకే
యితులుం బ్రాసముఁలుం బ్రయోగములె నాకాధారముల్గాఁగ స
త్కృతినిన్వ్రాయఁగఁ బూనితిన్ విమలసత్కిన్ రామచారిత్రమున్ 19

ఉ॥ వ్రాయుదు గద్యముల్దొరఁగి పద్యములేమఁజి మత్తెకాండరా
మాయణమందు లోపములు మన్ననచెక్కమియంపుఁడీకవుల్
స్థాయిగ నస్మదీయకృతి సర్వజనాదరణైకపాత్రమై
పాయకనిల్చుఁగాత, రఘువంశవరేణ్యునన్గ్రహంబునన్ 20

## షష్ఠ్యంతములు

కం॥ శ్రీరఘువీరున కాజిఖ, మారునకున్ జితసుబాహుమారీచాది
క్రూరాసురసైనికపరి, వారునకు మునిమఖవిఘ్నపరిహారునకున్ 21

కం॥ మునిపత్నీశాపవిమో, చనునకు ఖండితగిరీశచాపున కుర్వీ
తనయాపరిణయశోభిత, మనోజ్ఞునకుఁ బరశురామమదహరణునకున్ 22

కం॥ పితృవాక్పాలనరతునకు, సతీసహోదరయుతునకు సంయమికులస
ద్వ్రితునకు భయరహితునకుం, జటుద్ధిశాబ్దవనవాససంగతునకునున్ 23

కం॥ అనఘగుహార్చితపదున, మ్మనఘ భరద్వాజముఖ్యమునిలోక ఖయా
వనదీక్షాపరునకు భర, తనిజామలపాదుకాప్రదానరతునకున్ 24

కం॥ దనుజేంద్రసోదరీమద, ఘనాంధసూర్యునకు దుష్టఖరదూషణవం
జనపటుశౌర్యునకు దశవ, దనాపహృతభార్యున కవితథవీర్యునకున్ 25

కం॥ శబరీసంపూజితునకుఁ, బ్రబుద్ధసామీరిఘటితభానుజమైత్రీ
ప్రబలప్రమోదితునకున్, విభేదింపతనూజగర్వభేదనునకున్

కం॥ జనసుతజయ సంపాదికి, ననిలజవినివేదితజనకావనితలభ్య
త్తనయావృత్తాంతాకి, ర్ణనవ్యాబ్ధియామోదికిని వినయవాదికినిన్

కం॥ అతతకపిసైన్యనటబ, లాతిశయునకుఁ గృతకైత్రయాత్రునకు దిగ్
జైతకు విభీషణాభయ, దాత కుదధిబంధనైకధౌరేయునకున్

కం॥ ఉరుగర్వితదశముఖముఖ, గురుబలదైతేయజేతకు విభీషణరా
జ్యరమాభిషేకకర్తకు, పరపరిపూర్తి క్ష్మాప్రవాలబ్ధునకున్

కం॥ క్షితితనయాలక్ష్మణసం, యుతునకుఁ దయచరనిశాచరోపేతాధి
క్షితిపుష్పకయానునకుం, గృతనిజపురగమనునకును వినవంద్యునకున్

గీ॥ విపులసత్కీర్తిఁ బ్రణమిల్లి రవికులాబ్ధి, సోముఁడైనట్టి శ్రీరఘురామునిచరి
తమును వేంకటరామాయణమను పేరఁ, బద్యకావ్యంబుగానేను వ్రాయువాఁడ

కం॥ మామకవిరచితవేంకట, రామాయణకావ్యమును గరమభక్తిమెయిం
దామ చదివినను వినినను, భూమిజనుల కిహపరసుఖములు సిద్ధించున్

## కృతిసమర్పణము

కం॥ అరయఁగఁ దిక్కన మును దా, నరచించిన భారతంబును హరిహరులకీ
ద్వర కిష్టదైవములఁగుట, హరిహరనాథుఁడను పేర నంకితమిచ్చెన్

గీ॥ అమ్మహాకవితిక్కనయట్ల నేను, నాదు వెంకటరామాయణమ్ము వెంక
టేశ్వరునకును రాముని కిత్తునంకి, తమ్ము వేంకరామదైవమ్ము పేర

గీ॥ పోతనామాత్యుఁడాదియౌ పూర్వకవులు, పలువురాత్మీయభవ్యకావ్యములను దమ
యిష్టదేవులకంకితమిచ్చి పరమ, సుకృతవంతులై సుగతినిఁ జూఱఁగొనిరి

గీ॥ ఆకవులపద్ధతియె మంచిదనుచు నెంచి, నాదు వేంకటరామాయణము మదీయ
దేవుఁడైన వేంకటరామదేవునకును, భక్తిపూర్వకముగ సమర్పణమొనర్తు

కం॥ వేంకటరామస్వామికి, నంకితము నొసంగువాఁడ నస్మత్కృతమ
[illegible]

# శ్రీమన్నిర్వచన
# వేంకట రామాయణము

## అయోధ్యాకాండము

### అయోధ్యాపుర వర్ణనము

సీ॥ శ్రీరవిప్రతిబింబితో౽ గోపురంబులతోడ వివిధ శిల్పములతోడ,
ఆకాశవలయంబు ప్రాకారములతోడ రమణీయ హర్మ్యరాజములతోడ,
వైరిదుర్భేద్యకవాట సంతతితోడ, విమలకాంచన కుట్టిమములతోడ,
సాంద్రతరానేక చంద్రశాలలతోడఁ బ్రాసాదమండప ప్రతతితోడ,
సురుచిరప్రాభవ బద్ధాంతములతోడ శాతకుంభస్తంభచయముతోడ,
భయదశశ్వదగాధ పరిఖావ్రజముతోడఁ గిడుసౌబగౌ విటంకములతోడ,
వప్రప్రతోళ్యాపణప్రతానముతోడఁ గిరిమొవ్వ వీథీ మార్గములతోడ,
అతులితరత్న నిర్మిత కుడ్యములతోడ, స్ఫటికశిలావేది సమితితోడ,
సతతవారి ప్రపూరిత సరస్సులతోడఁ, బరిమళోద్యాన సంపత్తితోడ,
దివిజకాంతల మించుయువతీమణులతోడఁ, జతుర విద్వజ్జన తతులతోడ,
షట్కర్మనిరతులౌ సద్బ్రాహ్మణులతోడఁ, బల్లిదులగు వీరభటులతోడ,
నిత్యసత్యప్రౌఢి వెలయు వైశ్యులతోడ, నమ్రులౌ శూద్రజనములతోడ,
ఐరావణ నిభంబులగు నిభంబులతోడ, ననిల జవంబులౌ వారులతోడ,
ధనధాన్య పశుగోధన బృందములతోడ, మారి నస్త్యాద్యుపహాలముతోడఁ,
గీ॥ దనరి బ్రహ్మకుసెన వరసమొనరి౹( దరముగానిదియె యయోధ్యాపురీ వ

## దశరథమహారాజు పుత్రకామేష్టి చేయుట

సీ॥ తన బాహుబలసంపదను జూచి బెగడంది యరిగాపులై పగఱడఁగి యుండఁ
దననిరంకుశ శౌర్యమను చండకిరణుండు మించి జగంబు వెలింగుచుండఁ
దన యశశ్చంద్రికా తతి నిరంతరమును దశ దిశల్ వ్యాపించి ప్రీదపఱవఁ
దన యానవెల్లరుఁ దలఁదాల్చి నియమిత కార్యతత్పరులౌచుఁ గ్రాలుచుండ,
గీ॥ శిష్టపరిపాలనంబును దుష్టశిక్షణంబు సేయుచు నాసగరంబునేలు
చుండె నస్తోక భుజబలోద్దండుఁడగుచు, సర్కవంశ్యుండు దశరథుండనెడు రాజు

ఉ॥ తుల్యవిలాస యౌవన మృదుప్రియ భాషణ సద్వివేక సౌ
శీల్య గుణంబులం గరిమఁ జెన్నలరారుచు నున్నయట్టి కౌ
సల్య, సుమిత్ర, కైక యను జాయల ముగ్గురఁ బెండ్లియై కడున్
లౌల్యమునన్ యథేప్సితసుఖంబు దనియించె నృపుండు నిచ్చలున్

ఉ॥ అమ్మెయి సర్వసంపదల కాకరమయ్యును భూవిభుం డప
త్యమ్మది లేమిఁ జేసి పరితాపభరంబు తిరంబుగాఁగ ని
త్యమ్మును మానసాంబుజము నందును వందురుఁగాని భోగభా
గ్యమ్ములు పమ్మిగాఁ దలఁచి హర్షము నొందఁడ యెన్ని యంగలన్

ఉ॥ అంతనొక్కనాడు వారికులాధీశుని, చింతవాయి నవ్వసిష్ఠుఁ డనియె
"క్ష్మాతలేంద్ర! పుత్రకామేష్టి సేయుము, తనయు లుద్భవింత్రు దాన నీకు"

సీ॥ అనవుఁడు దశరథుండధ్వర సంభార సముదయంబును గూర్చి సమ్మదమున
ఋశ్యశృంగుండాది ఋషులు సదస్యులై తన క్రతుకర్తృత్వమునువహింప
నధ్వర్యులుద్గాత లఖిల హోతలుఁ జేరి సామాది వేదముల్ చదువు చుండ
యాజకుల్ మంత్ర సమన్వితంబుగఁ జరు లెడనెడ నాహుతు లిచ్చు చుండ
గీ॥ సాంద్రతర హోమధూమ సంఛాదితార్క, మండలంబయి చీకట్లు నిండుకొనఁగ
నినకులేశుఁడు పుత్రకామేష్టి సేయ, సాగెఁ గడుదీక్షతోడ నాసమయమందు

## విష్ణువు రావణునిచేబాధితులైన దేవతలకభయమిచ్చుట

కం॥ రావణుచే బాధితులై, దేవత లబ్జాక్షు కడకు దీనత్వమునం

ఉ॥ "వేలుపులార! రావణుఁడు వేలుపుఁ బెద్దనుగూర్చి పెద్దయో
కాలము ఘోరమౌ తపముగైకొని చేసి వరంబులందినాఁ
డాలములోనవాఁడు త్రిపురారికి వెనియునోడఁడైనను
గాలము వెచి త్రుంతు నురకంటకు నేనొక కారణంబునన్" 8

గీ॥ అటయు నెయ్యది యంటేని త్రిదశవైరి, యబ్జసంభవు వరములనడుగు వేళఁ
దనకునన్యుల మృతిలేక తనరునట్లు, కోరె, నరవానరులచేతఁ గోరఁడయ్యె, 9

గీ॥ వినుఁడు భూలోకమున మహావిపులకీర్తి, యజ తనూజుండు, దశరథుండను నృపాల
శేఖరుఁడు పుత్రకామేష్టిచేయుచున్న, వాడు సంతాన కాంక్షియై పరగ నిపుడు 10

చం॥ అనఘచరిత్రుఁడౌ దశరథావని నాథునకే జనింతు మీ
రును దిగ మత్సహాయులయి, రూఢిగ భూతలమందుఁ బుట్టుఁడ
త్యనుపమ ఋక్షవానరులరై యని మాధవుఁ డానతిచ్చినన్
విని సురలెల్ల "వల" యని విష్ణుని వీడ్కొనిపోయి పిమ్మటన్। 11

గీ॥ శౌరిచెప్పిన చొప్పున నఖిల దివిజు, లవనిలో ఋక్షవానరులై జనించి
రమిత భుజబల సముపేతు, లాజినిపుణు, లచల సంకాశదేహులు వర్క్యసములు। 12

## యజ్ఞపురుషుడు దశరథునకు పాయసము నిచ్చుట

గీ॥ అంతనట రాజమారాండుఁడైన రవికులేంద్రుఁ డుత్కంఠఁ బుత్రకామేష్టిసేయు
దక్షవంబుగ మహానియుఁడొక్కఁడుద్భ, వించె రవితేజుఁడై యజ్ఞ వేదియందు। 13

క॥ ఆయజ్ఞపురుషుం డొక, పాయస చషకంబునిచ్చి "ప్రభువర! యిమ్ము
హాయిగ సతులకు దీనిఁ, బాయక సంతాన మీవు వడయుదు" వనుచున్॥ 14

గీ॥ వనితయొసంగి, యంత, రాజయును డెందమున తత్పాయసము
ద నతి యుయమున భార్యల, కొసరివిడఁ డిట్టు పంచనారంభించెన్ 15

చం॥ సగము సుగౌసలాత్మజ కొసంగి యనంతరమా సగంబులో
సగము సుమిత్రకిచ్చి పెఱిగాముని నాముని గైకకిచ్చి, యా
సగలిసగాలఁ ... సుమిత్రకు నిచ్చె నలేంద్రుఁ డంత నా

కం॥ నానాటికి గర్భంబులు, నూనంబులు గాఁగఁ గామినులకున్ నవ మా
సానంతరంబు శుభదం బైన ముహూర్తంబునందు నతివేడ్క మెయిన్॥ 17

## రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల జననము

సీ॥ రక్షోవధార్థమై సాక్షాద్రమావర్తి విష్ణ్వంశమందు శ్రీరాముఁడనఁగఁ
దివిరి కౌసల్యాసతీ గర్భశుక్తిముక్తాఫలంబై యుదయించె నంత
కైకేయి కొడుకుఁడు సుశ్లోకుండు జన్మించె భరతుండు ప్రగ్గణ భరితుఁడగుచు
లలిసుమిత్రకునటు లక్ష్మణశత్రుఘ్ను లను కుమారద్వితయము పొడమె
గీ॥ క్రమముగా నిట్లు కొడుకులు కలిగి దినదినాభివృద్ధిఁ బొందఁగ నవని పతిని
నిరుపమానంద సాంద్రుఁ జేసిరత్రిభ, బిందు సందోహవారాశి వెల్లివిరియ॥ 18

కం॥ అతిశైశవదశయందే, విదిత సమస్తాస్త్ర శస్త్ర విద్యావాంఛం
గతులైరి దశరథావని, పతి పుత్ర చతుష్టయంబు ప్రాభవ్యమునన్॥ 19

గీ॥ రామలక్ష్మణు లస్త్రవిద్యామహార్ణవ పాటవమునను, సాహస బలపరాక్ర
మాది గుణముల నాకారమందుఁ గలుగు నృపసుతులకంటె ఘనులునా వెలసినారు॥ 20

## విశ్వామిత్రుఁడు దశరథునికడకు వచ్చుట

కం॥ అట్టియెడ నొక్కదినమున, నిట్టలపు రయంబుమీర వేతెంచెఁ గడున్
వెట్టిదుఁడు గాధితనయుఁడు, కట్టాయితమౌచు పృష్ణుని కడకుం దెలుపన్॥ 21

ఉ॥ వచ్చిన యా మునింగని, సపర్యల నెంతయుఁ బ్రీతుఁజేసి, "హా
రిచ్చటి కేగుదెంచుటకు హేతు వదెద్దియొ యానతిండు! నే
నిచ్చెద నెద్ది కోరిన మునీశ్వర!" నాఁ గడు నంతసించుచున్,
మెచ్చుచుఁ గౌశికుండు ధరణీధవముఖ్యునితోడ నిట్లనున్॥ 22

సీ॥ "పూని నేనొక యాగ పుణ్యాధ్వరముసేయఁ బల్మఱు యత్నింపఁ బాపమతులు
నీచ తాటకయు, మారీచ సుబాహులన్ దోషాచరులు సేనతోడవచ్చి
రక్తమాంసములు వర్షముగాఁ గురియించి చెలఁగి యజ్ఞము పాడుసేసిపోదు
[illegible]

చం॥ ''నరవర! కౌశికుండలిగినన్ జగమెల్లను నిర్దహించు, న
త్యురుతర కోపచిత్తుఁడు, సముజ్జ్వల తేజుఁ డవజ్ఞసేసినం
బొరియునగీడు పిన్నలనుబుద్ధిఁ దలంపకు రామలక్ష్మణుల్
మురలకజేయు లన్ను మదిఁజూన్పకు సంశయ మొందు సౌఖ్యముల్॥''

## దశరథుఁడు విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులను బంపుట

క॥ అని కులగురువు, వసిష్ఠుం, డనుపమ తేజుండు చెప్ప హతసంశయుఁడై
తన పుత్రుల విశ్వామి, త్రునితోఁ బుత్తెంచె దశరథుఁడు హర్షమునన్॥

కం॥ ఆ రామలక్ష్మణుల, సుకు, మారుల, ఘనశౌర్యధనుల, మదినసమానా
కారులఁదోడ్కొని ముని ముద, మార నిజాశ్రమమునకుఁ బ్రయాణంబయ్యెన్॥

ఉ॥ ఎంచుచుఁ గౌశికుఁ డచ్చటచ్చటి విశేషంబుల్ కుమారోత్తముల్
వినయం బెంతయుఁదోపఁ దన్నడిగినన్ వేర్వేర వర్ణించి యిం
పున వాక్రుచ్చుచుఁ గొంత దవ్వరుగుడున్ భూపాత్మజుల్, రాఘవుల్
ఘన మారశ్రమ మొందిరట్టి యెడలం గారుణ్య వారాశియై॥

సీ॥ ఆ గాధినందనుఁ డత్యాదరంబున నారామునకును, దదనుజునకును
బథిశ్రమము, క్షుత్పిపాసలుఁ బొరయకుండ బలాతిబలలను ప్రబలవిద్య
లను బ్రసాదింపవారును ద్విగుణితబలోత్సాహవంతులు గతశ్రములునగుచు
మునిచేత నైంద్రాది ఘనదివ్యశస్త్రాస్త్ర సంతతుల్ గ్రహియించి సంతసించి
గీ॥ యతనితోనేగి కొన్నిప్రయాణములకుఁ, గనిరి శుకపికశారికా కలరవాది
విహగసంతతి భరితంబయి వెలయుదాని, నాశ్రమోత్తంస మతని సిద్ధాశ్రమంబు॥ ౨

మ॥ అ సిద్ధాశ్రమవాసులైన తపసుల్ హర్షించి 'దైతేయులన్
వే సంహారముసేసి తమ్ము మనుపన్ విఘ్నండె విచ్చేసె' నం
చాసక్తిందగఁ బూజసేయుటయు నత్యంతంబు సంతుష్టుఁడై
కౌసల్యా వరసూతి వారలవయిన్ గారాబ ముప్పొంగఁగన్ ౩

ఆ॥ అభయహస్తమిచ్చి యటు పదంపడి మౌని, విభునిఁ జూచి రామవిభుఁ డుపలికె

ఎపుఁడక్కౌశికుఁడు "వల్లె" యనుచునప్పు, డాగమోక్త విధంబున నధ్వరంబు
ుపఁదొడఁగెను, రామలక్ష్మణులుచాప, హస్తులై కాచికొనియుండి రట్టియెడల। 39

ాటక దిశాశవాట, స్ఫోటనమగునట్లు తజచు బొబ్బలిడుచుఁ వెం
టుకకొండశరణిఁ గో, పాటోపముతోడ నచటి కరుదెంచుటయున్। 40

ుచ్చటి మౌనులప్పుడు భయాతురులై తమపాలిమృత్యువై
ుచ్చుచునున్నదీ యసురభామిని యంచు మదిం దలంచుచున్
ాచ్చగు రోదనస్వనము లెంతయు నొప్పఁగ నార్తులై కడుం
చ్చెలువచ్చి రామధరణీపతి మాటున దాగి రందఱున్। 41

ానినిఁజూచి యిట్టులనుఁ దాపసముఖ్యుఁడు రాముతోడ "నీ
ునపిచూపె తాటక సదా క్రతువిఘ్నము చేయుచుండెడున్
ుధ రామచంద్ర! సుదతిం దునుమాడుట పాపమంచెదన్
ి నుపేక్షసేయక వధింపు భవచ్ఛితసాయకంబులన్" 42

## విశ్వామిత్ర యజ్ఞరక్షణము

ునవిని రాముఁడు కల్పాశనితుల్యంబైన యొక్క శాతశరమ్మును
ాని, వింటఁదొడిగి దనుజాం, గననేసి వధించె శౌర్యఘనుఁడై కడిమిన్। 43

ు రక్కసి మరణించుచు, దారుణ రోదనముసేయఁ దత్సుతులు కడున్
రమున వచ్చి రదివిని మారీచ సుబాహులట కమానుష లీలన్। 44

ు ుపరిచ్ఛదంబుగా నేగుదెంచి, మేదురారావములతోడ మింట నిలిచి
కమాంసాదికములు వర్షింపుగాఁగఁ, గురిసి రయ్యజ్ఞశాలపై ఘోరభంగి 45

ుప్పుడు కౌశికుండు కడు నాతురుఁడై జనపాలసూనులం
ుప్పక చూచి యిట్టులను "ధార్మికసత్తములార! శీఘ్రమే
ుప్పలలాశనాళి వధియింపుడు కావుడి యజ్ఞ" మంచనం
ుప్పలు కుప్పలైపడఁగఁ గూల్చిరి దైత్యుల రామలక్ష్మణుల్। 46

ుటువక్త్రుండను రామభద్రుఁడు వెనస్ మారీచుపైనేయ వా
ుడువాతూల విఘాతిమై తృణకణంబో నాగ నొప్పారి, యుల
ురిమాలంపున దిర్రిరందిరుగుచున్ మాద్యద్ధతింబోయి, భీ

కం॥ మారీచుఁడటు దక్షిణ, వారాశి తటంబునందుఁ బడి, యుగ్రమతిన్
ధీరతఁ గైకొని తపమును, ఘోరంబుగఁ జేయుచుండెఁ గూరిమితోడన్॥ 48

కం॥ వెండియు నొక శితశరంబున ఖండించె! సుబాహు ఖలుఁడేహ మహో
ద్దండబలసముత్సాహుఁ డ్ర, చండమహాబాహు రామచంద్రుఁడు కడిమిన్॥ 49

కం॥ ఈ కరణి భయదదనుజా, నీకంబులనెల్ల గిట్ట విశ్వామిత్రున్
బికమెయిఁ జంపి, మునిక, శ్లోకము దిమఁ గూర్చి రఘువసూనులు పెర్మిన్॥ 50

చం॥ చెలఁగి మునీంద్రుఁడుం గ్రతువు చేసినవాడయు వారి యజ్ఞ
ధ్యులు నృప పుత్రులం గిరము నల్లముల్లోపల మెచ్చియిచ్చె న
త్యలఘుతరాస్త్రశస్త్రము లనంతములై పిలుసల్ల వాని సం
ఎలరఁగ స్వీకరించి యని కయ్యనపంక్తుఁడు రాముఁడుండెనన్॥ 51

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు జనకుని వృత్తాంతము దెలుపుట

సీ॥ "మునినాథ ! యింక నె నొనరింపఁగలయట్టి కార్యములేమేమి గలవొ? చెపుమ
శిరసావహించి నేఁ జేయుదు" నావుడు బ్రముదితుఁడై యతిప్రవరుఁ డనియె
"మిహిరకులాధీశ ! మిధిలాపురాధిపుఁ డౌ జనకుండు తానధ్వరంబు
చేయుచున్నాడు తదీయయాగంబును దిలకించి యత్తి మహీయునుగాక

తే॥ తనగృహంబుననున్న యీశివధనుస్సుఁ గడిమినెవ్వఁడు మోపెట్టఁగలఁడొ? వాని
కెలమిఁ దనసుత భూజాత 'నిత్తు'ననుచు సకల దిగ్దేశములయందుఁ జాటఁబంచె॥ 52

కం॥ నీవు మహాశక్తియుతుఁడ, వా ఖిల్లపకీలనెత్తె దా జానకి సిం
దావరియించును సందియ మావంతయులేదు పొదమచ్చటి"కనినన్॥ 53

కం॥ విని రామచంద్రుఁడిట్లను "మునినాయక! జనకజాత భూమిజయనుచున్
వినిపించితి రేకతమున ఎనజేక్షణ కా యమాఖ్య వరలెనొ చెపుమా" 54

కం॥ నావిని విశ్వామిత్రుఁడు భావజనముఁడైన రామభద్రునితోడం
దావినిచెనిట్లు జనక, క్ష్మావరసుత సీత పుణ్యచారిత్రంబున్॥ 55

సీ॥ "ఆమిథిలేశ్వరుం డఖిలసంపదలకు నాకరుండయ్యును నరయఁ దనకు
సంతతిలేమి వేసరి పుత్రకామేష్టి సేయంగ మదిఁదలఁచి మఖశాల
నిర్మింపఁబొలము దున్నించుచుండఁగ నొకట మంగసగంబు [illegible]

దృఢతరమంది శిరము నెయ్యమున నెత్తి, తనదు పుణ్యఫలంబు పండినదటంచు(
రఘు ముదితాంతరంగుడై గారవమున(, బెంచసాగెను జనకపృథ్వీవిభుండు॥ 56

తా విధానమున నా, ఫీతకురంగాక్షి రూపవిభ్రమకళలన్
రాశిరతినా నెగడుచు, భూతలమున( గడు(బ్రసిద్ధి( బొందుచు నలరెన్॥ 57

అరయ(గ నామీపెడునకు, వరసుందరి యూర్మిళయను వనిత జనించెన్
పరిపెమున నాలతాంగుల, నిరుపుర( బోషించె జనకు( డెంతయు( బ్రీతిన్॥ 58

అని యి విధమున సీతా వనజాక్షి చరిత్ర మెల్ల వనజాక్షునకున్
వినిపించి వారి( దోడ్కొని, యనుపము( డవ్మౌని పయనమయ్యె మిథిలకున్॥ 59

## అహల్యా శాపవిమోచనము

అరుగుచునుంత మార్గమునయం దొకచో నొక ప్రస్తరంబు దా
రథపదంబు సోకి పిలసద్గజగామిని యౌచు నిల్చె న
చ్చెరువగు మౌనితోడ నృపపుత్రకు( డిట్లను "శాపసేంద్ర! రా
యి యువిదయౌటకుం దల(ప నేమికతంబొ? వచింపవే దయన్॥" 60

అనవు(డు మౌని యిట్లను "నహల్య యనంజనుకాంత యామె తా(
బెనిమిటిచే శపింప(బడి పెద్దగు కాలమునుండి యిచ్చటన్
పెనుశిలయై వసించె రఘువీర! భవత్పదుణం దొలంగె నీ
వనితకు శాప మింక( దన భర్తృసమీపము( జేరి( గ్రమ్మఱన్॥" 61

అనిచెప్ప యా యహల్యాశాపకారణ మెఱి(గించినన్ విని యినకులుండు, రాము( డత్యంతగౌరవమున నాసరోజాక్షిని వీడ్కొల్పి యనుజసహితు(డై మౌనితో విదేహపురి( బ్రవేశింప జనకుండు సంతోషజలధి మునిగి తనదుజన్మంబు పావనమైనదని యెంచి శ్రద్ధాపరుండయి యిద్ధగుణుల రామలక్ష్మణులను గాధిరాజసుతుని, నాత్మమందిరమునకు వెయ్యంబెసంగ( దోడికొనిపోయి పూజించె భొడ్డభక్తి, నర్ఘ్యపాద్యాదులిచ్చి యనంతరంబు॥ 62

ఆమూతేజుని చాపమెక్కిడిన( గన్యాలబ్ధియౌ నంచునై
న్యేభస్యందనఘోటకవ్రజముతో నెంతే ముదంబొప్ప(గన్
భూభృద్వ్రాత మగణ్యమౌచు( జతురంభోరాశివేలావృతో

కం॥ జనకావనిపతి వచ్చిన, జననాథులనెల్ల నుచితసత్కారములం
దనుపుచు వారు వసింపఁగ, ననుపుగ నేర్పఱచె నిడుదు లాయాచోట్లన్॥ 64

## శివధనుర్భంగము

కం॥ తదనంతరంబ జనకుఁడు, పదివేవురు భటులచేత బహుయత్నమునన్
మదనాంతకుధనువు సభా, సదనమునకుఁ దేరఁబంచె సమ్మదలీలన్॥ 65

ఉ॥ దానినిఁగాంచి చిత్తములఁ దద్దయు భీతిలి "దీనినెత్తఁగా
నేనరుఁడోపు? నీజనకుఁ డిందఱినిం బరిభూతిసేయఁగం
దానిటు పన్నియుండిన కుతంత్రముగాని మఱొండుగా" దటం
చానరనాయకుల్ తలఁచి యాత్మగతంబులఁ జింతసేయుచున్॥ 66

గీ॥ "ఎచ్చితిమి యత్నశూన్యులవలెఁ జనంగఁ, బోలునే? యనుచు నటులఁ బరీక్షింప
నొక్కఁడొక్కఁడె కదఁగి యాయుగ్రచాప, మెత్తసాగిరి సాహసోన్మత్తులగుచు॥ 67

సీ॥ "ఎత్తెద"ననిపూని యెనుమంతయేనియుఁ గదలింపఁగాలేక కలఁగువారు,
"నిదియెత్తలేనిచో నీజీవితంబేల, యని యత్నమొనరించి యలయువారు,
పురమువేల్పులకెల్ల మ్రుదుపులఁజెల్లించి నిష్ఫలారంభులై నిలుచువారు,
తమశక్తియంతయు సమసి యలవిగాక వేడినిట్టూర్పులు విడుచువారు
గీ॥ నై యిటటి రాజులం దొక్కఁడైన నొక్క, యంగుళము నెత్తలేక తారతివిషాద
చిత్తులై "విల్లుగాదిది శిఖరి" యనుచుఁ, దలఁచి యుస్సురుమనుచును దొలఁగిరంత॥ 68

ఆ॥ "దీనినెత్తలేక యీనరేంద్రులచెంత, నవమతింపఁబడుచు నవయుకంటె
నూరకున్న మనకు నొప్పదే" యనికొంద ఱపుడు విల్లుడాయరైరి వెఱచి॥ 69

కం॥ అవచ్చిన నరపతు లిట్లావిల్లుగదల్పలేక యధికవ్రీడా
భావములతోడఁ దమతమ, తావులకున్ వేగఁజనిరి దర్పచ్యుతులై॥ 70

ఉ॥ అత్తఱి గాధిరాజతనయానుమతంబున శంభుచాపమున్
మత్తకరీంద్రు డింబురుహనాళము నెత్తెడిభాతి రాఘవుం
డెత్తి గుణంబునన్ శరముపెక్కిడి సజ్యముసేయునంతలో
భిత్తములయ్యె లస్తకము భీషణమైన నినాదమొప్పఁగన్॥ 71

గీ॥ సురలకు మునుల కది శుభసూచకమయి వీనులంబడ సంతోషనినదమౌచు

## రామలక్ష్మణ భరతశత్రుఘ్నుల వివాహము

ఉ॥ మనమునఁ బుత్రికిందగిన మంచిమగండు లభించెనం చెదన్
జనకుఁడు తద్దయున్ మురిసి చయ్యన లగ్ననిరూపణంబునుం
బొసరిచి యాత్మబాంధవసమూహముఁ బెండ్లికిఁ బిల్వఁ జారులం
బనిచి పురంబునల్గడల బాగుగఁ దాఁగయిసేయ నత్తరిన్॥ 73

ఉ॥ నేర్పరులగు పనివారల, నేర్పఱిచి నరేంద్రచంద్రుఁ డెంతయు హర్షం
బేర్పడఁ దానును బెండ్లికి, వేర్పున నమకూర్చె వస్తునికరములెల్లన్॥ 74

చం॥ పూసిరి గోడలెల్లఁ గడుఁబొల్పుగ నల్కిరి వింతరంగులన్
భాసురచిత్రరూపముల వ్రాసిరి కప్రపుముగ్గుపెట్టియున్
వాసనగల్గుద్రవ్యము లపారముగా నెలకొల్పి రెల్లెడన్
వాసిగఁ గట్టి గన్నగరివాకిళులన్ మణితోరణావళుల్॥ 75

ఉ॥ ఎఱియును నప్పురివీధుల నటిముటి కలయుంపిఁజల్లి యన్నివెలపులం
దిలచుగఁ బందిళులను గడుఁ, బఱపుగ నిర్మించి రర్కప్రభ సారకుండస్॥ 76

ఉ॥ పురమట్లు పరిణయోచిత, సరణిఁ గడునలంకరించి క్ష్మాతలనాథుం
డురుసమ్మదమున నుండఁగ, నరుదెంచిరి బంధుజనము లధికప్రీతిన్॥ 77

ఉ॥ భరతుఁడు శత్రుఘ్నుండును, బరివారం బనుగమింప భార్యలతోడన్
నరవరుఁడు, దశరథుండపు డరుసంబున మిథిలఁజేర నరుదెంచె వడిన్॥ 78

వ॥ అప్పుడు మైథిలుఁ డానందభరితుఁడై తనయజ్ఞకర్మ మంతయును దీర్చి
యుజసూతతోడి వియ్యముున కెంతయునుబ్బి యూర్మిళ నాసుమిత్రోద్భవకుఁ
దనతమ్ముఁడగు కుశధ్వజుని పుత్రికల మాండవి శ్రుతకీర్తియన్ యువతుల భర
తునకు శత్రుఘ్ననకును నీఁదలంచి యందఱికిని నాయుదంతంబు దెలిపి,

గీ॥ ప్రౌఢవనితల సవ్వధూవడులఁ గడిమి సంచితంబుగఁ గైసేయ డనియనుజ్ఞ
నొసఁగుటయు "పెల్లె"యనుచు నబ్జసరుహదళనేత్ర లెల్లను దద్దయు నేర్పుమీర॥ 79

సీ॥ లలితమంగళవాద్యములు చెలంగుచుమండ లలవలు నల్గుపాటలను బాడ
నతిపుణ్యసాధ్వులు నాచారనిపుణలై వెగడు పేరంటాండ్రు నెమ్మిఁగూడి

గీ॥ బాగుగఁ దిలకముల్‌దీర్చి బహువిశేష, వస్త్రమాల్యానులేపనవరవిభూష
ణంబులను గట్టనిచ్చి కరింబలంక రించి రప్పటి నవనాగరికులు మెచ్చ॥ 80

ఆ॥ అట్లు పెండ్లికొడుకులై విరాజిల్లెడి, దాశరథులఁజూచి తరుణులెల్ల
మోహవివశలగుచు మూర్ఛిల్లి క్రమ్మఱఁ, దెలిసి యిట్టులనిరి తెల్లముగను॥ 81

గీ॥ "ఈజగన్మోహనాకారు లీమహాత్మ, లరయ జామాతలగుట కీ యువతివిధుఁడు
తాను దొలిజన్మమున సుకృతంబదేమి చేసియున్నాడొ?"యని నుతుల్ సేసిరంత॥ 82

సీ॥ అటు వదంపడి కన్నెలకు నల్గులువెట్టి జలకంబులాడించి లలితములగు
కడుఁ గ్రొత్తవలువలు గట్టించి బంగారుసరిగయంచుల కంచుకములు దొడిగి
కస్తూరితిలకముల్ గరిమనీటుగఁదీర్చి విప్పుగాఁ గొప్పుల విడులు దుఱిమి
చెక్కుల మకరికల్ చెన్నారఁజిత్రించి ముక్కరల్ నాసాగ్రముల నమర్చి
గీ॥ కటకకంకణతాటంకకటికలాప, చారుమంజీరహారాదినకలభూష
ణావళులచేతఁ గైసేయ నతివలపుడు, చూడనొప్పిరి దేవతాసుదతులనఁగ॥ 83

శా॥ ఆకవ్యాముఖులందు సీత కులవిద్యారూపసౌజన్యసు
శ్రీకంబట్టయి యక్షకిన్నరసురస్త్రీసిద్ధోరగేంద్రాంగనా
లోకంబున్ హసియించుచుం దనకు నేలోలాక్షులుం బోల్పఁగా
నాకాలంబున లేరనం ద్రిభువనఖ్యాతిన్ విరాజిల్లెడున్॥ 84

సీ॥ అట్లొప్పియుండిన యాపెండ్లికూతుల వలువుర నప్పు డానరవరేణ్యుఁ
డగు జనకుండు తా నాగాధిసుతవసిష్ఠుల యనుజ్ఞనుబొంది మందరమగు
కల్యాణవేదికకడకుఁ దోడ్కొనిపోయి యుచితయానంబుల నుచితభంగి
రామప్రభృతులను రాపించి యత్యంతరమణీయకనకపీఠములపైన
తే॥ సభిముఖంబుగాఁగ సావధానులను, గూరుచుండఁజేసి కూర్మితోడ
వారికడ్డముగను వడిఁ దెరఁ గట్టించి, యవనినాథుఁ డిట్టు లనుచుఁ బలికె॥ 85

ఉ॥ "ఓయి రామచంద్ర యున్నతగుణసాంద్ర!, యిచ్చు నీకు సీతనోసఁగుచుంటి '
స్వీకరింపు మింక వెస నగ్నిసాక్షిగా", ననుచు ధారవోసె నతిముదమున॥ 86

కం॥ తదారతోడ నచుర ఉదతకె గోగాది గాని గౌరి గాంధారకక్

సీ॥ భేరీపటహకాహళీశంఖపణవాదివాద్యముల్ ఘోషింప హృద్యముగను
బ్రహ్మదరంబు నిండారఁ బ్రమదలు కొందఱు దీపాలపళ్ళెముల్ దెచ్చిరి మఱి
కొంద ఱక్షతలను గొనితెచ్చియుంచిరి కొంద ఱైదువరాండ్రు కొమరుమిగుల
తలఁబ్రాలు బంగరుతట్టిలతోఁ దెచ్చి యటనుంచి రత్తఱి వాగమోక్త
గీ॥ మంత్రములఁ బురోహితుఁడు సమ్మతిఁ బఠించి, దంపతులమీఁదఁ దగ నక్షతలను జల్లె
విరులవానలు గురిసిరి వెలఁదులెల్ల, భూసురాశీర్నినాదముల్ పొరిఁజెలంగె॥ 88

చం॥ అరయఁగ నవ్వధూవరుల కందఱకప్డు పురోహితుండు తా
శిరములయందునన్ గుడము జీల్కరతోఁ దగఁ గూర్చియుంచి య
త్యుచితతరపుణ్యుఁ డంత సుముహూర్తము సన్నిహితంబుగాఁగ స
త్వరముగఁ దీయఁబంచెఁ దెర వారలకెల్లర కంచితంబుగన్॥ 89

సీ॥ వరుల నేత్రాళులు వధువుల ముఖపద్మమకరందమాని తన్మయతనొందు
సుదతుల క్రేఁగంటిచూడ్కులు వర్తల యంఘ్రులపై నిల్చి యరయఁ బొలుచు
పతుల విలోకనప్రభలు పత్నులమేను మాటిమాటికిసోకి మగిడివచ్చుఁ
బమ్మఁజూడకయున్న తఱివేటి రమణులు రమణులపై దృష్టి రహిఁ బరపుదు
గీ॥ రంతకంతకు మోహంబు లతిశయింప, మగల మగువలు, మగువల మగలు చూతు
రట్టియెడ వారి వాల్చూపు లచ్చెరువుగ, వియ్యమొందుచునున్నట్టి విధము దోచు॥ 90

గీ॥ అరయ రాఘవుఁడు లంతులహస్తములను, నాత్మకరములఁ బట్టి సర్వాంగములను
పులకరింపఁగ నొకపీఠముసవటించి, రపుడు రతిమన్మథులనంగ నతిశయిల్లి॥ 91

గీ॥ ఎలమియు రాముఁడు ప్రావృట్సమయవినీలజలధరాకారనిస్ఫూర్తి నలరియుండె
మునీతవిద్యుత్సహస్రసమానలలిత, దేహకాంతితో జానకి తేజరిల్లె॥ 92

గీ॥ ఇట్టు లేకాసనస్థులై యుండుముఖులు, దాముచేసిరి శాస్త్రోక్తధర్మవిధిగ
రాజమహామహుల్ శ్రీరామలక్ష్మణులును, భరతశత్రుఘ్నులును హర్షభరితులగుచు॥ 9

గీ॥ అటుపిదప సభిముఖులయి యధివసించి, భూసురులచేత దీవనల్ పొంది రాజ
పుత్రులు సెల్వురు మంగళసూత్రములను, గట్టి తలఁబ్రాలు పోసిరి కన్నియలకు॥ 9

సీ॥ అంతఁ బుణ్యాంగనలు లావణ్యవతులు సతులకర్పూరవారతు లొసంగి
దీవించి రమరులు దివినుండి సుమవృష్టి గురిసిరి గంధర్వవరులుగూడి॥
[illegible]

గీ॥ అవసిష్ఠుఁడు వారిని ననలునకుఁ బ్ర, దక్షిణమును జేయించి సప్తర్షిసేవ
లాదిగాఁగల్గు నుచితకృత్యంబులన్ని, యొనరఁ జేయించె వైవాహికోక్తముగను॥

సీ॥ ఆరాఘవులపెండ్లికరుదెంచియుండిన సకలభూజవములుసమ్మదమున
భక్ష్యంబు లతిరసాల్, బహువిధాపూపముల్ పాయసం, బన్నంబు, పప్పు, వడలు,
పాలు, పెరుగు, నెయ్యి, పలురకంబులకూర, లూరగాయలు, చారు, గోరసంబు
మొదలుగాఁగలయట్టి భోజనంబులు తమ కడుపార మనసారఁగా భుజించి

గీ॥ కరము సంతుష్టులగుచు నత్కారయోగ్యములగు గంధంబు వక్క లాకు లు గ్రహించి
జనకరాజును శ్లాఘించికొనుచుఁ జనిరి, వేడ్కసందిల్లఁ దమతమ విడుదులకును॥ [illegible]

మ॥ ధరణీదేవత లన్నతృప్తులయి సత్కారార్ధ చిహ్నంబుగా
ఎదగోభూమిహిరణ్యవస్త్రచయముల్ వైదేహుచే బాసమున్
గరిమం బొప్పఁగ స్వీకరించి ధరణీకాంతుం బ్రశంసించి పో
యిరి తాము న్ననివాసభూములకు వెంతేనిం బ్రమోదించుచున్॥ ౯

కం॥ రామప్రభృతుల వీడ్కొని, ధీమహితుఁడు, గాధిసుతుఁడు, తేజోధికుఁ డు
ద్దామతపశ్శ్రీమంతుఁడు, తాముదముప నరిగె నాత్మధామముఁ జేరన్॥ 9

కం॥ ఈవిధమునఁ బరిణయమును, గావించి రథాశ్వదంతిగణము నమూల్యం
బౌ వస్త్రచయమును, విభూ, షావళులను దంపతులకు నరణంబిచ్చెన్॥ 9

కం॥ జనకుని సత్కారంబుల కినవంశ్యుఁడు, దశరథుఁడపుడెంతో ముదితుఁడై
తనసతులు సుతులు కోడండ్రమచరతతి గొలువఁ బయనమయ్యెం బురికిన్॥ 10

## శ్రీరాముఁడు పరశురాముని గర్వభంగముచేయుట

ఉ॥ అకరిణిం బ్రయాణమయి యర్కకులాధిపుఁ డేగుచుండఁగాఁ
బ్రాకటశౌర్యుఁడౌ పరశురాముఁడు మార్గమునం దటస్థుఁడై
యాకమలాప్తవంశజుని వట్టి కనుంగొని ''మీరదలెవ్వరో?
వాకువచింపు"డన్న నరనాయకుఁ డిట్టను భీతచిత్తుఁడై 101

కం॥ "భూమిసురవర్య! దశరథ, నామంబు వహింతునేను నాపుత్రులు వీ

ఉ॥ అని ప్రతిమాలిచెప్పినఁ దదగ్రసుతుండగు రామచంద్రునిం
గని జమదగ్నినందనుఁడు గర్వము, రోషముదోప నిట్లనున్
"ఘనభుజశక్తిమై శివువికార్ముకమెత్తిన దిట్ట వంచు నిన్
జనులు నుతించుచుందు రది సత్యమొ? మిథ్యయొ? తెల్పుకోఁదగున్॥ 103

కం॥ అవిదితబలగర్విత మా, ధవులకుఁ గాలుండనగుచు ధారణిలో భా
ర్గవరాముఁడ నేనుండఁగ, భువి మన్నామంబుఁ దాల్పఁబోలునె నీకున్?॥ 104

గీ॥ ఘోరసంగ్రామమున నిన్నుఁ గూల్చుటొండెఁ, గాక నీచేత నే మృతిఁగనుటయొండె
జరుగనగుఁగాని యన్యథా జరుగనేర, దుర్విలో రాములిరువురు నుండరాదు"॥ 105

గీ॥ అనవుఁ డారాముఁడిట్లను "నయ్య! వినుఁడు!, బ్రాహ్మణులతోడ రాజులు పందెనంబు
సేయరాదని శాస్త్రప్రసిద్ధిగలదు, చిప్పి మీతోడ నేనెట్లు సేయువాఁడ?॥ 106

కం॥ బాలుర విప్రుల గోవుల, స్త్రీలను వధియించు కుమతి చిరకాలం బా
కాలునిపురి నరకాగ్ని, జ్వాలలఁ దప్తాంగుఁడగుచు సంతాపించున్"॥ 107

కం॥ నావిని భార్గవరాముఁడు, భావములోఁ "దినకుపెఱచి భాస్కరవంశ్యం
డావిధిఁ బలుకుచునుండెం, గావలయు" నటంచుఁదలఁచి కడ కిట్లనియెన్॥ 108

గీ॥ రామ! నాతోడవెదిరించి రణమొనర్పఁ, జేతగానట్టి మాటలు చెప్పుచుంటి,
విట్టి భీరువుతో యుద్ధమేలనాకు?, నైన నొకపల్కుపల్కెద నవధరింపు॥ 109

ఆ॥ చెదలుపట్టినట్టి మదనాంతకుని కార్ముకంబు విఱుచు టొక్క ఘనత యగునె?
యిదె మదీయధనువు నించుకవంచి పొమ్మయ్య బల్లిదుండ వగుదువీవు॥ 110

సీ॥ అని యుపాలంభించి యాజామదగ్న్యుండు పల్కుచుఁ దనచేతి భయదధనువు
నారామభద్రున కందీయ నిజసత్త్వ మావిల్లుతోఁబాటు నతనిఁజెందె,
నవ్వుడు నృపసూనుఁ డాధనుర్దండంబువంచె శాఖను గరి వంచునట్లు
గర్వంబు సర్వంబు ఖర్వమైచన నిజావాసంబునకుఁ బోయె భార్గవుండు
గీ॥ రాముఁ బొగడుచు నాపంక్తిరథుఁడు పరము, హర్షసంభరితాత్ముఁడై యాత్మపురికి
నిజకుటుంబముతో నేగి నిరుపమాన, విభవమున సౌఖ్యము ననుభవించుచుండె॥ 111

ఉ॥ ఉన్నతసౌధరాజములయందు మనోహరపుష్పశయ్యలన్,
శీతలవాతపోతములఁ జెన్నలరారు వనాంతరంబులన్,
నూతనరత్నగోళికల నూతనపుష్పశోభఁ గేలి ౦

గీ॥ వారి యన్యోన్యదాంపత్య మారమన్న, ప్రజలు వేనోళ్ళఁ గొనియాడి రజసుతుండు
తనుఁ గృతార్థునిగాఁగ నెమ్మనమునందుఁ, దలఁచి సంతోషజలధిలోపల మునింగె॥ 113

కం॥ భరతుఁడు, శౌమిత్రి మనో, హరకేకయ రాజధానియగు రాజగృహం
బరుసమునఁ జేరనరిగిరి, గరిమంబున మేనమామగారు పిలువఁగన్॥ 114

## దశరథుఁడు శ్రీరామునకు రాజ్యపట్టాభిషేకము చేయ నిశ్చయించుట

గీ॥ అట్లు సుఖలీలనుండి యయ్యజతనూజుఁ, డొక్కదివసంబునందుఁ బేరోలగమున
మంత్రిసామంతహితభృత్యమాన్యులాది, యెల్లసభ్యులు వినుచుండ నిట్టులనియె॥ 115

తే॥ "ఏను వృద్ధుండనైయుంటి నింకమీద, క్షోణిఁ బాలింపఁగా నశక్తుండనైతి
రాజరాను విరక్తియుఁ బ్రబలమయ్యె, గాన నావిన్నపంబొండు గలదు వినుఁడు॥ 116

మ॥ గణనాతీతపరాక్రముండు ఖలశిక్షాశిష్టరక్షావిచ
క్షణు డిక్ష్వాకుకులోద్వహుండు కరుణాగాంభీర్యశౌర్యాదిస
ద్గుణసంపన్నుఁడు శస్త్రకోవిదుఁడు నాకున్ జ్యేష్ఠపుత్రుండు ధా
రుణిఁ బాలింపఁగలండు రాముఁడతి శౌర్యప్రాభవోద్దాముఁడై॥ 117

ఉ॥ ఈ తనువస్థిరంబు మఱి యెప్పుడుకూలునొ? దీని నమ్మరా
దాతతపుణ్యు రాముఁ జతురబ్ధిపరీవృతభూతధాత్రికిన్
నేతగఁ జేసి భూమిపయి నే మనియున్నపుడే తదీయవి
ఖ్యాతమహావిభూతిఁ గనులారఁగఁ గాంచి సంతసించెదన్"॥ 118

సీ॥ అని నిజాభిప్రాయ మందఱ కెఱిఁగించి యాక్షణంబున వసిష్ఠముఖుల
నంది శ్రీరామపట్టాభిషేకము రేప యని ముహూర్తము నిర్ణయంబుసేసి,
పురిని శృంగారంబుఁ బొనరింపు డని వెల్లువగలయట్టి పరిచారికాగణంబు
లను నియోగించి యజ్ఞనాయకుఁడు కొల్వుఁజాలించి నిజనివాసమున కరిగె
గీ॥ అంతనెల్లెడ మణితోరణాళిఁగట్టి, గోడలన్నుబూసి వింతరంగులుగలట్టి
చిత్రపటలను వ్రాసించి చిత్రముగను, గదళికాస్తంభపంక్తినిఁ గదలుకొలిపి॥ 119

కం॥ కలయంపిని జల్లిరి వీ, థుల గృహముల జందనంబుతో నందమునా,
నలికిరి ముంగిళ్లను ముగ్గులు వెట్టిరి క్రమమునను గ్రొంజిగియొప్పన్॥ 120

కం॥ ఇట్లు పురమునుగైసేసి యెల్లజనులు, శ్రీరఘూత్తమపట్టాభిషేకదర్శ

## మంథర కైకేయికి దుర్బోధచేయుట

ఉ॥ మంథర కైకసన్నిధి కమందగతిం జనుదెంచి యిట్లనున్
"సింధురయాన! నీమగఁడుచేసినమోసము గంటె? నేఁడు ద
ర్పాంధుని రామభద్రు వసుధాధిపుఁ జేయఁదలంచె నీయెడన్
బంధురమైన ప్రేమ కడు వమ్మయిపోయెను ఱేని కిత్తఱిన్ 122

ఉ॥ ఈ సకలావనీతలమునెల్ల నిజాత్మజుఁ డేలఁగల్గినం
గోసలరాజనందన యకుంఠితవైభవమందు రాణివై
నీసుతుఁ డీవు వారలకు నిచ్చలు నూడిగముం బొనర్చుచున్
దాసులరై చరించుటలు తప్పదు నానుడి విశ్వసింపుమా 123

కం॥ కావున దీనికి విఘ్నం, బేవిధమున నైనఁ జేసెదేవి సుఖమ్ముల్
నీవను భవింపఁగల్గెదు", నావుడు దానికి భరతజనని యిట్లనియెన్ 124

కం॥ "దీనికి నపాయరహితం, బైన యుపాయంబుచెప్పి యస్మత్సుతుఁడున్
నేనును బ్రదికెడి తెఱు వే, దైవం జూపింపవలయు నతివరో! కరుణన్" 125

చం॥ అనవుఁడు దాసి యిట్టులను "నంబురుహానన! విన్ము తొల్లినీ
కవనిపుఁ డిత్తునంచు వచియించిన రెండువరంబు లిప్పు డి
మ్మను మొకదానికిన్ భరతు నారయఁబట్టముఁగట్టి రామునిన్
వనులఁ జరింపఁబంపు మని వైళమకోరు మఱొండుదానికిన్" 126

చం॥ అనవిని కైక మానసమునందు నసమ్మతిదోప నప్పు డి
ట్లనియెను దాసితోడఁ "గమలాప్తకులాంబుధిపూర్ణసోముఁ డ
త్యనుపమకీర్తిధాముఁడు, సురారివిరాముఁడు, రాముఁ డారయం
దనజనయిత్రికంటె ననుఁ గద్దయుఁ బ్రేమిడిఁ జూచుచుండెడున్ 127

ఉ॥ అట్టి మహాత్ముఁ గానలకు నక్కటికం బొకయింతలేక నే
నెట్టులఁ బంపఁగోరుదు? మహీశుఁడు దీనికి సమ్మతించునే?
తిట్టరె లోకులెల్ల? ననుఁ ద్రెక్కొనదే దురితంబు ఘోరమై?
యెట్టి తలంప నీకలుషకార్యము సేయఁగఁబాడియే? సఖీ!" 128

గీ॥ అనినవిని దాసియిట్లను "నతివ! నీవు పాపము దొడరునని యిప్డు పరమపూజ్య
రాజ్యలక్ష్మిఁ గోల్పోయి ప్రబలదాస్య, వృత్తిలో మున్గుటెంతయు వెఱ్ఱిగాదె? 129

గీ॥ కుక్షి నవమాసముల మోసి కొడుకునుగని, కరము గారాబమునఁ బెంచు కన్నతల్లి
కాత్మజుఁడె యన్నమిడఁ డింక నతివ మిన్న, సవతికొడు కెంతపోషించు? జాలినొంద

గీ॥ తివిరి తమయవసరములు దీరుదాక, కపటపుంబ్రేమ చూపింపఁగలరు ఖలులు
వారినిన్ విశ్వసించిన వామనయన!, చేటుమూడుట నిక్కము క్షితితలమున 131

కం॥ రాముని ప్రవర్తనము నా, కామూలాగ్రముగఁ దెలియు నతని స్వభావం
బోమగువ నీవెఱుఁగవు ప, యోముఖవిషకుంభ మాతఁడొక్కొ తలంపన్ 132

ఉ॥ కావున రాముపైన మమకారము వీడుము నాహితోక్తులన్
భావమునందునిల్పు జనపాలకునిన్ భరతాభిషేకమున్,
వావిరి రామచంద్రువనవాసముఁ గోరు మనోరథంబునన్
నీవు సుఖింపఁగల్గుదువు నీరజలోచన! నిక్కువంబుగన్" 133

కం॥ అని యిట్లనేకభంగులఁ, దనకుఁ బ్రబోధింపఁ గైక తనమానసమం
దున నెట్టకేల కొదఁబడి' యినుపముకుతుకమున నిట్టులను మంథరతోన్ 134

శా॥ "కౌసల్యాసతికిం ఉదాత్మజునకున్ క్ష్మాజాతకున్ నేనునన్,
నాసూనుండును నాదుకోడలును దైన్యంబొప్ప నశ్రాంతమున్
దాసత్వం బొనరింపకుండఁ గడఁకం దప్పించి రక్షించితో
దాసీ! నీఋణ మిగవేరసుగదా! తథ్యంబు వేయేండ్లకున్" 135

కం॥ అని యభినందించుచు నా, వనజేక్షణ దాసికపుడు వరమణిహారం
బును బారితోషికముఁ గొ, ష్మని యిచ్చెఁ బ్రియంబు డెందమం దుదయింపన్ 136

చం॥ అదియును శైశవంబుతటి నాడుచు రాముఁడు తన్ను బంతిచే
నడుమునఁ గొట్టనాడవెడి యాపగ నేఁడుదీరెనంచుఁ దా
ముదమునఁ బారితోషికముఁ బొంది గళంబునఁ దాల్చి కుల్కుచున్
సదనముఁ జేరఁబోయె విరసంబు నిజాకృతియుందుఁ దోపఁగన్ 137

కం॥ ఆనాటిరేయి కేకయి, భూనాథతనూజ మహితభూషణతతులం
బోనాడి మలినవసనము, బూని యలరుసెజ్జ వీడి పుడమి శయించెన్ 138

ఆ॥ అట్లు కపటదుఃఖ మభినయించుచుఁ గైక, యవనికాంతుఁ డెప్పు డరుగుదెంచు
నెప్పుడు తనకొర్కె లీడేరునోయని, తహతహపడుచుండెఁ దరుణిం 139

# దశరథుఁడు కైకేయిమందిరమునకుఁ బోవుట

మ॥ ఘనశౌర్యోజ్జ్వలు నార్యలోకపరిరక్షాదక్షు శ్రీరామచం
ద్రుని సామ్రాజ్యమహావిభూతి కభిషిక్తుం జేయఁగా బూనుటల్
తన ప్రేమైకనిధానమై తనరు నిల్లాలైన కైకేయి తా
వినెనో? లేదొ? వచింతు నంచుఁ జనియెం బృథ్వీశుఁ డచ్చోటికిన్ 140

ఆ॥ విభుని రాక యెఱిఁగి బిసరుహాక్షి మఱింత, దైన్యభావమునఁ దాండవింప
మౌనముద్రఁ దాల్చి మాటాడదయ్యె న, య్యబ్జముఖినిఁ జూచి యధిపుఁ డడలి 141

కం॥ 'ఇదియేమి వైపరీత్యము, గద? మాసినయట్టివలువ గట్టి తొడవులన్
వదలి యిటు నేలపైఁబడి, సుదతీమణి యేలయొక్కొ శోకముఁ బొందెన్?" 142

మ॥ అని తర్కించుచు ధారణీరమణుఁ డయ్యబ్జాక్షినిన్ డాసి త
త్తనువున్ హస్తముచే స్పృశించుచు సుధాధారాప్రసారంబులై
తన వాక్కుల్ విలసిల్ల నిట్లనియె "కాంతా! లెమ్ము! నీపీఁగితిన్
వసటం జెందఁగనేల తెల్పుము సువ్యాధ్యావంబు దీటింపఁగన్ 143

గీ॥ అఖిలవారులు రామపట్టాభిషేకదర్శనోత్కంఠులై మహోత్సాహజలధి
తేలియాడుచు నున్నవా రివిదమిన్న!, యేల శోకించుచుంటివో యెఱుఁగఁజెప్పుమ? 144

కం॥ అనవరతంబును నే నీ, కనుసన్నల మెలఁగుచుంటిఁ గాదే? యలుగం
గనియేమి? నాయొనర్చిన, ఘనమగు నేరం బదేమి గలదో? చెపుమా! 145

సీ॥ దినదినం బెదురేగుదెంచుచుండిన నీవు రాకేందుముఖి! నేడు రావదేల?
పలుకుల నమృతంబు లొలుకఁబల్కెడు నీకు మానినీమణి నేడు మౌనమేల?
పరిచర్య లనిశంబు భక్తినల్పెడు నీకు వామలోచన నేడు వైరమేల?
సతతంబు నన్నిష్టరతులఁ దేల్చెడు నీకురమణిరో నేడు వైరాగ్యమేల?
గీ॥ సుదతిరో నిత్య మాశ్లేషచుంబనాది, కములఁ గరిగించు నీకు నా కరమొకింత
సోకినన్ నేడు విసుగును జూపెదేల?, న్యాయమే యిది? లేలెమ్ము! నళినవేత్ర! 146

శా॥ కొమ్మా! నిన్నుఁ బరాభవించిన మహాక్రూరాత్ము లెవ్వారొ? పే
ర్కొమ్మా! వారు దిగిదలెనను రణక్షోణిన్ విదారించి శ్రే
యమ్ముం గూర్తును రామునాన మతి నీయానన్ మదిన్ నమ్ము! పి
క్కమ్మా నానుడి సత్యవాదులని పేర్గన్నారు మద్వంశజుల్ 147

ఉ॥ ఏమి కొఱంతగల్గె? హృదయేశ్వరి! నాకు దెలుపఁగఁ జెప్పు నీ
వేమి యొనర్పుమన్న సరియే యది యెట్టిదియైన వ్రేల్మిడిన్
మామకశీర్షమందు ననుమానములేక ధరించి చేసెదన్
క్షేమముఁగూర్తు నాపలుకు చిత్తములోపల విశ్వసింపుమా!"

చం॥ అనవుడుఁ గేకయాత్మజ 'ధరాధిపుఁడిన్ బ్రగిమించి రాను
న్నిన పలలోనఁ జిక్కె'నని నెమ్మదినెంచి మహాప్రమోద మం
దినదయి సంభ్రమంబొలయ దిగ్గనలేచి వినమ్రయౌచు వి
టనియె "మహీశ! యిత్తువుగదా మఱి యియ్యదియేని?" నావుడున్

## కైకేయి దశరథుని వరములను గోరుట

క॥ భూవరుఁడు పలికెఁ "గోమలి!, నీవడిగిన ప్రాణమైన నేనిత్తు నిదిం
కేవిధము శంక"లనవుఁడు, దేవంబునమురిసి యిట్లు ధామిని పలికెన్

గీ॥ "అసురసంగ్రామమునఁ దొల్లి యొసఁగినట్టి, రెండువరములు ప్రీతియం దుండెనుగదఁ
యిప్పుడవి నాకునిమ్ము మహీశ!"యనిన, నిత్తుననిచెప్పెఁ బార్థివుఁ డింతితోడ

క॥ "యిమ్మాటకే నిత్తునని క, రమ్మనఁ గరమొంచి చెప్పు! రాజేంద్ర! నినున్
నమ్మెద"ననిన లతాంగికి 'యిస్మాటకేనిత్తు' ననుచు మాధవుఁ డనియెన్

ఉ॥ అప్పుడు కైకసంతసిలి యయ్యవనీశునితోడఁ బల్కె "నీ
విప్పృథివిస్థలిన్ భరతుఁడేలఁగ నొక్కవరంబు రాఘవుం
డిప్పుడ మౌనివృత్తి వని కిమ్ముగనేగి చతుర్దశాబ్దముల్
దప్పక యుండిరాగ నరనాథ! మఱొండు వరం బొసంగుమా!"

గీ॥ అనవుఁ డిమ్మాట లాలించి యవనినాథుఁ, డదరిపడి యిట్టులనియె నా యతివతోడ
నిట్టివరముల నున్నెవ్వ రెన్నడైనఁ గోరఁగా వింటివే నీవు? కోమలాంగి!

గీ॥ దానదాసీజనమునైన ధనములయిన, నియిపల్లైనను భూషణావళుల నైన
ఘూరిగోధనములయినఁ, బరములైన గోరికొను మిత్తుఁ జెడుకోర్కిఁ గోరనేల?

చం॥ నిజజననిక్రికంటె నధి నన్నె ఘనంబుగఁ జూచుచుండు నా
సుజనవరేణ్యుఁ డంచితవిశుద్ధమనస్కుఁడు రామచంద్రుఁడో
గజనిభయాన యట్టి గురుకాపనికోత్తము నట్టె విర్ధియన్
విజనమహాటవిం దపసినేసనుటో యనఁగాగ నక నకా!"

గీ॥ అని యిమ్మతిదోపంగ నాడుచున్న, భానుకులదుగ్ధపాథోధివనజవైరి
యైన దశరథుమాటల కడ్డువచ్చి, కేకయాత్మజ యిట్లనెఁ బ్రాకటముగ 157

ఉ॥ "తప్పగరాదుసత్యమది తప్పినఁ దప్పును గిరిసంపదల్,
తప్పను సూర్యలోకములు తప్పును జేసిన పుణ్యమంతయుం
జెప్పినమాట దాటరని చెందిరికీర్తి త్వదీయవంశ్య లా
గొప్పప్రసిద్ధి దానిపుడు కోల్పడఁబోకుడు; క్ష్మాతలేశ్వరా!" 158

గీ॥ అనిన విని నృపుఁ డిట్లను "నతివ! నీవె యిట్టి దుశ్చింతనముఁ దలపెట్టితొక్కొ?
లేక దుర్జనులెవరైన నీకు నిట్లు, కఱపియున్నారొ? మనలను జెఱుపఁగోరి 159

శా॥ కట్టా! నీకపకార మెన్నఁడయినం గావించెనేయట్టి నా
పట్టిం గాననభూమికన్ప మమచున్ వాక్రువ్వఁగా నీకు నో
రెట్టాడెం? గడు సత్కులీనవగు నీవీపాపపున్ మారమ్ముం
బట్టన్ న్యాయముగాదు నావచనముల్ పాటింపు మబ్జాననా! 160

శా॥ పట్టింబాసినఁ గోసలేంద్రనుత ఈ ప్రాణంబులన్ నిల్పునే?
చుట్టాలెల్లను రామచంద్రునకునై శోకాకులస్వాంతులై
సట్టేటంబడి యట్టి చత్తురుగదే? నన్నుప్వ డీ మాజనుల్
దిట్టన్ సంతతి మెట్టులుండుదును ఎల్ జీవచ్ఛవంబట్టులన్? 161

గీ॥ ఈ విపత్తులకెల్లను నీవ మూల, మనుచు నిందింతురెల్ల రా యపయశంబు
పొందియుండెడు నందాకఁ బొందవలసి, ఎచ్చునప్పుడు బ్రదుకు దుర్భరముగాదె? 162

సీ॥ ఇది యేమి బుద్ధె నాపుత్రుఁ డగ్రజుఁ డుండఁగ రాజ్యమేలఁ దా
వ్వాదయిమునందు నియ్యకొనఁ డియ్యది ధర్మవిరుద్ధమౌట నో
సుదతిరో! యింక నీ పెపరిసొమ్ముగఁ జేయు మిదిందలంచి యీ
యుదధివరీతమైన సకలోర్వి గ్రహింతువొ? నాకుఁ జెప్పుమా! 163

ఉ॥ ఆయతరాజ్యమైన భవదర్పణముం బొనరించెదం దృణ
ప్రాయముగాఁ దలంచి మఱి ప్రాణముసైనను నిత్తుఁగాని నా
రాయణసన్నిభుం డయిన రామునిమాత్రము నిర్దయుండనై
యీ యురుకాననంబులకు నంపఁగఁజాల క్షమింపు కోమలీ!



మ॥ అనినం గోపమునంది యిట్లనియె నయ్యబ్జాక్షి రాజేంద్రుతో
"నినవంశంబునఁ బుట్టినాడ వకటా! యీరీతి నీవేల నీ
తినిఁ బోనాడుచు బొంకఁజూచెదవు? చింతింపం గడుం జోద్యమా
యెమ గౌసల్యకు భీతిఁజెందితివి నిన్నేమందు సుర్వీశ్వరా? 165

సీ॥ యతికి రాజ్యంబిచ్చి యాహరిశ్చంద్రుండు చండాలసేవలు సలుపలేడె?
యొకకపోతమునకై యొడలి మాంసము శిబి డేగకిచ్చి గడింపఁడే యశంబు?
మున్ను దధీచియన్ ముని శచీపతికోరఁ దన వెన్నెముకనిచ్చి ఘనతఁగనఁడె?
తనను హింసింప వచ్చిన వామనునకల బలి పదత్రయము భూభాగమీడె?
గీ॥ మాటదప్పక యెందఱో మనుజపతులు, సర్వమును గోలుపోయి యస్థలితు లగుచు
నష్టకష్టమ్ములను బొంది రవనినాథ, వారు నీవలె నేడ్చియున్నారె చెపుమ? 166

గీ॥ ఇట్టి యౌదార్యవంతుడ వేల మున్నె, కాదనుచుఁ జెప్పవైతివి మేదినీశ?
ఎట్టి ప్రాగల్భ్యములు పల్కి తుట్టతుదకు, నీవరద్వయ మీలేక యేడ్వనేల? 167

శా॥ వానిం డింతటి కష్టమేల తమకున్? భూపాల! శ్రీరాముఁడే
భూనాథుం డగుఁగాక తజ్జననియే భూరిప్రభావాఢ్యయై
మీనాక్షుల్ తనుఁగొల్వ రాణియగుచున్ మిమ్మెల్ల శాసించుఁగా
కేనున్ నాదుతనూజుఁడైన భరతుండె పోదు మా కానకున్" 168

మ॥ అనుఁడా పంక్తిరథుండు దీనుఁడయి యత్యంతింబుఁ బ్రార్థించియున్
ఘనమౌ నీతులవెన్నియో శాఱపియుం గైకేయి దుశ్చింతనం
బును మాన్పింపఁగలేక తా వగచుమన్ భూకాంతుఁ డున్నంత వే
గెను తూర్యంబులు వందిమాగధులసంగీతంబు లొప్పారఁగన్ 169

ఉ॥ అంత సుమంత్రుఁడన్ సచివుఁ డిచ్చటికిం జనుదెంచి "లగ్న మ
త్యంతసమీపమయ్యె నని యద్భుతశక్తియుతుం డరుంధతీ
కాంతుఁడు మిమ్ముఁ దోడ్కొనుచు గ్రక్కున రమ్మని నన్ను నిప్డు మీ
చెంతకుఁ బంపినాడు నృపశేఖర! రండిఁక సత్వరంబుగన్" 170

గీ॥ అనుచు వాకిటనిల్చి యయ్యవనివిభునిఁ, బిల్వ నాతఁడు వినియును వినినివాని
[illegible] 171

ఉ॥ "ఓయి! సుమంత్ర! నీవరిగి యున్నతుఁడౌ రఘురాముతోడ మా
తాయకు నాజ్ఞగానుడివి నాసదనంబునకుం బ్రియంబునం
దోయజచారులోచనునిఁ దోడ్కొని వేగమెరమ్ము పొ"మ్మనం
బోయె నతండు శీఘ్రమున భూపసుతుండగు రాముపాలికిన్ 172

శా॥ ఆరామావనినాథుఁ డట్టితతి హర్మ్యాగ్రంబునన్ సీతతో
గారాబంబున ముచ్చటించుచు మహోత్కంఠన్ రతింగూడు నా
మారుండో యననొప్పి వచ్చిన మహామాత్యున్ సుమంత్రుం గడుం
జేరందీసి బహూకరించుచు వచశ్శ్రీ మీరఁగా నిట్లనున్ 173

సీ॥ "నీవు మతిమంతుఁడవు కడునిర్మలుఁడవు, స్వయముగా వచ్చితో? లేక జనవిభుండు
పంపెనో? నాకుఁ జెప్పు మవశ్యమెట్టి దేనిఁ గావింతు శిరసావహించి నేను" 174

చం॥ అనిన సుమంత్రుఁ డిట్లనియె "అయ్య! భవజ్జనకుండు కైకయిం
టను వసియించియుండి మిమ్ము నిప్పటికున్ మిముఁదోడితెమ్మటం
చనుపఁగ వచ్చినాడ సుగుణాకర కారణ మేమొ తెల్పఁడా
జనపతి రండు పొషదము చయ్యన స్యందన మెక్కుడం"చనన్ 175

## శ్రీరాముఁడు కైకమందిరమునకు బయలుదేరుట

మ॥ మదిలో నుబ్బుచు రాముఁ డానవమునన్ మందస్మితం బొప్పఁగా
సుదతీరత్నముతోడఁజెప్పి యపుడే శుంభద్రథారూఢుఁడై
కదలెన్ మంగళవాద్యసంతతి చెలంగం జేరి పుష్పాక్షతల్
సుదతుల్ చల్లఁగ వందిమాగధజనుల్ స్తోత్రంబులం జేయఁగన్ 176

గీ॥ ఇట్లుచని రాముఁ డాకైకయింటికడను, దాను స్యందనమునుదిగి లోనికేగి
యవనతాస్యుఁడై కన్నుల నశ్రులొల్కఁ, దఱచు శోకించుచుండిన తండ్రిఁ గాంచె 177

ఉ॥ కాంచి నృపోత్తముండు తనఁ గన్గొననొల్లక హేతువేమొ భా
షించక మోమువంచుకొని చిత్తరువోయిన యస్మికిన్ విచా
రించుచు దండ్రిఁ దానుపచరించుచుఁ గేకయరాజపుత్రితో
నంచితరీతి రాఘవసుధాధిపుఁ డాత్రముదోప నిట్లనున్ 178

మ॥ "నను వీక్షింపఁగ నొల్ల డించుకయునున్ నాతోడ మాటాడఁ డీ
యినవంశాగ్రణి నాదెసన్ విముఖుఁడై యారీతి శోకింపఁగాఁ
దనకున్ నేనొనరించియున్న యపరాధంబేమొ? వాక్రుచ్చి యో
జననీ! నన్నుఁ గృతార్థుఁ జేయఁగదె! వాత్సల్యంబు సంధిల్లఁగన్" 1

సీ॥ అనవుఁ డా కైకేయి "జనపతియిష్టంబుఁ ద్రికరణశుద్ధిగాఁ దీర్తుననుచు
బాసచేసెదవేని భాషింతు" నని పల్క విని రామభద్రుఁ డావనితతోడ
"నయ్యకువై యెట్టిదైనను గావింతు నసువులైనను నిత్తు నబ్ధిఁ గొల్తు
బడబానలంబైన భక్షింతు నమ్ము మీ మహి చలించినఁగాని మాటదిరుగ
గీ॥ గ్రహములెల్లను దమతమగతులుదప్పి, పోయినంగాని నేఁదప్పఁబోను సుమ్ము!
తండ్రియిష్టముఁ దీర్పని తనయుఁడొక్క, తనయుఁడె?"యని పల్క నాతరుణి చెప్పె

## కైక శ్రీరామునితోఁ దన వరములవిషయ మెఱిఁగించుట

సీ॥ "అనఘాత్మ మున్ను దేవాసురకదనంబు నందునన్ మెచ్చి మీయయ్య రెండు
వరములునాకిచ్చె వరుసగా నేను వే డవియిప్పు గోరెద నాదరింపు
మొకవరంబునకు నీ సకలోర్వికిని నాదుపట్టిని బట్టంబుఁ గట్టవలయు
వేఱొకదానికిఁ గానలకు నిను పదునాలుగేడులు పంపవలయు
గీ॥ ననవుఁ డొసఁగాక యవియిచ్చి జనవిభుండు, తాను నీకివ్వ డాయెనింతంబు దలుపఁ
గరము శంకించుచున్నాఁడు కాననికిఁ, దపసివై పొమ్ము నిల్పుము తండ్రిమాట" 18

ఉ॥ అనవిని రాముఁ డిట్లనియె నవ్వనచేక్షణతోడ "నింతకం
టెను మఱి భాగ్యముంగలదె? నేనికఁ ధన్యుఁడనైతినమ్మ నా
యనుజుఁడె ధారణీతలము నంతయు నేలునుగాక ప్రీతితోఁ
జనియెదఁ గాననంబులకుఁ జయ్యనఁ దాపసవేషధారినై 18

గీ॥ ఇంతమాత్రమునకయి నరేంద్రుఁ డింత, వంతఁబొందఁగనేల? యిపుడె మేము
ననికినెగెద నిప్పుడె భరతుఁ బిల్వఁ, బంపి పట్టాభిషిక్తుఁ గావింపుమమ్మ" 18

మ॥ అనిచెప్పన్ ముదమొంది యిట్లనియె నాయబ్జాక్షి శ్రీరామతో
"ననఘా! నాసుతునింక రాఁగనుతు నీవాలస్య మేమాత్రమై
నొనగావింపక మౌనివేషివయి కాసంజేరఁ బొమ్మిప్పుడే
చనునందాకను రాగడుం గుడువఁ డీ రాజేంద్రుఁ డారాఁడె" 18

మ॥ అనుఁడాపల్కుల నాలకించి పతి కోపావిష్టుఁడై యిట్లనున్
“వనితా! నాపయినన్ వెపంబిడి దయావార్ధిన్ రఘూత్తంసు న
త్యనఘుం గానకుఁ బంపఁజూచితివి నే నట్లేల గావింతు? నా
వనికిన్ నిన్నిదె పంపి రామునకు నేఁబట్టంబునుం గట్టెదన్ 185

సీ॥ ఘనముగా నామీదఁ గపటానురాగంబుఁ జూపించి వేడిటు పాపివగుచుఁ
గోరరానివి నన్నుఁగోరి మావంశంబుఁ బుడమిపాల్ సేయఁగాఁ బూనితకట!
నిన్ను నమ్మఁగరాదు నీచవర్తనురాల పాముని కనయంబు పాలువోసి
పెంచినట్టాయె నిన్నుంచుకొనుటయెల్లఁ దడయరాదింక నా యడిదమునకు
గీ॥ నిన్ను నెరఁజేసి కులమును నిష్కలుషము, గాఁగ నొనరింతు”నని మహోగ్రహముతోడఁ
గత్తి యొరనుండి దూసి యాకైక పైకి “నతికెదంగాక!”యనిలేచి యుఱుకుటయును 186

గీ॥ అట్టితఱి రామభద్రుఁడా యవనినాథు, నాపి యొక యాసనంబునం దధివసింపఁ
జేసి మృదువచోరచనలచేతఁ దానొ, కింత శాంతునిఁగావించి యిట్టులనియె 187

ఉ॥ “నారిపెమొప్ప నాజనని కైక మదభ్యుదయంబుఁగోరి కాం
తారమునన్ వసింపుమని నాకు హితంబును జెప్పెఁ గావునన్
దూరఁగనేల యీసుగుణధుర్యను? సైరణఁ బూనుఁడయ్య యీ
ధారణి కింక నాదరతఁ దప్పక మీరభిషిక్తుఁ జేయుఁడీ! 188

గీ॥ ఇద్దగుణుఁడౌస భరతుండు నేను మీకు, నరియుఁ దుల్యంబ యయ్యుగాన యతఁడె నేల
నేలఁగూడదె? యీ భేదమేల? తెలిసి, జేలవలెఁ దలడిల్లెద రేలమీరు? 189

ఉ॥ మనవంశంబునఁ బుట్టినట్టి ప్రభువుల్ మాటిన్నుడుం దప్పఁబో
రను సత్కీర్తి జగంబులోపలను విఖ్యాతంబుగా నిల్చె దా
నినిఁబోనాడిన రాజ్యమేల? బతియున్ నేనేల? నీవేల? కా
వున సత్యాత్ముఁడవై తిరింపు మనఘా బోవిడ్వు మీ శోకమున్ 190

గీ॥ ఆలసింపక నన్నింక నడవికనుపు, పదియునాల్గేడులుండి నేఁ బిదప వత్తు
పారమార్థికదృష్టినిఁ బదిలముగను, హృదయముననిల్పి శోకంబు వదలుమయ్య! 191

గీ॥ అనుచు దుఃఖోపశమనవాక్యము లనేక, ములుమహామతి రాముఁ డా భూవిభునకుఁ
జెప్పి వలఁగొని కైకకుఁ జేరి మ్రొక్కి, కదలె వటనుండి నిశ్చలహృదయుఁ డగుచు

ఉ॥ మాపెరుఁడంత రాఘవుఁడు వోవుచునుండఁగ జూచి యేడ్చుచుం
"పోఎలదన్న! కౌశలకుఁ బొమ్మని నెను వచింపవెన్నఁడున్
సివిటు నన్నువీడి చనసితియె? నిన్ విడనాడి మేచిలో
జీవము లెటునిల్పుదును? జెప్పఁగదన్న!" యటంచు నార్తుఁడై 193

కం॥ ఎలుఁగెత్తి గోడుగోడునఁ, ఎలవించుచు నేలమీదఁ ఎడి మూర్ఛిల్లెం
ఎలఁపఁగ నసిచే సతికిన, నిలమీదం దునిసిపడెడు వృక్షము మాడ్కిన్ 194

గీ॥ దశరథుండట్లు మూర్ఛిల్లి తనకుఁదానె కొంతతడవునకుఁ దెలిసి క్రూరచిత్త
యైన కైకసు దూరిచు నచటువాసి చనియె వందురుచున్ యథాస్థానమునకు 195

సీ॥ అంత రామావనీకాంతుఁ డాకౌసల్య యింటికిం బోవ నాయిందువదన
యెడదసంతోషించి కొడుకునక్కునఁ జేర్చి చెక్కులముద్దాడి చిక్కువడిన
ముంగురుల్ సవరించి మోదాశ్రుపులురాల లలితాన్నపానాదులను నొసంగి
సంతృప్తుఁ జేయు నాజననితోఁ బుత్రకుఁ డిట్లను, "నోతల్లి! యింకమీఁద
గీ॥ నెవరి నీరీతిఁ బోషింతు? వెవరిఁ గాంచి, చిత్తమున సంతసింతువో చెప్ప?" యనవుఁ
గా ఎతీరిత్ర మాపల్కు లరయుఁదనకు, ములుకులై కర్ణములసోక నలికి ఎలికె 196

## రాముఁడు తనవనవాసోదంతమును జెప్పఁ గౌసల్య శోకించుట

మ॥ "కొడుకా యెన్నఁడు పల్కవే యిటుల? నాకుంజూడఁగా నేఁడు నీ
నడువుల్ వింతగఁదోచె నీపగిది నీనోటన్ మహోగ్రలముల్
వెడలం గారణమేమొ? దాపక కడున్వేవేగ వాక్రుచ్చి నా
యెడదం గలిసయుట్టి సంశయభరం బెల్లన్ నివారింపుమా!" 197

చం॥ అనివుఁడు రాముఁడింకఁ దనయింటకుఁ జెప్పక తప్పదంచు నె
మ్మనమునఁనెంచి యిట్లనియె" మాతరొ! కేకయరాజపుత్రికిన్
మును క్షితిపేతి రెండువరముల్ ప్రియమార నొసంగెనట్టి యా
ఎసరుహనేత్ర యిప్పుడవి ఎల్లఘ నిమ్మనికోరెఁ గోరినన్ 198

గీ॥ "ఇత్తు"నని పార్థివుఁడుచెప్ప నింతియొక వ, రిమ్మనకు భరతాభిషేకమ్మను మఱి
యొకవరమునకు విపినంబులకుఁ బతుర్ద శాబ్దములు పంపఁగోరె నన్నమలచరిత! 199

గీ॥ అనినవిని పిడుగువడినట్టులై 'హతాస్మి', యనుచు హృదయంబు చెదర నాయతివ గొప్ప
[illegible] 200

గీ॥ అంత నారామపుఁడు తన యింటిచెంతఁ, జేరి శైత్యోపచారముల్ సేయఁ గొంత
వడికిఁ దెలివొంది యుడుగని వగలఁబొంది, యిట్లు విలపింపఁజొచ్చె నా యింతిమిన్న

సీ॥ "తనకు వరంబులు ధరణీశుఁ డిచ్చెఁబో నీరీతిఁ గైకేయి కోరనేల?
కోరెఁబో మదిలోనఁ గొంకక నరనాథుఁ డిచ్చెదనని మాట యీయనేల?
యిచ్చెఁబో భరతున కిలనిమ్మనక యింతి యడవికి నినుఁ బంపు మనఁగనేల?
అన్నంతనే లేశమైనను గృపలేక పతి నిన్ను వనులకుఁ బంపనేల?
గీ॥ ఇన్నిటికిఁ జూడ నా వ్రాత యిటులుండె, దుర్విధిని నింక నేమని దూరుదాన?
నీవు కానలకేగిన నేను మేన, జీవముల నిల్పఁగలనె? నా చిన్నికొడుక! 20?

మ॥ నిను ధాత్రీశ్వరుగా నొనర్తుననుచున్ నేడీ ప్రజానీకముల్
విని వాక్రుచ్చి యధర్మచిత్తుఁడయి పృథ్వీనాథుఁ డాకైక చే
సిన దుర్బోధకు లొంగి విన్ను వనవాసిం జేయఁగాఁ బూనె మీ
జనకుం డెంతిది క్రూరచిత్తుఁడొ గదా? చర్చింప నోపుత్రకా! 20

గీ॥ కైకేయికొసకుఁ బట్టంబుఁ గట్టనిమ్ము, నీతివిఖ్యాతుండని ఖ్యాతిఁగన్న
నిర్మలుఁడె నీదుజనకుండు నెనరులేక, నిన్ను వవికేల పొమ్మనె నీతిఁదప్పి 20

శా॥ ఎన్నో నోములునోచి నోచి మటి ని న్నేఁగంటినేకాని మా
యన్నా! నీవు ధరాధినేతవయి యాహ్లాదింపు భాగ్యంబునుం
గన్నారం గననోచనైతి నకటా! నాయట్టి నిర్భాగ్యురా
లున్నే యుర్విపుడైన నేశోకతతి యీయుర్విం? గుమారోత్తమా! 2(

గీ॥ సందియులు లేక కొన్నాళ్ళు నుందుచుంటిఁ, గొడుకు కల్గియు నేడుమ గుండెపలసెఁ
బట్టుగొంగ్రాలనై యున్న నిక్కపనట, లేకపోయియుండుసుగద నాకుఁ బుత్ర! 2(

శా॥ నీవీయుర్వికి నేతవౌదు వనుచున్ నీ శైశవంబందునన్
దైవజ్ఞుల్ వచియించి రప్పలుకు తథ్యంబంచు నే నమ్మి నే
డా వాక్కుల్ వృథసేసి కైక యిటు నా యాశాంకురచ్ఛేదమున్
గావించెంగద యింక నే బ్రదికియున్నన్ సార్థకం బేమికో? 2

కం॥ నాకంటె వెక్కుడుగ నీ, వాకేకయసుతను భక్తి నరయుదువుగదా!
యేకీడొనరించితివని, యాకాంత యడవికిఁ బంపుమని కోరె నినున్?" 2

గీ॥ అని యనేకవిధంబుల వనరుతల్లి, కాత్మజుం డిట్టులనిపల్కె, "నమ్మ వినుము!
దైవనిర్ణయ మిట్టుండఁ దిగుసె వారు, వీరు చేసిరటంచును దూర మనకు? 209

క౦॥ తనకిత్తునన్న వరములు, వనజేక్షణ రాజనడుగవలదె? యతండా
ఎనితికు నొసఁగుటి తప్పే?, జనక నివాక్యంబు నిల్పఁజనదే నాకున్? 210

క౦॥ మును భార్గవరాముఁడు తన, జనకుఁడు నియమింపఁ దల్లిఁ జంపఁగలేదె?
జనకుని ఎంపాసరింపని, తనయుఁడు జీవన్మృతుండు తథ్యం బరయున్ 211

గీ॥ తండ్రియాజ్ఞ నుల్లంఘింపఁ దగ దదెట్ల, దైనఁ గావించునాతఁడె యాత్మజుండు
కాన వేఁబోదునమ్మ యాగహనములకు, నాకనుజ్ఞ యొసంగుము శోకముడిగి" 212

గీ॥ అనిపుఁ డా కోసలాత్మజ తనమనమున, నంతకంతకు మితిమీరి యగ్గలముగఁ
బొంగివచ్చెడు దుఃఖంబు ద్రింగలేక, వెండి యిట్లని తాఁ బలవింపఁజొచ్చె 213

సీ॥ "మేడలలోపల మెలఁగుచుండెడునీవు గహనవాసంబెట్లు గడిపెదన్న?
స్యందనాదులనెక్కి సంచరించెడునీవు చెడుత్రోవలందెట్లు నడతువన్న?
మెత్తనిపాన్పుపై నత్తమిల్లెడునీవు నేలపై నెటు శయనింతువన్న?
లలితమృష్టాన్నంబు లనుభుజించెడునీవు కందమూలము లెట్లు తిందువన్న?
గీ॥ కేవలము సుకుమారుండ వీవు దండి, యెండలందునఁ గ్రాగు చెట్లుండెదన్న?
తనవరతమహాభోగంబు లందునీవు, కష్టములనెట్లు సైరింపఁ గలిగెదన్న? 214

ఉ॥ నిన్నెటుపంపుదున్ వనికి? నీవటఁ గష్టములందుచుండ మా
యన్న! గృహాంబునందటుల నక్కట! నేను వసించియుండుదున్?
నన్నును వెంటఁదోడ్కొని వనంబున కేగుము నీవులేనిచో
నినగరంబదేల? మరి యేటికి నిందలి వైభవంబులున్? 215

సీ॥ శ్రీపుఁదాటిన మాపుత్రియ నిన్నుఁబాసినే నీవడునాళ్లెడు లెట్టులుండు?
నదియుసుంగాక మాయమని భరతుఁడెలఁ గడుఁ గ్రూరురాలైన కైకకోడి
పరివారములు నన్ను బలసికొల్వఁగరారు పెనిమిటిచనుపు లేకునికివెతఁగి
ఎన్నెయి వాసియు వెతఁబం టెడలినే నెట్లు జీవించుచు నింటనుందు?
గీ॥ సాటివారిలో నెగుఁబాటుఁ జేటుపొంది, కైక శాసింపనన్ను నేకరణి సైతు?

## శ్రీరాముఁడు తనతల్లి యగు కౌసల్య నూరడించుట

సీ॥ "కడువృద్ధురాలవు కష్టంబులెట్టివో యెన్నఁడేనియును నీ వెఱుఁగవమ్మ!
వనవాసమన్న దుర్భరమహాక్లేశాస్పదము గాన నీవు రాఁదగదు సుమ్మ!
యిదియు నట్లుండె నీ యువనిలో సతులకుఁ బతియె చుట్టము దైవ మతనికంటెఁ
నెలఁబోరు వేఱొండు దైవంబులే దట్టి పతిఁబాసి నావెంట వత్తుననుట
గీ॥ పాడిగాదిమ్మ నాకిది వగచుచున్న, తండ్రిసేవింపు మింటనే తగవసింపు
నెక నెగాడఁపోకుఁడు కలసిమెలసి సంచరింపుము బాంధవ సద్వ్రజంబు" 217

సీ॥ అని పెక్కులెఱఁగిల నా రామచంద్రుండు తనకు బోధింప నాతరుణిమిన్న
కొంతసేపటికి నొక్కింత ధైర్యముఁబూని తొరఁగెడు నశ్రులు తుడుచుకొనుచు
వగయింత బానాడి వదనంబు నీటిచేఁ బ్రక్షాళనముచేసి వచ్చి రాఘ
వలచేతి కొకరిక్ష వలనొప్పఁగాఁ గట్టి "యానాఁడు సుధఁదేర నరిగియున్న
ఆ॥ యాఖగేశ్వరునకు నైన శుభంబది, నీకుఁగలుగుఁగాక నిఖిలసురలు
బ్రోతు రనవరతము పొ"మ్మనిదీవించి, సాగనంపె రామచంద్రు నపుడు 218

కం॥ జననికిఁ బలుమా ర్లభివం, దనమొనరిచి "పోయివత్తుఁ దల్లీ! చిత్తం
బున వగవకు"మనుచు నుడివి, చనియె నతండా సుమిత్రసదనంబునకున్ 219

కం॥ అంత సుమిత్రయు లక్ష్మణుఁ, డెంతయు సంభ్రమముదోప వినికులపతి క
త్యంతరమణీయపీఠమ, నంతగుణాఢ్యునకు నిడఁగ నాసీనుండై 220

### శ్రీరాముని వనవాసవృత్తాంతము విని సుమిత్ర దుఃఖించుట

కం॥ తన వనవాసోదంతము, ఘనుఁ డారాముండు చెప్పఁగా విని మదిలో
నెవలేని దుఃఖమొదవ, న, వని పైఁబడి యాసుమిత్ర పడి మూర్ఛిల్లెన్ 221

ఉ॥ అప్పుడు లక్ష్మణుండు చటులాహివిధంబుల మండి కన్నులన్
నిప్పులురాల నిట్లనియె "నిన్ను వనంబున కంపుమంచుఁ దాఁ
జెప్పెడి దట్టి కైక పతి చేడియమాటకు సిగ్గులేక ని
న్నిప్పని కియ్యకొల్పెనటె? యిప్పలుకుల్ వినఁగూడునే? నృపా! 222

ఉ॥ ఎప్పుడొ యిత్తునన్న వర మిప్పు డొసంగకపోయినం గదుం
దప్పని యెంచెఁగాని మనతండ్రి జనుల్విన నేడు నిన్నుఁ దా
నిప్పుడమిన్ సనుష్ఠముగ నేలఁగఁజేయుదు నన్న వాక్యముం
దప్పుటమాత్ర ముల్లమునఁ దప్పిదమంచుఁ దలంపఁ డేమియున్ 223

ఉ॥ చెప్పదుబుద్ధి రాజునకుఁ జేకొనఁడేనియుఁ దత్ప్రలంబునుం
దప్పక పొందువాడు పగదాయనుఁ గైకను దారుణాసిచే
నిప్పుడ ఖూల్తునొండె మఱి యూపురిఁ బాసి తనూజతోడఁ దా
నిప్పుడువాలుగేండ్లు వనికేగ(గఁ) జేయుదునొండె" నాపుడున్ 224

సీ॥ అనుజునిఁ జూచి యయ్యన్న యిటనిపల్కె, "సౌమిత్రి! విను సత్యసంధుఁడైన
జనకునిఁ గొనియాడఁజనుఁగాని నిందింపఁజన దింత కాయన సల్పినట్టి
యపరాధమేమి? ఈ యమ్మకిచ్చెదనన్న వరములీరాదె? యవ్వనిత వాని
నడుగఁగూడదె? తండ్రియాజ్ఞ నౌఁదలఁదాల్చి యడవి కేఁబోవ న్యాయంబుగాదె?
గీ॥ ధర్మరతుఁడైన భరతుండు ధరణివేలఁ దగదె? తమ్ముఁడ! యిందేరి తప్పులేమిఁ
దెలిసియును నీవెవరిపైన నలిగి యింక, బలపరాక్రమములు చూపఁదలఁచితయ్య?" 225

తే॥ అనుచు బోధింప నారాము నమలబోధ, తనచెవుల కంకుశంబయి తాక నన్న
దురుతరాటోపమును వీడి యుస్సురనుచు, మదముడిగి నిల్చె లక్ష్మణమదగజంబు 226

ఆ॥ అంత మూర్ఛఁదేరి యాసుమిత్రాదేవి, ప్రబలదుఃఖభయదవార్ధియందు
మునిఁగి యిట్టులనుచుఁ బొరిపొరివిలపించె, గరము నెట్టివారి దొరఁగుచుండ 227

సీ॥ "నీవు సామ్రాజ్యాధినేతవై పరిపాలనమ్ము సేయుదువని నమ్మియుంటి
మేటిప్రభులకెల్ల మేటివై దిశల యశమ్ము నిల్పుదువని నమ్మియుంటి
మూకక్షములఁబాపి మాకేడుగడయునై మమ్ముఁ బ్రోచువటంచు నమ్మియుంటి
చేనాటికైన మాకింతయాధారమ్ము సుమ్ము! నీవని చాల నమ్మియుంటి
గీ॥ నకట! నాయాసలన్నియు నవనిఁగలిపి, పుణ్యసాఫల్య కౌసల్యఁ బుత్రశోక
వార్ధిలోపల ముంచి యీనాటికైన, యాజ్ఞఁబాటించి వనికేగ న్యాయమగునె? 228

సీ॥ పినతల్లి చిన్నమ్మ యని నను బ్రియమార నింకఁ బల్కెడువార లెవ్వరయ్య?
ముద్దులొల్కఁగ నాకుఁ బుణ్యచరిత్రంబు లింక భాషించువా రెవ్వరయ్య?
మమతతోఁ గుశలసంప్రశ్నముల్ గావించి యింక మమ్మలయువా రెవ్వరయ్య?
సతతంబు నామెకసుతుతోడ నతఁగూడి యెలమిఁ బ్రేమించువా రెవరయ్య?

గీ॥ నీవు కానలకేగిన జీవితంబు, నెట్లు నిల్పుదు? నింక నా కేదిదారి?
నీవియోగమహార్ణవ మేవిధమునఁ, గడతునో? చెప్పుమయ్య యిక్ష్వాకుతిలక!" 229

సీ॥ అని పెక్కుభంగుల నడలు సుమిత్రకు రాముఁడు జ్ఞానవైరాగ్యములను
వెరవొప్ప బోధించి ప్రేమతో నామెఁ దేర్చి యాలక్ష్మణుదిక్కుఁ జూచి
"నేవచ్చువందాక నీవింటనేయుండి నావియోగమునకై నవయుచుండు
తండ్రినిఁ దల్లులఁ దగ నూరడింపుము కైకనేమియు ననఁబోకు మఱియుఁ
గీ॥ బరమసద్గుణభరితుఁడౌ భరతుతోడి, చెలిమిఁ బాటించి వర్తింపు చిరశుభంబు
లందుఁ దమ్ముఁడ!"యని చెప్ప నతివిషణ్ణ, హృదయుఁడై యగ్రజున కాతఁ డిట్టులనియె

శా॥ అన్నా! నీవు నిమేషమేనియు నయోధ్యాపట్టణంబందు లే
కున్నన్ మామకచిత్త ముండుటకు నుద్యోగించునే? కావునన్
నన్నుం దోడ్కొనిపొమ్ము కానలకు నీ నవ్యాంఘ్రి సేవాఫలం
బున్నం జాలుఁ గృతార్థసంభవుఁడనై యుందున్ సదా రాఘవా! 231

గీ॥ నీవు రావలదంటేని నెటతోడ, లక్ష్మణుఁడు లేడటంచుఁ దలంపు మనసు!
నాడు బాణాగ్నిచేత నీనగరమెల్ల, భస్మమొనరించి ప్రాణముల్ పాయువాడ!" 232

సీ॥ అనుఁ డాసుమిత్రి యిట్లనియె రామునితోడ "సీతమ్మఁ దక్కఁట! నిన్నువిడిచి
యొకనిమిషంబేని నుండనేర్చునె వీటఁ? గొనిపొమ్ము నీవెంట వనుల కీతని
నీకు దోడైయుండు నీసేవలొనరించు నెల్లవిధంబుల నితనిరాక
శ్రేయస్కరం"బని చెప్ప నాసతిపల్కు చేకొని సౌమిత్రిరాక కపుడు
గీ॥ నెమ్మనంబున రాముఁ డంగీకరించి, తనదు పినతల్లి యిచ్చు దీవనలఁ గొనుచు
నాస్య మవికారమైయొప్ప నచటువాసి, క్షితితనూభవగేహంబుఁ జేరఁబోయె 233

## రాముఁడు తనవనవాసవృత్తాంతము సీత కెఱిఁగించుట

గీ॥ అప్పు డారాముఁగని యిట్టులనియె సీత, "ఛత్రమును వాహనంబును జామరంబు
మొదలుగాఁగల నృపచిహ్నములను వదలి, యేగుదేరఁగఁ గారణమేమి నాథ?" 234

కం॥ నావుఁడు దరస్మితాననుఁ, డై వారిజనేత్రతోడ నతఁ డిట్లనియెం
"గేవల మరణ్యవాసికి, భావింపఁగనేల కొమ్మ ప్రభుచిహ్నంబుల్?" 235

సీ॥ అనవిని వెదరి యాఁగలేక రామునితోడ "వనవాసినంటివి వరగుణాఢ్య
కారణం బదియేమి గలదొ నాచెప్పవే" యటంచు నడుగ జానకితోడ నవనివిభుఁడు
తెలిసి వనవాసవృత్తాంతంబు పూసగ్రుచ్చినరీతిఁ జెప్పెఁ జెప్పిన లతాంగి
నిర్విణ్ణురాలయి నేలపై మొదలంటఁ ద్రవ్వఁబడిన లతిక చందముఁ ద్రెళ్ళి
గీ॥ కొంతతడవునకుఁ దెలిసి స్వాంతమందు, నంతకంతకుఁ బొడముచున్నట్టి దుఃఖ
మపనయింపఁగలేక యాయబ్జవదన, పేరెలుంగెత్తి తా విలపింపఁ జొచ్చె 2

సీ॥ "పరహితత్వంబును బరసతీపరధనవిముఖభావము మహావితరణంబు
దయయును సత్యంబు దాంతియు శాంతియు విజితేంద్రియత్వంబు విమలతపము
విద్యయు జ్ఞానంబు వినయంబు శీలము సౌజన్యమును సదాచారపరత
సద్వివేకంబును సద్విచారంబును సమదృష్టియును సుప్రసన్నతయును
గీ॥ మొదలుగాఁగల సద్గుణంబులకు నెలవు, మాటపట్టయి యున్న నిన్ననఘచరిత
కన్నకొడుకని లవమైనఁ గరుణలేక, ఖేదు కానకుఁబొమ్మనఁ బాడియగునె? 2

సీ॥ రాముఁడు నామకప్రాణపంచకమని పలుమార్లు మీతండ్రి పలుకుచుండు
రామునిపై నాకుఁ బ్రేమయెక్కుడటంచుఁ బలుమార్లు మీతండ్రి పలుకుచుండు
రామున కీధరారాజ్య మిచ్చెదనంచుఁ బలుమార్లు మీతండ్రి పలుకుచుండు
రామభద్రుండు నానోముఫలంబని పలుమార్లు మీతండ్రి పలుకుచుండు
గీ॥ అట్టి మహనీయగుణశాలి కిట్టిపాప, బుద్ధి జనియించుటలు చూడ మున్నుపాల
కడలిలోపల గరళంబు పొడమినటు లయ్యె దుర్విధి కేమందు? నవనినాథ!" 23

సీ॥ అని విలపించు నయ్యతివ కాతఁడుచెప్పె "దైవకృతంబులై దాపురించు
కష్టసుఖంబులు గణుతింప రేబగళ్ళనుబోలి యొకదానివెనుక నొకట
వచ్చుఁ గ్రమ్మఱవిచ్చు వానికై వగవంగఁ బనిలేదు కాంత! యింటను వసించి
యత్తమామల భక్తినరయుచు సతతంబు సేవించుచుండుము చెందుఁగీర్తి"

ఆ॥ అనిన విని లతాంగి యాత్మేశుతోఁ బల్కె, "నిన్నుఁబాసి నేను నిలువఁగలనె?
చంద్రు నెన్నఁడైనఁ జంద్రిక పాయునే? వత్తు నీదువెంట వనుల కనఘ!" 23

గీ॥ నావుఁ డారామచంద్రుండు నాతికనియె, ' సంతతక్రూరజంతుసంచారఘోర
కాననంబగుఁ గాని యది యుద్యానవనము, కాదు చనుదెంతు వనుటను [illegible]" 24

మ॥ అవినన్ జానకి సమ్మతంపడక తా నాత్మేచ్ఛతో నిట్లనున్
"వనిలో మీ రగచాట్లపాలగుచునుండన్ నేను గేహంబునం
దనయంబుండుట నీతిగాదు కొనిపొం డాత్మేశ! మీరున్న యా
వన ముద్యానవనంబు గాగ మదిలో భావించి నే నుండెదన్ 241

క౦॥ పతి యెచ్చట వసియించునొ, సతియును దానచట నుండఁజనుఁ గావున స
మ్మతి వచ్చెదమీతో" నని, యతికరుణముగాఁగ నేడ్చి యువవిజ వేడెన్ 242

## శ్రీరాముఁడు సీతరాక కంగీకరించుట

సీ॥ త త్సతీమణిరాక కంగీకరించి యా రాముఁ డప్పుడు సుమిత్రాసుతుండు
వెంటరా దేవితో వేవేగఁ దిపుతండ్రి నగరికిఁ జనఁగన్న నరవరుండు
కాంచి భార్యలుఁ దాను గడిది యుగ్రాపెళవివశాత్ములై పలవింపఁ బొడఁగ
రటనున్న వారంద శోకసెయ్యుచుండ దోప కపని దర్శించుము సతిపిన్న
గీ॥ రక్తులై యూరకుండిరి చిత్రరుపుల, పగిది నయ్యెడ శ్రీరామభద్రుఁడు తన
మునయాలాపములచేత నాత్మజనకు, నెలమి వెంతయు నూరార్చి యిట్టులనియె 243

సీ॥ 'ఈసీతయును మతీ యీసుమిత్రాత్మజుఁ డడవికి నాతోడ నరుగుదేరఁ
యినమైయున్నారు వలదనిచెప్పిన వినరు గావున వీరి విపినమునకుఁ
బోకొనిపోవుదు నాకస్సుయిసెంగు మనఘాత్మ!'' నావుఁ డా యువనివిభుఁడు
తనపుత్రుతెగువకుఁ దద్దయుశోకించి 'యాలిమాటలువిని యక్కటకట,
గీ॥ నిన్నుఁ గానకుఁబొమ్మంటి వెనరులేక నీచమనుజుఁడ ఖలుఁడ దుర్నీతిపరుఁడ
నాదుతప్పు క్షమింపుము నాదుకొడుక! పోఁడగదు నీవు కానసభూములకును' 244

గీ॥ అనుచు వాపోవుచుండ నయ్యధిపుఁ జూచి, కోసలేంద్రతనూజయు నాసుమిత్ర
కైకదూరుచుఁ బలవింపఁగాఁ దొడంగి, రప్పు డిట్లను రాజుపై వలిగి కైక 245

మ॥ 'మును నాకిచ్చెదనన్నయిట్టివరముల్ భూమీశ యీఁగోరితిం
గానుమం చీవు నొసంగినాడ విది నీకుంగష్టమైయున్న నీ
వని వాక్రుచ్చినఁబోదె? యింతవగపేలా? నీవు నీయంగనల్
కనుఁ దిటంబనియేమి? యాపగిదినిన్ నాయందుఁ దప్పేమొకో?' 246

## శ్రీరాముఁడు సీతాలక్ష్మణసమేతుఁడై వనములకు బయలుదేరుట

సీ॥ అవ్వసిష్ఠులవారి కభివందనము సేసి యమ్మహాత్మునిచేత నతులితంబు
లైన యాశీస్సుల నంది యచ్చటనున్న సర్వులకును నమస్కారపూర్వ
కంబుగా 'మేమిదే కానకేగెద' మంచు విశదంబుగాఁ దాము విన్నవించి
బాణబాణాసనపాణులై ధృతతనుత్రాణులై యయ్యన్నదమ్ము లిరువు
గీ॥ రరుగ సంవిధులై యుండునంత సీత, డాయఁగావచ్చి కౌసల్య పాయని వగఁ
తన్ముఁ బొందఁగ శోకించి ఖిన్నయగుచు నిట్టులనియెను సన్నని యెలుఁగువొప 254

సీ॥ "మేటిరాజులలోన మేటిభూతిండని యీ రాజునకును నిన్నిచ్చె జనకుఁ
డింతిరో యాతని కేపురాకృతమహాపాపసంచయపరిపాకమునకొ
నేఁడిట్టి దురవస్థ మూఁడెను దీనికై వగచి రాముని దూరవలదు నీవు
పతి దరిద్రుండైనఁ బామరుండైనను పతియెట్టివాఁడైన మానవతికి
గీ॥ నతఁడె దైవము కావున నబ్జవదన!, పతిని సేవింపు సత్కీర్తిఁ బడయుమమ్మ!"
యనుచు దీవింప 'నౌఁగాక'యని లతాంగి, యత్తకున్ భక్తిమ్రొక్కె ధన్యాస్మి యనుచు

ఉ॥ అట్టితఱిన్ సుమిత్ర తనయాత్మజుఁ జేరఁగఁబిల్చి యిట్లనుం
'బట్టి! రఘుప్రవీరుని భవజ్జనకుండుగాఁ దలంపు న
న్నెట్టెటుఁగొల్తు వట్లె యిటి యీజనకాత్మజఁ గొల్వుమన్న యా
నట్టడవిం బురంబనుచు నమ్మి చరింపుము పొమ్ము పుత్రకా!' 256

సీ॥ అని పుత్రు దీవించి యాసతి వెండియు నారామునితోఁ జెప్పె 'సనఘ! నీవు
నడుభయంకరమైన కాననభూమిలో నీనీడుతమ్ముని నీజనకజ
నెల్లవేళలయందు నేమరఁబోకుము' నావిని రాముఁడా నాతికనియె
'నాచేతి విల్లుండ నీచతుర్దశభువనములవైనను గెల్తు నాకు వీరిఁ
గీ॥ గాచుటొకలెక్కగాదమ్మ! కలతమాని, యునుపుమమ్మ మమ్మింక నీ' వనుచుఁ జెప్పి
యామె యొసఁగెడు దీవనలందుకొనుచు, నాయ్యమునఁ జిఱునగవొప్ప నాక్షణంబ 257

గీ॥ ఆటిపంపున నొకరథ మాసుమంత్రుఁ, డాయితముసేసి కొనితేర నందుపైనఁ
దమ్ముఁడును జానకీదేవి తాము నెక్కి, కదలె రాముఁడు వేవేగ గహనములకు 258

## పౌరులు సీతారామలక్ష్మణులను వెంబడించుట

ఉ॥ అప్పుడు పత్పురీజనము లందఱు నొక్కట గుంపులై కడున్
గొప్పరమైన వెవ్వగలఁ దేలుచు 'రాముఁడు లేకయున్న చో
నిప్పురి నుండనేల? మన మేగుద మాతనితో'యటం
చప్పృథివీశ్వరుం దరిగినట్టి పథంబునఁ బోయి రార్తులై 25‘

గీ॥ దశరథుఁడు భార్యలుం దాను దారివెంటఁ, బరుగిడుచు 'హోసుమంత్రుఁడా! యరద మాపు
మెప్పుఁ డీక్షింతుమో రాము? నింకొకపరిఁ, గాంతు' మని కేకలిడఁగ నా కలకలంబు

చం॥ వినుచు సుమంత్రుఁజూచి రఘువీరుఁడు రామవిభుండు పల్కె "మా
జనకుఁడుఁ దల్లులుం బ్రజలు చయ్యన వచ్చుచు నున్నవారదే!
కను మిట వారువచ్చినను గార్యముదప్పును కాన తేరు నీ
వనిలజవంబునన్ నడుపు" మన్ననతండును దోలె గ్రక్కునన్ 261

కం॥ రథవేగముఁ గనుఁగొని, తా రరుదెంచుటలు చూచి "యద్దయు వేగన్
ఈ రయిగిచున్నవా" రని, పౌరులు తలవోసి వెనుకఁ బరువిడిరి వెసన్ 262

చం॥ అరదముఁజూచి చూచి మఱి యయ్యది చూడ్కి కదృశ్యమైన న
త్త్వరితరథాళిఁ గాంచి యదియుం దగఁ దోన నడింగినన్ నరే
శ్వరుఁ డటుపిమ్మటన్ మిగుల పట్టబయల్గని తెల్లవోయి ని
ష్ఠురముగ హా ని బొబ్బలిడి వందురి వందురి నేలపైఁ బడెన్ 263

ఆ॥ అప్పు డా సుమిత్ర యా కోసలాత్మజ, ధరణిమీదఁ బడిన ధవుని లేపి
యెత్తి ధూళిఁదుడిచి యేడ్తెఁ దోడ్కొనిపగిడి పురికిరాగ మనుజవిభుఁడు 264

చం॥ తనసగరంతఁజొచ్చి యొకతల్పమునందుఁ బరుండి పొర్లుచుం
దనయుని పోకకుం బలువిధంబులఁ గుందుచు 'హారఘూత్తమా'
యను నిడనాడితే? వినుతనామ మురారివిరామ! రామ!' యం
చనఘుఁడు రామునే తలఁచి యార్తినిఁ బొందుచునుండె తేరొగిన్ 265

కం॥ తన ప్రాణేశ్వరుకంటెను, ఘనముగ శోకించుచుండెఁ గౌసల్యయునుం

చం॥ ఎదురువిడి వచ్చుచుండఁగని భావమునం 'దిఁక వీరు వీటికిన్
మరల' రటంచుఁ దోఁప రిపుమర్దనవిక్రముఁ డాత్మఖాత్తముం
దరదము నిల్పఁబంచి ప్రజ లయ్యెడకుం జనుదేర వారితోఁ
'పురజనులార! మీకిటులఁ బోయిన నావెనువెంట వచ్చుటల్ 267

చం॥ భరతుఁడు ధాత్రికింకఁ బరిపాలకుఁడయ్యెడు మిమ్ముఁ బ్రోచెడుం
జిరముగ నాతనిం గొలిచి, చెందుఁ డనంతశుభోన్నతస్థితుల్
మరిపెఱుతోడ గీములకుఁ బొందు సుదీయహితంబుఁ గోరుఁడీ!
పురజనులార!' యంచు హితబుద్ధి వచించినఁ బౌరు లెల్లరున్ 268

ఆ॥ 'పట్టణంబు వలదు భరతుకొల్వంతకు, వలదు నీదువెంట వత్తు' మనుచు
బట్టుపట్టి యేకవాక్యులై పల్కిన, నాలకించి రాముఁ డాత్మయందు 269

ఉ॥ 'విరల కెంతచెప్పినను వీనులకెక్కదు చెప్పి చెప్పినా
నారిక నోరునొచ్చును ప్రయోజనముండ' దటంచు నెంచుచుం
బౌరుల వెంటఁబెట్టుకొని వారిజబంధుఁడు గ్రుంకువేళకున్
సారసలోచనుండు తమసానదిదగ్గఱఁ జేరి యచ్చటన్ 270

కం॥ ఆరేయిఁ గడపుటకువై, యారాఘవు లాజనకజ యాకులసెజ్జల్
నేరుపున నలవరచుకొని, పౌరులుఁ దారెలమి వానిపైఁ గూర్కుటయున్ 271

సీ॥ అర్ధనిశాకాలమందు రాముఁడులేచి మార్గశ్రమముచేత మైవి మఱచి
గుఱ్ఱువెట్టుచు నిద్రగొనుచున్న పౌరుల వంచించిపోవ నూహించి తనదు
సారథితో నిజసంకల్ప మెఱిఁగించి తేరాయితముఁజేసి తేరఁ బంచి
తారు ముప్పురునెక్కి తగ నయోధ్యకుఁ బోవు త్రోవవెంటనె తేరుఁ బోవనిచ్చి
గీ॥ కొంతదవ్వేగి మఱి ప్రక్కకున్ మరల్చి, త్రోవఁ దప్పించి వెన్కకుఁ దోలఁజేసి
తమస దాటించుకొని మహాత్వరితముగను, పోయి రవ్వల గళరథమూపసుతులు 272

ఆ॥ అట్లు పాయిపోయి యావేగవతి సర, యువును దాటి మఱియు నవలఁ బెక్కు
లగునెలవులు గడచి యరిగి యమ్మరునాడు, మంచుగొంగ యస్తమించుసరికి 273

కం॥ పటుశౌర్యధనుఁడు రాముఁడె, దుట నవలోకించె భయదతుంగతరంగన్

కం॥ ఆరాముఁడు నాటికిఁ ద, క్షీరంబును విడిచి శ్రమము దీఁనటుల
చ్చె రయిడి తానుఁ నిమ్ముఁడు, కూరిమి విశ్రామకేళిఁ గోరి శయింపన్ 27

## పౌరులు శ్రీరాముని వియోగదుఃఖముచే నయోధ్యకు వచ్చుట

సీ॥ అంతఁ బ్రభాతమందు నట నందఱు పౌరులు మేలుకాంచి బా
లాంతుఁడు చెంతలేకునికిఁ గన్గొని యెంతయు భీతచిత్తులై
యంతట రోయుచున్నెడల నారథ మేగినచొప్పు వారి క
త్యంతముఁ గానుపించుటయు నయ్యది తాము పరీక్ష సేయుచున్ 27

కం॥ ఆరథము వాడ పురిడెస, కారయుఁ జనినట్లు దోప నా రాముఁ డయో
ధ్యారాజధాని కరుగుట, పౌరులు తలపోసి చనుచుఁ బరికింప నటన్ 27

గీ॥ వాడు కొంతదవ్వేగ నాతెరు పోయి, నట్టె దాడ గప్పింపమి నర్కకులుఁడు
తమ్ము వంచించి చనెనని వెమ్మనమున, నెంచి పురి రయోధ్యకు నేత్చుకొనుచు 27

సీ॥ అట్లు పురంబున కరిగి యాపురజను లారాఘవుఁడు లేమి కార్తులగుచు
హారికొన్న పెన్నిధి మరలఁబోయినయట్లు తలఁచి యాహారనిద్రలను విడిచి
'హారామ! హారామ! హారామ!' యనిరామనామసంస్మరణంబుఁ దాము విడక
కాకుస్వరంబుల ఘనశిలల్ కరుగఁగా శోకించుచుండిరి కాకులట్లు
గీ॥ మారిదుఃఖంబు నాపింపఁ బురమునందు, గజములకు మదిధారలు గాడుటుడిగె
తురగముల్ హేషలన్వాని దుఃఖపడియె, నాఘమున్ దూడ లంబాయటంచు నటచె

## సీతారామలక్ష్మణులు గుహుని సందర్శించుట

సీ॥ అంత నక్కడ రాముఁ డాగంగయొద్దున వచ్చియున్నాడను వార్తవెలిఁగి
శృంగిబేరం బేలు చెంచుల యేకిమీఁడు గుహుఁడను మేటి భక్తుండువచ్చి
యారాముపృత్తాంత మఖిలంబువిని కుంది తేనియుఁ బండ్లు నాతిథ్యమిచ్చి
తన ప్రక్కనమునకు దశరథాత్మజులను గొనిపోయి పూజించెఁ గోర్కెమీర
గీ॥ నారఘూత్తము లారాత్రి యచటవసించి, యుచయమునలేచి నేపంబు లొప్పఁదీర్చి
జడలు మున్నగునవి కాల్చి యడవిఁ దిరుగు, తపసులం బోలి యొప్పిరి దాశరథులు

కం॥ అటుపిదప వాసుమంత్రుని, కిటులన్ వాక్రుచ్చె రాముఁ 'డికమేము రథం
[illegible] 28

సీ॥ అనిన నాతఁడు కన్నులను నీరునించుచు 'మిముఁబాసి పురి కేవిధమునఁ బోదు?
మీవెంటఁ జనుదెంతు మీసేవలొనరింతు నన్నుఁ దోడ్కొనిపొంము నయగుణాఢ్య!'
యనుచు దుఃఖించెను నాసుమంత్రునిఁజూచి రాముఁ డిట్లనిచెప్పె 'నోమనీషి!
నిన్ను నిచ్చలుఁ దన వెయ్యంపుబంటుగా నెంచుచుండిన భూమిపాలుఁ గొల్వ
గీ॥ కీవు నావెంటఁ గానకు వేగుదేరఁ, బాడి యగునయ్య? నాకునై వగచి వగచ
యేమియయ్యెనో మాయయ్య? యేమిగతియొ? యరిగి యామహితాత్ము నూరార్పవలదె'

సీ॥ అనిచెప్పి రాముఁ డాతని నియ్యకొల్పి తా వెండియునిట్లను 'విను! సుమంత్ర!
నీవయోధ్యకునేగి నేఁజెప్పినట్లుగా నెల్లరతోడను నిట్టులనుము!
పదునాలుగేడులు నడునాల్గుదినముల కైవడిఁ గడపి నగరికి వత్తు
నాకునై దుఃఖింపబోకుఁ డంచువచింపు' మనిచెప్పి వీడ్కొల్ప నాసుమంత్రుఁ
గీ॥ డరదమును దోలుకొని కుందు చరిగెఁ బురికి, నంత శ్రీరాముఁ డాయయోధ్యాపురమున
కంతరంగములోపల నధికభక్తి, వెంతయును మ్రొక్కి గుహుఁజూచి యిట్టులనియె 283

ఉ॥ 'ఆటవి వసింపవచ్చి సుగుణాకర! నీదు సపర్య నందుకొం
టిటఁ దిడవుండరాదు మఱి యింకొకచోటికిఁ బోదు మీవియ
త్తటనినిఁ దాటఁజేయుఁ' డని తామరసాక్షుఁడు రాఘవుండు ప
ల్కుటయును నాలకించి గుణకోవిదుఁ డగుహుఁ డప్పు డిట్లనున్ 284

చం॥ 'కటకట! మిమ్ము నిర్దయతఁ గానకుఁబొమ్మని చెప్పెఁ గైక నే
నెటువలెఁ బొమ్మటంచు వచియింతు? మఱేమి కొరంతగల్గె? మీ
రిట వసియించి పక్కణము నేలుడు నిచ్చలు నేను బంటనై
యెటు లొనరింపుమన్న నటులే యొనరించి సుఖింపజేయుదున్' 285

॥ అనినఁ దద్భక్తి కత్యంతంబుమెచ్చి రామావనీకాంతుఁ డిట్లనుచుఁ బలికె
'గరిమతో మునివృత్తిఁ గైగొంటిమిటమీద నెట్టభోగంబుల నొల్లమింకఁ
గందమూలముల నాకలికిమాత్రముఁ గొంచు వనవాస మొనరింప వలయుఁ గాని
జనపదంబుల నివాసముసేయ నుచితంబుకాదు గావున మేము గహనములకుఁ
॥ దోదు మట్టిటులనఁబోక సాదరమున, సాగనంపుము నీవింక సత్వరముగ
శబరకులసార్వభౌమ సజనలలామ!, ప్రాజ్ఞుఁడవు నీకు వేఱ చెప్పంగనేల?' 286

ఉ॥ నావిని యాగిరాండు ఘనవాగ్ధతిబాజాల సత్కరించి తా
నావనువెట్టి దానిపయి నాతియుఁ దాను లక్ష్మణుండు ను
ద్భావముతోడ నెక్కి గుణభద్రుఁడు రాముఁడు గంగదాటె నా
నావిధులన్ గుహున్ మనమునన్ మతిసేయుచు సంతసించుచున్ 287

సీ॥ అట్లు గంగనుదాటి యారాఘవేశ్వరుం డనుజుండు సతియుఁ దన్ననుసరింప
నెఱుగుచోఁ దనధన్వర్థ్యానినాదమునకుఁ దిద్దయు భీతిల్లి దాటులిడుచు
నల్లైనలకుఁ బాఱు నానామృగంబుల వేర్వేరఁ జూపించి వెలఁదితోడఁ
బక్షాతులెల్లను దగఁ బేర్కొనుచు మఱి యచ్చటచ్చటనున్న యతివిచిత్ర
గీ॥ వనవిశేషంబులను జూపి జనకసుతకు, నప్పుడప్పుడెంచుచున్ నదీనదములు మఱి
ప్రహ్లదముఖం వెక్కులైనట్టి యతులగిరులు, తరులు పొదలును దాటుచు నరిగి యరిగి

## శ్రీరాముఁడు సీతాలక్ష్మణసమేతుఁడై భరద్వాజుని దర్శించుట

తే॥ వాటి మాపటివేళకు వరవరుండు, నతితనిష్ఠాగరిష్ఠుఁడు సంయమికుల
సార్వభౌముఁడు నురుతపశ్శక్తి యుక్తుఁ, డగు భరద్వాజు నాశ్రమమ్ముండుఁ జేరె 289

కం॥ ఆతపసి తచ్చరిత్రము, చేతమునం దెఱిఁగి పగిది సీతాపతికిన్
బ్రీతిగ ఫలమూలంబుల, నాతిథ్యంబిచ్చి భక్తి నర్చించుటయున్ 290

మ॥ ఆరాత్రిం గిరిపందలంచి యట మార్గాయాసముం దీరఁగా
నారాముండును భూమిపుత్రి తృణశయ్యం బండి రా లక్ష్మణుం
'డె రక్షించెద మీరి' నంచుఁ 'బదునాల్గేండ్లపు నాచెంతకున్
రారా' దంచును నిద్రకున్ మఱువ నిద్రాదేవి భీతిల్లుచున్ 291

ఉ॥ 'ఎన్ని విధాలనాకు నిటుఁబొందు మిటంచు విధించినావొ? నే
డిన్నియుమిందు వ్యర్థమగున ట్లొనరింపఁగ నీకుఁ బాడియే?
నిన్నెడఁబాసి యెచ్చటికి నేఁజని యెవ్వరిఁ జొత్తు నక్కటా?
నన్ను సముద్ధరింపు కృపనంపి!' యటంచుఁ గరంబు వేడినన్ 292

కం॥ దానికిఁ గరుణించి సుమీ, త్రానందనుఁ డిట్టులనియెఁ 'దగ నూర్మిళయుం
దౌనిద్ర నీవు చూడు' మని, యానతియొసఁగుటయు వల్లె యని యది చనియెన్ 293

'నిద్రాదేవి యనుగ్రహంబు కలిగెన్ సిద్ధించె నా యిష్టముల్
పద్రంబయ్యెడు నింక మా" కనుచు దాభావించి హర్షించి ని
స్సంద్రప్రాభవశాలి లక్ష్మణుఁడు వారిం గాచుచున్నంతఁ బూ
ర్వాద్రిన్ భానుఁడలంకరించె భువనాహ్లాదైకసంపాదియై 294

## శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో చిత్రకూటపర్వతమును చేరుట

అప్పుడు పక్షుల యతులితకలకలధ్వనులుఁ దదాశ్రమవాసులైన
గాత్రులు క్రమమొప్పఁ జదువు ప్రాఁజదువుల యులివుల నాలించి యులికిపడుచు
రేగిన దని రామవిభుఁడు సీతయు లేచి సౌమిత్రి తారును సమ్ముదమునఁ
గాల్యకృత్యంబులు కడుశ్రద్ధగాఁ దీర్చి మునిసల్పు సత్కారములు గ్రహించి
సమ్మహాత్మున కభివందనమ్ము చేసి, యమితముగను దదాశీస్సు లందుకొనుచు
రామచంద్రుఁడు వినయపూర్వకముగాఁగ నాభరద్వాజముని కిట్టులనుచుఁ బలికె 295

మీరు మహానుభావులరు మీరిటఁ జూడని సుస్థలంబులో
రగుణాఢ్య లేవనుట తెల్లము గావున మాకు నుండఁగా
రయు నేస్థలంబు మఱి యర్హము తెల్పుడు' నావుఁ డమ్మహా
ముఁడు మౌనిపుంగవుఁడు దాశరథింగని ప్రీతి నిట్లనున్ 296

చంద్రులకెల్ల మేటి సతతామలపుష్పఫలోన్మఖేల్లస
ద్రుమపుంజకుంజపరివేష్టితమై యలరారు చిత్రకూ
టాద్రికిఁ బొండు మౌనులకు నెయ్యది యెల్లపు డాటపట్టగున్
పదములయ్యెడుం దమకు భానుకులాంబుధిపూర్ణచంద్రమా!' 297

యచెప్పి చిత్రకూటాద్రికిఁ జనియెడు మార్గముం దెలుప నమ్మౌనిపతికి
భక్తిఁ బ్రణతులై యటనుండి కదలి మువ్వురు మోహామూర్తు లపుడు
ముఁదు ముందును రామానుజుఁడు వెన్క నడుమ నారాముఁడును నడచిరాఁగ
యుచో నెడనెడ నిలుచుచు క్షుత్తృష్ణ లలముచో సందిలి ఫలజలముల
వారించుచు రేఁబగళ్ళనక దప్పి, యనక నొప్పియనక వింతలైన నెలవు
లెన్ని దాటుచుఁ జనిచని కొన్నిపయిని, ముని కనుఁగొని చిత్రకూటాద్రి వెలముఁగనిరి 298

సీ॥ కని దాని సౌందర్యమునకు నచ్చెరువొంది సౌమిత్రితో రామచంద్రుఁ డనియెఁ
జూచితే లక్ష్మణ! యీచిత్రకూటంబు? కన్నులపండువై క్రాలుచుండె
నెటుచూచినం గడునెత్తగు శృంగంబు లెటుచూచినన్ ఫలవిటపితతులె
యెటుచూచినన్ దరీతటధాతుపటలంబె యెటుచూచినన్ బ్రవహించు ఝరులె
గీ॥ యొరు దీనిని వర్ణింప నలవియగునె?, చిత్రకూటాఖ్య దీనికిఁ జెల్లయుంటె
యంచితగిరినైనఁ గనకపర్వతమునైన, సాటి పేర్కొనఁగూడ దీశైలమునకు 2

ఉ॥ కైక యొనర్చినట్టి దపకారముగా దది మీదుమిక్కిలిన్
నాకుపకారమౌ నని మనంబున నెంచెద నెలయన్న నీ
లోకములోనలేని యతిలోకవిచిత్రములెల్ల నిచ్చటన్
నాకనులారఁ గాంచితిని నాదు పురాకృతపుణ్య మెట్టిదో?" 3(

కం॥ అని యుగ్గిరి నగ్గించుచు, ననఘుం డారామభద్రుఁ డనుజుఁడు సతితోఁ
జనుదేర దానినెక్కెను, ఘనముగ నుదయాద్రినెక్కు కమలాప్తుక్రియన్ 30

సీ॥ ఇట్టిమ్మహాగిరినెక్కి శ్రీరాముఁడు జనకజాలక్ష్మణసహితుఁ డగుచుఁ
బోవుచో నందలి మునిపుంగవులు చూచి 'యీవచ్చుచున్నవా రెవ్వరొక్కొ?
కోటిమన్మథులైన సాటియె వీరికి? నీయింతి కేయింతు లీడుగారు
లలితమౌ సౌందర్య మలవడియున్నారు మునివేషములవేల పూనినారొ?
గీ॥ యిరయు వెందుల కిచ్చటి కరుగుదెంచియున్నవారొక్కొ వీ?' రని యుల్లములను
బలువిధంబులఁ దలపోసి భానుకులుల, కెదురుగావచ్చి పూజింప నినకులుండు 30?

కం॥ వారొసఁగిన పూజలుగొని, గౌరవమున నృపుఁడు దుఃఖకరమగు తనదౌ
చారిత్రమంతయు సవిస్తారముగా మదివి మఱియుఁ దా వారికనున్ 303

గీ॥ 'కొన్నిదివసంబు లీచిత్రకూటమందు, వాసమొనరింపఁ దలఁచినవార మేను
కావునన్ మాకు నిచ్చోటఁ గరుణతోడ, స్థలమొకించుక చూపుఁడు తపసులార!! 304

కం॥ నావుఁడు 'భాగ్యముగాదే, యీవుండుటమా' కటంచు నెల్లరు నేక
గ్రీవముగా నుడువుచు నొక, పావనసుస్థలముఁజూప భానుకులేశుల్ 305

గీ॥ అందు రమణీయమగునొక్క యాకుటిల్లు, గట్టుకొని యదియే మేడగాఁ దలంచి
మరిమెమున నందుఁ రాము కాపురముసేయు చుండి [illegible]

## శ్రీరాముఁడు కాకాసురుని శిక్షించుట

జనకజతొడపైనఁ దనశిరంబిడి రామదేవుండు ప్రీతి నిద్రించుచుండ
మాయావియగు నొక్క మనుజాశనుండప్డు వాయసంబయి డాయవచ్చి సీత
పలుమార్లు తోలినం దొలఁగిపోవక యది తన చంచుపుటమునఁ దఱిచి యురము
గాడఁగాఁ బొడువ భూకాంతుఁడాలోన మేల్కని కినుక నొక యిషీకంబు వైచె
నదియు బ్రహ్మాస్త్రమగుచు వెన్నంటిరాగఁ, గాకి పదునాల్గులోకముల్ గలయఁదిరిగి
తనకు రక్షకు లెవరులే కునికిఁజేసి, 'కావు' మని వెండిరామునికడకు వచ్చె 307

దానికిం గరుణించి భూజాని పలికె, 'నాదుదివ్యాస్త్రమది రిత్తవోదు కాన
నీనయనమొండు దీనికి నెమ్మితోడ, ని' మ్మనిన నిచ్చి యాకాక మేగెనపుడు 308

అదికారణంబుగా నవనిలోఁ గాకంబు లన్నియు 'నేకాక్షు' లనఁగ నెగడె
నిట్లు కాకాసురు నేపెల్ల మాపినవాఁడయి శ్రీరామభద్రుఁ డడవి
మునులచే దీవనల్ బొందుచుఁ దమ్ముండుఁ దరుణియుఁ దాను మోదమునఁ జేలు
చుండి రిక్కడ యిట్లుండె నక్కడ శూన్యరథముతోఁ జనిన సారథిఁ గాంచి
'యోసుమంత్రుఁడ నీవెంత మోసగాఁడ, వౌర యిమ్మెల్ల వంచించి యర్కకులుల
నెట విడిచివచ్చినాఁడవు కుటిలచిత్త?, చెప్పుమా!' యని పురజనుల్ చేరిదూఱ 309

అపనతాస్యుఁడై యేమి యనరాఁడు కా సు, మంత్రుఁ డత్యంతదుఃఖితస్వాంతుఁ డగుచు
రాజమార్గంబునం బోయి రాజునగరు, దరిసి యటఁ దేరుదిగి లోని కఱుగుటయును 310

ఆసుమంత్రునిఁగాంచి యజసుతుం డప్పుడు దిగ్గనఁ దల్పంబుడిగ్గి యతనిఁ
గౌఁగిటఁజేరిచి ఘనతరశోకంబు గదుర నిట్లనిపల్కె 'సదయహృదయ!
నాదుతనూజుల నాముద్దుకోడలి నెటదించి వచ్చితి వెఱుఁగఁజెప్పు?
మట కేసుబొరెద నటవిలోపల వార లెటులుండిరో చూచి యెగుదెంతు?
ఎన్నఁ దోడ్కొని వామ్మ పుణ్యమ్ముఁ గట్టు, కొమ్ము చయ్యనఁ దేరాయితమ్ము 'సేయు'
మనెడు నవనిపతినిఁ జూచి యాసుమంత్రు, డిట్టులనిపల్కెఁ దనవగ నుట్టుపడఁగ 311

'సమయంబుఁదీరిచి చనుదెంతు నందాక నాకునై శోకింపఁబోకు మనుచు
నీకుఁ జెప్పుమటంచు నాకుఁ జెప్పి విభుండు నన్నిటఁ బురికంపి నాతిఁగూడి
రామ దమ్ముఁడు గంగ దాటి యవ్వలఁబోయి రెటనుందురో వారి నెఱుఁగవశమె?
ఏయూహా మానుము నెవ్వగల్ పీడుము సత్యపరాక్రమశౌర్యధనుఁడు

గీ॥ రాముఁ డరిభంజనుఁడు మహారణకుశలుఁడు, కాని యాతని కేకీడు కలుగఁబోదు
పదియునాలెండ్లు సుఖవృత్తివనిఁ జరించి, తిరిగిరాఁగల ఁడధిప సందియము వలదు' 312

కం॥ నావుఁడు సుమంత్రుఁ గనుఁగొని, భూవరతిలకుండు మఱియుఁ బొగులుచుఁ బలికెన్
'నావంటి యాత్మద్రోహిని, బ్రోవఁగలయుపాయమెందు నీవు గంటె సుమంత్రా?' 313

గీ॥ ఆశ్రితజనులు సుగుణరత్నాకరుండు, నాయనంతరం మీ రాజ్యపాలకుఁడవ్వ
యనకుసరైండు మామకపోషకుఁడగు, రాముఁ గోల్పోయి యింకనే బ్రదుకఁగలనె? 314

సీ॥ ఎవ్వనికొఱకు నే నెన్నెన్నొజన్మంబు లొప్పారఁ గావించియుంటి నొక్కొ
ఎవ్వనికొఱకు నే నెన్నియో వ్రతముల నోటికమైఁ జేసియుంటి నొక్కొ!
ఎవ్వనికొఱకు నే నిన్నిన్నియనరాని యుపవాసములు సల్పియుంటి నొక్కొ
ఎవ్వనికొఱకు నే నెల్లదేవతలకు నురుభక్తితో మ్రొక్కియుంటి నొక్కొ'
గీ॥ అట్టి నాభాగ్యరాశి నాయనుఁగుఁబట్టి రామచంద్రుఁడు నిర్జితరాక్షసేంద్రుఁ
డమలగుణసాంద్రు డస్మన్నయనచకోర, చంద్రుఁ డిక్కట లేకున్న సైతునెట్లు?' 315

సీ॥ అని విలపించెడు నధిపుతోఁ గౌసల్య వగచుచు నిట్లను వసుమతీశ!
యెన్నొ నోములు నోచి యే నొక్కసుతుఁగని కడుమురియుచునుండఁ గైక తాను
నోర్వఁగాలేక యా యురుకాననములకుఁ బంపెను నాపుత్రుఁ బాపమనకి
యీరీతి శోకింపనేటికి మీరలు? విధికృతం బెవరు తప్పింపఁగలరు?'
గీ॥ నాథుఁ డపనిఁ డిట్లను 'నాతిమిన్న మఱచిపోవుదమన్నను మఱపురాని
యతితరంబగు పుత్రశోకంబు నాకుఁ, బ్రాప్తమయ్యె మనశ్శాంతిఁ బడయు టెట్లు? 316

గీ॥ రామచంద్రునిపై నాకు ప్రేమఘనము, రామువిడనాడి వేనిఁక బ్రదుకఁగలనె?
దైవయోగంబువంజేసి దాపురించెఁ, గేడుకాలంబు మనమేమి చేయఁగలము? 317

గీ॥ నా పురాకృతమగు మహాపాప మెంతొ, గిలదు కావున నాకిట్టి ఘనతరమగు
పుత్రశోకంబు జననిండఁ బొందవలసె, నెవరి పాపంబు వారల నేఁచుకున్నె? 318

## దశరథుఁడు తనశాపవృత్తాంతమును గౌసల్యకెఱిఁగించుట

గీ॥ పొలతి దీనికిఁ గారణంబుగ మదీయ, పూర్వకథ గలదొండు నీవు వినియుండ
వది మహాదుఃఖకరమైన దగుటఁజేసి గౌసల్యా [illegible] 319

సీ॥ తొల్లి నేనొకనాడు విల్లమ్ములుఁబూని సరయూనదీపరిసరమునందు
ఎదురేయి వేటాడ నదిలోన బుడబుడ యనుధ్వని నాచెవియందు సోకి
వనగజంబేదియో వచ్చి తానిటనీరుఁ ద్రాగుచున్నదటంచుఁ దలఁచి యొక్క
సునిశితాస్త్రము గుఱిచూచి యాదెసకునే విడిచితి విడిచినవెంటనె యొక
గీ॥ మునికుమారుని యార్తనిస్వనము నాకుఁ, గర్ణగోచరమగుటయుఁ గిడు భయమున
నచటికిం దక్షణమపోయి యజ్ఞదత్తుఁ, డను మహాతాపసోత్తము తనయుఁగంటి 321

సీ॥ ఆతఁడు తనచేతియందలి కుండిని నొక్కెడవైచి పేరురము నందు
నాటిన బాణంబు నాటినట్లేయుండ నీటియొడ్డునఁబడి నెత్తురొలుక
నట్టిటు పొరలుచు నాయాసమందుచు నిట్లని విలపించె 'నెన్నఁ డెపుడి
కెగ్గుసేసియెఱుంగ నిట్టి నన్నెవ్వడో క్రూరబాణంబునఁ గూలవేసె
గీ॥ దైవమా వృద్ధులగు నాదు తల్లిదండ్రు, లెంతయేడ్తురో మాకొడుకేడి? యనుచు
నింక వారి నోదార్చువా రెవ్వరొక్కొ?, మఱియునిది విన్నవారిల మందురొక్కొ' 322

తే॥ అని యనేకవిధంబుల నడలుచున్న, మునికుమారుని నేఁ జేరఁబోయి యతని
యురమునన్ నాటియుండిన శరమువెఱికి, యుపచరించుచు నిట్లంటి నుభయమున

ఆ॥ 'బాలకా! నీవు నీటిలోపలఁ గమండ, లువును ముంచినయప్పుడు రవముకలిగె
నదివిని గజేంద్రుఁడనుబుద్ధి నకట! నేను, బాణమేసితి క్షమియింపవలయు నన్ను' 324

కం॥ అనివగచుచు బ్రతిమాలెను, వనుఁగని యాబాలుఁడనియె "నావిధి యిట్లుం
డెను నీ వేమియొనర్చితి, వినకులపతి కుంద"కనుమ నిట్లనె మఱియున్ 325

చం॥ "నరవర! నీరుదెమ్మనుచు నాతలిదండ్రులు పంపవచ్చి నీ
కరవాతిఁజేసి యిచ్చుటను జావఁగనుంటెని నీరువట్టుచేఁ
గరమఁ దపించుచుందురటఁ గావున వారికి వారిఁగొంచు న
త్వరముగఁ బోయి నీవొసఁగి దాహము దీర్పుము పుణ్యముండెడున్" 326

కం॥ అని నాకుఁ జెప్పి మునినం, దనుఁ, డసువులఁబాసె నంతఁ దద్దయు వగలన్
మునుఁగుచు జలములఁ గొని నే, ఘనులగు మునిదంపతులను గాన నరిగితిన్ 327

॥ వారు దప్పిగొన్నవా రగుటంజేసి, ముందు నాదుచేతియందు నున్న

క॥ పుట్టుపులగు నేం యుం, పుట్టగి నే పెంచి పాలు పల్కుచు నామె
యటుమ సంస్కారించుచు, నిట్టులనిరి పెక్కులత్వ మెంతయు దోషఁ 329

తే॥ "ఎన్నఁడు నాలసింపవిదు లేగిన వెంటనె యచ్చుచుంటివే
యున్నడురెయి యింత తడవేటికి పిల్చినవాడ వక్కటా!
నన్ను విపత్తుబాంధ నని నెవ్వరు గొందిల మింతపెట్టెనుం
గన్నులులేని మాకు యకే కన్నులు నీవెగదయ్య పుత్రకా!" 330

సీ॥ నాపుడు వారితో నాయొనర్చిన మహాదారుణపాపకృత్యమును నెర్వ
మెఱిఁగించ 'నను క్షమియింపుడీ!' యని వారి చరణంబులకు మ్రొక్కి చాలవేడ
నెప్పటికేమియు వినక యాదంపతుల్ 'హాకొడుకా' యని యవని ద్రెళ్ళి
కొంతవడికి లేచి గోడుగోడునఁ గడునేడ్చుచు నాతోడ నిట్లనిరి

గీ॥ 'క్షితితలేశ్వర మాసుతు మృతశరీర, మైనఁ దిలకింపవలయును గానఁ ముమ్ము
నటకుఁ దోడ్కొనిపొ' మ్మని యడుగ వారిఁ, దోడుకొనిపోయి చూపించినాడ శవము 331

గీ॥ శవముపైఁబడి వార లార్తులగుచుఁ, బెద్దయుంబ్రొద్దు విలపించి పిదప నన్నుఁ
జూచి యిట్లని 'రధిప! మాసుతునిఁ జంపి, మాకు నొడిఁగట్టితివి పుత్రశోక మీవు 332

సీ॥ ఈపుత్రశోకాబ్ధి నీదుట కరయు దుస్తరముగాపున మేము తనయుతోడి
మరణింతు మీవును మావలెఁ బుత్రశోకంబుచే మడిసెదుగాక' యనుచు
నలిగి నన్శపియించి యమరలోకమునకుఁ దమ యోగవిద్యాబలమునఁ జేసి
యాక్షణమేపోయి రమ్మునిదంపతు లప్పుడా యిద్దరి యంగములకు

తే॥ దహనసంస్కారమొనరించి తటినిఁ గ్రుంకి, యతివిషాదముతోడ నే నచటువాసి
సదనమున కేగుదెంచితి సరసిజాక్షి, యమ్మునుల శాపమిపుడు నా కంటివచ్చె 333

## దశరథుఁడు పుత్రశోకముచే మరణించుట

ఉ॥ కాన తనిశాపకారణమునంతయుఁ దావివరించిచెప్పి యు
ర్వీపతి వెండియుం బలుకు సాధ్వీరో తెల్పెద నేటిరాత్రితో
దినములుగూడనేడిగును దివ్యవరాక్రమభామ రాము స
ద్గుణనిజవక్త్రముఁ జూసి యసువుల్ ధరియింపఁగఁజాల నేనిఁకన్ 334

క॥ అనుచుఁ బ్రలాపించుచు న, జ్జనవాథుఁడు రామనామసంస్మరణముతోఁ
గనుఁదోయి మూసి నిద్రించినవా డను నూహాగొల్పి జీవముఁ బాసెన్ 335

అంత వేగుటయు నయ్యవసిష్ఠకడ కేగి కౌసల్య మేల్కొల్పఁ గదలమెదల
కళ్లయుండుటచూచి యధిపుఁడు మరణించె ననుచు భావించి యయ్యనఘచరిత
యాక్రందనముసేయు నదివిని యంతఃపురాంగనలంపలు పటువచ్చి
విభునిచుట్టును మూగి పెల్లుగా పిలపించి రాగోల నాలించి యఖిలజనులు
వచ్చి కైకనుదూరుచుఁ బలువిధముల, వేద్వఁగాసాగి రప్పుడా యంతి కైక
దశరథమహీప శవముపైఁ దానుఁద్రెళ్ళి, గాఢముగవేడ్చె నధికదుఃఖంబు దోప 336

అప్పు డావసిష్ఠుఁ డాజిమరణవార్త, భరతునకుసుఁ జెప్పిపంప నతఁడు
రథమునెక్కి మిగులరయమున శత్రుఘ్నుఁ, తో నయోధ్యఁజేరఁ దానువచ్చె 337

ఇట్లు వురికి భరతుఁ డేతెంచి శత్రుఘ్నుఁ, డనుగమింపఁ దొలుత నాత్మజనని
యైన కైకయింటి కరుదెంచి తమతండ్రి, మరణహేతు నడిగె మదిచలింప 338

## క భరతునకు రామవనవాసము దశరథమరణవార్త నెఱింగించుట

అప్పుడు కైక యిట్లనియె నాభరతుంగని 'తొల్లి నాకు మీ
యప్ప వరద్వయంబొసఁగె నందొకదానికి నీకు రాజ్యమం
దప్పక రామునిం బదియునాలుగువత్సరముల్ వనంబులం
దొప్పగనుండఁ గోరితి మఱొండువరంబునకుం గుమారకా 339

అనఘుఁడు దానికియ్యకొని యబ్జదళాక్షుఁడు రాఘవుండు 'మా
జనకునివాక్యమున్ నిలుపఁజాలుదు నే' నని లక్ష్మణుండునున్
జనకజ వెంటరాఁ గరము సంతసమొప్పఁగఁ గానకేగె మీ
జనకుఁడు తద్వియోగమున స్వర్గముఁ జేరఁగఁ బోయెఁ బుత్రకా 340

ఎత మరణించెనంచు రఘువీరుఁడు కానకుఁ బోయెనంచు సం
తతము దపింపఁబోకు మెది దైవకృతం బెటులుంతె నట్లగున్
గతజలసేతుబంధనము గాక గతంబున కేడ్వకిన్న యీ
క్షితితలమెల్లనేలుము శచీపతి నాకము నేలుకైవడిన్ 341

తనయుల పురోభివృద్ధికి, ధనముగడించుటలు వైఱధర్మము జననీ
జనకులకుఁ గాన సకలా, వనిగిడియించితి సుఖింపు వలసినరీతిన్ 342

## భరతుఁడు తనతల్లియగు కైకను దూషించుట

ఉ॥ అనవుడుఁ గైకతో భరతుఁ డాగ్రహమెంతయుఁ దోప నిట్లనున్
'జననివె నీవు నాకు? రఘుసత్తము సత్తము రాము నక్కటా!
వనులకుఁ బంపి తెక్కి కులపాంసనివౌ కద రాజ్య మెవ్వఁడై
నను మఱి నేను నెన్నడిగినాడనె? మానవరూపరాక్షసీ, 34

గీ॥ ఓటమి కారాహుచంద్రుని యడుగుమనుచుఁ, గోరినప్పుడ నీనాల్క కోటిచీల్క
చెలఁగదాఁకో దుర్మతీ? యెన్నఁ జేని నిన్నుఁ గనుఁగొన్న మరితెంయి నన్నుఁబొందు 34

గీ॥ ప్రేమపాత్రమ్మువైన యారామచంద్రుఁ, గ్రూరరాక్షససంచార ఘోరవిపిన
మార్గములకుఁ బంపుమనుచు భూభుజునికోడ, గోముఖవ్యాఘ్రమవై యెట్లు కోరితివు? 34

సీ॥ హాలసంభ్రమములో నుద్భవించు హాలహలము, పుట్టి దివిజులఁగాల్చె, నాపోల్కి నీవు
పాపసంజాత వైయిక్ష్వాకువంశమెల్ల, సంతమొనరింపఁ బుట్టితి యక్కటకట 34(

ఉ॥ కారఁగరాని కార్యములనుగోరి సుతాపకుఁ బాడుతండ్రిని
గ్రూరతఁ జంపితీవు పదిఁగొంకక! నిన్నిఁక నేమిచేసినన్
దీరదు పాదుకొన్నము త్వదీయశిరంబును ఖండివైచెదన్
గారవిగాక నీవు మఱి మానినివై యిరుచుంగఁ దాతకీ 347

సీ॥ కలవారియింగా బుహాదాశరాక్షసవంశంబునం బుట్టవలసినట
దానవు నీవు యధార్థంబు మానవమాత్రురాలవుగావు మహాతిపుణ్యుఁ
డైన కేకయధరిత్రీనాయకుని కెట్టు పుట్టియుంటివో కదా? బుద్ధిహీన
రాల నీయుదరంబునం దక్కటా నేను జన్మించుటంజేసి సంచితంబు

గీ॥ నిందఁబొందితిఁ బాపంబు చెందెనన్ను, నింక రాముని మోముచే వెట్లుచూతుఁ?
గౌముకుఁ గోల్పోయి కౌసల్య కొందలపడి, యెంతదూరినొ? యచటికి నెట్లుపోదు? 348

ఆ॥ చెడ్డబుద్ధిచేతఁ జెడుకార్య మొనరించి, దైవకృతమటంచు నీవు నాకు
సిగ్గులేక మఱలఁ జెప్పెదవక్కటా!, యేమనందు నిన్ను నింకఁ జెనటి!' 349

కం॥ అని యిట్లనేకవిధముల, ననుఁడగు భరతుండు దూరఁ గైకేయి మనం
బున దుఃఖమొదవ నిజనందనుదెస దృష్టించి యిపుడు తా నిట్లనియెన్ 350

గీ॥ 'నీకొఱకు నేను రాము నస్తోకపుణ్యు, నడవికిం బంపి నిందయు నఘముఁబొంది
రాజ్యముగడించి యీయ దూరంగఁదగునె, కుడిచికూర్చుండలేక యోకొడుక! నన్నుఁ?'

అవ్వుడు దాసిఁ ద్రొక్కని విషోరగమట్లు ఉండి యాభరతుండు మాత కనియె
'పాపి గయ్యాళి! నే నూరకయుండినకాలఁది విద్ధ్భాఋలను బ్రేలఁ
కొచ్చితి పింక నింతెచ్చెఅవధియింతు' అని కత్తిపైకెత్తి నాక్షణంబ
శత్రుఘ్నుఁ డడ్డమై జననిఁ జంపిన దుష్టు లని మనపై రాముఁ డాగ్రహించుఁ
గాన యీమెను దునుముట వాను, మనచుఁ, జెప్పి భరతుని వారించె నప్పుడచటఁ
బొంచి వినుచున్న మంథరంగాంచి ప్రజలు, 'దీనికెల్లను మూల యీతెఱవ యనిరి'

అపుడు శత్రుఘ్నుఁ డామంథరను బట్టి, పోవుచున్నను దొనీక బోయి కాలుఁ
బట్టి గిరగిరఁద్రిప్పి తాబెట్టిదముగ, ద్రేసె ధరమీద నాగ్రహావిష్టుఁ డగుచు 353

అదియు భీతిల్లి కదలక యట్లెయున్నఁ, గాంచి సౌమిత్రి మదిసనదంముఁ దలఁచి
వెండియుం గొట్టనొల్లకయుండె భరతుఁ, డంతఁ బాఱుచుఁ జూచుచు నంబకనియె 354

'కలవైన నీదుకోర్కె ల, ఫలమగునని తలఁపవలదు పాపీ మగుడన్
లలితయశు రామభద్రుని, నలఘుభుజుం దోడితెత్తు' నని చెప్పి వెసన్ 355

## భరతుఁడు కౌసల్యయింటికిఁ బోవుట

అటనుండి కదలి యుత్కటశోకమొందుచు భరతుండు కౌసల్య పజకేగ
నాతల్లి యడలుచు నాతనిఁగన్గొని యెంతయు రోషించి యిట్లు పలికె
'కుమతిపై రాజ్యంబుకొఱకు నీ వక్కటా! యడవికి నాసుతు నంపుమనుచుఁ
గైకకుస్ బాగుగాఁ గఱపి రాజగృహమునకుఁ బోయితీవు నిందకును దలఁకి
భరత నీవాంఛ యింక సఫలతనొందెఁ, జల్లఁగా నేలుకొమ్ము రాజ్యం!' ఎనపుఁడు
నామెపల్కులు ములుకులై యార్తిఁబెంపఁ, గరము దుఃఖించి భరతుఁడా గరితకనియె

'నీపాదములసాక్షి నేపాపమెఱుఁగను జనని వన్నిట్లాడఁ జనునె నీకు?
రాముఁడులేని యీరాజ్యంబునాకేల? కూళయై యటుకైక కోరెఁగాక!
తథ్యంబుగా నిట్టి దారుణకృత్యంబుఁ దలపెట్టియుంటినా? తల్లి! వినుము!
జారులు చోరులు సద్ధర్మదూరులు నద్భుతద్రోహు లసత్యవాదు
లాదిగాఁగల పాపాత్ములనవరతముఁ, బోవుచున్నట్టి గతికి నేఁ బోదునమ్మ!
మఱియు నొకపల్కువినుము రామవిభు నడవిఁ, దోడుకొనిరాకయున్న నం జూడకమ్మ!'

అని తన మనఃప్రియంబుగ, ఘనుఁ డాభరతుండు పలుకఁ గౌసల్య యనం
ఘన నాతని సౌజన్యం, బున కెంతయు మెచ్చి యిటుపొగులుచుఁ బలికెన్ 358

సీ॥ 'నీవంటి సద్గుణనిధి యెందునున్లేడు యుగములలో వెదకినను నీవు
కొడుకును గోల్పోయి యుండుట మతిచెడి యెవరాని వాట లేనంటి నిన్ను
నన్ను క్షమింపుము నయగుణోపేత యో భరతా యటంచుఁ దాఁ బలికి, భరతుఁ
డునుతాఁ డోడ్చాకి తప్తియై వగచుచు, ఓరిమ్పరిశమన కరిగి యచట
గీ॥ యత్యల్పంబు వైయున్న రాజుశవముఁ, జూపభరతశత్రుఘ్నుల సైపలేని
శోకమున రోదనముచేసి క్షోణిఁద్రెళ్ళ, రిపుడు కైకేయిసుతుఁ డిట్టు లనుచువేడ్చె 35

సీ॥ 'కన్నులుదెఱచి ఏం గాంచనొల్లవిదేమి గారాబుయిన నన్నుఁ జేరఁదీసి
కుశలమడుగవేల కోపమా నాపైన? నెవాప మెఱుఁగను నాపనేను
యమ్మెల్లరను దుఃఖమయివార్ధిలో ముంచి నీ విహముంబాసి పోవఁదగునె?
కెకసుతుండని కసలితి కాఁబోలు నీ సుమిత్రాపుత్రు నేనిఁగాంచు
గీ॥ హితఁ డెగ్గేమిసేయులే దెన్నఁడైన, నీకునై తాను బాపము నెలఁద్రెళ్ళి
యెంత పిలకించుచున్నాడో యుటు లఁజూడు, మితనిపైన సోదార్ప్రము క్షితితలేంద్ర' 360

కం॥ అని పిలపించెడు భరతున, కనఘుండగు నవ్వసిష్ఠుఁ డనియెఁ 'గుమారా!
ఏసరం ఎని లేదిఁక మీ జనకున కొనరింపు మగ్నిసంస్కారముల్' 361

## భరతుఁడు దశరథునకు దహనసంస్కారము చేయుట

సీ॥ అసుఁడుఁ పెద్దా గైకొని కెకకాపెపటంపు క్ష్మాతలేంద్రుసి మృతకాయు నప్పుడు
స్నానంబుచెయించి, నవ్యమాషాంబరముల ధరింపఁగఁజేసి లలితగంధ
పుష్పాదులను గడుఁ బొలువారఁ గైసేసి యొక్కరథంబుపై నుంచుకొనుచు
వివిధమంగళవాద్యవితతుల తోడరా నరుఁఘుపకడనున్న శవసిలయము
గీ॥ దిశకు శత్రుఘ్నుఁడుం, దాను దశరథనతు, లధికముగ పిలపించుచు నయుఁయియును
వారిశోకసంతప్తులై వాఁ లరిగి, రొకరివెంబడొకరు రొకంగా నెవ్వవారు 362

ఉ॥ ఇట్లు ప్రేతభూమి కేగి యాగాదిశవంబు నట దహించి భంతుఁ దాగిమొత్త
పిదిఁ దిలోదకంబు లిడిచి కిందప్రదా, సముదిచేసి, తక్షణంబయితఁడు 363

గీ॥ పురికిఁ జనుదెంచి తంత్రికిఁ బరమునందుఁ, బ్రీతిగానుండ బ్రాహ్మణవితతి కెల్ల
దానసంతృప్తి జేసి శ్రాద్ధములనల్ప, చొనరిఁ బండ్రెండు దివసంబు లుండునంత 364

గీ॥ రాజు స్వర్గస్థుఁడగుటయు రాముఁ డడవి కరుగుటయు రాజ్యమునకింక నరయ రాజు
లేకునికి విచారించి యస్తోకపుణ్యుఁ, డనువసిష్ఠుఁడు భరతుతో ననియె నిట్లు 365

‘రాజులేకున్నచో రాజ్యము పెలిజను లన్యోన్యపీడితు లగుచునుండ్రు
జారచోరాదిదుర్జనముల పైకొందు రఖిలధర్మంబును పంతరించుఁ
బరరాజులు దెంబి బహుసులభంబుగా నాక్రమింతురు రాజ్య మట్లుగాన
భరత! నీవిఁక ధరఁ బాలింపఁబూనుము సర్వప్రజానురంజకుఁడ వగుచు’
వనపుఁ దత్తఁడియ్యకొనక యిట్లనియె ‘నన్నుఁ, దైకపొతుకి పెచియుండ్రుగాక నాకు
రాజ్యమేటికి బ్రదుకేల? రామచంద్రు, వేడికొని వెండిపీటికిఁ దోడితెత్తు’ 366

### భరతుఁడు రామునికడకు సపరివారంబుగా బయలుదేరుట

అనిపలికి యప్పుడపని, యనుమతిఁగొని భరతుఁడంత నఖిలజనులకుం
బనపయనము తెలియుటకై, ఘనముగఁ బురిఁ జాటఁబంచి కట్టాయితమై 367
హితగురుద్విజపురోహితమంత్రిసామంతబంధువర్గంబెల్ల బలిసి కొలువ,
నమదేభఘోటకస్యందనసద్భటానీకంబు ముందట పీకనడువఁ
బటహకాహళశంఖపణవమృదంగాదివాద్యధ్వనికి దిశావలయము మ్రోవ,
నచ్ఛలపత్తులు, కౌసల్యాదిజనయిత్రు లాందోళికలనెక్కి యరుగుదేర
నార్యుయ సుమంత్రుఁడెతిఁగింప మహితయటలు, భరతశత్రుఘ్నులిరువురు పలువిధముల
దుష్కరాలగు సైకను దూరుకొనుచు, బయలుదేరిరి వగపుతో భయదవనికి 368
ఇట్లు చనిచని యానాటి కినుఁడుగ్రుంకు, సరికి భరతుఁడు గంగసుడరిసె నంత
నట శబరనాయకుండైన యాగుహుండు, సైన్యములరాక గని, నిజస్వాంతమందు 369
ఈ రాజెవ్వఁడొకొ? పరి, వారంబులతోడ నిటకు వచ్చుచునున్నా
డారయ నావక్కణమును, బీరంబునఁ జూఱఁగొనఁగ విచ్చేసెనొకో! 370
అని వితర్కించి యప్పుడే యనుచరులను, జీరి యాపచ్చుచుండి వార లెవరో?
యెఱిఁగి రండని ఎంప వారేగి సర్వ మెఱిఁగికొనివచ్చి గుహునితో నిట్టులనిరి 371
క్రూరురాలైన కైకెయికొడుకు భరతుఁ, డట రఘూత్తమునుఁడగు రాము నంతికమును
కేఁగుచున్నవాడట నేటి కమరతటిని, దాపున విడిసె సైన్యముల్ దాను నెలమి 372
అని చారుల్ వివరింప నాగుహుఁడు తా నంతర్గతంబందుని
ట్లని యూహించె రణార్థియై భరతుఁ డా యిర్క్ష్వాకున్వయోత్తముతో
ననిసేయం జనుదెంచెఁ గావలయుఁ దథ్యం బట్టులేకానిచో
[illegible]



కం॥ అని భావించినవాఁడై, ఘనుఁ డాగుహుఁడపుడు భయదకార్ముకధరులై
తనవెంట సైనికులు వెసఁ, జనుదేరఁగ యుద్ధమునకు సన్నద్ధుండై 3'

## గుహుఁడు భరతునిపైఁ గోపించి నిందించుట

ఉ॥ భరతునిఁ జేరవచ్చి యనివార్యసముద్ధతిదోప నిట్లనుం
'గరము దురాత్మురాలయిన కైక వనంబునకన్ప రాముఁడుం
దిరిగి సఖీపుఁడై యకట యిచ్చటఁ జేసి వసింపఁగూడదే?
పరమెనరింప సేనఁగొని దుర్మతివై చన నీకుఁ బాడియే? 37

గీ॥ రామభక్తుండు, నత్యంతభీమబలుఁడు, నైన యీగుహుఁడుండ రాముపనీట
నీకుఁగా నెదురులకేనిఁ దాకవశమె? యిందునకు నొక్కయెడుగైనఁ బోవనీను 37

చం॥ భరతుఁడ! నీకుఁ బ్రాణములపై నతి మోహమె కలిగుండిశ్
బరుపము వెన్కకింక హితమార్గముచెప్పుచునుంటి లేనిచో
శిరముల వెల్లిఁగొల్పి నిను సైన్యయుతం బగ రూపుమాపి యా
పరఁడగు రాముమన్ననకుఁ బాత్రుఁడనౌచుఁ బరింతు నిద్ధరన్' 37'

సీ॥ అనఁడు గుహునితో నార్తిఁజెందుచుఁ గైకొలుదుఁ డిట్లనిపల్కె 'ప్రాణనాథ! మిత్రమ!
పాపియౌ కైకకుఁ బ్రభవించియుండిన నేరమికై యతి నేను శిక్ష
కట్టుఁడఁ జేకాని యౌరయ నాయందుఁ బాపాంశమైనలేదు తథ్యముగను
గలనైన రాజ్యంబుఁ గాంక్షింపలేదు నే నారాము వనికిఁబోఁ గోరిలేదు
గీ॥ కైకచేసినచేతకుఁ గరముఁ గినిసి, యెంతయున్ వందలించి యాయినకులపతి,
రామచంద్రుని మరలఁ బురంబునకును, దోడితెచ్చుట కరుగుచున్నార! నమ్ము 378

సీ॥ ఇది యథార్థము నమ్ము మింతకంటెను మఱి యన్యథాబుద్ధి నాయందు లేదు,
దీనికి సాక్షు లాదేవత' లనఁబుఁడు నాతనిసద్బుద్ధి కాత్మమెచ్చి,
యిరకోటిపొగడుచు సుమవృష్టిఁ గురియించె నప్పుడా శబరనాయకుఁడు మురిసి,
భరతునకునుభ్రమ్రొక్కి పల్కె 'సోదరుని! నిన్నేమేమొ పలికితి నెఱుఁగ నేను
గీ॥ నన్ను మన్నింపు నీబుద్ధి నెన్నఁదరమె, క్రూరురాలగు కైకేయి కుక్షియందు
నీవు పుట్టుట చూడ మానికము నాగుఁబాముతలలోనఁ బుట్టినపగిదిఁ దోఁచె' 379

కం॥ అనిపలికి సైన్యయుతముగఁ దనపక్కణమునకు భరతుఁ దగఁ దోడ్కొనుచుం
జని యాహారాదికముల ననుపముఁ డాగుహుఁడొసంగె నాగిరమొసఁగ్ 380

## భరతుఁడు భరద్వాజమహామునిని దర్శించుట

ఆరాత్రి యటనుండి యమ్మరునాఁ డపుడమ్మతో భరతుండు జడలుదాల్చి,
గుహుఁడు నావలుపెట్టఁ గొమరొప్పనెక్కి గంగనుదాటి యతఁడు తమ్మనుసరింపఁ
బయనంబుసాగించి వననదీనదములు, పల్లెలు, పురములు, పక్కణములు
పెక్కులుగడచుచు నక్కడక్కడ రాము వెదకుచుఁ జనిచని నిర్మలాత్ముఁ
డగు భరద్వాజు నాశ్రమమందుఁ జేరి, వెమ్మి సేనల నంతంత నిల్పఁబంచి,
మునికడకుఁ గైకకొడుకేగి మ్రొక్కుటయును, నాతనిం గని యతినాథుఁడలిగి పలికె 381

'కటకట! నీదుతల్లియగు కైక పురంబుననుండనీక తా
నటవులకంపె రాము మఱి యంతటితోఁ గసిపోక నీవిటుల్
కుటిలతతోడ సైన్యములఁగొంచుఁ గుమారక రాముపైకి న
క్కటికములేక వెండియును గయ్యమొనర్పఁగఁ బోవుటొప్పనే? 382

అనవిని వెఱచి యామునితోడ నిట్లను భరతుండు వినయసంభరితుఁ డగుచు
'సంయమివర్య! నా స్వప్నమందేనియుఁ జెడఁగోర రాముఁ దత్సేవకుఁడను
కైకసుతుఁడనౌట కాఁబోలు నన్నిట్లు పలుకఁజొచ్చితిరి నా భావమరయ
నట్టిదిగాదయ్య! యారాముఁ గ్రమ్మఱఁ బురికిరమ్మని పిల్వఁబోవు చుంటి'
ననుఁడు ముదమొంది ముని ససైన్యముగ నతని నతిథిసత్కారములుచేసి యాదరమున
బథమెఱింగింపఁ జని కొన్నిపయనములకు నతఁడుచేరెను చిత్రకూటాచలంబు 383

## సపరివారుఁడైన భరతునిఁజూచి లక్ష్మణుఁడు కోపించుట

అంత నక్కడ రాముఁ డాసైన్యముల మహాకోలాహలధ్వని నాలకించి,
సౌమిత్రినింజీరి 'సైన్యసమేతుఁడై యెవ్వఁడో మనతోడఁ జివ్వసేయ
నరుదెంచుచున్నవాఁడదె! ధూళిఁ బరికింపు ముత్తరదిక్కునం దుదితమయ్యెఁ
గరిబృంహితంబులుఁ దురగహేషలు నొప్పె నదియేమొ తెలిసిరమ్మనుచుఁ బంప
నతఁడు కొంతొకదవ్వేగి యతిజవమున, నొక్కయున్నతభూరుహం బెక్కి మూకఁ
గనియెఁజూచి పతాకాద్యలంకితచిహ్నములఁ గుర్తించి భరతు సేనలుగ వెఱఁగి 384

చం॥ తనపయికిన్ రణంబున కతం డరుదెంచుటకాఁ దలంచి వృ
క్షముపయినుండి బల్మిడిగుచందముఁ దోపఁగ లక్ష్మణుండు తా
దుమికి మహాజవంబునను దోయజలోచనుఁడైన రామభూ
రమణునిచెంతకుం జని క్రోధ్యమా రోషమునొంది యిట్లనున్ 385

గీ॥ 'సైన్యములఁగొని భరతుండు సమరమునకు, వచ్చుచున్నాడు మనపైకి వసుమతీశ!
వీడు మన్నింపఁదగినట్టివాడు కాడు, ఖలుఁడు కులపాంసనుఁడు మహాకలుషయుతుఁడు,

గీ॥ కైకచేసిన యెగ్గునకే కరంబు, వ్యసనపడుచున్న మనపైకి భరతుఁడిపుడు
క్రూరుఁడై వచ్చుటలుచూడ గోచరించు, పైని రోకటిపోటన్నపగిదిఁ దోచె 387

ఉ॥ నాకు ననుజ్ఞయిండు నరనాయక యిప్పుడె సంగరంబునన్
వీకనెదిర్చి మద్విశిఖవృష్టినిముంచి కలంచి మూకలన్
గాకుపడంగఁ జేయుటయు నైకియుతుం బరిమార్తునొండెఁ నే
వికరలీల మోకడకు ప్రేల్మిడిఁగెల్చెదనొండెఁ జూడుఁడీ' 388

చం॥ అని కుపితాంతరంగుఁడయి యాతఁడు పల్కుచుఁ జాపబాణముల్
గొనుటకుఁ బూనుఁ దంతి రఘుకుంజరుఁ డిట్లనుఁ దమ్ముతోడ 'ఓ
వనయము దుర్వివేకమొవ నాగ్రహమూనెదు మంచిచెడ్డలం
దువ సువిచారమూని విటు దుందుడుకేటికినీకుఁ? దమ్ముఁడా 389

చం॥ భరతుఁడు సద్గుణైకనిధి భక్తుఁడునాకు నవారతంబునన్
దురమునకేగుదెంచెనని తోపదు నామది కించుకేనియున్
మరల నయోధ్యకున్ మనల మానుగఁదోడ్కొనిపోవనెంచి తాఁ
బరిఁగొని వైభవంబెసఁగవచ్చెడుచొప్పు కనంగనయ్యెడున్' 390

## భరతుఁడు సపరివారముగా సీతాలక్ష్మణసమేతుఁడైన రాముని దర్శించుట

సీ॥ అనవుఁడు లక్ష్మణుం డారామువల్కుల కట్టిట్టులనఁడయ్యె నంతభరతుఁ
డాచిత్రకూటంబు నారోహణముసేసి యెల్లసైన్యంబుల నెలమిఁదాను
దూరమ్మునవెయుంచి తోడశత్రుఘ్నుండు జనయిత్రులున్ వసిష్ఠప్రముఖులు
చనుదేర శ్రీరామచంద్రుసకడకేగి తత్పాదములకు వందనమొనర్చి
గీ॥ 'యక్కటా సర్వభోగంబు లనుభవింపఁ, దగినమీ రడవులయందుఁ దగనియిడుమ
పడుచునుండఁగ వేఁజూడవలసివచెఁ విధినివేమందు' నని పలవింపఁజొచెఁ 391

సీ॥ అట్లు పాదాక్రాంతుఁడై విలపించెడు భరతుని రాముఁడు పట్టియెత్తి
యనునయోక్తులచేత నాతనినూరార్చి జానకీలక్ష్మణసహితముగను
జనయిత్రులకు వసిష్ఠునకు నెలుమార్లు ప్రణమిల్లి తనకును ప్రణతులైన
గుహుని నాశత్రుఘ్ను గొప్పగాయన్నించి యిందఱిక్షేమంబు లడిగియుడిగి
గీ॥ వారి కాతిథ్యమొసఁగి సగౌరవముగ, సర్వు లాసీనులగునటు సలిపి తాను
దారికామధ్యగతుఁడైన కైరవాప్తుఁ, డనఁగఁగూర్చుండి భరతుతో ననియె దయను 392

కం॥ 'అడవికివచ్చినదాదిగ, నెడదన్ మూకైత్రిపించి యెట్లున్నాడో?
కడుభీతి బాధుయుచున్నది, అడియుక యెఱిఁగింపు మనఘ! తండ్రికుశలమున్' 393

సీ॥ అని దశరథుసేమ మడిగి యాభరతుతో వెండియుఁ బల్కు కోదండగురుఁడు
'రాజనీతియెఱింగి రాజ్యంబువాలింతె సర్వజనానురంజకముగాగ?
దాక్షిణ్యమునువీడి దండనార్హులఁబట్టి లంచముల్గొనక శిక్షించుచుంటె?
యుద్యోగిగణముల నుత్తమ, మధ్యమాధమంబులన్ మూడు విధములు తెలిసి
గీ॥ యెలమిఁబోషింతె గురువులఁ గొలిచి నీతి, విద్యగడియింతె? తండ్రి సేవింతె భక్తి?
వదియెవ్వ్యము వ్యతికదియెదారి, యిరయ నివెల వచ్చితో? భరత! చెప్పుమ' 394

సీ॥ అనిన గద్గదకంఠుఁడై భరతుండను 'నీరాజనీతి నాకేమితెలియు
దోరామచంద్ర యింకొకవార్తవినుమయ్య! తాపసవృత్తిఁ గాంతారమునకుఁ
దామేగుదేరఁ బరపడి యేడవనాడు మనజనకుండు తా మరణమొందె
నటుపైనఁ బురికి నేనరుదెంచి విధివిధానముగ శ్రాద్ధాదికర్మములఁ జేసి
ఆ॥ నిన్ను దర్శింపఁ గానకు నేను వచ్చి, నాథ' యని పల్కఁ జెవులకు వాడిములికి
యగుచు నాటుడు నార్తులై యడలి మూర్ఛఁ, బొంది రా రామలక్ష్మణుల్ భూమిపుత్రి

## దశరథునిమరణమునకు సీతారామలక్ష్మణులు దుఃఖించుట

ఉ॥ ఇమ్మెయి మూర్ఛాగతులై, క్రమ్మఱఁ దెలివొంది తనదు కాంతామణియుం
దమ్ముఁడుఁ దనతో వేద్వ ము, నమ్మగ విలపించె రామనరనాథుఁ డిటుల్ 396

సీ॥ 'హా రఘువంశచంద్ర! సుగుణాకర! సాంప్రదాయశోధురంధరా!
హా రణరంగనిర్జితమహారినృపాలక భూమిపాలకా!
హా రవితేజ ధైర్యకనకాచల నాయనువారులేరు మా
కెవ్వని దిక్కుఁజూపి మటి యేగితి వాత్రిదివంబుఁ జేరఁగన్? 397

ఆ॥ అగ్రసుతుఁడనంచు నందఱికంటెను, బ్రేమపూర్వకముగఁ బెంచినాఁడ
వట్టి ముద్దుతండ్రివైన నీకిన్ని సీ, స్త్రైనఁ బోయపైతి నకట ఉదకు 39
ఉ॥ ఏలితి వబ్ధిసంవృతమహీతలమెల్ల నిరంకుశంబుగాఁ
దోలితి వాజిరంగమున దుర్దమశౌర్యుల శత్రురాజులం
జాలితి వంతరంగరిపుషట్కదురాక్రమణంబు నోర్వఁగం
బోలితి వష్టదిక్పతుల భూవర! నీకు సమానులుండిరే? 39
గీ॥ ఇట్టి ధీరుఁడవైయుండి కట్ట నీవు, పదియునాలేండ్లు దాటినపిదప రానె?
యంతదనుకఁ గడుపలేక యసువియోగ, మందితివి నీదు ధైర్య మెందరిగె నయ్య? 400
శా॥ హా జన్మాంత మహాదుఃఖజలధిన్ మున్మందిఅన్ మంచి ని
వా జంభారిపురంబుఁ జేరఁజన నవ్యాయుంబుగాఁ దోచెదున్
వెజన్మంబులకైనఁగాని తలఁపన్ నీవంటి పుణ్యాత్ముఁ డె
యోజన్ మాకు లభించునింక జనకుం డో రాజచూడామణీ?' 401
తే॥ అని విలపించి వసిష్ఠుని, యనునయవాక్యములచేత నారాముఁడు నె
మ్మనమున నొకింత యూరటఁ, గని యనుజుని సతినిఁదెర్చి గరిమంబెనఁగన్ 402
ఆ॥ తాము ముప్పురవుడు తిగఁ గృతస్నానులై, దశరథునకుఁ బిండదానమాది
యైన యుత్తరక్రియలు సమంచితరీతి, నాచరించిరి తదనంతరంబ, 403

## భరతుఁడు శ్రీరాము నయోధ్యకు రమ్మని ప్రార్థించుట

కం॥ అంది యథాప్రకారము, నందాసీనులయియుండ నా కౌసల్యా
నందనునకుమ్రొక్కి భరతుఁ, డందఱువిన నిట్టులనియె నతివినయమునన్ 404
కం॥ 'కైకేయిమాటకై యిటు, సాకేతపురంబు విడిచి సంయమివృత్తిం
గైకొని కాననభూమికి, మీకుం జనుదేర ధర్మమే రఘువీరా! 405
ఆ॥ రాజులేక కాంతిరహితమై నగరంబు, రాజులేనియట్టి రాత్రివోలెఁ
గానఁబడుచునుండె గ్రక్కున వెంచేయుఁ, డఖిలజనముదావహం బెసంగ 406
ఉ॥ కైక యొనర్చినట్టి యపకారము చిత్తములోఁ దలంపఁగాఁ
బోకుడు కోసలాత్మజయుఁ బుణ్యచరిత్ర సుమిత్రయున్ మహా
శోకపయోధిమున్గి కడుఁసుక్కి కృశించిరి మీరు రానిచో
నాకముఁ జేరఁబోవుదురు పాపఖులల్ మదివమ్ము మగ్రజా! 407

ఉ॥ నేను శత్రుఘ్నుఁడును వారితోనఁ బోదు, మొకరివెనువెంట నౌకరుగా నున్నవారు
లంద అనువులఁ గోల్పోదు రవుడు వీడు, కాడుకాఁగల దింక నిక్కము మహాత్మ 408

ఉ॥ ఆవృత్తాంతము జనక, క్ష్మావరుఁ డాలించి బంధుజనములుఁ దానుం
గేవలము శోకమొందుచు, జీవములెడఁబాయఁగలరు సిద్ధమ్మధిపా 409

మత్తకోకిల॥ రండు నాదగు ప్రార్థనమ్ము నిరాకరింపకుడయ్య దో
ర్దండపిక్రమమొప్ప నీవసుధాస్థలిం దగనేలుడీ!
నిండుమోదముతోడఁ బౌరులు నేను దాసులమౌచు మా
దండఁజేరి భజించుచుందుము! దండికారి రఘూత్తమా' 410

చ॥ నావిని తమ్ముఁజూచి జననాథశిరోమణి రాముఁ డిట్లనున్
'నీవచనానుసారముగ నే నడువంగనుబోల దిత్తఱిన్
భూవిదితంబుగా జనకువానికి నెమ్మయినైనఁ దీర్చి నే
నావలవత్తుఁ గాని పురి కంతకుమున్నగ వచ్చుటొప్పునే? 411

ఉ॥ జనకునివాక్యమున్ నిలుపఁజాలక యాభరితుండు తన్ను ర
మ్మనుట దెపంబుగాఁగొని మహామతి రాముఁడు క్రమ్మఱం బురం
బునకరుదంచె నాతనికిఁ బోలునె యిట్టి యసత్ప్రవర్తనం?
బని నచుదూరరే జనము లక్కట యానడి కోర్వవచ్చునే? 412
సత్యసంధులటంచు నస్మత్కులులకుఁ, జిరతరస్థాయియగుకీర్తి చెందెనయ్య!
యట్టి సత్కీర్తిఁ గోల్పోయినట్టులేని, బ్రదికి నిష్ఫలమేగద భరత మనసు 413
కావునఁ బదునాల్గేండ్లట, వీవాసముఁజేసి నేను బిమ్మట వత్తున్
నీ వంతవఱకు నీ స్వ ర్వావనిఁ బాలింపవలదె యధికవిభూతిన్? 414
మాకునయి చాలశోకించు మాతలైన, కోసలేంద్రతనూభవ నా సుమిత్ర
నూరడింపుము కైకను దూరకన్న, పొమ్ము నీవింక నాకేతపురమునకును' 415

ఉ॥ అవపుఁడు రామునిపలుకుఌ, తనమనమున దిగులుపెంపఁ దద్దయు వగతో
నినకులవిభునకు వెండియు, ననఘుండగు భరతుఁ డిట్టులని వాక్రుచ్చెన్ 416
'అగ్రజు నడవులకన్పి భూతలమెల్లఁ దానయేలుచునుండ ధర్మమగునె
యీ భరతువ? కని యెల్లభూజనములు నన్ను నిందింతు రనారతంబు
నానింద కేనోర్వ నధిప విచ్చేయుము జనసమ్మతంబుగ జగతినేల
లేనిచో వీటికి వేనుబోనొల్లను రాజ్యమేటికినాకు బ్రదుకదేల?

గీ॥ త్వత్పదాంభోజములచెంతఁ బ్రాణములను, విడుతునొండెను మునివృత్తి స్వీకరించి
యాసుమిత్రాత్మజునివలె నేనుగూడ, నింపె మిమ్ము సేవించుచు నుండు నొండె' 417

కం॥ అని మిక్కిలి శోకించుచు, ఘనముగఁ బ్రతిమాలుచున్న కైకేయిసుతుం
గనుఁగొని ప్రియవార్తాకముగ, వినకులపతియైన రాముఁ డిట్లనిపలికెన్ 418

సీ॥ 'ధరణీరాజ్యమునీకు దారుణాటవినాకు విధియించె దశరథోర్వీవిభుండు
మన పిత్ర్వరముఁగూడ జనకాజ్ఞమీరరాక పర్తింపవలయు నవశ్యముగను
గావున నీవింక గ్రక్కునఁ మరలేగు క్షితితలంబునకేగఁ బతివిగమ్ము
నామాటలాలింపు నావంపుసేయుము నీకుఁగల్గంపులు నెగడుచుండు'
గీ॥ ననుచుఁ ఎల్కిన నాలించి యవనిపతికి, దాని బల్కను మారాడఁ దిప్పెపెంచి
ఘనతఁ దంగీకరించిన భావమొప్ప, నిట్లనియెను రామునిగీతతోడ 419

చం॥ 'భవదుపదేశనీయమయి భాసిలు గద్దె నలంకరింపఁగా
మిపుల ననల్పుఁడన్ వినుఁడు మీపగు పాదుకలన్ మహాత్మ! గా
లపమున నాకొసంగుడు ఘరంమునకుం గయికొంచుఁబోయి నే
నవనినిఁ దత్పరోక్షమున నంచితరీతిని నేలుచుండెదన్' 420

చం॥ అనుటయు నవ్వసిష్ఠముని యుండఁగఁ దాముడమొంది రామతో
వనజాలు రాజలౌట తగ దగ్రజులుండఁగ మీకులంబునం
దినకులనాథ! యిట్లగుట నీ భరతుం డిఁక మీదుపాదుకల్
తనకు నొసంగుమం చడిగెఁ దప్పక యిందని చెప్పి వెండియున్ 421

సీ॥ ఘనుఁడా వసిష్ఠుఁ డిట్లనియె రామునితోడ 'భానుకులేశ మీ పాదుకలకు
నభిషేకమొనరించి యరయ నీభరతుండు త్వత్పరోక్షంబున ధరణి నేలు'
నని పల్కుటయు విని యట్లనెకావింపుఁడో మునిజనకామ! రామ యనుచుఁ
బ్రజలందరున్ రాము పాదుకాపట్టాభిషేకంబుసేయ నంగీకరించి
గీ॥ రా గురుపునాజ్ఞ మస్తకమందుఁ దాల్చి రామభద్రుండు కరము గారాబమొప్పఁ
దవదు పావనపాదుకాద్వయము నప్పు, డనఘచరితుండయిన భరతున కొసంగె 422

గీ॥ వానిఁగైకొని భరతుండు భక్తితోడఁ, గనులకుం బలుమరు లద్దుకొనుచుఁ దనదు
శిరముపైఁ దాల్చి వినయసంభరితుఁడగుచు నిటనుచుఁ బలె గారాననిశబ్దిక 423

'నీయాజ్ఞమీరక నేనువసుంధరారాజ్యంబుఁ బాలింతు రామచంద్ర!
పదునాలుగేడులు వనవాసమొనరించి యవధిదాటకయున్న యిరుగుదెంచి
మీరాజ్యమెల్లను మీరె కైకొనరఁగు లేనిచో నే నగ్నిలోనఁ జొత్తు'
నని పల్క శ్రీరాముఁ 'డిపుడు యిక్ష్వాకుని కులజుండనయ్యు బొంకుదునె నేను?
సకలసురమునిగణములు సాక్షిగాగ, వత్తు వీటికి' నని మఱి దాఁ బలుకుటయును
స్వాంతమున విశ్వసించి సచ్చరితుఁడైన, భరతుఁ డప్పుడు భక్తితత్పరత బోప 424

## భరతుఁడు రామపాదుకలనుగొని యయోధ్యకుఁ బోవుట

రామలక్ష్మణులకు భూమిజకును బోయివచ్చెద నని చెప్పఁ బార్థివేంద్రుఁ
డతని దీవించి పొమ్మని యనుజ్ఞయొసఁగి జననులకును గురుజనములకును
వందనంబొనరించి వారిచ్చుదీవనల్ గైకొని సంతోషకలితుఁడగుచుఁ
దక్కినవారికిఁ దగురీతి మన్నన గావించి యెల్లరఁ బోవఁ బనిచె
నట్లు రాముని వీడుకోలంది భరతుఁ, డఖిలపరివారములు తన్ను ననుగమింపఁ
దమ్మునింగూడి చిత్రకూటమ్మువీడి, మగుడఁ బయనించె సాకేతనగరమునక 425

నరిచని కొన్ని పయనముల కా భరద్వాజుని యాశ్రమప్రాంతమునకు
నరుదెంచి యమ్మునిని కళిలంబెటింగించి యాతఁడు వీడ్కొల్ప నరిగియరిగి
యాగంగయనుదాటి యట శృంగిబేరంబు దరిసి యా గుహుని నాదరముమీర
నదుండఁగాఁ బంచి యితఁడు సేసినయట్టి సత్కారములకెంతొ సంతసించి
పచటినుండి యనేకంబులగు నెలవులు, దాటుచుంబోయి భరతుండు మేటికాంతి
హీనమై చందురుఁడులేని రాత్రిపోలె, నున్నపురముఁ బ్రవేశించె ఖిన్నుఁడగుచు 426

ట్లు భరతుఁడు పురిఁజేరి యగ్రజున్న, పాదుకాద్వయ మతిపవిత్రోదకముల
తఁ బ్రక్షాళనముచేసి చెన్నుమీర, నగణితంబుగఁ గైసెసి నగరమందు 427

## భరతుఁడు రామపాదుకాపట్టాభిషేకము చేయుట

నువిధానేకమంగళవాద్యతతులు, చెలఁగ నుత్సవమొనరించి కొలువుకూట
మనకు విచ్చేసి శ్రీరామభూమివిభుని, పాదుకల నభిషేకించి భరతుఁ డనియె 428

స్మితలపతియగు రాఘవుఁ, డేతెంచెడునంతదనుక నీపాదుకలే
శచాత్రికివెలస్ వేశముగుం జుండి సభఁనికరములారా!' 429

మ॥ అని వాక్రుచ్చిన సభ్యులెల్లఁ బరమాహ్లాదంబునంబొంది 'య
ట్లవే కానిం' డని ధన్యవాదములతో నా రాముఁ డాపీటమున్
డిసయట్లే మదినెంచి పాదుకలకున్ నిశ్చింతగా మ్రొక్కి ర
వ్యనజాక్షుండగు రామచంద్రుని మదిన్ భావించి సద్భక్తి మై 430

కం॥ అనిశ మయోధ్యాపురజను, లినకులువనవాసదినము లెన్నుకొనుచు నె
మ్మనముల నించుకయూరటఁ గని కడఁపగసాగి రెట్టొ కాల మొకగతిన్ 431

సీ॥ భరతుఁ డట్లగ్రజు పాదుకాపట్టాభిషేకంబొనర్చి తాఁ జిత్తమందు
నారామవిభుఁడు లేనట్ట యయోధ్యలో నుండఁగా మది నాతఁ డొల్లకయుఁ
దా రాఘవుని యరణ్యావాసదినములు గణియించుకొనచు నస్ఖలితనియమ
యుక్తుఁడై మునివృత్తి నొప్ప నందిగ్రామపరిసరంబున నొక్క పర్ణశాలఁ
గీ॥ దనర నిర్మించుకొని యచ్చటను వసించి, పాదుకల కిన్మకుండోలెఁ బరమభక్తి
తోడ సేవలుచేయుచుఁ బాడితప్పఁ, బోక క్షితి నేలుచుండె నర్వ్యులను మెచ్చ 432

కం॥ ఆనాటినుండి రాము, క్ష్మానాథుని మహితపాదుకాద్వయమె యయో
ధ్యానగరవాసులెల్లన్ మానసములఁ దలఁచుచుండ్రు మఱి తమప్రభుగాన్ 433

అయోధ్యాకాండము సమాప్తము

# శ్రీమన్నిర్వచన వేంకట రామాయణము

## ఆరణ్యకాండము

### శ్రీరాముఁడు సీతాలక్ష్మణసమేతుఁడై దండకారణ్యమును జేరుట

అవల శ్రీరామభూపాలుఁ డాత్మగతము, నంబు భరతుండు వెండియునరుగుదెంచు
ననుమఁ దద్దయుశంకించి యనుజుఁ దతిప, వెంటరాఁ జిత్రకూటంబు విడచిపోయి 1

అతిగభీరంబు నైన మెడమించుకయులేక తరునికుంజములచేఁ దనరువాని
ఘశార్దూలకేసరిముఖ్య దుర్మృగకాండబహుళమై యుండువాని
ఘోరవృశ్చికాది యుగ్రోరగవ్రాళి కనిశంబు నాటపట్టైనవాని
భూతతరక్షుక పిశాచ సమరాహ్వప్రచారమై కర మలరారువాని
కాకఘూకప్రముఖపక్షి కలకలరవ పరితమై భీతిఁ గొల్పుచుఁ బఱఁగువాని
దండకాభిఖ్యనొందిన దారుకాటవిని బ్రవేశించె రామపృథ్వీవిభుండు 2

ముందునడచుచుఁ గత్తిచేఁ బొదలనఱికి, తీవలనుద్రోసి ముండ్లను దీసివైచి
తిమ్మఁ డించుక ఎఘనిరోధంబుఁ బాపఁ, బదతిఁ గేల్బూని రాముఁడు నడువఁదొడఁగె 3

పెనుమిట్టపల్లంబు లనుగమింపఁగలేక వేడినిట్టూర్పులు విడిచివిడిచి
కఠినశిలల్ దాకి కాళులుక్క తమ్ములై నడువఁజాలక కడు సడలియుదలి
యడుగడుగునకుఁ గంటకాదులు హెచ్చుగాఁ గ్రుచ్చుకొనుచునుండ నొచ్చినొచ్చి
డెందియై ముందు ప్రచండమౌ నెండకుఁ గాయంబుతప్తమై కందికంది
యకట! సుకుమారియగు సీత యడవులందుఁ, గేవలము స్రుక్కి శ్రమనొంది ఖిన్నయగుచు
విభునివెన్వెంటఁ జనుచుండె విధికృతంబు, వశమె తప్పింప నెంతటివారికైన? 4

ఆకరణి వారుమువ్వురు నరుగుచుండ నొక్కచో విరాధుండను రక్కసుండు
నేరఁగావచ్చి మేఘగర్జారవమున, నట్టహాసముసేయుచు నిట్టులనియె 5

## రాముఁడు విరాధుఁడను రాక్షసుని సంహరించుట

సీ॥ 'ఓరి తాపసులార! మీరెవ్వరో? మహావీరులవలె ధనుర్ధారులగుచు
చెలువక నాదైన విపినంబులోనికి నేటికి వచ్చితిరింతితోడ?
నసువులపై మీకు నాసయొకలదేని మసలక మగువ నాకొసఁగి పొందు
లెనిచో నేఁ గబళింతుమి' మ్మని వాడు పల్కుచు నత్యంతభయదమైన

ఆ॥ తనదునోటఁ దెఱచుకొని హుంకరించుచు రాగఁజూచి దివసరాజకులలు
శితశితిమిఖములు చెరినాల్గు తమ్ముళ, ద్వారి మిచ్చిపాపఁ బరిపుకీయు 6

కం॥ వానిని లెక్కింపక వా, డానరిపతిసుతులపైన నత్యుగ్రతరం
బైన నిజశూలముంగొని, 'దీనంటరిపోర్తు' ననుచు ధీరతవైచెన్ 7

గీ॥ అదియు వేవేగఁ దముచెస కరుగుదేర, రామచంద్రుఁడు విగతసంభ్రాంతుఁ డగుచు
దివ్యశరమొండు పింట సంధించియేసి, ఎదుమునే దాని రెండుగా నఱకివైచె 8

కం॥ తనశూలము విఫలంబై, చని నారక్కసుఁడు కోపసంరంభుండై
ఘనముగ శిలాద్రుమంబుల, ననుపమముగ వారిపైన నడరించుటయున్ 9

గీ॥ అన్నిఁటిన్ రామలక్ష్మణు లంతరమున, సవ్యశరములచేతఁ జూర్ణంబుచేసి
తన్మహాబాహులయుగము నద్దంతలీలఁ, జెండివైచిరి యహితకౌక్షేయకముల 10

ఉ॥ చెండియుఁ దొల్త వాడు కతుటీశరుఁడై చపదేరఁ గాంచి కో
దండగురుండు రామవసుధారమణుండు తదీయమూర్ధముం
బండతరాసిచేఁ గరము సాహసమొప్పఁగఁ దుస్మివైచి నం
గొండవిధాన నయ్యసుర క్షోణితలంబునఁ గూలె నార్చుచున్ 11

సీ॥ అవ్విరధద్భుతలీల నావిరాధుండొక్క దివ్యుఁడై తనదైన దేహకాంతి
వెలుదెసల్ వ్యాపింప వెలుఁగుచు రాముని గనుఁగొని యిట్లను ననఘుఁడ!
గంధర్వుఁడను నేను గాయకముఖ్యుండఁ దుంబురుఁడనువాడు నాపేరు రంభ
రంభతోఁ గార్యము రతికేళిఁ దెలుపఁ దినసభకుం బోక తడసితినని

గీ॥ కిన్నలేశుఁడు కోపించి నన్ను రాక్షసుఁడవు గమ్మని శపియించెఁ జోద్యముగను
నీప్రసాదంబునుజేసి నేటితోడ, దొలఁగె నాశాపమనిచెప్పి పలికె మఱియు 12

కం॥ 'నే నిఁకపోదిదట మునుపటి, స్థానంబున కరుగువాడఁ జయ్యన మీరున్

కం॥ ఆరామలక్ష్మణులచున్, ధీమం తాతుంబురుండు స్థిరభక్తినమ
స్కారము వేసి విమానస, మారూఢుండగుచుఁ బోయె నమరులఁ బొగడన్ 14

## శ్రీరాముఁడు శరభంగాగస్త్యాదిమునులను దర్శించుట

ఉ॥ ఆతఁడు చెప్పినచొప్పున, నా తరణికులుండు రాముఁ డనుజుఁడు సతియుం
బ్రీతిగ వెంబడిరాఁ జని, యాతతపుణ్యాత్ముఁ గాంచె నాశరభంగున్ 15

సీ॥ కాంచి నమస్కరించుటయుఁ గారుణికుండగు నా మునీశ్వరుం
డంచితరీతి రాఘవుల నాదరమొప్పఁగ సత్కరించి ప్రా
పంచికధర్మపద్ధతుల బాగుగఁ గొన్నిఁటిఁ దానుదెల్ప వా
రెంచి రఘూత్తముల్ తపసిచేత ననుజ్ఞనుబొంది యవ్వలన్ 16

ఉ॥ చనుచున్ వారు క్రమంబున, ఘనులగునందలి మునులను గడుభక్తిమెయిం
గనుఁగొనుచుఁ దత్సపర్యల, ననురాగముఁ బొంది చూడ నరిగిరగస్త్యున్ 17

ఆయగస్త్యుఁడు భావికార్యంబు నాన, నమిత హితంబౌంచి యోజనస్థానమునకుఁ
గలపంచవటీపమునందునఁ గ్రామమున్న, పంచవటి కేఁగదనితెల్పె వారితోడ 18

॥ మునిపతి యాదేశంబున, ననుపమగౌరాత్ముర్యులైన రాఘవశరధుల్
చని పంచవటిని గాంచిరి, కనుపోయికి నుత్సవంబు ఘటియింపంగన్ 19

॥ కొలఁదిదినములు లావణ్య, స్థలమున వసియింప నృపుఁడు తలఁచి యనుజతో
పలయింబిటు నిర్మింపఁగ, వలయుననుచుఁ జెప్ప నతఁడు యత్నంబులచే 20

ఒకకుటీరంబు లలితమై యొప్పఁగట్టి, దంపతుల రహస్యప్రవర్తనముసకును
దనయుతికి వంగకరమనితలఁచి దాని, పక్క నిర్మించె వేఱొకపర్ణశాల 21

పార్థివుండు తదీయసద్భావమెఱఁగి, ప్రీతుఁడై తమ్ముఁడును దాను వేఱువేఱ
గాపురముసేయుచుండి రక్కాననున్న, తాపసులకెల్ల నభయప్రదాత లగుచు 22

## లక్ష్మణుఁడు శూర్పణఖకుమారుఁడైన జంబుని వధించుట

ట్టుండ రామావనీపతిమ్ముఁడు ఫలాహారణార్థ మొకనాడు పరిసరాట
ఫలకేగి యచ్చట ఫలకుసుమాదుల నెమకుచుండఁగ నక్కజముగ నొక్క
.రవాలరాజ మంబరమార్గముననుండి ధరణీస్థలికి వచ్చి మరలదిపికి

ఆ॥ పైకినెగసి దానిఁబట్టి యచ్చెరువొంది, యీయపూర్వఖడ్గ మెవరిదొక్కొ?
యనుచుఁ దత్త్వభావ మతిమతి శ్లాఘించు పడుమజాతుననుచు మదిఁదలంచి 23

గీ॥ ఎక్క పొదరిల్లు నఱుక నందుండి వెలికిఁ, బ్రబలశోణితధారలు గ్రమ్ముటయును
జూచి వెఱఁగందుచుండ నచ్చోనొకండు, కానుపించెను మృతుఁడైన యౌనివరుఁడు 24

గీ॥ అంత సౌమిత్రి కడు విభ్రాంతుఁడగుచు, నన్నవాలికిఁ బఱతెంచి యయ్యదంత
మంతయునుచెప్పి దుఃఖమ్ము స్వాంతమందు, నెంతయునుదోప రాముతో నిట్టులనియె 25

ఆ॥ అన్న! తపసిఁజంపి యావంద్రతారార్క మవ్యయమునకెల్ల నపయశంబుఁ
దెచ్చినాఁడ నిట్లు దెగిటార్చి కాపాడ వలయు వంశగౌరవంబు మీరు 26

గీ॥ దుష్టశిక్షకుఁడని మాకు దొడ్డపేరు కలదు కావున దుష్టుఁడఁ గిల్బిషయుతుఁడ
శిక్షకర్తుఁడ నన్ను నిష్పక్షపాతముగ దండితునిఁజేసి సత్కీర్తిఁ దాల్పుమన్న! 27

గీ॥ అని యనేకవిధంబుల నాసుమిత్రి కొడుకు విలపించుచుండ నప్పుడమితేఁడు
పాపభయమున నతనితోఁబాటుఁ దాను దుఃఖితుండయి యిదినిట్లు దూరసాగె 28

ఉ॥ వేడుక నీకుఁగలెనొకొ? పేదవు మాపయిఁగింత పేటసిన్
పేదనదాడి మెచ్చ నొకవించెడి కష్టములిన్నియుంచు నో
రాడదుచెప్ప నింకను దయాలు ఎరికింపఁగనెంచె యుర్విధీ!
పాడియె నీకు బ్రహ్మవధపాపము మాపయిమోప? నక్కటా! 29

గీ॥ బ్రహ్మవధపాప మన్నిపాపములకన్న మిన్నయని చెప్పవింపము మే మిదెట్లు
పరిహరింపఁగ నేర్తుము? పాపవిధి! కలచె పోకిఁక దుర్గతిగాక యుగతి? 30

## రామలక్ష్మణులకు మునులు జంబునివృత్తాంత మెఱిఁగించుట

కం॥ అనియిట్లు వారు రోదన మొనరించుచునుండఁ గొంత యొయ్యన నటకున్
మునివరులు వచ్చి సర్వము, నినకులపతిచేనెఱింగి యిట్లనిరి తగన్ 31

గీ॥ 'ఎవడనుజుచేత వధియింపబడినవాఁడు, రావణునిచెలియలైన శూర్పణఖకొడుకు
జంబుఁడను క్రూరదనుజుఁడు క్ష్మాతలేంద్ర!, మౌనిగాఁడు నిజంబుగ మానవపతి 32

కం॥ జననాథ! తచ్చరిత్రము, వినిపింతుము తండ్రియైన విద్యుజ్జిహ్వుం
డనుమాట దశగ్రీవుఁడు, తునుమాడఁగఁజేసి కినుకతో వానింటన్ 33

గీ॥ శివదమమీదఁ బగదీర్పఁదలచి ఘోర, తపముగావించుచుండెను దనిఁగూర్చి
యతిపంబున కిష్టుఁడు మఱంబునొంది యొకమహాఖడ్గమును నొలకయితండు 34

మత్తకోకిల॥ ఆ నిశాతమహాసిఁ గ్రమ్మఱ నర్కపాలికిఁ బొమ్మనెం
దానురాక నిరాకరించెను దద్దయుం బొగరెక్కి యా
భానుఁడంచుఁ దలంచి యాగ్రహభావ మెంతయుఁ దోఁపఁగన్
భానువంశపవిత్రవార్నిధివారిజారి! రఘూత్తమా! 35

గీ॥ అవ్విధంబున నా ఖడ్గ మసురుచేత, నంపఁబడి వెండి చనుచుండ నస్మదీయ
పుణ్యవశమున దానిని భూరిబలుఁడు, యుష్మదనుజుఁడుగొని దైత్యు నుఱక చంపె

కం॥ అని జంబుకుమారుని కథ, వినిపించి మునీంద్రులెల్ల వీడ్కొనిపోవన్
జననాథతనయు లూరటఁ, గనియుండి రనంతరంబ గాథముదమునన్ 37

## శూర్పణఖ మృతుఁడైన జంబునిఁ జూచి శోకించుట

సీ॥ శూర్పణఖ శీఘ్రమునఁ దన సూనునకిడ, షడ్రసోపేతవివిధభోజనచయంబుఁ
గొనుచుఁ జనుదెంచి యచ్చటఁ గూలియున్న సకలదుర్గుణనికురుంబు జంబుఁగాంచి 38

తే॥ గుండెలు మోదికొంచుఁ గొడుకుం దగఁ గౌగిటఁజేర్చి కన్నులన్
దండిగ నశ్రుబిందువులు ధారణిపైఁ బ్రవహించుచుండ ను
ద్దండతఁ బొంగివచ్చు పటుదారుణదుఃఖము నాపలేక తాఁ
జండతరార్తనాదము లెసంగ నిశాటిని యేడ్చె నిమ్మెయిన్ 39

ఉ॥ "కన్నులు విప్పుమన్న! ననుఁ గన్గొనుమన్న! భవద్వచస్సుధం
దిన్నగ వీనులంజొనిపి తేర్పుము నీజనయిత్రినిం గృపన్
మిన్నకయుంకి, నీయెడల నేనొనరించిన పాపమేమి? నీ
కన్నముఁదెచ్చితిం గుడుపుమన్న! విపన్నను నన్నుఁ జూడుమా! 40

॥ నీవియోగంబు భరియించి నేసుపుత్ర!, యెట్లుజీవింతు? నింక నాకేదిదారి?
కనికరములేక నన్ను నేకాకిఁజేసి, పుత్రశోకంబు నొడిఁగట్టి పోవఁదగునె?" 41

॥ అనుచుఁ బెక్కుగతుల నా నిశాచరకాంత, యటవి మారుమ్రోయునట్లు ఘోర
భంగి నార్తయగుచుఁ బలవించి వలపించి, కినుకపొడమ నిట్టులనియె మఱియు 42

॥ విన్నిటు చేసినట్టి ఖలునిన్ హరుఁడైన ఘటెవ్వఁడైన నెం
దున్నను వెంబడించి చటులోగ్రపరాక్రమవిక్రమంబునం
గ్రన్నన వానిఁబట్టికొని కంఠముఁద్రుంచెదఁ బొట్టఁజించెదన్
నన్నుగఁ గతితోఁ దఱిగి నముఁతి వండిగుజింతుఁ బుఁతలా 43

గీ॥ అనిపలికి యానిశాటిని యాక్షణంబ, పటుతరాగ్రహమునఁ బంచవటికి వచ్చి
యచటి మునులను ధర్షించి యడిగె నాదు, కొడుకుఁ దున్మినఖలునిఁ బేర్కొనుడటంచు

కం॥ అప్పుడు వారు భయంపడి, యిప్పలువకుఁ జెప్పకున్న నిఁక బ్రదుకున్నే?
చెప్పకతప్ప దటంచుం, జెప్పిరి రాఘవులమీదఁ జిడిముడిపడుచున్ 45

కం॥ చెప్పిన నిప్పలు కన్నుల, నుప్పతిలఁగ నౌడుగఱచి యురుకోపమునం
దప్పక వారల నమలెద, నిప్పడ యని చుప్పనాతి యెంతయును వెనన్ 46

## శూర్పణఖ రామునిఁజూచి మోహించుట

కం॥ అమరేంద్రసదృశుండును, విమలాత్మకుఁడైన రామవిభుఁడున్న లస
ద్రమణీయంబైన కుటీ, రముచెంతకు నరుగుదెంచి రక్కసి యనటన్ 47

సీ॥ నీలాంబుదచ్ఛాయఁబోలు దేహమువాని సస్మితసుందరాస్యమ్మువాని
నరవిందసదృశంబులగు నేత్రములవానిఁ బువ్విల్తువిలుగేరు బొమలవాని
నాజానులంబితాయతబాహువులవానిఁ జారువిశాలవక్షంబువానిఁ
గిసలయవిభవంబుగెల్చు నంఘ్రులవానిఁ గంబుసమానకంఠంబువాని
గీ॥ ఘనజటావల్కలంబులఁ గ్రాలువాని, నభినవోజ్జ్వలయౌవన మమరువాని
నన్నివిధముల నొప్పిదమైనవాని, రాము రామాసహితు రఘురాముఁ గనియె 48

ఆ॥ కని తదీయరూనగరిమ కెంతయుమెచ్చి యలుకవోయి మోహమావహిల్ల
వట్టెనిలిచి మదిని నిట్లనితర్కించె, మదనబాణదళితహృదయ యగుచు 49

చం॥ లలితసురూపయౌవనవిలాసములం గడు నద్వితీయుఁడై
వెలిఁగెడు నీతఁడెవ్వఁడొకొ? వీని కనంగుఁడుగాకయున్నఁ బు
వ్విలుతుఁడు సాటివచ్చు నని పేర్కొనఁగాఁదగునేమొ? కాని య
మ్మలు తలఁపన్ నమానులని యొప్పవె చెప్పఁగ ముజ్జగంబులన్? 50

కం॥ రతియో? పార్వతియో? భా, రతియో? శ్రీసతియొ? కాని రసికహృదయస
మ్మతయగు నీయతివ యితని, సతియై యుండంగవలయు సర్వవిధములన్ 51

కం॥ ఈ తరుణి కితఁడేతగు, నీతని కీతరుణితగును నిమ్మెయి వీరిన్
ఖ్యాతిగ జతఁగూర్చిన యా, ధాతమహాకౌశలంబుఁ దరమే పొగడన్? 52

ఉ॥ అక్కట! పూర్వజన్మసముపార్జితపుణ్యఫలంబొ! నాగ నా
యిక్కకువచ్చియుండిన రతీశ్వరసన్నిభుఁడైన యీతనిం
జక్కఁడగింపనెంచితిని జంబునిఁబోలు తమాజు లిమ్మహిం
జిక్కుదురెందఱైన మఱి చిక్కునె యిట్టిమహాత్ముఁ డెమ్మెయిన్?

సీ॥ ఇతని మనోహరాకృతివిలాసంబులఁ గనులారనెప్పుడు గాంచకున్న
నితని సన్నిధిఁజేరి రతులప్రసంగంబు లింపారఁగా ముచ్చటింపకున్న
నితని వాతెఱకేనె లెలమిమై నెల్లప్డు తనివారఁగాఁ గ్రోలి తనియకున్న
నితనితో శయనించి తలకంతుతాపంబు దీరంగ రతికేళిఁ దేలకున్న
గీ॥ మానిమానికిఁ జెలరేగి మసనుఁడేయు వాడిగలతూపు లెడద నోనాడుచుండ
నెటుభరియింతు? నింక నేనెట్లుమేన, నసువులను నిల్పుకొననేర్తు? నక్కటకట! ౬

కం॥ కోరి బహూరతులచవు లిం, పారనెఱింగితిని గాని యరుదుగ మారా
కారుఁడగు నిట్టిసుందరు, తో రతిసుఖ మనుభవింప దొరకొన దెపుడున్ ౬

గీ॥ అనుచుఁ గామాకులస్వాంతయై యనేక, భంగులన్ మదిఁ జింతించి పావనాత్ముఁ
డైన రాముని చరితంబు నరసెవనని దరిసి యిటుప్రచ్ఛసేసె నద్దనుజవనిత 5

కం॥ "అయ్యా! మీదగుదేశం, బెయ్యది? కులమేది? నామ మెద్దియొకో? యీ
తొయ్యలి నీగృహిణియె కద?, యియ్యడవివసింప హేతువేమి? తెలుపుడీ!" 5

కం॥ నాపుడు శూర్పణఖకుఁ దన, యావదుదంతంబుఁ జెప్పి యర్కకులుండా
రావణుసోదరితోడన్, నీవెవ్వతె వనుచు నడుగ నెలఁతుక పలికెన్ 5

శూర్పణఖ తనవృత్తాంతమును శ్రీరామునితోఁ దెలుపుట

సీ॥ "శతమఖప్రముఖదిక్పతుల నందఱఁగెల్చి దాసోహమనునట్లు చేసెనెవఁడు
కడిమిమై నవలీలగాఁ గందుకమువోలెఁ గైలాసగిరి నెత్తఁగలిగె నెవఁడు
తమ్మిచూలిని ఘోరతపమునమెప్పించి యర్థిమై వరముల నందెనెవఁడు
ఈరేడుజగముల నెదురొకింతయులేక కడునిరంకుశవృత్తిఁ గ్రాలెనెవఁడు
గీ॥ అట్టి లంకాపురాధీశుఁ డమితబాహు, బలసమగ్రుఁడు విశ్రవోబ్రహ్మసుతుఁడు
[illegible]

ఉ॥ శూర్పణఖాభిధానమున సుస్థిరవిక్రము లాజిలో మహా
దర్పితులైన వీరులగు దైత్యులు దేహముఁ బ్రాణమున్ మదీ
యార్పణసేసి కొల్వఁగ నిరంకుశమైన ప్రభుత్వ మేర్పడన్
నేర్పున నీయరణ్యమును నేనయధీశ్వరినౌచు నేలుదున్ 60

సీ॥ నాయాజ్ఞలేనిదే యీయరణ్యములోన శివునకైనను బ్రవేశింపరాదు
తెలియక నీవరుదెంచితి వనియెంచి మన్నింతునందునా మత్తనూజు
నేమియు నపరాధమెఱుఁగని మహనీయు నధికతపోయుక్తు నార్యవినుతు
జంబుకుమారునిఁ జంపి నన్ననయంబు నతిఘోరపుత్రశోకార్ణవమున
గీ॥ ముంచి నాకింతకీడొనరించియున్న, నిన్నుపేక్షింపరా దైవ నేవచించు
మహితహితభాషణంబులు మానవేంద్ర!, నీచెవులనింపుమయ్య! మన్నించుదాన 61

చం॥ జలజదళాక్ష! నీదయిన చక్కఁదనంబును జూచి వెమ్మదిన్
వలచినదాన నన్ను మరుబారికిఁ ద్రోయఁగఁ బాడిగాదు నీ
లలనగ స్వీకరింపు మతులప్రమదంబున మారుకేళి నీ
వలసినయట్లు దన్నుము భవత్పదదాసిగా మెలంగెదన్ 62

గీ॥ నీదు మహనీయరూపబలాదులకును, నేనుదగుదును గడురూపహీనురాలు
దుర్బలయునైన యాసీత తోయజాక్ష, నీకుఁదగదయ్య! విడువు మానెలఁత నింక 63

కం॥ నీవును నేనుఁగలసి యా, దేవేంద్రుఁడు శచియునట్లు దివ్యసుఖులమై
యీవని నందనవనిగా, భావించి యనారతంబుఁ బాలింపఁదగున్ 64

ఉ॥ నావుడు దానిపల్కులకు నవ్వుముఖంబునఁ దాండవింప రా
మావనినాథుఁ డిట్లనియె 'నంగన! నీనరి యందగత్తె లీ
భూవలయంబునందు మునుఁ బుట్టఁగలేదిఁకఁ బుట్టరెన్నఁడుం
దావకరూపసంపదలు ధారణినందన కెట్లుకల్గెడున్? 65

గీ॥ రహితసౌందర్యయైన దుర్బలయునైన, లేశమైనను రసికతలేనిదైన
నగ్నిసాక్షిగఁగొన్న యాయంబుజాక్షి, నెట్లు త్యజియింతు? నపకీర్తి కెట్టులోర్తు? 66

కం॥ నన్నే తన దైవముగా, నెన్నుచు నాతోడ వనికి నేతెంచిన యా
యన్నులమిన్నను విడిచిన, నున్నేపుణ్యంబు? నాకు నుండునె సుగతుల్? 67

కం॥ కావున వెట్టిదయిన నా, కీవనితయె చాలు నిర్వురేటికి భార్యల్?
కేవలము దరిద్రున' కవి, యా వసుధారమణుఁ డిటులనియెన్ మఱియున్ 68

### రాముఁడు శూర్పణఖను లక్ష్మణునికడకుఁ బంపుట

ఉ॥ 'అల్ల కుటీరమందు నను వన్నిఁటమించిన నాదుతమ్ముఁ డు
త్ఫుల్లసరోజలోచనుఁడు పుష్పశరప్రతిముండు మిక్కిలిన్
బల్లిదుఁడైన లక్ష్మణుఁడు వానము సేయుచునున్నవాఁ డతం
డెల్లవిధంబులన్ భవదభీష్టముఁ దీర్చును బొమ్ము కామినీ! 69

ఆ॥ దారలేమిఁ జేసి తహతహపడుచున్న, వాఁడు నేను జెప్పినాడననుచుఁ
జెప్పు మతనితోడ సింధురనిభయాన!, నిన్ను స్వీకరించు నిక్కువముగ' 70

చం॥ అనవిని యాక్షణంబ దనుజాంగన లక్ష్మణుచెంతకేగి త
ద్వినుతవిలాసరూపఘనతేజములంగని యిట్టిసుందరుం
డనిమిషులందు లేడు వరులందును లేడు తలంప రాముఁ డీ
యనఘున కీడుగా డనుచు నాత్మగతంబున నూహసేయుచున్ 71

కం॥ రాముననుజ సుదివినయ, ట్లాఘూలాగ్రమ్ముగాగ నాత్మచరితమున్
సౌమిత్రికిఁ జెప్పి యసుర, కామిని యిట్లనుచుఁ బలికెఁ గామాకులయై 72

కం॥ 'నాయందము నాచంద, మ్మేమయితివను లేమిఁ దెలిసి యినకులపతియో
నీయగ్రజుండు నన్నుఁ దన, జాయగఁ గొనఁదలఁచెఁగాని స్వాంతములోనన్ 73

గీ॥ తనకు శనిదేవతయుఁబోలె దాపురించి, యున్నజానకికతమున నన్ను నీదు
కడకుఁబుత్తెంచెఁ బాప మాఘమని కట్టి, భాగ్యదశలేక నన్నుఁ జేపట్టఁడయ్యె 74

కం॥ నీవైన నన్నుఁబత్నిగ, భావమునన్ స్వీకరింపు భావజకేళిన్
నీవలసినట్లు మెలఁగుచుఁ, గావింతు ముదంబునీకు ఘనశౌర్యాఢ్యా' 75

చం॥ అనవుఁడు లక్ష్మణుండు పరిహాసనిమిత్తము రామభద్రుఁ డ
వ్వనితను బంపియుండు నని భావములోనఁ దలంచి బొజ్జము
క్కును బృథుకుక్షియున్ నిడుదకోరలు విప్పగు నోరునున్ ఘన
స్తనములునై యనహ్యమగు తద్వికృతాకృతిఁ జూచి నవ్వుచున్ 76

సీ॥ దానికిట్లను సుమిత్రాపవిత్రతనయుండు 'పెఁడి! నీవెంతటి బేలవొక్కొ
మకరందపానంబుమాని పుష్పంధయ మన్యము చపులకు నాసఁజేయు
చందాన శ్రీరామచంద్రునిఁ ద్యజియించి దపువిగా నన్నుఁ గోరఁదగునె నీకు?
[illegible]

గీ॥ నేను నిరతంబు రామభూజానిఁ గొలిచి, బ్రమకుచుండుదు నన్నుఁ జేపట్టితేని
నాకుఁగలిగిన దాస్యమే నీకుఁగలుగుఁ, గాని సుఖలేశమైనన గలుగదబల 77
కం॥ కావున రామునిపాలికి, నీవరుగుము నెలఁత!' యనిన నిజహృదయమునం
గేవలమునావేశం, బావహిలన్ రాముకడకు నది చనుదెంచెన్ 78
సీ॥ ఆరామభూపాలుఁ డారాక్షసాంగనవలన నంతయువిని 'వారిజాక్షి!
కలనైన నేనన్యకాంతనొల్ల నటంచు సమ్మతిఁ గైకొంటి సద్వ్రతంబు
నిన్నువరించుట నీతిగా' దని పల్కి మఱియు నిట్లనియె నావనుజవిభుఁడు
'నీమోహనాకృతి గామారికైనను మోహాబ్ధిలోపల ముంచునన్న
గీ॥ లక్ష్మణుం డెంతవాడొక్కొ లలన! తొలుత, బాగుగా నిన్నుఁజూడమిఁ బంపినాడె
కాని యీనారిపొమ్ము నిక్కముగనిన్ను, భార్యగా స్వీకరించు నోపడతి యతఁడు' 79
కం॥ నాథుఁడుఁ బరిహాసార్థము, క్ష్మావరుఁ డటపలికె ననుచు మదిఁదలఁపక యా
రావణసహోదరి సుమి, త్రావరసుతు కడకుఁ బోయి రతికిన్ వేడెన్ 80
గీ॥ వేడుటయు లక్ష్మణుండను 'వినుము తొలుత, ధీరు రామునిఁగోరి తాకారణమున
వదినవైతివి నాకిఁక వామనయన!, వానివరుసలు గణియింపవలదె నీవు' 81
ఆ॥ అని నిరాకరించి యాలక్ష్మణుఁడు వెండి, రాముచెంతకనుప రాఘవుండు
'తనకువల' దటంచుఁ దమ్ముపాలికిఁబంపె, ననుజుఁ డొల్లకనిపె నన్నకడకు 82

## లక్ష్మణుఁడు శూర్పణఖ ముక్కుచెవులను ఖండించుట

సీ॥ ఇట్లు తన్నొల్లక యినకులులిరువురు గరము వినోదింపఁగాఁ దలంచి
కోతినాడించినరీతిఁ బల్మారులు నట్టిటుఁద్రిప్పుట కాత్మవిసిగి
'యోరి నరాధములార! నన్నొక్క సామాన్యకామినిఁగాగ మానసములఁ
దలఁచిరి కాబోలు తడయక మీకిఁకఁ దగినశిక్ష విధింతుఁ దథ్యముగను'
గీ॥ నని మహోగ్రహమూని యా, యవనిసుతయె, నన్ను నృపుఁడొల్లమికిఁ గారణంబుగాన
దీనిమ్రింగెద, నని నోరుఁదెఱచుకొనుచు, దివిపగులనార్చుచున్ సీతదెసకు వచ్చె 83
కం॥ దానినిఁగనుఁగొని భీతిలి, జానకి తన మఱుఁగుఁజొరఁగఁ జయ్యన విభుఁడా
చానకు ధైర్యముఁగఱపి ని, జానుజునింబిలిచి యిట్టులనివాక్రుచ్చెన్ 84
గీ॥ 'ఈవెలఁదితోడఁ బరిహాసమింకఁజాలు, దీనివాంఛను గడముట్టఁ దీర్పుమనఘ!'
నావుడా లక్ష్మణుండంత నాతితోడ, 'నతివ నీకోర్కెఁదీర్చెద' న్ననుచుఁజేరి 85

సీ॥ తన వామకరమునఁ దన్మహానాసను బిగియంగఁబట్టి యవ్వీరవర్యుఁ
'డే సీమసరసమో యిది?' యన దానితో 'మాసీమసరసమో మగువ!' యనుచు
భయదాసిచేత శూర్పణఖ ముక్కునుజెవుల్ ఖండించి రక్కసుల్ గలిగియున్నఁ
జెచ్చెఱఁజని నీవు చెప్పు కొ మ్మిఁకఁబొమ్మ చెనఁటిరో! యనుచుఁదాఁ దెప్పిపంప
గీ॥ నాసికాకర్ణములనుండి నెదులయట్లు, రక్తము స్రవించి ప్రవహింప రక్కసి కడు
నార్తనాదమొనర్చుచు నచటునాసి, చనియె ఖరుఁడున్న యా జనస్థానమునకు 86

ఉ॥ దానినిఁజూచి యాఖరుఁడు తద్దియు విస్మయమొంది యిట్లనున్
'మానిని! నీకు నిట్టు లవమానముసేసిన క్రూరుఁడెవ్వఁడో?
వానిని వేగఁబేర్కొనుము వజ్రియునైన మఱెవ్వఁడైననుం
గాని వధించి నీఁకుఁ గుతుకంబొడగూర్చెద' నంచుఁ బల్కినన్ 87

కం॥ విని యారక్కసి వానికి, వనముల రాఘవుల చరిత మతివిశదముగా
వినిపించి వారిఁ గెడపి, తనపరిభవమహ్మానార్పఁ దనుచని పలికెన్ 88

## ఖరదూషణులు రాక్షససేనలతో రామలక్ష్మణులపైకి యుద్ధమునకువచ్చుట

సీ॥ ఆపల్కులాలించి యాగ్రహంబొదవఁగఁ గాలాహివలెమండి ఖరుఁడు పలికె
'వినుము! శూర్పణఖ! నా విక్రమంబెఱుఁగవే? శక్రాదులపుగెల్వఁ జాలుదువన
నరు లొకలెక్కయే నాకు? వారలఁబట్టి సంగరధాత్రిలోఁ జంపి నీదు
సూడుదీర్తు' ననుచు వాడు ప్రగల్భంబు లమితంబుగా నాడి యాక్షణంబ
గీ॥ విపుల రణభేరి మ్రోయించి వీతభయులు, సమరకర్కశు లతిపరాక్రమధురీణు
లనఁ బ్రసిద్ధిగడించిన యసురభటులు, పదియునాలుగువేవురు బలిసికొలువ 89

మ॥ ఖరుఁడున్ దూషణుఁ డంత నాననములం గట్టల్క దీపింప భా
స్కరవంశోత్తములైన రాఘవులతోఁ గయ్యంబొనర్పన్ మదో
ద్ధురతన్ మేటి రథంబులెక్కి విలసద్దుర్వారదోర్గర్వసు
స్థిరులై యార్చుచు గ్రక్కునన్ వెడలి రక్షిణప్రతాపోన్నతిన్ 90

సీ॥ ఇవ్విధంబునఁ దిమ్ము నెదిరింపవచ్చెడి యసురసందోహంబు నంతనంతఁ
గని రామభద్రుండు జనకజాసంరక్షణార్థ మాతతబలు ననుజు సునిచి
తానొకరుండ కోదండతూణీరముల్ గొంచెదుర్కొని మూకఁ గూడముట్టి

గీ॥ బ్రతిహతం బొనరించుచు వనమృగములఁ, గొదమసింగము పేటాడి కూల్చునట్లు
మారణోద్యమతత్పరమానసుఁ డయి, సమరకేళివిహారంబు సలుపఁదొడఁగె 91

ఉ॥ అప్పుడు పార్థివోత్తము మహోద్భృతచాపవిముక్తబాణముల్
తప్పక తాకుచుండ భటదంతితురంగరథాదులెల్లఁ బెం
గుప్పలుగా రణస్థలినిఁ గూలఁదొడంగె వియచ్చరవ్రజం
బుప్పరవీధి నిల్చి కని యుత్కటహర్షభరంబుఁ దాల్చెఁగన్ 92

గీ॥ మఱియు నమ్మూకయందలి మహితశౌర్య, కలితులైనట్టి దనుజయోధులు కడంగి
శక్తికొలఁదులఁ బోరాడి క్ష్మాతలేంద్రు, బారిఁబడి చత్తురేకాని పారిపోరు 93

## శ్రీరాముఁడు ఖరదూషణాదులను సంహరించుట

సీ॥ అపగతప్రాణులై యాహవస్థలినిఁ గూలిన వారిఁగాంచి చలింపఁబోక
నిజకరస్థాయుధవ్రజము తుత్తునియలై ధాత్రిణింగలిసిన బీరువోక
తెలివిలేకుండఁ జిచ్చఱపిడుగులనుబోని కఱకుటమ్ములు నాట వెఱఁగుపడక
క్షతములనుండి సంతతధారగా క్షతజము స్రవించుచునుండ సరకుఁగొనక
గీ॥ సైన్యమంతయుఁ గరము నస్ఖలితధైర్య, వంతమై పెద్దయును బ్రొద్దు భండనంబు
సలిపి రఘుసత్తముని శితశరపరంప, రాగ్నికీలల కెఱయౌచు నంతమొందె 94

చం॥ దనుజబలంబు లిట్లు రణధాత్రినిఁ ద్రెళ్ళి నశింపఁ జూచి తా
మనుపమకోపచిత్తులయి యార్చుచు నాఖరదూషణుల్ శరా
సనముల నెక్కువెట్టి పటుసాయకజాలము లొక్కపెట్ట న
వ్వనరుహమిత్రవంశమణిపైఁ గవియింపఁగసాగి రుద్ధతిన్ 95

చం॥ అసదృగ వానిసన్నిఁటి శితాస్త్రములం బరగించి దవ్వులన్
వెసఁ దునుమాడివైచి రఘువీరుఁడు వెండియు రెండుతూపులన్
మసలకయేసి సయ్యసురనాథుల భీకరచాపదండముల్
వసుమతిపైఁ దొరంగె శకలమ్ములుగాగ మహోద్భృతింబుగిన్ 96

గీ॥ దానవులు వెండి వేఱుకోదండములను, బూని శరములు సంధింపఁబోవు నెడల
వానినింగూడఁ దునిమె నవార్యశౌర్య, ధుర్యుఁడగు రాఘవుఁడు వాడితూపులేసి 97

చం॥ ఇనకులుఁడిట్లు రాత్రిచరు లెన్నిధనుస్సులు దాల్ప వన్నియుం
డునుకలు సేయుచుం దవదు దోర్విభవంబున కస్త్రలాఘవం
బునకు వియచ్చరప్రకరముల్ వెఱఁగందఁగ సూతరథ్యముల్
దునిమి రథాంగయుగ్మమును దూర్ణమ చూర్ణముఁజేసె నుద్ధతిన్ 98

సీ॥ విరథులయ్యును వారు వీరాధివీరులై యినుమంతయేనియు నీడఁబోక
ప్రావృట్పయోధరార్భటుల చందంబున సింహగర్జనములు చెలఁగుమంత
గ్రక్కునఁ జెరియొక్క కత్తియు డాలును గేలధరించి యాభీలగతిని
స్యందనంబులుడిగ్గి సరభసమ్ముగఁ ఎతి కభిముఖులగుచుఁ దా రరుగుదేర

గీ॥ నాలసింపక శ్రీరాముఁ డగ్నిఁబోని, తీవ్రశరమొండు వింట సంధించి విడువ
నదియుఁ గడురివ్వనంబోయి యాక్షణంబ, దూషణుని మూర్ధ మవలీలఁ దునిమివైచె 99

కం॥ తలదెగిన నసురుమొండె, మ్మిలపై బహురక్తధారలెగ్గఁ దొరంగం
గులిశాహతిఁ ద్రెళ్ళెడు నా, కులగిరిచందంబుఁ దోపఁ గూలెం దోర్త్రోన్ 100

గీ॥ అప్పు డనుజనిమరణంబు నాఖరుండు, కన్నులారఁగఁగని కోపకలితుఁ డగుచు
వేగఁ బఱతెంచి జానకీవిభునరమ్ముఁ, దాకవిసరెను దనచేతి దారుణాసి 101

సీ॥ కడులాఘవమునఁ దత్కరవాలఘాతంబు దప్పించుకొని రఘూత్తముఁ డలిగి
యశనిపాతముఁబోని యతిదృఢముష్టిని సారించి యసురునాస్యమ్ముఁ బొడిచె
దానివలన వాడు తలదిమ్మపట్టగ నట్టిటుసోలఁగ నర్కవంశ
తిలకుఁ డాలోప గాధేయదత్తంబును బ్రబలదుర్జయశత్రుభంజనంబు

ఆ॥ నైన యగ్నిబాణ మరివోసి యేసిన, నేలఁగూలి ఖరుఁడు నిధనమొందె
నంత నమరగణము లారామచంద్రుపైఁ, గురిసెఁ గుసుమవృష్టిఁ గుతుకమునను 102

## శూర్పణఖ తనపరాభవమునుగూర్చి రావణునితోఁ జెప్పుట

ఉ॥ అక్కరణిన్ ఖరాదులగు నప్పదునాలుగువేల దైత్యులం
జక్కడగించి దేవమునిసంఘములెల్ల నుతింపుచుండ ను
క్కెక్కెనమేటివీరుఁడు దినేశకులాగ్రణి పర్ణశాలకున్
గ్రక్కుననేగుదెంచెఁ దనకాంతయుఁ దమ్ముఁడు హర్షమొందఁగన్ 103

గీ॥ తమ్ము నిరతమ్ము బాధింప దానవాళి, నంతమొందించి రక్షించి నందులకతి
హంసవరితాతులై యందలిమును [illegible] 104

సీ॥ కదనంబులో నట్లు ఖరదూషణాదులు రామచంద్రునిచేత గ్రుగ్గటయును
దనమానసంబునఁ దద్దయుశోకించి యాశూర్పణఖ లంక కాశ్రణంబ
చని సర్వసామంతసచివభృత్యాళితో నొడ్డోలగంబువం దున్నయట్టి
రావణుదర్శించి రవికులశ్రేష్ఠుల చరితంబుఁ దనకైన పరిభవంబు
గీ॥ సపరివారంబుగా ఖరుఁ డపగతాసుఁ, డగుటయును దెల్ప నాలించి యధికరోష
భీషణాకారుఁడగుచు నవ్వేలఁదితోడఁ, బండ్లు పటపటగొఱుకుచుఁ బలికెనతఁడు 105

సీ॥ 'విపులదంష్ట్రాభీలవిషధరాధిపునేనిఁ జెనకిన నొకవేళఁ జెనకవచ్చు
సమదహర్యక్షకేసరనికాయముఁబట్టి నిలిపిన నొకవేళ నిలుపవచ్చు
బ్రళయకాలానలభయదకీలలఁబడి తప్పిన నొకనేళఁ దప్పవచ్చు
నల మృత్యువదనగహ్వరముఁ బ్రవేశించి బ్రదికిన నొకవేళ బ్రదుకవచ్చు
గీ॥ గాని ముల్లోకముల నొక్కరేనివస్నుఁ, బోరనెదిరించి బ్రదికినవారు లేరు
తెలిసితెలిసియు నిన్నిట్లు పనుపలగుచుఁ, బరిభవించిన ఖలు లింక బ్రదుకఁగలరె? 106

గీ॥ అనినవిని శూర్పణఖ తన మనమునందు, నపరిమితమగు సంతోష మావహిల్ల
దనుజకులచక్రవర్తినిఁ గనుఁగొని కడుఁ, బ్రియముదోపఁగ నిట్లని విన్నవించె 107

కం॥ 'ఆరామలక్ష్మణులు కడు, ధీరులు జితవైరు లధికతేజోబలదు
ర్వారులు వారు మనుష్యులు, కా రసదుగఁ దలఁపవలదు ఘనశౌర్యాఢ్యా! 108

కం॥ విదితబలులు ఖరదూషణు, లెదిరించిన రాముఁడొక్కఁడే కదనమునం
బదునాల్గువేలమందిని, సదమద మొనరించె నతులసాహస మొప్పన్ 109

గీ॥ ముజ్జగములెత్తివచ్చినఁ బోరిలోన, రామలక్ష్మణులను గెల్వరాదు కావ
వారితో యుద్ధమొనరింపవలదు మనకు, నొక్కసదుపాయ మెఱిఁగింతు మరుగుణాఢ్య!

కం॥ ఆరఘుకులు లిరువురిలో, నారయ జ్యేష్ఠుండు రాముఁడనువానికి భా
ర్యారత్న మొర్తుకలదా, వారిజముఖి రూపవైభవం బేమందున్ 111

కం॥ లలితాంగులనెందఱిలో, తిలకించితిఁగాని యొక్కతెయు నాసతికిం
దులఁదూగదు సహజసము, జ్జ్వలచారువిలాసరూపసంపద్గరిమన్ 112

గీ॥ అచ్చపలనేత్ర నెట్లైనఁ దెచ్చితేని, ఘనుఁడురాముఁడు తద్వియోగమునఁ జేసి
చావఁగలఁడన్నతోఁబాటుఁ జచ్చుఁ దమ్ముఁ, డతివరకున్ను గసిదీరు నందుకబము'

## రావణుఁడు సీతాపహరణకుతూహలియై మారీచునికడ కేగుట

చం॥ అనివచియించి శూర్పణఖ యగ్రజుపీక్కొని యాత్మభూమికిం
జనిన ననంతరంబ దనుజప్రవరుం డనుజావమానసం
జనితనితాంతకోపవివశత్వముఁ బొ మనోజతాపమే
తన కపు డగ్గలంబగుటఁ దానతిఁ దేరఁగ నిశ్చితాత్ముఁడై 114

సీ॥ ఆ దశకంధరుం డప్పుడ రథమెక్కి యంభోధితీరంబు నందుఁ దపము
సేయుచుండిన మహామాయావియును దన ప్రియసఖుండైన మారీచుకడకుఁ
బోయి యాతఁడు సల్పు పూజలుగైకొని యెంతయుహర్షించి యిట్టులనియె
'వినుము! మారీచ! నేవినిపింతు నొకవార్త రామలక్ష్మణులను రాజసుతులు
గీ॥ దండకాటవిస్థలకుఁ దమతండ్రిపంప, వచ్చి మునివృత్తిఁగైకొని వారలిపుడు
పంచవటియను స్థలమున నంచితముగఁ, గాపురంబున్నవారట గర్వమొప్ప 115

గీ॥ పలువతనమున వారు శూర్పణఖ ముక్కు, కర్ణములఁగోసి పంపి యక్కజముగాఁగ
ఖరుని సపరిచ్ఛదంబుగాఁ గలహమందు, నొక్కఁడే చంపెనట! రాముఁ డోగుణాఢ్య! 116

కం॥ కావున వారలు నాయెడఁ, గావించిన దారుణాపకారమునకు నేఁ
గావింతుఁ బ్రతీకారము, నీవరయఁగ సాయమగుచు నిలువఁగవలయున్ 117

చం॥ విను మది యెట్టిదన్న రఘువీరున కచ్చరమించుఁబోండ్లకున్
దనఁ దగునట్టి భార్య కలదట్టి సుధీవర! దానిఁ గైతవం
బునఁ గొనివత్త మమ్మనుజపుంగవు లిప్పురుఁ దద్వియోగసం
జనితదురంతశోకమునఁ జత్తురు' నా విని భీతినొందుచున్ 118

శా॥ మారీచుండను 'నయ్య! రాముఁడన సామాన్యుండె? బాల్యంబునం
దే రక్షఃప్రకరంబులం దునిమి గాధేయాధ్వరంబుం గడున్
ధీరత్వంబునఁగాచెఁ దచ్ఛరమహాతీవ్రావాతింగాదె నే
నీరీతిన్ మునివృత్తిఁగైకొని తపంబిచ్చోటఁ గావించుటల్? 119

సీ॥ అస్త్రశాస్త్రజ్ఞుఁడై బాలుఁడైయున్న యప్పుడే రాముఁ డత్యంతవిక్రమముతోడ
ననుపమదుష్కరఘనకార్యములు పెక్కు లొనరించి జగముల వినుతికెక్కెఁ
బ్రాయపుసిరిఁబొంది బహుళాస్త్రశస్త్రవిద్యాపాటవంబున నధికశౌర్య
[illegible]

గీ॥ నీకుఁ గ్రూరాత్మలెవరొ దుర్నీతిఁగఱపి, చెఱుపఁదలఁచిరి నాబుద్ధిఁ జిత్తగింపు
చెలిమికతమున హితమునుజెప్పుచుంటి, దనుజనాయక! యీ దురుద్యమము వలదు

కం॥ ఎప్పుడు నిజశరహతి నను, నొప్పించెనొ రాఘవుఁడు దనుజవల్లభ! నే
నప్పటినుండి రకారముఁ, జెప్పిన వెఱఁగందుచుండఁ జిత్తములోనన్' 121

ఉ॥ నావిని 'యాచరుల్ గిరులు నాకొకలెక్కయె? సంగరంబునన్
దేవగణేశుఁ డాదియగు దిక్పతులందఱినిన్ జయించి త
ద్దేవపదంబులెల్లఁగొని దిగ్విజయంబొనరించి యున్న యీ
రావణుఁడుండ నీవిటు కరమ్ము భయంపడనేల? మిత్రమా!' 122

కం॥ అనిపలుకుచు రావణుఁడా, తని రమ్మని ప్రార్థనంబుఁ దాసలుపుటయున్
విని మారీచుఁడు దశముఖుఁ, గనుఁగొని యిట్లనుచుఁ బలికెఁ గడువినయమునన్ 123

సీ॥ 'ఓరాక్షసేశ్వర! శ్రీరామభద్రుండు మనుజమాత్రుఁడుగాఁడు మనకులంబు
నాశనమొనరింప నారాయణుండు లా నవనీతలంబునం దవతరించెఁ
దద్దేవి జానకి తలఁప సాక్షాల్లక్ష్మి ఒలిమినామెను బెఱఁబట్టసగునె?
పార్థివు శరపరంపర ఘోరవహ్నికి శలభంబులట్లు భస్మంబుగాక

గీ॥ బ్రదికి వెన్కకు వత్తుమే? పంక్తివదన!, వలవదీపని యడుగుము కులముచెడును
కానిపనిసేయ నెంతటివానికైనఁ, జేటుపాటిల్లు నని బుధుల్ చెప్పవినమె? 124

కం॥ అని తనరాక కసమ్మతిఁ, గనఁబఱచుచు నీతులెల్లఁ గఱపుచునుండన్
విని మారీచునిపైఁ గడుఁ, గినిసి దశాస్యుండు కనులఁ గెంపావహిలన్ 125

గీ॥ 'ఓయి! మారీచ! నాపంపుసేయవేని, భయదకరవాలమునకు నిన్ బలియొనర్తు'
నని నిజాసినిఁ బైకెత్త నతిభయమునఁ, గంపితుఁడౌచు నతఁ డాత్మగతమునందు 126

కం॥ 'ఈపాటిచేత మడిసినఁ, బాపంబేకలదు రామభద్రునిచేతన్
రూపటి ధన్యాత్ముఁడనై, యేఁగెద' నంచుఁ దలఁచి యియ్యకొనుటయున్ 127

గీ॥ అప్పు డసురేంద్రుఁ డత్యంతహర్షమంది, నిజరథంబున మారీచుని నిడుకొనుచు
వేగమునఁ బంచవటి చెంతకేగుదెంచి, యాతఁడుం దాను నొక్కచో నరదముడిగి 128

గీ॥ ఆ దశాస్యుఁ డిటుపల్కె నాదరమున, 'నోయి! మారీచ! యింక నీమాయచేత
నెట్టులైనను నృపుల నీవెరకుఁ గొనుచుఁ, బొమ్ము హరియింతుఁ బిదప నాబాలఁ దే వేను'

## మారీచుఁడు మాయలేడి యగుట

అని కర్తవ్యము మారీ, చునకున్ వాక్రుచ్చి దివిజసూదనుఁ డట దా
గెను బొదమాటువ నారులకుఁ, దనయునికి యెఱుంగనట్లు తత్సమయమునన్ 130

ఘనతటిచ్ఛపలతఁ గైకొన్నకందోయి యర్ధచంద్రుని గేరునట్టి నొసలు
చక్కనికొమ్ములు సిప్పకర్ణంబులుఁ గంబుసన్నిభమైన కంధరంబు
నిలువెల్లఁ బసిడియై వెలిఁగెడువెమ్మేను బలువన్నెరంగులు గలుగుపొడలు
వక్రత్వమదిలేక వరలెడువాలంబుఁ గరముఁబొంకములైన ఖురపుటములు
కలిగి యెవ్వరుఁ బూర్వమేకాలమందుఁ, జూడలే దిట్టిమృగమని చోద్యమందఁ
దాన సౌందర్యమునకెల్లఁ దావలమయి, లీల మారీచుఁడొక మాయలేడి యయ్యె 131

ఇట్లు మాయాకురంగమై యేగుదెంచి, రాముఁడును సీతయున్నట్టి రమ్యమైన
పర్ణశాలకురంగట బహుమనోజ్ఞ, గతుల విహరింపఁజొచ్చె నక్కజముదోప 132

దిక్కులఁ జెవులను నిక్కించి పరికించు వెంతయుజవమున నెగసిదుముకు
నేల మూర్కొనిచూచు వాలమల్లార్చును ఖురపుటముల వసుంధరనుద్రవ్వుఁ
గొమ్మలఁ గొమ్ములఁగ్రుమ్మి విరులరాల్చు పొలుపారు పచ్చనిపూరిమేయు
మౌనులకడఁజేరి మచ్చికతోనిల్చుఁ బొటి యూరములందు దూరిపోవు
కోరియొకవరిమృగములఁ గూడితిరుగు, వేరి యొకవేప నేకాకియై చరించు
మఱియు నిన్నిన్నియనరాని మహితగతుల, మహిజఁ బ్రేరేప విహరించె మాయలేడి133

దాని యపూర్వసౌందర్యంబునకు మెచ్చి సగ్గుణోపేత యా జనకజాత
యెదవిస్మయంబంది 'యియ్యది సామాన్యమగు కురంగశ్రేష్ఠమగునొ! లేక
యిలకు వినోదార్థ మేతెంచినట్టి యా విధుమండలంబున వెలయు మృగమొ?'
యని తలపోయుచుఁ దనకు దానివిఁ దెచ్చి యిమ్మని రామభూమీశు నడుగఁ
దత్ప్రియముసేయుపొంటె నాధరణివిభుఁడు, శాంతకడ ధీరు లక్ష్మణుఁ గాపువెట్టి
సాటిలేనట్టి శరములు మేటిధనువుఁ, బూని యాలేడినిం బట్టఁ దానువెడలె 134

మునుయజ్ఞమృగముఁ బట్టఁగ, వెనువెంటంజనిన కాలివిధమున రామా
[illegible] 135

సీ॥ పొదలలోపలడాగి పొదసూపకెలయించుఁ బొడసూపి పేరాస పుట్టఁజేయు
వెదురుగాఁజనుదెంచి 'యిదెచిక్కె' ననిపించు దొరకక వంచించి తొలఁగిపోవుఁ
మారిమేయుచునిల్చు భూపాలకుఁడు తన్నుఁ దరియఁగాఁ గన్గొని దాటులిడుచు
పట్టనకందక చుట్టుఁగ్రుమ్మరఁజొచ్చుఁ బెక్కులౌ సిలుగులు పెట్టికలఁచు
గీ॥ ధవుఁడు వెన్వెంటఁ బఱచుడుఁ దానుబఱమ, నృపతి నిట్టూర్చి శ్రమచేత నిలువ నిలుచు
మేఘపటలంబు విడివోని మెఱుపువోలె, మేదినీశ్వరు చెంతనే మెలఁగుచుండు 136

కం॥ ఈవిధమునఁ బట్టువడక, క్ష్మావిభు నలయింపఁజేసి కౌశలమున మా
యావియగు హరిణరాజం, భావనమునఁ గొసుచుఁబోయె నతిదూరముగన్ 137

గీ॥ దాని కపటచేష్టలఁగాంచి తరణివంశ్యుఁ, డది యసురమాయ కాఁబోలునని తలంచి
యాగ్రహముతోడ నాలేడి నగ్నివంటి, యొక యమోఘశరంబేసి యుర్విఁగూల్చె 138

గీ॥ అదియు మరణించుచుండి రామావనీశు, స్వరముఁబోలిన కృత్రిమస్వరముతోడ
'హా ప్రియా! సీత! హా లక్ష్మణా!' యటంచుఁ, బల్మరులు గొప్ప రోదనధ్వని యొనర్చె

శా॥ ఆ యార్తస్వర మంతి సీత పలుమా ర్లాలించి భీతాత్మయై
కాయంబంతయుఁ గంపమొంది చెమటల్ గ్రమ్మంగ ధమ్మిల్లముం
బాయం గ్రొవ్విరులెల్లరాల విలసత్పాదాంగదశ్రేణియున్
మ్రోయన్ లక్ష్మణుచెంతకుంబఱచి యశ్రుల్ గారఁగా నిట్లనన్ 140

మ॥ 'అనఘా! లక్ష్మణ! వింటివే? విమలుఁ డా యర్కాన్వయుం డేటికో!
ఘనలంబేర్కొని రోదనధ్వనులు పల్మార్లక్కటా! సల్పెడున్
వనమధ్యంబున తేనికెట్టి దొసఁగుల్ వాటిల్లెనో క్రూరమౌ
దనుజవ్రాతముచేత! వేగఁ జనుమా! ధాత్రీశు రక్షింపఁగన్' 141

సీ॥ అని పల్క సీతతో నాలక్ష్మణస్వామి యిట్లను 'నా రాఘవేశ్వరునకుఁ
గీడుమూడినదన్న క్షితియెల్లఁ గ్రుంగదే? యీ యేడువారిధు లింకిపోవె?
రాలవే చుక్కలు? వ్రీలవే కులగిరు? లొక్కచోటికిరావె దిక్కులెల్లఁ?
దలక్రిందుగావె పాతాళాదిలోకముల్? జలజగర్భాదులు నమసిపోరె?
గీ॥ తప్పఁదలఁచితి కాబోలుతల్లి! నీవు, జరుగదట్లెన్నటికి రామచంద్రుసాక్షి
మనల వంచింప మాయావి మఱియొవండొ, యిట్టి పన్నాగమును బన్నె నిదినిజంబు

మ॥ అది యట్లుండె ధనుస్సు రామవిభుహస్తాగ్రంబు నం దుండినం
గదనంబందు సురాసురాళి గెలువంగాఁజాల దా మేటి కా
పద లెవ్వేనియుఁ జెందనేర విదిగో వచ్చున్ భవద్వల్లభుం
డెద భీతిల్లకుమింక ధీరమతివై యీవుండుమా తల్లిరో!' 143

గీ॥ అని యనేకవిధంబుల నతఁడుచెప్ప, నపుడు కని తనకానన్న మగుటఁజేసి
వినక మరదిస్వభావ మావెలఁదిమిన్న, వేఁడిగానెంచి కరముఁ గోపించిపలికె 144

ఉ॥ 'అటవిలో నగ్రజుం డాపన్నిమగ్నుఁడై యార్తితో నినుఁబిల్వ నక్కటక్కట!
కరుణయించుకలేక కపటాత్మకుండవై పొమ్మని ప్రార్థింపఁ బోవనిచ్చ
లేక నాకేమేమొ సాకులుచెప్పెదు నీబుద్ధియంతయు వేడుతెలిపెఁ
దెనెబూసినకత్తి తీరునమెలఁగుచు నాభర్తమృతిఁజెంద నన్నునీవు
తే॥ భావమందునఁ బొందఁగావచ్చు ననుచుఁ, దలఁచినాడవుకాబోలు ఖలుఁడ! నీదు
తలఁపుకొనసాగ దీమేను జలవిషాన, లార్పణమొనర్తు నట్లేల యాచరింతు?' 145

## లక్ష్మణుఁడు సీత నొంటరిగా విడిచి రామునికడకు బయలుదేరుట

సీ॥ అనఁపుఁ డాసతి పల్కు లతిశాతశరములై తన్ను నొప్పింప నాధార్మికుండు
హరి! హరీ! యని చెవు లబ్జిమూసికొనుచు భూరిదుఃఖావేశమున ధరిత్రి
పైఁద్రెళ్ళి మూర్ఛిల్లి పదపడి తెలివొంది యిట్లుశోకించె నీ యింతినోటి
వెంట నవాచ్యముల్ వెల్వడె నేడేమి వింతలుపుట్టునో భీతికలిగె
తే॥ నిది మహాటని యొంటిగా నీమెనెట్లు, విడిచిపోవుదు? పోనిచో వెలఁదినన్నుఁ
దా శపించును పోదువా? ధారుణీశ, నానఁదప్పుదు నింకెట్లు లాచరింతు?' 146

కం॥ అని యా సుమిత్రకూరిమి, తనయుండిటు పెక్కుగతులఁ దర్కించి మనం
బునఁ గట్టకడకుఁ జనుటయె, తనకుచితం బనుచుఁదలఁచి ధరణిజ కనియెన్ 147

సీ॥ 'కడుభయంకరమైన కాననసీమలో నిన్నొంటిగావీడి నేను బోవ
నారామవిభుఁడల్లు నసురాళిచే నీకు ముప్పుగల్గునటంచు బుద్ధిఁదలఁచి
యరుగకయున్న నన్నక్కట! యేమేమొ యనరాని దుర్భాష లాడితమ్మ!
[illegible]

గీ॥ కోప ముపసంహరింపుము గుణశరధి!, పట్టుగొల్పుము ధైర్యంబు పరమసాధ్వి!
వేనిదేపోవుచుంటి భూజానికడకుఁ, దోడుకొనివత్తు దుఃఖంబు వీడుమమ్మ!' 148

గీ॥ అనిపలికి పర్ణశాలచుట్టును సుమిత్ర, పట్టి బరులేదు వ్రాసి 'యోవదిన! నీవు
వీనిదాటకు ఖలుఁడెవఁడైనఁగాని, దాటివచ్చిన మృతినొందుఁ దక్షణంబ' 149

చం॥ అనివచియించి దేవతలనందఱినిన్ సతిఁగాపుడంచు వె
మ్మనమునవేడి యా క్షితికుమారికకుం బలుమార్లు తామహో
వనతశిరస్కుఁడౌచు నభివందనముం గడుభక్తిఁ చేసి ఎ
య్యనవెడలెన్ సుమిత్రకొడు కగ్రజుచెంతకుఁ జాపహస్తుఁడై 150

## రావణుఁడు భిక్షుకవేషముతో సీతకడకు వచ్చుట

సీ॥ అంత వదేమంచియదనని తలపోసి యారావణాసురుం డక్కజముగఁ
గపటమునీంద్రుఁడై ఘనకుండి నొకకేల దర్భలునొకకేలఁ దాల్చ యఖిత
మహితరుద్రాక్షలు మఱియెన్నొపేరులు వ్రేలాడ జడలును గ్రాలుచుండ
ఫాలమునవిభూతి పతులంబు నెలకొల్పి జింకతోలొక్కటిఁ జంకఁబెట్టి
గీ॥ తనకు వచ్చియురాని మంత్రములఁగొన్ని, యుచ్చరించుచు మునులకు నొజ్జయనఁగ
బేసికన్నెచ్చటనొదాచిపెట్టి శివుఁడె, వచ్చెననఁ బర్ణశాలకుఏచ్చి నిలిచె 151

సీ॥ వానిని వీక్షించు మౌనీంద్రుగానెంచి జానకి తవదైవ మానసమున
నంభ్రమంబును భక్తి సందడింపఁగ నర్ఘ్యపాద్యముల్గొని విధి పట్టియూర్వ
ముంగిట సౌమిత్రి పొలుపార వ్రాసిన యేడు బయులు దాటి యేగుదెంచి
యా దొంగతపసిని నర్చింప నతఁడును ముదమొంది కలయ నప్పొలఁతిఁ జూచి
గీ॥ యాకరము లాచరణములు నానయనము, లాశచము లాకుచంబులు నాముఖంబు
మొదలయిన యంగముల యందమువకుమెచ్చి, యంగజోన్మాదుఁడై యిట్టులనుచు నడిపె

సీ॥ 'ఇలకు వినోదార్థ మేతెంచియున్న భారతివా! శ్రీసతివా! పార్వతివా! రతివా!
కాక మానవజాతి కామినులకునిట్టి యనమానసౌందర్య మలరియున్నె?
నారిజనేత్ర! నీ వేరాజుపుత్రిక వెవఁడునీపతి? నామమెద్దియొక్కొ?
కులమేది? నీవుండు స్థలమేదితెల్పుము? దండకాటవుల నీ యుండవేల?
గీ॥ యతిమృదుమకూలచీనిచీనాంబరములఁ, గట్ట కీ నారచీరలు గట్టవేల?
షడ్రసోపేతమధురభోజ్యములంతియు మెసవ కీ కంద[illegible]

సీ॥ అనవిని యతనితో నవనిజ యిట్లను 'మిథిలాపురంబేలు ప్రథితయశుఁడు
జనకుండు మాతండ్రి జానకియనియును సీతయనియు నన్నుఁ జెప్పుచుంద్రు
తనతండ్రి దశరథజనపతి పంపఁగాఁ బదునాలుగేండ్లు నాభర్తరాముఁ
డడవులవసియింప ననుజుండులక్ష్మణుఁ డేనును వెంటరా నేగుదెంచి

గీ॥ యిచట నివసించుచున్నార మీదినమున, లేడియొక్కటి మాకడ లీలఁదిరుగ
దానిఁదెమ్మని నేఁగోర ధవుఁడువోయెఁ, బిదప లక్ష్మణుఁ డధిపుఁడుపిల్వ వెడలె' 154

కం॥ అని తమచరితముఁ గృత్రిమ, మునికిన్ వాక్రుచ్చి 'మీదు పుణ్యచరితమున్
వినవేడుక నాకుఁగలిగె, వినిపింపు' డటంచు సీత వేడుటయుఁ దగన్ 155

సీ॥ ఆలేమ వేడికో లంగీకరించి యా విబుధారి తనగుట్టువిడిచి పలికె
'వినుము! మానిని! నేను వీరాధివీరుఁడ లంకాపురంబు నిశ్శంకతోడఁ
బాలింతు విశ్రవోబ్రహ్మకుమారుండ రావణబ్రహ్మను రాక్షసులకు
రాజునైయుండుదు రణరంగమున సర్వదిక్పాలురనుగెల్చి దిగ్విజయముఁ

తే॥ జేసియున్నాఁడ నాపేరుచెప్ప నెట్టి, వీరులైనను భీరులై వినతులగుదు
రింతయేటికిఁ? దారకలినశశాంకు, లస్మదాజ్ఞచే వర్తింతు రనవరతము 156

ఆ॥ ఓపడంతి! జగతి నెవ్వరుఁ, బ్రాపింపని వరములెల్లఁ బద్మభవునిచేఁ
బ్రాపించినాఁడ దపమున, నేపనిచేసినను విజయమే యగునాకున్ 157

సీ॥ ఈడులేకయె యింతివాడులే డననొప్పు వేడు మన్మథునకు నోడినిన్నుఁ
జూడగావచ్చితి సుందరి! నీరూపు కందోయికెంతయు విందుగూర్చెఁ
గరము దరిద్రుఁడుఁ గడుబక్కమానవుఁడైన రామునిఁగూడి యడవులందుఁ
గడగండ్లలోమున్గి గాసిఁజెందఁగవేల? నావెంట లంకకు నాతి! రమ్ము

గీ॥ నావనితలెల్ల నీదు సంసేవఁజేయ, నేను నీకనుసన్నల నెమ్మినడతు
సకలభోగంబు లందుచుఁ బ్రకటలీల, రాణివై యేలుకొమ్ము నారాజ్యమెల్ల' 158

తే॥ అనుచుఁ గామాకులస్వాంతుఁడై దశాస్యుఁ, డివ్విధంబునఁ బలుక నాయేణనయన
తనమనంబున జెదరక దైత్యుఁజూచి, యెంతయును గోపమేపార నిట్టులనియె 159

సీ॥ 'నిక్కఁపుబుషివని నిన్ను నేనోరోరి! భక్తితోఁ బూజింపఁ బాడిఁదప్పి
కడుసాధ్విననునన్నుఁ గామించి యేమేమొ కాఱులుప్రేలెదు కావరమున
నృపుఁ డేగుదెంచిన నీకావరమ్మడంచి నిశితశరాగ్నుల నిమురగింపు
నేనేడ? నీవేడ? నిర్జరయోగ్యమైనట్టి పురోడాశ మవనిఁ గుక్క

గీ॥ యభిలషించినకరణి నీవరయఁగోరి, తదిలభించునె? కరమడియాపగాక
ఋద్ధిహీనుఁడ! యింక నాబుద్ధివిని పు, రమునకేగుము రాఘవుల్ రాకమున్నె' 160

మ॥ అనుఁడారావణుఁ డామెపల్కులకుఁ గోపాటోపసందీప్తుఁడై
తననైజాకృతిఁజూపె వింశతిభుజాదండంబులున్ నీలమే
ఘనిభంబై తనరారు నున్నతమహాకాయంబు భాస్వద్దశా
ననముల్ దారుణదంష్ట్రలుంగలిగి నానాభూషలున్ రాజిలన్ 161

## రావణుఁడు సీతను రథముపై నిడుకొని పోవుట

సీ॥ ఆరక్కసుని భీకరాకారమునుజూచి భీతయై యాసీత వివశయగుచుఁ
గత్తిచేనఱికిన కదళికచందాన భూమిపైఁబడి గాఢమూర్ఛనొందె
నప్పుడు దశకంఠుఁ డబ్జాక్షినింబట్టి తనరథంబున నిడుకొని ముదమున
సత్వరగమనుఁడై చనఁగాఁ దొడంగినఁ గొండొకవడికి మేల్కొని లతాంగి
గీ॥ ద్రోహియును జోరుఁడగువాని దూఱుచుఁదన, కాయరణ్యములో నెవ్వరైనఁ నుందు
రేమొ రక్షకులని మదివెంచి పెద్ద, యెలుఁగుదోపఁగ విట్లని యేడ్వసాగె 162

శా॥ 'ఘోరాకారుఁడు గామరూపుఁడు మహాక్రూరాత్ముఁడౌ రావణుం
డారామక్షితినాథుదేవివగు న న్నన్యాయమార్గంబునం
జోరుండై కొనిపొవుచుండె మఱి యిచ్చోరక్షకుల్ గల్గినన్
రారే! మ్రొక్కెద నీవిపన్ననిఁక సంరక్షింపఁ బుణ్యాత్మకుల్ 163

శా॥ విన్నారో! మఱి నామొఱం! జెఱను దప్పింపం బ్రయత్నించువా
రున్నారో! యెవరైనఁ బుణ్యమతు లీయుగ్రాటవిన్ లేరొ! నా
కన్నుందోయికి నొక్కరైన నకటా! కాన్పింపరే దైవమా!
యెన్నన్ నాకు శరణ్యమేది? యిఁక నేనెట్లి వెతింబాయుదున్'' 164

శా॥ అన్నా! లక్ష్మణ! బుద్ధిహీననయి నిన్నట్లేను దూషించితిన్
నన్నున్ మన్ననసేయు మాఫలముఁ బొందంగంటి నేనిత్తఱిన్
నన్నింకం గినియంగఁబోకుము చెఱందప్పింప వేవేగ నీ
యన్నందోడ్కొనిరమ్ము తత్పరుఁడవై యార్యా! సుమిత్రాత్మజా! 165

ఉ॥ నిన్నుఁబరాభవించి యవినీతిపరుండయి నీదుభార్యనా
నన్నొకరక్కసుండు నరనాయక! తాఁ జెఱఁగొంచుఁ బోయెడుం
గ్రన్ననరాగదే! నిశితకాండపరంపర వీనిఁదున్మి యా
పన్నను నన్నుఁగావఁగదె పంకజలోచన! రాఘవేశ్వరా! 166

శా॥ హారామా! సుగుణాభిరామ! సదయా! యాలించితే నామొఱల్?
ఘోరారణ్యమునందు దానవులు నాకుంబోలె నీకేవిప
ద్వారంబుల్ ఘటియిల్లఁజేసిరాగదా! బల్మిత్తియైవచ్చి యా
క్రూరంబౌ హరిణంబుకట్టి! మనసింం గూర్చెన్ వియోగవ్యథల్' 167

## జటాయువు రావణునితో యుద్ధము చేయుట

సీ॥ అని మఱియును సీత యడవిలోపలఁగల తరుగిరిమృగపక్షితతులఁగూర్చి
పేర్కొని పేర్కొని పెద్దయెలుంగన నాయరణ్యము మాఱుమ్రోయునట్లు
తనపోక రామభద్రునకుఁజెప్పరె యంచుఁ బలుమార్లు పలవింపఁ బక్షినాథుఁ
డైన జటాయు వా యాక్రందనమువిని యమృతవేగుఁడై యాక్షణంబ
గీ॥ పక్షసంజాతభీకరవాతధూత, సకలవనలతాతరు గండశైలుఁడగుచు
నచటి కరుదెంచె భయదాట్టహాసరావ, కలితదిగ్భాగుఁడై దశకంఠుఁ డడల 168

గీ॥ ఇట్లు విహగాధినాయకుఁ డేగుదెంచి, యాసతిని రామసతిగాగ నాత్మనెఱిఁగి
రోషతామ్రాక్షుఁడై జగద్ద్రోహియైన, యాదశాస్యునిఁజూచి యిట్లని వచించె 169

శా॥ ''ఓరీ! దుర్మతి! రాముదేవియగు నీ యుత్ఫుల్లపద్మాక్షినిం
జోరత్వంబునఁ గొంచుఁబోవ మది నీసౌమ్మంచుభావించితే?
సారోదంచితసద్గుణాఢ్యయగు నీ సాధ్వీలలామంబునుం
గ్రూరా! వీడుము లేకయున్ననిఁక నీకున్ ముప్పు వాటిల్లెడున్ 170

శా॥ వీరాగ్రేసరుఁడస్ మహాద్భుతసమిద్విద్యాప్రవీణుండ దు
ర్వారోద్యద్బలవిక్రమాఢ్యుఁడ సదాబంటన్ రఘుస్వామికిస్
రారమ్మోరి! జటాయువంద్రునమ సంగ్రామంబునన్ నిన్ను గం
భీరోగ్రాశనితుల్యబంచుహతులన్ వేధించి సాధించెదన్'' 171

కం॥ అని రథనిరోధియై యా, యనుపమసత్త్వుఁడు జటాయు వావిధమునఁ బ
ల్కిననపలుకు లెలవిని య, దనుజవిభుం డమితరోష దరోద్ధతుఁడై 172

చం॥ ఒకపదిచేతులందుఁ జటులోగ్రశరాసనముల్ ధరించి వే
రొకపదిచేతులన్ శితశరోత్కరముల్ పరగింపఁ బాఁగుడుం
బ్రకటబలాఢ్యుఁ డావిహగభర్త తదీయశరోరువృష్టికిన్
వికలుఁడుగాక నిల్చి పటువిక్రమసంపద సొంపుమీరఁగన్ 173

సీ॥ తనపక్షసంజాతతతమహానిలమునఁ దూలఖండములట్లు తునిసిపోవ
నాతూపులంతంత నతిమతిఁదెరలించి కనుఁగవఁ గోపాగ్నికణము లురుల
నారక్కసునిమీఁది కక్కజంబుగదూకి తన్మస్తకంబులఁ దన్నుటయును
మకుటపంక్తులుడొల్ల మతిరక్తమొలుకంగి దశకంఠుఁ డాగ్రహోదగ్రుఁడగుచు
గీ॥ 'నోరిపక్షీంద్ర! నిలు' మని పౌరుషోక్తు, లాడుచున్ శూలతోమరాద్యతులమలగు
పేరుగల సాధనంబులు పెక్కు లాఖ, గేంద్రుపైఁ బ్రయోగించెను సాంద్రముగను 174

చం॥ అవి చనుదెంచి కొన్ని తనయంగముగాడఁగ నాటినన్ జటా
యువు కడునొచ్చి రక్తచయమబ్బగ రోషకషాయితాక్షుఁడై
జవమున మీఁదికింబఱచి చంచుపుటంబున విండ్లఁదున్మి యా
దివిజవిరోధి యాస్యములు తీవ్రపఖంబులఁ జీరెఁ జీరినన్ 175

గీ॥ వాడు ముఖముల నెత్తురువరదలగుచుఁ, బొం చుండఁగి నొక్కింత పరవశుఁడయి
యట్టిటులిపోల నాలోన నాఖగపతి సారథిన్ గుఱ్ఱములఁ జంపి తేరుఁ గూల్చె 176

సీ॥ విరథుఁడై వాడంత ధరణిజఁగొని మింటి కెంతయుజవమున నెగసిపోవ
వెంటనంటి విహంగవిభుఁడు 'నీచోరోరి! యెందుబోయినను నే నందువత్తు
నీపీచమడఁతును వెలఁతనువిడికింతు' ననుచు వీరోక్తుల నాడుచరిగి
పలలాశనాథము వడి నిల్వరించిన మతిచేయునదిలేక మగుడవాడు
గీ॥ మహికిదిగి యాగ్రహంబు ముమ్మరముగాఁగ, మహితనయ నొక్కచోడించి మహితనిశిత
మండలాగ్రహస్తుండయి మల్లయుద్ధ, మునకుఁ గడఁగెను వమ్మెటిపులుగుతోడ 177

చం॥ కరియుగళంబుమాడ్కి, నుదకాసరయుగ్మముపోల్కి, ఘోరకే
సరియుగళంబుభాతి నఖచంచుపుటాయుధుఁడౌచు నాఖగే
శ్వరుఁడును, ఖడ్గపాణియయి పంక్తిముఖుండును ధీరతం బర

ఉ॥ పాయుచు డాయుచున్ బలిమిఁబట్టుచుఁ ద్రోయుచు నట్టహాసముల్
సేయుచు వెచ్చనూర్చుచును జేవదలిర్పఁగఁ బెక్కు తాడనో
పాయములం బరస్పరము భంజితులౌచును మూర్ఛలొందుచుం
బాయక వెండిలేచుచును బంటుతనంబునఁ బోరి రిర్వురున్ 179

గీ॥ ఇట్లు రక్తసిక్తాంగులై యేపుమీరఁ, బెద్దయునుఁబ్రొద్దుఁ బోర నవ్విబుధవైరి
యతులమాయాబలంబున నదృశుఁడగుచు, విహగవరుమాయలంబన్ని వికలుఁజేసి 180

## రావణుఁడు జటాయువు తెక్కలను ఖండించుట

మ॥ అడిదంబున్ ఝళిపించి రావణుఁడు శౌర్యప్రాభవోద్దాముఁడై
కడువంచించి తదీయపక్షయుగమున్ ఖండించె ఖండించినన్
వడి రక్తౌఘము కాల్వలౌచుఁ బ్రవహింపం బక్షినాథుండు తాఁ
బుడమింగూలెను వజ్రదారితనగంబుంబోలె నుగ్రాకృతిన్ 181

ఉ॥ అప్పుడు సంతసించి దనుజాధిపుఁడెంతయుఁ గుందుచున్న యా
కప్పురగంధి నెత్తికొని ఖండితశాత్రవులైన రాఘవుల్
తప్పక వెంటవత్తురని తాఁబరికించుచు శంకితాత్ముఁడై
యుప్పరవీధియందుఁ జనుచుండఁదొడంగె మహాజవంబునన్ 182

సీ॥ ధరణీతనూజయు తనమనంబుననింకఁ జెఱవిడిపించి రక్షించువార
లెవ్వరులేరని యెంచి నిరాశచే దిశలుప్రతిధ్వనుల్ దెలుప నార్త
రావంబుసేయుచుఁ బోవుచో ఋష్యమూకంబను నొకగిరి కానుపింప
నందు సుగ్రీవాదులైన వానరులేవురుండుట గనుఁగొని యుత్పలాక్షి
గీ॥ వారలేనియుఁ దనపాశవల్లభునకుఁ, జెప్పఁగలరేమొ యనునానఁ జేసి నగలు
దీసి చీరచెఱఁగున బంధించి మూట, వారిముందరఁబడవైచె వామనయన 183

గీ॥ వారినుం దమమనముల వారిజాక్షి, యంతరిక్షంబునందున నరుగుచుండి
యూనగలమూటవైచుట కబ్బురపడి, దానినింగొని దాచిరి తక్షణంబ 184

కం॥ దుర్ణయుఁడగు రావణుఁడటు, పూర్ణేందునిభాస్యఁ గొనుచుఁ బూర్ణముదమునం
దూర్ణమ శతయోజనవి, సీర్ణంబగు కడలిదాటి చేరెన్ లంకన్ 185

సీ॥ చేరి యందలిధనాగారంబులును బెక్కుధాన్యశాలలు మహోద్యానములును
భర్మహర్మ్యంబులు బహుచిత్రగేహముల్ చతురంగశాలలు సౌధతతులు
పుష్పకాదివిమానపుంజంబుఁ దాఁజెఱఁబట్టి తెచ్చిన సురపన్నగాది
కాంతలు నాదిగాఁగల వన్నివేర్వేఱఁ వేర్కొనిసతికిఁ జూపించిపలికె
గీ॥ 'వెలఁది! నీభాగ్య మేమందు? వీనివెల్ల, నీయధీనంబుఁగావింతు నేను నీదు
పాదసేవారతుండనై బ్రదుకుచుండు, నాయభిమతంబుఁ దీర్పుము నళిననేత్ర!' 186

సీ॥ అనవుఁ డాసతి వానిఁగవఁబోక యొకతృణఖండంబుఁగైకొని కనలిపలికె
''ఓరి! రావణ! నేను శ్రీరాము వాఙ్మనఃకాయకర్మంబులఁ గరమునక్తిఁ
దెన్నార సతతంబు సేవింతునేకాని నీపుచెప్పెడునట్టి నిరుపమాన
భోగంబులొల్ల నీ పొందంతకునువొల్ల వెడగ! నీదుర్భాష లుడుగుమింక
గీ॥ బ్రదుకఁదలఁతేని నన్నుభూవల్లభునకు, నొసఁగి శరణంబువేఁడు మాయురుకృపాళుఁ
డరయరక్షించు లేదేని నర్కకులుఁడు, నిన్ను నీవారి నందఱ నిర్దహించు' 187

సీ॥ అనిపల్కుటయువిని యారావణాసురుం డాగ్రహంబొదవ నిట్లనుచు నుడివె
'సకలదిగ్జేతను బ్రకటబలాఢ్యుఁడ నాకొక బక్కమానవునిఁ జెప్పి
వెదిరింపఁజూచెదు వెలఁదిరో! వారెంతవారు? నాలంకకు వచ్చిరేనిఁ
బట్టిచంపనె? నిన్నుఁబట్టిభోగింపనే?' యని పౌరుషములాడి యాక్షణంబ
గీ॥ తన యశోకవనమున నాతరుణినునిచి, త్రిజటమొదలైన దానవస్త్రీలఁ జీరి
'కొమ్మ నాకెట్టులైననుఁ గూర్పు' డనుచుఁ, బలికి తద్రక్షణార్థంబు వారినుంచె 188

## రామలక్ష్మణులు తిరిగి పర్ణశాలకు వచ్చుట

సీ॥ అట రాఘవేశ్వరుం డామాయలేడిని వధియించి వెనుకకువచ్చుచుండ
నక్కలుగూయుట నళినాప్తబింబంబుమాయుట గ్రద్దలు మఱి తలపయి
నాడుటయును మొదలగుదుర్నిమిత్తముల్ తనకష్ట పొడసూపఁ దరణికులుఁడు
తనచిత్తమునఁ గడువనరుచు నెదురుగాఁజనుదెంచుచున్న లక్ష్మణునిఁ గాంచి
గీ॥ తా మతింతభీతిల్లి యారాముఁడనియెఁ, 'దమ్ముఁడా! యేల నాయాజ్ఞఁ దప్పితీవు?
తరుణి నొంటిగవిడిచి రాఁదగునెనీకు?, నియ్యడవి రాక్షసులదాట యెఱుఁగవొక్కొ' 189

సీ॥ నావినిసౌమిత్రి నరనాథచంద్రుతో వెంతయు భీతిల్లి యిట్టులనియె
'ఓరామచంద్ర! నేనొంటిగా వదినను వీడియేతెంచుట కూడదైన
నొకపల్కువినుడు మీరురుచాపహస్తులై హరిణంబుఁబట్టంగ నరుగుటయును

॥ జనకనందన యా యార్తశబ్దమువిని, కలఁగి మీశేమొ యాపదకలిగె ననుచు
నన్ను మీకునొసటగఁ బొమ్మన్న నామె, భీతివాయఁ దెల్పితిని మీపెంపదెల్ల 190

॥ కాని యాయె నాపల్కులు తానువినక, 'యరుగుమీవన్న నరుగవా' యనుచుఁ గినిసి
నన్ను వినరాని దుర్భాష లెన్నొపలుక, నింకఁదడయరాదని మదినెంచినేను 191

॥ పర్ణశాలచుట్టు వసుధేశ! బరులేదు, వ్రాసి వానిఁ దాటవలదటంచు
వదినతోడఁ జెప్పివచ్చితి నాతప్పు, గావుమప్ఘ! రామ! కదనభీమ!' 192

॥ అని బాష్పాకులలోచనుండయి తదీయంబైన పాదద్వయం
బునకున్ శీర్షముసోక మ్రొక్కుచుయు నా భూమీశుఁ డాలక్ష్మణుం
దనహస్తంబుల లేవనెత్తి పలికెం 'దా బేలయై సీత యా
డినదుర్భాషల కీవు నోవకుము నీడెందంబునం దమ్ముఁడా!' 193

॥ అని యుపలాలించి యా రాముఁడనుజుతో వెండియు నిట్లను 'విను గుణాఢ్య!
మాయామృగంబట్లు మద్బాణహతిఁగూలి నావలె నార్తి వాపోపుటయును
మృదువాణియైన యా మేదినీసుతనోటివెంట నశ్లీలముల్ వెల్వడుటయు
గ్రద్దలాడుటయు నాకమలాప్తబింబంబు మాయుట నక్కలు గూయుటయును
॥ జూడ నీదుర్నిమిత్తముల్ కీడదేదొ, మనకు సూచించుచున్నవి మనము జేయి
వెట్టికలఁచినయట్లాయెఁ గట్ట! నాకు, సరగఁ బోదముపద పర్ణశాలకింక' 194

॥ అని వేగమె తమయాశ్రమ, మును డాయఁగవచ్చి యదియు మునుపటివలె లే
కనుపమకాంతివిహీనతఁ, దనరుటఁగని రాముఁడదలి తమ్మున కనియెన్ 195

॥ 'సతతంబుఁ బఠియించు శ్రుతిపాఠచయమును సంయముల్ నేడేల చదువరొక్కొ?
కర్ణోత్సవంబుగాఁ గాకలీస్వనములఁ బక్షులునేడేలఁ బలుకవొక్కొ?
సంతతవ్యోమసంఛాదిత ఘనహోమధూమంబు నేడేల తోపదొక్కొ?
ఆవులు దూడలు 'సంభా' యటంచును శబ్దముల్ నేడేల సలుపవొక్కొ?
। చూడనిర్జనమై కాంతిశూన్యమగుచు, నుండె నీపంచవటి యిటులుండనేల?
హేతువేమయియుండునో యెఱుఁగరాదు, తమ్ముఁడా! నాకుఁ గడుభయోత్పాత మొదవె'

॥ అని చింతాక్రాంతుండై, ఘనుఁడగు లక్ష్మణునితోడఁ గడురయమున న
య్యనవసన్నిభుండు దశరథ, జనపతినందనుఁడు పర్ణశాలకు వచ్చెన్ 197

## రాముఁడు పర్ణశాలయందు సీతలేకుండుటచూచి శోకించుట

సీ॥ వచ్చి కీరములేనివరపంజరముపోల్కి, రజనీకరుఁడులేనిరాత్రిమాడ్కి
శూన్యమై యత్యంతశోభారహితమైన పర్ణశాలనుఁజొచ్చి పడఁతినందుఁ
గానక భీతిల్లి తానును దమ్ముండు నందందరోసియు నచటిమునుల
నడిగియు నెందును నతివపోయినపోక పొడఁగానకధిపుఁడు బుద్ధికలఁగి
గీ॥ ఘోరదుఃఖభరము తన్నుఁబొందుటయును, గాఢమూర్ఛమునింగి లక్ష్మణుఁడుసేయు
శీతలోపచారంబులఁజేసి కొంత, తెలివిఁగని యిట్లు పలవింపఁదివిరె నృపుఁడు 198

గీ॥ 'అకట! మనలను వంచించి యసురుఁడెవఁడొ, ఎలిమిఁ జెఱఁగొనిపోయె నాపంకజాక్షిఁ
దమ్ముఁడా! యింక నెక్కడిధరణితనయ?, భార్యఁబాసిన నెక్కడిబ్రదుకు నాకు? 199

సీ॥ ఏకాంత ముఖచంద్రు వీక్షించి నానేత్రకుముదంబులు సఫలత్వము వహించు
నేపల్లవోష్ఠి సల్లాపామృతముసోక వీనులవిందుఁ గావించుచుండు
నేసాధ్వి సౌందర్యసారమునఁదోగి నామనోహంస మానందమొందు
నేయింతి సాంగత్య మీయరణ్యావాసమే యింద్రభోగమై యెసఁగుచుండు
గీ॥ నట్టి జానకి సుగుణరత్నాంబురాశి, కులపవిత్ర పతివ్రతాతిలక యకట!
లేకయుండిన లక్ష్మణా! నాకుమేనఁ, బ్రాణములునిల్వనేర్చునే పాసిపోక? 200

సీ॥ మాయామృగమునేఁడు మనపాలికేతెంచి యెలమిమై విహరింపనేలయొక్కొ?
విహరించినంతనే వెలఁదిదానినిఁదేరఁ బ్రియమార నన్నుఁ బ్రార్థింపనేల?
ప్రార్థించెఁబో నేను బాణముల్విలుఁగొని హరిణంబుఁబట్టంగ నరుగనేల?
యరిగినంతనె దాని దొరకలేదనియల్గి క్రూరబాణంబేసి కూల్పనేల?
గీ॥ కూలెఁబోయది నాయట్లఘోరభంగిఁ, జెలఁగి కపటార్తరావంబు సేయనేల?
చేసెఁబో యదిభీతిల్లి సీతనన్నుఁ, బొమ్మనఁగనేల? తాఁ జెఱఁబోవనేల? 201

గీ॥ సకలగీర్వాణగణములు సంస్తుతింప, జగతినెవ్వరు మోపెట్టఁజాలనట్టి
గరళకంఠుని సుమహితకార్ముకంబు, విఱుచుటలు ధారుణీసుతకొఱకుఁగాదె? 202

చం॥ పదియును నాలుగేండ్లు వనవాసముచేసి యయోధ్య కెమ్మెయిం
బదపడి పోవనేర్తు? ననుఁ బౌరులుగన్గొని 'సీతయే' దనన్
బదులు మతేమిచెప్పఁగలవాఁడను వారలతోడ? నింకనే
బ్రదుకుటయెట్లు భూమిపయి భార్యనుఁగోల్పడి నిందితుండనై?' 203

సీ॥ అని యనేకవిధంబులను విలపించుచు 'సురతిని మీరైనఁ జూపు' డనుచుఁ
బల్మరుల్ తరుమృగపక్ష్యాదులనుగూర్చి పేర్కొని యడుగుచు వెళ్లివాని
చందంబుఁదోప 'హాజానకీ! వచ్చితే? యిటురమ్ము నినుఁబాసి యెటుసహింతు?
సరసోక్తులాడుము హరిణచర్మము నీవుతెమ్మన్నఁ దెచ్చితిఁగొమ్మ! కొమ్మ'
గీ॥ యని యసందర్భవాక్యంఋ లాడుకొనుచు, నంతకంతకు మితిమీరి యడలుచున్న
భూతలేశునిఁ గన్గొని బుద్ధిశాలి, యైన లక్ష్మణదేవుఁ డిట్లనుచునుడివె 204

గీ॥ 'ప్రాజ్ఞుఁడవు సర్వవిధశాస్త్రపారగుండ, వన్న! దుఃఖించెదేల నీ వజ్ఞునట్లు?
లెమ్ము ధీరుఁడవగుచు రారిమ్ము వదిన, నిపుడవెదకుద మిమ్మహావిపినమందు' 205

## రామలక్ష్మణులకు జటాయువు సీతవార్త నెఱింగించుట

కం॥ అని యయ్యిద్దఱు సోదరు, లనుపమభుజబలులు దక్షిణాభిముఖముగం
జని రక్కాననమునఁఎడి, జనకక్ష్మాధీశతనయ జాడసరయుచున్ 206

కం॥ చెట్టులనక ఫుట్టలనక, గుట్టలనక కోనలనక గుహలనక కడున్
దట్టపుఁబొదలనక పుడమి, పట్టిని వెదుకంగడఁగిరి వనినెల్లెడలన్ 207

ఉ॥ ఇక్కరణిన్ మహీపతులు మహీసుతరోయుచుఁ బోయిపోయి తా
రొక్కెడ మున్ను రావణశితోగ్రకృపాణవిభిన్నపక్షుఁడై
యుక్కఱి నేలమీదఁబడి యుత్కటదారుణవేదనాహతిం
జిక్కి తపించుచున్న మహనీయు జటాయువుఁజూచి డాసినన్ 208

చం॥ అతఁడును వారిఁగాంచి 'మిహిరాన్వయమండనులార! నేను మీ
పితృసఖుఁడన్ జటాయువను పేరువహింతు వినుండు జానకిన్
వితతబలుండు దైత్యకులనేత దశాస్యుఁడు రావణుండు గ
ర్వితమతి ముచ్చిలించుకొని వీతభయుండయి పోయెఁ దావెసన్ 209

కం॥ ఆరాక్షసేశ్వరునితో, దారుణయుద్ధంబునలిపి తత్ఖడ్గముచే
దారితపక్షుఁడనై యిటు, ధారుణిపైఁగూలివాడ ధార్మికులారా! 210

ఆ॥ అఖిలలోకపూజ్యులగు మిమ్ముఁగనుఁగొంటిఁ, బావనుండనైతిఁ బాసెభవము
నే నసువులనింక నిశ్చింతగాఁద్యజిం, చెదను మీరు సతినివెదుకఁ బొండు' 211

సీ॥ అనుచు గద్గదకంఠుఁడై పక్షినాథుండు వసుధేశులకు సీతవార్తఁదెలిపి
మతిలంకకుంబోవు మార్గంబదేదియో యెఱిఁగింపకయె శక్తిహీనుఁడగుచు
నృతిఁదప్పి యర్ధనిమీలితనయనుఁడై యభ్లజీవముఁబాసి యందెముక్తి
నా రామలక్ష్మణు లంతజటాయువు మృతకళేబరమును జితిపయినిడి
గీ॥ యనలసంస్కారమొనరించి యతనిమృతికి, నార్తిఁజెందుచు నావల నడవిలోన
జనకజాన్వేషణార్థులై చనుచునుండ, నొక్కచో భానుకులులకు వక్కజమగ 212

## కబంధవధ

సీ॥ యోజనాయతబాహుఁ డురమందుఁగన్నులు కడుపులోపలఁదల కలుగువాఁడు
భంజితప్రాణికబంధుండుఁ బ్రిదశనిర్బంధుండు సమితగర్వాంధుఁ డైన
ఘనుఁడు కబంధుఁడన్ దనుజుండు పొడసూప సౌమిత్రితో రఘుస్వామిపలికెఁ
'దమ్ముఁడా! దనుజుల ధరవెంటజీనొకంటి మిట్టివికృతరూపు వెన్నఁడైనఁ
గీ॥ జూచియుంటిమె?' యని కడుఁజోద్యమంది, వానిపైవారు బాణముల్ వఱపుటయును
వానిలెక్కింపకసురుండు బాహుయుగము, సాచి యామిషార్థియై లక్ష్మణునిఁబట్టె

సీ॥ పలలాశనుని బాహుపంజరంబునఁజిక్కి యాలక్ష్మణుఁడు కంబు కాలపాశ
బద్ధుఁడై దుఃఖించు ప్రాణిచందంబున విడివడవేరక కడుఁదపించి
'హారామ! నీకునాకకట! ఋణానుబంధము నేటితోఁదీరె'దానవునకు
నాహారముగనన్ను నర్పించి నీవైనఁ దప్పించుకొనిపొమ్ము ధర్మహృదయ!'
గీ॥ యనుచు నాక్రందనముసేయ నర్కకులుఁడు, తమ్ము దురవస్థకెంతయుఁ దామువగచి
కన్నుఁగవనుండి విస్ఫులింగములురాల, దానవునిపైన నాగ్రహావగ్రుఁడగుచు 214

చం॥ తనయొరమండి తక్షణమె దారుణశాతతరాసిదూసి యా
కొని హరింణుఁబొదుమకు కోల్పులికైవడి వానిపైకి లం
ఘనమొనరించి తక్కరయుగంబు కఱుక్కునఁదున్మివైచి త
మ్మునివిడిపించె రామనృపముఖ్యుఁ డపారకృపాంబురాశియై 215

చం॥ విదళితబాహుఁడై మదమువీడి కబంధుఁడు తెల్వినొంది దు
ర్మదరిపుజేతయైన రఘురాముఁగనుంగొని 'మీరలెవ్వరో?
విదితముసేయు, డన్న నరపుంగవధామయతచారునేత్రుఁ డా
త్రిదశవిరోధికిన్ దనచరిత్రమునంతయుఁజెప్పెఁ దెలిసన్ 216

కం॥ విని యాకబంధుఁడప్పుడు, తనకమితజ్ఞానమొదవఁ దగనిట్లనియెన్
'దనువనుదివ్యుఁడ మత్కథ, వినిపించెద వినుము రామ! విక్రమధామా! 217

సీ॥ కాంచనగర్భుచేఁ గామరూపంబును చిరకాలజీవిత్వసిద్ధి నొంది
యీ దానవాకృతియే పూని నేఁదొల్లి గర్వించి తాపసాగ్రణులనెల్ల
బాధించుచుండ నాపైనగ్గి స్థూలశిరుండనుమునినాయకుండు నాకు
'నిట్ల రాక్షసుఁడవై యీవెల్లకాలంబునుండు' మనుచు శాపమొసఁగె దాని
గీ॥ కేను భీతిల్లి ప్రార్థింప మౌనివరుఁడు, వెండియున్ దయాశాలియై 'చండకిరణ
వంశమండనుఁడగు రామువలన నీకుఁ, బాయు నాశాప' మనిచెప్పెఁ బార్థివేంద్ర! 218

సీ॥ నాటినుండియు నేను నక్తంచరుండనై యుండితి నేటికి యుష్మదీయ
కారుణ్యమునఁజేసి తీరెనాశాపము మునుపటితనువింకఁ బొందువాడ'
ననిచెప్పి వెండియు నాకబంధుఁడుపల్కె 'ననఘాత్మ దానవులందఱివలెఁ
గాక నేనిట్లుండఁగా హేతువేమన మదముననాజికి మఘవుఁడీర
గీ॥ నతఁడు కోపించి పవిచేత నస్మదీయ, శిరముఖండించి ఘనమహోదరమునందుఁ
జేర్చి యిట్లువిరూపిగాఁ జేసినాడు, గర్వమొక్కింత యుడిపె నిక్ష్వాకుతిలక! 219

చం॥ అనవిని రాముఁడద్భుతమునంది కబంధునిఁజూచి పల్కె 'నో
యనుపమసద్గుణాఢ్య! విబుధారికులాధిపుఁడైనయట్టి యా
ఘనభుజశక్తియుక్తు దశకంఠుఁడెఱుంగుదె? తెల్పు' మన్న న
య్యసమునుఁడు దివ్యుఁడిట్లనియె నర్కకులోత్తముతోడ నమ్రుఁడై 220

సీ॥ 'మునిశాపవశమునభూపాల! యీదేహమున్నంతవఱకు నా కుండదెఱుక
కావున దీనినిఁగడఁగి దహింపుడు తొంటిదివ్యాకృతితోఁచు మఱల
సంపూర్ణమైన విజ్ఞానోదయముకల్గు నప్పుడా రావణు నద్భుతమగు
చరితంబు నీకు నేసర్వంబెఱింగింతు' నని పల్క రాఘవు లాక్షణంబ
గీ॥ తమ్మహాదేహ మగ్నిదగ్ధంబుచేసి, రంత ఘనవిమానారూఢుఁడై కబంధుఁ
డొక్కదివ్యపురుషుఁడయి యొసరఁదోఁచి, యినకులేశ్వరువీక్షించి యిట్లులనియె 221

సీ॥ 'పదితల లిర్వదిబాహువుల్ కలవాడు భయదరాక్షసకోటిపరివృతుండు
భండనంబున దిశాపతులగెల్చినవాడు బ్రహ్మచే వరములఁబడిసినాడు
బలసంపదలచేతఁ బ్రబలుఁడైయున్నాడు పాపకార్యములకు భైరవుండు
బహుళమాయాతంత్రపండితశ్రేష్ఠుండు భయరహితుండయి పగగునాతు

గీ॥ భవ్యనూతనసౌఖ్యాబ్ధిపారగుండు, పరమదీర్ఘాయురారోగ్యభాగ్యయుతుఁడు
ప్రకటలంకాధిరాజ్యసంపాదకుండు, ప్రాభవాటోపకలితుఁ డా పంక్తిముఖుఁడు' 222

కం॥ అని రావణునిప్రభావము, ఘనముగ వాక్రుచ్చి మఱియు గర్వితరిపుకా
ననదావపావకులయిన, యినవంశ్యులతోడ నాతఁ డిట్లనిపలికెన్ 223

కం॥ 'ఆవక్తంచరుఁడు మహా, సేనాసహితుండు మీరు సేనారహితుల్
వానిని జయింపరాదటు, గాన యెఱింగింతు వినుఁడు కర్తవ్యంబున్ 224

సీ॥ అవనీశ! యిచ్చటి కనతిదూరమునందు ఋష్యమూకమను మహీధరంబు
కల దందు రవిజుండు ఘనుఁడు సుగ్రీవుఁడం గపిరాజు కలఁడు విక్రమకలాపుఁ
డతనికిఁ గపిసైన్య మగణితంబైయుండు నీవట కేగి సుగ్రీవుతోడఁ
జెలిమిఁగావింప నీచేదశాస్యుఁడు పోరజితుఁడగు సతినీవు చెందనేర్తు'
ఆ॥ ఎని వచించి నృపతి కా ఋష్యమూకగి, రీంద్రముచకుఁ ద్రోవనెఱుఁగఁజేసి
మఱియు లంక కేగు మార్గంబుచుండెల్పి, యిటులనియె దివ్యుఁ డినకులునకు 225

సీ॥ 'పంపాసరోవరపశ్చిమతటమున ఘనుఁడు మతంగుఁడన్ మునివరేణ్యు
పుణ్యాశ్రమము లోకపూజ్యమైవిలసిల్లు నచ్చటి కేగుము సచ్చరిత్ర
కలితజటాబంధ శబరి యాశబరి నిం బూజించు నని చెప్పి భూపిభులకు
నానతుఁడై దివ్యుఁ డాత్మేచ్ఛఁ బనివినె సంతనారాఘవు లచటినుండి
గీ॥ యా కబంధుని యాదేశమంది వరమ, యోగిగణసంతతావాసయోగ్యమగుచుఁ
గన్నుఁదోయికిఁ బండువై క్రాలుచున్న, యమ్మతంగాశ్రమముకడ కరుగుటయును 226

కం॥ ఆశబరి భక్తిదోపఁగ, దాశరథులకెదురువచ్చి తత్పదములకుం
దాశిరమువంచి మ్రొక్కిద, యాశరథిన్ రాము నిట్టులని కీర్తించెన్ 227

## శబరి రామలక్ష్మణులను బూజించుట

ఉ॥ 'సారసదళనేత్ర! సౌందర్యగాత్ర! యోదశరథపుత్ర! సీతాకళత్ర!
తాటకాజైత్ర! నిర్దళితరాక్షసగోత్ర! వరమునిస్తోత్ర! పావనచరిత్ర!
సాధుసంస్తుతిపాత్ర! సకలలోకపవిత్ర! సద్గుణక్షేత్ర! విజ్ఞానమాత్ర!
ప్రకటీకృతక్షాత్ర! పాపలతాదాత్ర! బహుపుణ్యసత్ర! జీవగణసూత్ర!
॥ చటులతాపత్రయధ్వాంతజలజమిత్ర!, భీకరారాతికాననవీతిహోత్ర!
అమితసంసారవారాశియానపాత్ర! [illegible]

అని కొనియాడి శబరి యా, యినవంశ్యులచరితమునకు నెంతయుఁదనచె
మ్మనమునఁ జాలిపొడమ వా, రినిఁ దగఁబూజించెఁ గరముఁ బ్రియమేపారన్ 229

అమ్మగువసలుపుపూజల, కమ్మనుజోత్తములు దనిసి యానాడట మో
దమ్మునవిలిచినవారై, యమ్మరునా డధిపుఁడిట్టులనియె శబరితోన్ 230

'ఓకాంతామణి! నీసపర్యలకు నేనుల్లంబులో మెచ్చితిన్
నీకల్యాణగుణంబులెల్ల నెదివర్ణింపంగ శక్యంబె? యీ
లోకంబందు భవత్సమానసతు లాలోకింప లేరెవ్వరున్
నీకున్ సంతతమోక్షరాజ్యపదవుల్ నిక్కంబుగాఁ గల్గుతన్!' 231

అని రామభద్రుఁ డిట్లనియె 'సాధ్వీ! విను మవనిజంబాసినదాదినుండి
దుఃఖార్ణవంబునఁ దోఁగి నిద్రాహారములకెల్లదూరమై పోయియుంటి
నొక్కచో నిల్చుట కూరటలేక నాచిత్తంబు చీకాకుఁ జెందుచుండుఁ
గావున నేనింకఁ గంజాక్షిజానకి నన్వేషణముసేయ నరుగవలయు'

ఎనుఁడు శబరి రామున కిట్టులనియె 'రామ!, పుణ్యధనుఁడైన దనువు తాముప్నెనీకుఁ
జేయఁగల కార్యములనెల్లఁ జెప్పియుండె, నైనవేనును వాక్రుత్తు నవధరింపు 232

ఘనుఁడు సుగ్రీవుఁడం గపిరాజు ఋష్యమూకంబను గిరిపైనఁ గాపురంబు
సేయుచునున్నవా డాయగచరకులవల్లభుం డన్నయౌ వాలిచేత
నపగతరాజ్యుఁడై యపహృతభార్యుఁడై యగణితప్లవగసైన్యములఁగూడి
పరితపించుచునున్నవా డిప్పుడతనితో సఖ్యంబుగావించి శౌర్యశాలి
యైనవాలిని వధియించి యర్కజునకు, సంతసంబును గూర్పుమా సచ్చరిత్రుఁ
డీవునుంగూడి యాదశగ్రీవుఁజంపి, సీతఁగైకొను' మనితెల్పి చెప్పెమఱియు 233

'ఆద్యుఁడవు నవ్యయుండవు నఖిలవేద, వేద్యుఁడవు నిన్నుఁజూచిన వీక్షణముల
నేనిహముఁజూడవొల్లను గానయింకఁ, దనువువర్జింతు సద్గుణధామ! రామ!' 234

అనిచెప్పి శబరిపిదపం, దనదేహం బగ్నికర్పణముచేసి మహా
ఘనతరమోక్షానందముఁ, గనఁబోయె సమస్తదేవగణము నుతింపన్ 235

అంత నచటినుండి యరిగియారాఘవుల్ బహువిధఫలపుష్పభరితవృక్ష
విభ్రాజితంబును విపులలతాకుంజపుంజరమ్యంబును భూరిధాతు
తటశోభితంబును జటులనానానేకకందరసందోహసుందరంబు

గీ॥ మైన ఋష్యమూకముఁగని మానసముల, వింతనొందుచు మఱియుఁ దదంతికమున
ఘనులు సతతసేవాసమాగతనిలింప, పంపదర్శించి రక్షిపర్వంబు నింప 236

గీ॥ కాంచి యాపంపమహిమవర్ణించి వారు, దానిజలములఁ దగఁ గృతస్నానములగుచుఁ
గొంత మార్గశ్రమముదీరఁ గోరి యొక్క, మేటితరుమూలమున విశ్రమించుటయును

## సుగ్రీవుఁడు రామలక్ష్మణులకడకు హనుమంతునిఁబంపుట

సీ॥ ఆమహావీరుల నాజిజితారులఁ గార్ముకధరుల రాఘవులఁ జూచి
యచ్చట సుగ్రీవుఁ డాత్మగతంబుగ వాలిపంపున వారువచ్చి రనుచుఁ
దలపోసి భీతిల్లి తనసచివాగ్రణియగు వాయునందను నమలచరితు
నధికధీమంతు నాహనుమంతునింజీరి యిట్లనిచెప్పె "నోయీ! గుణాఢ్య!
గీ॥ వారెవరొ! పంపకడనున్నవారు మౌని, వేషధారులయ్యును మహావీరులవలె
బాణచాపాదులగు యుద్ధపరికరములఁ, దారుపూనియున్నారేమి కారణంబొ? 238

కం॥ నాకొక యూహజనించెడు, నాకేశసుతుండు పంప నన్నెదిరింపన్
వీకమెయి వచ్చుచుండిరొ?, కాకుండిన వీర్టురాగఁగారణమున్నే? 239

కం॥ ఈనాయూహ యథార్థం, బేనియు నప్పీరులిటకు నేతెరకము
న్నే వేనిందుండక యెం, దేనియుఁ జనుటుచితమనఘ! యాతిరుణమువన్" 240

కం॥ అని భీతచిత్తుఁడై యా, యినజుండు మఱొండుకడకు నేగుటకుమనం
బుననిశ్చయించి వెండియు, హనుమంతునిఁజూచి యిటులనియె మృదూక్తిన్ 241

గీ॥ 'వాయునందన! నీవేగి వారిచరిత, మెల్లఁదెల్లముగానర్గి యెటిఁగివైరి
వర్గమునకునుఁజెందనివారలేని, నాదుచెంతకుఁ దోడ్తెమ్ము సాదరముగ' 242

సీ॥ అనిచెప్పి పంప నా యంజనాతనయుండు వటువేషధారియై పంపకడకు
నరుగుదెంచుచునుండ నాతని నంతంతఁబొడఁగాంచి శ్రీరామభూపతిలకుఁ
డద్భుతాంబుధిమగ్నుఁడై లక్ష్మణునిఁజూచి "సౌమిత్రి! బంగారుచాయవాఁడు
కౌపీనధారియుఁ గంకణకేయూరహారకుండల భూషితావయవుఁడు
గీ॥ కోటిభాస్కరతేజుఁడె సాటిలేని, మేటివానరాకారుఁ డిచ్చోటికెవఁడొ!

మ॥ అని శ్లాఘించుచునున్నరాఘవుని డాయన్వచ్చి సద్భక్తితో
హనుమంతుండు తదీయపాదముల కత్యంతంబుఁ దా మ్రొక్కి యా
జనకక్ష్మాపతిపుత్రివార్తఁ దెలుపన్ సాధ్వీశిరోరత్న మి
ట్లనె నీకిచ్చెదనన్నచందమునఁ బండ్లంగొన్నిటిం గాన్కగా 244

గీ॥ ఉగసమర్పించి వాయునందనుఁడు సంఘ, టితకరాంజలిపుటుఁడయి సతసమస్త
దెవతస్తాయి రాము శాత్రవవిరాము, నెలమిఁగన్గొని నమ్రుఁడై యిట్టులనియె 245

సీ॥ 'ఇనతేజులార! మీరిర్వు రింద్రోపేంద్రులో? జయంతవసంతులో? తలంప?
హరికుమారులో? మఱియెవ్వరోగద? సుందరాంగులలోన సుందరాంగు
లేరాజసుతులు? మీకెవ్వినామంబులు? దీనులై వనినిట్లు తిరుగనేల?
మీయాకృతులఁజూడ మీదుమిక్కిలి మహాదుఃఖసూచకములై తోచుచుండె
గీ॥ మిమ్ముఁగనుచున్నకొలఁది నామెమ్మనంబు, భక్త్యమృతరసోత్పన్నమై ప్రబలఁజొచ్చె
నిరతమును మీకుబంటనై నెగడుచుండు, నాకుఁదెల్పుఁడు మీదుపుణ్యచరితంబు' 246

కం॥ అనవుఁడు సుమిత్రకొమరుఁడు, వినయవివేకాదిశీలవిద్యావంతున్
హనుమంతునిఁజూచిపలికె, ఘనమగు ప్రావృట్పయోదగంభీరోక్తిన్ 247

సీ॥ 'తరణివంశముఁ బవిత్రముసేయ దశరథక్షీరాబ్ధిచంద్రుఁడై చెలఁగెనెవఁడు
పసితనమందె రాక్షసవీరులంగూల్చి కౌశికుమఖమును గాచెనెవఁడు
భువనత్రయముమెచ్చ భూతేశువిలుఁద్రుంచి యిలజానకినిఁ బెండ్లియాడెనెవఁడు
ప్రకటరాజన్యవిరాము భార్గవరాము గర్వభంగముఁజేయఁగలిగె నెవ్వఁ
గీ॥ డట్టి జగదేకవీరుఁ డాహవవినిర్జి, తాసురనికాయుఁ డాదినారాయణాంశ
భవుఁడు సకలలోకారాధ్యపావనగుణ, భరితుఁడై యున్న శ్రీరామభద్రుఁ డితఁడు 248

కం॥ ఇమ్మహనీయునకును నేఁ, దమ్ముఁడ భృత్యుఁడను వినుము తరుచరవర! న
న్నిమ్ముగ లక్ష్మణుఁడనునా, మమ్మునఁబేర్కొనుచునుంద్రు మహిజనులెల్లన్ 249

సీ॥ తండ్రిపంపునఁ జతుర్దశవత్సరంబులు దండకాటవులందుఁ దగఁజరింప
వచ్చి యిచ్చటఁ బంచవటిచెంగటన్ మేమఁ గాపురంబుండ లంకాపురీశుఁ
డైన రావణుఁడను నసురాధముఁడు మమ్మువంచించి యీరాము పత్నియైన
సీతను బల్మిమైఁ జెఱఁగొనిపోయిన నామెనురోయుచు నడవులందు
గీ॥ వచ్చుచుండఁగ శబరియన్ వనితమాకుఁ, గీశకులనాథుఁడైన సుగ్రీవుపెంపుఁ
జెప్పి యాతనితోఁ జెల్మిసేసిరేని, విజయసంసిద్ధియగునని విన్నవించె 250

సీ. కావున మేము సుగ్రీవసఖ్యార్థమై ఋష్యమూకాద్రికి నేగుచుంటి'
మనిపల్కి వెండియు నాజంబువధయునుఁ బాపాత్మయైన శూర్పణఖపరిభ
వము నటుపై ఖరుఁ బరివారయుతముగాఁ గడతేర్చుటయు నాదిగాఁగల్గు
యెల్లవృత్తాంతంబు లింపారఁజెప్పిన నాలించి యా పవనాత్మజుండు
గీ. హర్షపులకితగాత్రుఁడై యాదరంబు, భక్తి యును దన మానసాబ్జమునఁ బొదల
వారికిం బలుమారులు ప్రణతుఁడగుచు, నినకులేశులతోడఁ దానిట్టులనియె 251

## హనుమంతుఁడు రామలక్ష్మణులను సుగ్రీవునికడకుఁ దోడ్కొని పోవుట

సీ. 'రామలక్ష్మణులార! రమణీయయశులార! పరమయోగీశ్వరేశ్వరులకైన
దొరకని మీమైత్రి దొరకొనెనట్టె! మాయినతమాభవుభాగ్య మేమనందు?
తనదాయ వాలిపంపున మీరువచ్చేసిరని మదిశంకించి యతఁడునన్ను
మీచరిత్రమెఱింగి మిత్రవర్గమునకుఁ జేరినవారేని గౌరవముగఁ
గీ. దోడితెమ్మనుటయు వచ్చినాఁడ రండు నన్ను హనుమంతుఁడందురు వారిసుతునకు
సేవకుఁడవౌదు నంజనాదేవి కనిలు, వలన నేనుద్భవించినవాఁడ వినుఁడు 252

సీ. బాల్యంబుననె నేను భాస్కరబింబంబు ఫలమనియొకనాఁడు భ్రాంతినొంది
పట్టఁబోయినఁ గాలి భగ్నమయ్యెను హనువందుచే హనుమంతుఁడంద్రు నన్ను
మఱియు నాతూరుపుమలమీద నొకయడ్గు నస్తాద్రిపైనొక్కయడుగు మోపి
సకలశ్రుతిస్మృతిశాస్త్రపురాణేతిహాసాదులను వారిజాప్తువలన
గీ. నధ్యయనముఁగావించితి ననఘులార!, ధైర్యగాంభీర్యశౌర్యదోర్వీర్యధుర్యుఁ
డనఁగ నెగడితి బ్రహ్మచర్యవ్రతంబు, బుధులుమెచ్చ నాజన్మాంతమును వహింతు.'

గీ. అని తనయుదంతమెఱిఁగించి యర్కకులుల, నంసభాగములయిన నధివసింపఁ
జేసికొని పావని రవిజుచెంతకేగి, యాతనికి వారిఁజూపి యిట్లని వచించె 254

శా. 'వీరిక్ష్వాకుకులోన్నతుల్ దశరథోర్వీపాలసూనుల్ మహా
వీరశ్రేష్ఠులు రామలక్ష్మణజగద్విఖ్యాతనామాంకితుల్
ధీరాత్ముల్ పదునాలుగేండ్లు జనకాదేశంబునంజేసి యు

మ॥ వనమధ్యంబున నీరఘుప్రవరులన్ వంచించి చౌర్యంబునన్
విను లంకేశుఁడు రావణాసురుఁడు తా వీతజ్ఞుఁడై రామభా
ర్యను త్రైలోక్యనుతప్రశస్తగుణవిఖ్యాతన్ మహాపూత సీ
తను బల్మింగొనిపోయెనట్టి తన కుద్యన్మృత్యు వానన్నమై 256

కం॥ వీరా సీతనువెదకుచు, ఘోరారణ్యంబునందుఁ గ్రుమ్మరుచుండన్
సారమతి శబరియనుసతి, వీరా! మీలావుచేవ పెంపెఱిఁగింపన్ 257

కం॥ విని మీతోస్నేహింపఁగ(, జనుదెంచినవారు మీరు శంకవలవదీ
మనుజోత్తములనుగొల్చుచు, మనుఁడికఁ గపినాథ! మీదు మనువు తరించున్' 258

కం॥ అనియిట్లు తచ్చరిత్ర, మ్మనిలజుఁ డఖిలంబుఁజెప్ప నాలించి ముదం
బున భక్తిదోప వారిని, వినిజుఁడుపూజించి నృపతి కిట్లనియెఁదగన్ 259

## (శ్రీరామసుగ్రీవుల పరస్పర స్నేహము

సీ॥ "శ్రీరామచంద్ర! మీ స్నేహంబునందేసి ధన్యాత్ముఁగా నన్నుఁ దలఁతు విమదు
నాకు జీవములర్పణముసేసి సేవించు నగచరసైన్యంబు లగణితంబు
లొక్కొక్కఁడె జగం బుబ్బాతలూగింపఁజాలు పరాక్రమశౌర్యధనులు
మీరు చూడనిచోట్లు ధారుణిలోలేవు జానకియెందున్నఁగాని వెదకి

గీ॥ రాఁగలరు తేఁగలరు చింతనీగు దనము!, రణములోపల మీచేత రావణుఁడికఁ
మడిసెనమకొండు లోకైకమాతయైన, సీతతోఁగూడ జయలక్ష్మి చెందుమిమ్ము " 260

సీ॥ అని యీరడిలఁబల్కి యర్కజుఁ డావారు తాదాచియుంచిన ధరణితనయ
తొడిపులుయాటను ఎడమితెనికొనంగి "యోరాఘవేశ్వర! యొక్కవనితి
భులుఁడెవ్వఁడో బలాత్కారముగాఁ దన్నుఁగొనిపోవ వినువీధిఁ జనుచుమండి
మమ్మిందుఁ బొడఁగాంచి మానిని తనమేని భూషణంబులఁదీసి మూటఁగట్టి

గీ॥ మాయెదుటఁబడవైచె వెమ్మనమునందు, నక్కజంబంది దానినే నట్టిదాచి
యుంటి నామెయెసీతయైయుండుఁగాని, యీతొడవులం బరీక్షింపు డినకులేంద్ర!" 261

చం॥ అని రవిజుండు పల్కుటయు నారఘురాముఁడు వాని సీత తా
ననయమలంకరించునగలౌటఁ గనుంగొని హా!ప్రియా! యిటం
చనుపమరోదనంబెసఁగ నద్భుతమూర్ఛమునింగి వెండి త
మ్మని కిరోపచారముల భూపతిమేలుని యిటనున్ వగన్ 262

సీ॥ 'అనఘ! సౌమిత్రి! యీయాభరణంబులు జానకివౌట నిస్సంశయంబ
యిందివి పడవైచి యెందేగెనోగద! యిందెవ్వరెఱుఁగ రాయిందుముఖిని
నక్కట! యెందున్నదని వెదుకవలయు? దానవుఁడెందైన దాచినాఁడొ
లేకభక్షించెనో నాకేమిస్ఫురియింప దెట్టిన జానకియిఁక లభింప
గీ॥ దేమిసేయుదు? సతిఁజూడ కెటుభరింతు, నీవియోగాబ్ధిదాటుటె ట్లేదిదాని
యనుచుఁ దలపోతలకుఁజొచ్చి యలుకపొడమ, మఱియు నిట్లనిపల్కె న

సీ॥ 'నాసీతలేనిచో నీసర్వలోకంబు లుండిఏనేమి? లేకున్ననేమి?
బ్రహ్మాండభాండముల్ భస్మంబుగావింతు బ్రహ్మాదిసురలను బట్టికాలఁ
దిగ్గజేంద్రంబుల ప్రుగ్గించి దీటింతు శేషకూర్మంబుల చేవఁజెఱుతు
నుదధులే డింకింతు నుర్వీధరంబులఁ జూర్ణంబుఁజేయుదుఁ జుక్కలెల్ల
గీ॥ నట్లిరాత్తును సూర్యచంద్రాదులైన, గ్రహములన్నింటినింబట్టి కట్టిపెట్టు'
ఏని మహారోషవివశాత్ముఁడగుచు వింటఁ, దివిరి బ్రహ్మాస్త్రమపుడు ఎంర

సీ॥ సకలలోకంబులు చాలసంక్షోభించె గ్రహతారకలు తమగతులు దప్పె
బ్రహ్మాదిసురలు నభయులై తలంకిరి అవనీతలము సాద్రియై చలించె
నఖిలభూతశ్రేణు లాక్రోశమొనరించె దిగ్గజంబులు ధరఁద్రెళ్లసాగె
శేషకూర్మంబులు చేడ్పడి మూర్ఛిలై నేడుసముద్రంబు లింకఁజొచ్చె
గీ॥ జగతిఁగల రాక్షసాంగనాజనసమూహ, గర్భనిర్భేదనంబును గాఁదొడంగె
లోకశాంతికినై మునిలోకమెల్ల, సదమలస్వాంతముల రాము సన్నుతించె

గీ॥ అట్లు లయకాలరుద్రుఁడో యనఁగమండి, యస్త్రమునువీడ సంసిద్ధుఁడైన ।
దేవునింజూచి లక్ష్మణదేవుఁడప్పు, డెంతయును నమ్రభావుఁడై యిట్లనిరూ

సీ॥ 'దేవాధిదేవ! మీ దేవినపహరించియుండిన దశకంధరుండె మనకుఁ
బగతుండు నపకారి వానిని వానికి ననుచరులైయున్న యఖిలదనుజ
కోటిని మర్దించి క్షోణిసర్వం బరాక్షసముగా నొనరింపఁ జనుఁగాని
యేకీడుసేయని యీలోకములనెల్ల నాశనమొనరింప న్యాయ్యమగునె?
గీ॥ భూతసంతతులెల్ల వాపొపఁజొచ్చెఁ, కరుణఁజూడుడు క్రోధంబుఁ బరిహరిం
డనుచుఁ బ్రార్థించిచెప్ప శాంతాత్ముఁడయ్యె, రాముఁ డప్పుడిట్లనుదినరాజవం

సీ॥ 'ఓరామచంద్ర! లోకోన్నతగుణసాంద్ర! భావింప మావంటి పామరులకు
శోకింపఁజనుఁగాని సుజ్ఞానవంతులరగు మీరు శోకింపఁదగదు వినుఁడు
వాలిచే రాజ్యంబు భార్యనుగోల్పోయి దీనుండనై యవమానమొంది
చిరకాలముననుండి స్థిరతతోనుండనే? యేద్వ్యఁప్రయోజన మేమిగలదు?'
గీ॥ కాన విగతశోకుండవై క్ష్మాతలేంద్ర!, భావికర్తవ్యమునకింకఁ బౌరుషముగ
నుత్సహింపుడు ప్రాణముల్ యుష్మదర్థ, మర్పణముసేసి జయముఁ జేకూర్పఁగలను

మ॥ అని యాభానుసుతుండు పల్కుటయు తా దాలించి శాంతించి యా
తని నాలింగనమాచరించుకొని యుత్సాహంబుతో నిట్లనున్
'దిననాథాత్మజ! నీదుజ్ఞానమును బుద్ధింజూడ శాఖామృగం
బనరా దీవొక దివ్యపూరుషుఁడవౌదంచేను భావించెదన్ 269

శా॥ త్వద్విజ్ఞానవిజృంభితామలమహా వాక్యామృతాసారదీ
వ్యద్విస్తారితరప్రసారశమితోద్యత్తీవ్ర తాపుండనై
విద్వద్వందిత! నేఁదరించితిని భావింపంగ నీవంటి స
ద్విద్వాంసుండు సఖుండు గల్గఁ గొఱతల్ వేఱుండునే నాకిఁకన్?' 270

కం॥ అని కపినాథునింబొగడి యర్కకులేశుఁడు రాముఁడిట్లనున్
'విను! ప్లవగేంద్ర! నీపగతు విక్రమమొప్పఁగఁ ద్రున్మివైచెదన్
ఘనతరకీశరాజ్యమును గైకొని యేలఁగఁజేయుదున్ నిమన్
మనమున విశ్వసింపు మనుమానము ఖేదము వీడు మిత్రమా!' 271

॥ అనుచుఁబల్కి తాను వాయర్కసూనుండు, నవలునవ్విధానమున శపథము
లాదరించుకొని మహానురాగమున న, న్యోన్యమైత్రి కలిగి యుభయులంత 272

॥ తదుపరి రామచంద్రుఁడు ముదంబున నర్కజుఁజూచి యిట్లనున్
'సదమలభావ! నీకు బలశాలియు నగ్రజుఁడైన వాలి కే
లొదవె మహావిరోధమది? యొప్పుగ నాకు సవిస్తరంబుగా
విదితముసేయు' మన్నఁ గపివీరుఁడు చెప్పఁదొడంగెఁ దత్కథన్ 273

## సుగ్రీవుఁడు శ్రీరామునితో వాలివృత్తాంతము నెఱిఁగించుట

సీ॥ 'వరరూపసుందరి వనిత మదంబను నేకాంతమునఁద్రొల్లి యింద్రసూర్యు
లీక్షించి మోహించి యింతినిఁబొందంగ నేవేరవునుగాన కిర్వురికిని
వీర్యంబుస్ఖలనమై వెలఁది వాలగ్రీవదేశంబులందుఁ దత్తేజమొంద
శక్రుసనంశంబున జయశాలి మద్భ్రాత వాలంబునంబుట్టి వాలిపేర
గీ॥ నర్కుఘనవీర్యమునఁజేసి యాలతాంగి, గ్రీవమందున నేను సుగ్రీవుఁడనెడు
పేరఁబుట్టితి మాతల్లిప్రీతితోడ, మమ్ముఁబోషించె నిర్జర మానవేంద్ర! 274

ఉ॥ ఏమును బెద్దవారమయి యింద్రసుతుండగు వాలి తారయం
గామిని నే రుమాఖ్యగలకాంతను బెండిలియై పరస్పర
ప్రేమదలిర్ప నిర్వరముఁ బెద్దయు సఖ్యతనుంటి మంత సు
త్రామకుమారకుండు కపిరాజ్యవిభూతికి నేతయై తగన్ 275

గీ॥ అనుపమంబగు కిష్కింధయనుపురంబు, తనకు నశ్రాంతమును రాజధానిగాఁగఁ
బ్రకట కపిరాజ్యమంతయుఁ బ్రాభవమున, నేలుచుండెను రిపుమదోన్మాలి వాలి 276

గీ॥ నేను నవ్వాలియెడ మహోన్నతమైన, భక్తివిశ్వాసములు స్నేహభావమొప్ప
బ్రదుకుచుంటిని దత్ప్రియమహాత్ముఁడనయి, యిట్టులుండఁగ నొక్కనా డినకులేంద్ర! 277

సీ॥ దుందుభాఖ్యుండైన దోషాటకులనాథతనయుండు మాయావి యనెడువాడు
తనకు లోకత్రయంబున నొక్కఁడేని సంగరభిక్షఁబెట్టమి గర్వితుఁడయి
వాలి మహాబలశాలియౌటయెఱింగి వేగఁగిష్కింధకు నేగుదెంచి
యమరేంద్రతనయుని నాజికింజీరిన నతఁడును గినిసి నేననుసరింప
గీ॥ వీకమైఁ బోయి దనుజునిఁ దాకుటయును, వాడు మమ్మిర్వురనుఁగాంచి భయమునొంది
కాందిశీకుఁడై యొకగిరిగహ్వరమునఁ, జొచ్చెఁ జొచ్చిన దివిజేంద్రసూనుఁ డపుడు 278

కం॥ 'అనక్తంచరు వెలికిన్, రానీయకు' మనుచు నుడివి రయమునఁ దానున్
లోనికిఁజనియెఁ దదాజ్ఞా, ధీనత నేబిలముకడనె స్థిరముగ నుంటిన్ 279

కం॥ ఆరక్కసుఁదాకి యతఁడు, పోరొకయబ్దంబు సలిపెఁ బొరినంత బిల
ద్వారముననుండి శోణిత, ధారాపూరము బహిరతంబయి తోచెన్ 280

దానిచేఁ గన్గొని దనుజుండు మఱియును దఱచుగా నల్పెడి దారుణతర
సింహనాదంబులఁ జెవులారనాలించి మద్భ్రాత యసురుచే మడిసెననుచు
వాఁడువెలుపలికి వచ్చిన నన్నును బరిమార్చునటంచు భావమున నెంచి
బిలమునకొక్క గండశిల నడ్డముగవైచి యటనుండి కిష్కింధ కరుగుదెంచి
సర్వులకుఁ బ్రాకటానని చావువార్తఁ, దెలుపమంత్రులు దండనాథులును నన్నుఁ
గిశసామ్రాజ్యమునకు నధీశుఁజేయ, నేలుకొనుచుంటి రామభూపాల! నేను 281

అటు పదంపడి వాలి యసురాధమునిఁజంపి యరుదెంచువాఁడు గుహాముఖమున
నడ్డంబువైచిన యశ్మంబుఁగని నన్నుఁ బలుమార్లు పేర్కొని పిలిచిపిలిచి
యేనటలేమిఁ దానెఱిఁగి వన్నపరాధిగాఁ దలపోయుచుఁ గరముఁగినిసి
ఎహుయత్నమున శిలం బ్రక్కకుఁబోఁదన్ని బిలబహిర్గతుఁడయి వేగిరంబ
)టికేతేర నేమను భీతినొంది, యాతనికెదురుగాఁబోయి యస్మదీయ
)రపరాధిత్వ మెఱిఁగించి వెమ్మిఁ దత్ప, దములపైవ్రాలి క్షమియింపఁదగు నటంచ

ాని యతండు నాపలుకుఁ గైకొననొల్లక పాదతాడితుం
ానొవరించి యిట్లనియె 'నన్ను బిలంబుననుంచి క్రూరతన్
గానికి రాతినడ్డమిడి దర్పముతోఁ బురికేగుదెంచి క
్గా! నిను నమ్మవచ్చునె? దురాత్మక! రాజ్యము నేలుచుంటివే? 283

ృతతధర్మమూర్తివని యారయఁదమ్ముఁడవంచు విన్ననా
తమునందలంచి తగఁజేకొని బ్రోచితిఁగాని యిట్టి దు
)తిపరుండవౌటెఱుఁగి నిన్నిఁకనేమనవచ్చు? దుర్మతీ!
ితిని నమ్మరాదనుట సార్థకమయ్యెను నీకతంబునన్ 284

వివేకివై నన్నునంతంబునొందించి యీవె యీకపిరాజ్య మేలుకొనఁగఁ
ుఁచియుంటివి నీదు తలఁపే వెఱింగితి నిర్దోషివనిచెప్ప విన్ననేను
్వసింతువె యిఁక? విశ్వాసఘాతుక! చెనటి! ఓలద్రోహి!' యని యనేక
ుముల దూషించి పృథితరోమండయి యస్మత్కళత్రంబు నపహరించి
తలఁగొట్టిన వాలికి వెఱచినేను, గొందఱాప్తులుగొలువ నీకుధరమందుఁ
ృవసించుచున్నాఁడ దాయయిందు, రాఘవనిక్కిఁజేటి సతతంబు రామచంద్ర!' 285

నివవిని రాముఁడిట్లను, 'నిననందవ! శక్రతనయుఁ డీగిరిపైకిం
ుదేరమిఁకిఁగతంబే.' మనియడిగిన వానఁడిట్లని నారుగా...

గీ॥ 'తొల్లి మాయావితండ్రియో దుందుభుండు, మహిషరూపధరుండయి మఘవసుతుని
నాజికిం జీరటయు నాతఁడాగ్రహించి, కడిమిమైఁబోయి యధిప! రక్కసునిఁదాకె 287

గీ॥ తాకి బహుదివసంబు లాదనుజుతోడ, పీకమై ఘోరరణముఁ గావించివానిఁ
గాలగోచరుఁజేసి యాగ్రహముఁబట్టి, లేక తన్మహాభయుదికళేబరంబు 288

కం॥ తనపాదంబున నుద్ధతి, ఘనుఁ డాదేవాధినాథుగాదిలిసుతుఁ డ
త్యనుపమబలమునఁ దన్నుట, యును నది యోజనముపోయి యుర్వీనాథా! 289

గీ॥ ఈగిరీంద్రముపై నతం బెలమిఁదపముఁ, జేసెడి మతంగుఁడనుముని చెంగటఁబడి
తత్తపోభంగమొనరింప దారుణతర, కోపమున మండిపడి మౌనికుంజరుండు 290

కం॥ 'ఎవఁడిచ్చట మదముననీ, శవమును బడవైచినాడొ చలమున వాడీ
యవనీధరమెక్కిన శిర, మవిసి మృతింజెందుఁగాక యాక్షణముననే' 291

కం॥ అని శాపమొసఁగుటయు నది, విని యా గిరిపైకి జంభభేదిసుతుఁడు తాఁ
జనుదేరవెఱచుఁ గావున, ననఘా! నేనిటవసింతు నశ్రాంతంబున్' 292

## సుగ్రీవుఁడు శ్రీరామునిబలమును బరీక్షించుట

సీ॥ అనిచెప్పి 'యాదుందుభాసురు మృతకాయ మిప్పటికినిఁగూడ నిమ్మహీధ
రమ్మునమున్నది రండు చూపెద' నంచు రామలక్ష్మణులను రవిసుతుండు
వేగఁ దోడ్కొనిపోయి భీతిఁగొల్పుచు మహామనితరపర్వతాకారమట్లు
యున్న తదీయసమున్నతదేహంబుఁ జూపించి యిట్లను 'శూరులార!
గీ॥ బహుదినంబులనాటిశవంబు గాన కాకగృధ్రాదిభక్షితమై కరంబు
జీర్ణమై యస్థిమాత్రావశిష్టమయ్యె, నిమ్మహాకాయ మిప్పుడో యినకులేంద్ర! 293

సీ॥ పుష్కలంబుగ మాంసపుష్టికలిగియున్నయప్పుడే దివిజాధిపాత్మజుండు
యోజనదూరమం దుద్ధతిఁబడవైచె దానికంటె ద్విగుణితముగ నిప్వ
డీ జీర్ణదేహంబు నెంతయుబలమున నేసినవేగాని యింద్రసుతునిఁ
దాకి జయింపంగఁదరముగా' దనిచెప్ప నాలించి శ్రీరాముఁ డతిజవమునఁ
గీ॥ దనపదాంగుష్ఠమునఁజేసి తక్షణంబ, తొడరి పదియోజనంబుల దూరమందు

సీ॥ ఇంతిమాత్రమునకె యినకులేశ్వర! వాలి బలముకంటెను మీఱుబల మదెక్కు
డనరాదు వినుఁ డాతఁ డవనిలోపలఁగల గట్లెల్లఁ బుట్టచెండ్లట్ల పెరికి
యెగురవేయును మఱియేడుసముద్రముల్ కరువలికంటె శీఘ్రమునఁబోయి
దాటిరానేర్చు నామేటికిధాత్రిలో సాటిలేరనిన నామాటయుంది
గీ॥ నతిశయించుటైనలే దదియుఁగాక, యింకనొకవిశేషముగల దీసమీప
మందుఁగల వేడుతాటిచెట్లధిప! వాని, దివిజపతికైనఁగాని భేదింపరాదు 295

కం॥ అయ్యేడు తాటిమ్రాఁకుల, నొయ్యన భుజశక్తిఁబట్టి యొకచోటికి రా
నయ్యమరాధిపతనయుఁడు, చయ్యనఁ దావంచెఁ బెక్కుసారు లిలేశా! 296

॥ అదిచూచి 'ధరనెవ్వఁ డావస్తతాళంబులను నొక్కకోలచేఁ దునిమివైచు
వాడెహా వాలిని వధియింపఁగలఁ' డని మునుమతంగుండను మునివచించెఁ
గావున వానినిఁగడిమిమైఁగూల్పుడు విశ్వసింతును మిమ్ము వీరవర్య!'
యనిచెప్ప శ్రీరాముఁ 'డవియెటనున్నవో నాకుఁజూపుము కపినాథ' యనిన
॥ వల్లెయని యాక్షణమె కీశవల్లభుండు, జలజబాంధవకులవార్ధిచంద్రు రామ
చంద్రుఁ దోడ్కొనిపోయి తానరగఁజూపె, సాటిలేనట్టి యమ్మేటి తాటిచెట్ల 297

॥ చూపుటయు ఘనభుజబలాటోపకలితుఁ, డైన శ్రీరాముఁడొక దారుణాస్త్రమేసి
దశవదనునాంత్ర త్రాళ్లనేతద్విధమునఁ, ద్రుంతునన్నట్లు త్రుంచెనా దొడ్డతాళ్ల 298

॥ అప్పుడు సుగ్రీవుఁడమృతానందనిమగ్నుఁడై యిట్లను మనుజపతికి
'రామాభిరామ! సుత్రామసన్నుతనామ! సాక్షాత్పరంధామ! శౌర్యభీమ!
మీభుజవాశక్తి మృగకులజాతుండనగుటచే వెఱుఁగమి నట్లునేను
ఘనమౌపరీక్షలు కల్పించి మిమ్మలయించితి సన్ క్షమియింపవలయు
॥ విశ్వసించితి నిఁక బలభేదిసుతుఁడు, చచ్చుమీచేతి జయ మవశ్యంబుగలుగు
రుమనుగూడి వానరసేనయూథిఁగొలువ, నేలుకొందును గపిరాజ్య మేలికనయి' 299

॥ అని ప్రముదితహృతయుండై, యినతనయుఁడు రామచంద్రునీక్షించి మహా
వినతుఁడయి వాలిఁగూరిచి, వినుమని వెండియును దాను వివరించె నిటుల్ 300

'కనుఁగొనినయంతమాత్రన ఘనుఁడువాలి, రిపుబలోత్సాహసంపద నపహరింపఁ

గీ॥ వాలినదికారిణంటుగ వసుధనేరి, కైనవెదిరించి గెల్వంగ నలవిగాదు
కావ ప్రచ్ఛన్నముగ నొక్కచోన డాగి, వాని సమయింపవలయును వసుమతీశ!' 30

కం॥ నావిని శ్రీరాముఁడు సుగ్రీవునితో నిట్టులనియెఁ 'గిష్కింధకిఁకన్
నీవేగి యుద్ధమునకా, దైవతవిభుసుతునిఁ బిలుము తరుచరవర్యా! 30

కం॥ మీరిరువురునుం దలపడి, పోరాడుచునుండ నేను బొంచిశరమునన్
వీరాగ్రణియగు వాలిని, ధీరతఁ బరిమార్చివైతు ధీరవిచారా!' 30

గీ॥ అనుచుఁ గర్తవ్యమును రాముఁడర్కజునకుఁ, దెలువ నీలుఁడు తారుఁడనిలజుఁడు నలుఁ
డనునరింపఁగ భూపనందనులతోడ, నగచరాధిపుఁ డాజిసన్నద్ధుఁడగుచు 30

గీ॥ తివిరి కిష్కింధకేగి తదీయమైన, నగరబాహ్యప్రదేశంబుసఁ పిడిసి ర
ఘుప్రవీరులచ్చోట నిగూఢవృత్తిఁ, దనరవసియించి తన్నంపఁ దరణిసుతుఁడు 30

గీ॥ తక్షణమె యొక్కఁచోపోయి తాను నగర,గోపురముచెంత నిలుచుండి ఘోరముగను
సింహనాదిముల్ సేయుచు జిష్ణుసుతునిఁ, తీరె నాయోధనమునకుఁ జీరుటయును 30

## వాలిసుగ్రీవుల ప్రథమయుద్ధము

ఉ॥ ధీరుఁడు పాకశాసని మదించిన సింహముబోల్కి సింహగ
ర్జారవభేదితాఖిలదిశావలయుండయి వేగఁ దత్పుర
ద్వారమునుండి వెల్వడి నితాంతమహాసముదగ్రరోషదీ
ప్తారుణితాంబకుండగుచు నర్కతనూజుని వచ్చి తాకినన్ 30

కం॥ ఆయిరువుర కప్పుడు భయ, దాయోధనమయ్యె మింట నఖిలాపస్త్యల్
పాయకనిల్చి కనుంగొని, వేయివిధంబులను రామ వినుతియొనర్పన్ 30

సీ॥ అవనిజంబులతోడ నతిముతిఁ బ్రహరించుకొందు రుదగ్రులై కొంతతడవు
విరివిగాఁ బాషాణవృష్టిదారుణలీలఁ గురియించుకొందురు కొంతతడవు
కడిమిమై నిర్వురు గట్టిగాఁ బిడికిళ్ల గ్రుద్దుకొందురు మఱికొంతతడవు
దంతనఖముల క్షతంబులు గావించుకొందురు పీకమైఁ గొంతతడవు
గీ॥ నొకని నొక్కఁడు పట్టుచునుగ్రభంగి, క్షోణిఁబడఁద్రోసికొందురు కొంతతడవు

॥ తరుచరవీరు లిక్కరణిఁదాకి నిరంకుశశక్తితోఁ బర
స్పరజయకాంక్షులై పెనఁగసాగుడు నిర్వురి మేనులన్ భయం
కరముగ రక్తవాహినులు గాటముగాఁ బ్రవహించెఁగాని సు
స్థిరబలవిక్రముల్ సరకుసేయక పోరఁదొడంగి రేపువన్ 311

॥ అప్పుడనుజుతోడ నవనీరుహముపొంత నస్త్రసంధానుఁడై యతినిగూఢ
ముగఁ దాను వసియించి భూపాలమణి రాముఁ డాకన్ను లాచెవు లామొగంబు
లాపిక్క లాడొక్క లాచెక్కు లాయక్కు లాకాళ్లు లాౘ్రేళులాదియైన
యవయవభేదంబు లావంతయునులేక సమరూపధారణ మమరియున్న
॥ యమ్మహావీరులనుజూచి యందులోన, నింద్రసుతుఁడెవ్వఁడో! మఱి యినతనూజుఁ
డెవ్వఁడో! స్వాంతమున నిర్ణయింపవేర, కూరకయెయుండె శరమేయ కారఘుపతి 312

॥ ఇట్లు పెద్దయుఁబ్రొద్దు నేపుమైఁబోరాడి చివరకు రవిజుండు చేవవీడి
'దశరథాగ్రసుతుండు తలపోయ నిఁకఁ దనయం దుపేక్షాపరుఁడయ్యె' నటచు
భావించి కడుభయభ్రాంతుఁడై పగతుచే నెంతయునొచ్చి పెన్నిచ్చి పఱచి
ఋష్యమూకాద్రిపై నెక్కుటయును మహోత్సాహంబుతో వాలి చనియెఁ బురికి
॥ రామలక్ష్మణులంత నారవితనూజుఁ, జేరఁగాఁబోవ నాతఁడు చిత్తమందు
నతిశయంబయినవిషాద మచ్చుపడఁగ, నిట్టులనియెను రామావనీశుతోడ 313

॥ 'పుట్టితివట! రవికులమునఁ, గొట్టితివట! రణమువందుఁ గ్రూరాత్ములఁ జే
పట్టితివట! శిష్టజనుల, నిట్టులఁజేయంగధర్మమే నృప! నీకున్? 314

॥ అమ్మఘవాత్మజుందునిమి యక్కట!రాజ్యము నాకు నిత్తునం
చమ్మెయి నమ్మఁగాఁబలికి యాజికి నంబురికొల్పి దాయచే
నిమ్మెయి భంగపాటు ఘటియిల్లఁగఁజేసితి వీవుపేక్షతో
నమ్మినవారినిం జెఱుప న్యాయ్యమెనీకు? నరేంద్రనందనా! 315

॥ లంచముంగొని నీవువంచించి నన్ను, వాలిచేతను జంపింప వచ్చినాడ
వకట! మిత్రధర్మముఁజూడవైతి వధిప!, యింక నీతోడఁ జెలిమి వేవెట్లొనర్తు? 316

॥ మున్న మీపట్ల శంకించియున్నవాడఁ, గాని నేను గేవలము మృగంబనగుట
బుదిచాలమి మీతోడ బదపఱుఁ దవయిచెడితిలి వింక వీచనుమచాలు' 317

ఆ॥ అనుచు నిష్ఠురోక్తులాడుచుండిన వాన, రేంద్రుఁజూచి యా నరేంద్రుఁ డనియె
'ననఘ! యూరడిల్లు మస్మన్మనోగత, మున్నదున్నయట్లు విన్నవింతు 318

గీ॥ లేశమైనను భేదంబులేక యిరుపు, రాకృతి విశేషములఁ దుల్యులగుటఁజేసి
దేవపతిసూను నిన్ను గుర్తింపక మతి, శరమునేయకయుండితి. సచ్చరిత్ర! 319

గీ॥ ఇది యథార్థముగఁ దలంపు మింతకంటె, నింక వేఱేమియునులేదు శంకవీడు
చేతమందున నీ వన్యథాతలంప, వలదు విశ్వసింపుము నన్ను వనచరేంద్ర! 320

గీ॥ నీవు ధీరుఁడవైలెమ్ము నిర్జరేంద్ర, తనయు వధియించి నేత్రమోదంబుఁ గూర్తు
నేను దీనికిఁదప్పిన నిత్యసత్య, రతుఁడయిన పంక్తిరథునకు సుతుఁడఁగాను' 321

సీ॥ అని యివ్విధంబున నతనిసందేహంబు దీరంగ బోధించి దిగులువాపి
మనుజవల్లభుఁడు క్రమ్మఱ యుద్ధసన్నద్ధుఁగావించి సుగ్రీవుగళమునందు
లలిగజకుసుమమాల లాంఛనార్థమువేసి తోడ్కొనిచని తారు దొంటియట్ల
ప్రచ్ఛన్నముగనుండి వాలిపై నాజికిఁబంప మహోత్సాహభరితుఁడగుచుఁ
గీ॥ దరణితనయుఁడు తత్పురద్వారముకడ, కరిగి దాయను దనతోడ ననియొనర్పఁ
జీరుటయు వాలికోపించి శీఘ్రముగను, సమరసన్నద్ధుఁడయ్యె నాసమయమందు 322

సీ॥ తద్దారయగుతార తద్దయువగచుచు నిట్లనిపల్కె నాత్మేశుతోడ
'వల్లభ! తమతంత్రిపంపున నిక్ష్వాకుకులమండనుం డాజికోవిదుండు
రామభద్రుండు భార్యాసమేతుండయి యనుజుండు వెంటరా వనికివచ్చి
లంకేశుచే నట లలనఁగోల్పోయి సుగ్రీవసహాయార్థ మావిభుండు
గీ॥ వచ్చి తన్మైత్రిగావించి భండనమున, నిన్నుఁబరిమార్చి సుగ్రీవునిన్ సమస్త
కీశరాజ్యమున కభిషేకింతుననుచు, శపథమొనరించెనట! రామచంద్రుఁ డధిప! 323

ఉ॥ కావున నాదువిన్నపముఁగైకొని కయ్యఁపుసేతమాని సు
గ్రీవునితోడ సంధియొనరింపుము శిష్టశరణ్యుఁడైన రా
మావనినాయకుండు నినునాదరమొప్పఁగ సంతతంబునుం
బ్రోవఁగలండు సర్వశుభముల్ సమకూరును వానరేశ్వరా!' 324

గీ॥ అని యనేకవిధంబులఁ దనకుహితముఁ, జెప్పుచున్న వనితపల్కు చెవులనిడక
బేయరజలదరగరంభీరఘోష [illegible] 325

శా॥ 'తారా! నాకును రామభద్రునకునుం దర్కింప లేశంబునున్
వైరంబేమియులేద యాతనికి నెన్నండేని సుంతైన నేఁ
గ్రూరత్వంబునఁ గీడుసేసియెఱుఁగం గోపించి నన్నేల ని
ష్కారుణ్యంబున ధర్మదూరుఁడయి తాఖండింపఁగాఁ బూనెడున్? 326

చం॥ ఇనజునకున్ సహాయుఁడయి యేడ్తెఱవచ్చి నృపుండు నన్నుఁజం
పిన మఱి చంపుగాక! మది భీతిలి భానుజుతోడి సంధికిన్
మనమున నిప్పుడియ్యకొన మానముదక్కునె? నానయుండునే?
నను(గని దాయకోడెనని నవ్వరెభూజను లంబుజేక్షణా! 327

గీ॥ పగతునకునోడి శరణన్న పందజగతి, నరయ జీవన్మృతుండనఁ బరగుఁగాన
వీరధర్మంబుఁబోనాడి వైరితోడ, సంధిసేయుటకేనెట్లు సమ్మతింతు? 328

గీ॥ ఏమియైననుఁగానిమ్ము రాముచేత, జీవములు గోలుపోయినఁ బోవనిమ్ము
భానుసుతుతోడ నేనేమొభండనంబు, సేయుటలుమాన నామాటసిద్ధ మతివ! 329

కం॥ అని యతఁడు భార్యపలుకులు, విననొల్లక మహితరోషవివశాత్మకుఁడై
ఘనముగ గర్జిల్లుచు న, త్యనుపమగతి ననికివెడలె నర్కజుపైకిన్ 330

## వాలిసుగ్రీవుల ద్వితీయయుద్ధము

గీ॥ ఇట్లు పురినిర్గమించి యయ్యింద్రసుతుఁడు, వచ్చుచుండుట గన్గొని భానుజుండు
తానునుంగూడ సింహనాదములతోడ, వీకనెదురేగి వాలిని డీకొనుటయు 331

కం॥ చుఱచుఱఁజూచి పల్కె బలసూదననందనుఁ 'డోరి! భీరుడా!
యిటిముటి నిన్నకయ్యమున నటు పరాభవమంది యప్పుడే
మఱచి మనంబునందు నణుమాత్రముసైతము సిగ్గులేక క్ర
మ్మఱఁ జనుదెంచి తెంతమతిమాలినవాడవొ నీవు' నావుడున్ 332

సీ॥ విని భానుసుతుఁడంత వినుమని వాలితో విశదంబుగానిటు విన్నవించె
'భార్యనుగోల్పోయి బహుకాలమునునుండి భ్రష్టుఁడనై నగుఁబాటుఁజేటుఁ
బొందుచు నీహేయపున్ బ్రదుకిఁకమీద బ్రదుకరాదనుచు భావమునెంచి
క్రమ్మఱవచ్చితిఁ గయ్యంబులోనిన్నుఁ జంపుటొండెను నేను జచ్చుటొండె
గీ॥ నేడునిక్కువమోరోరి! నీతిబాహ్య! రిత్తవోవను నాపల్కు రిత్తగాదు
రమ్ము! ర' మ్మనిచీరి యాగ్రహముఁదోప [illegible] గొండతోడనుగొండతాకునట్లు 333

ఉ॥ ఘోరశిలాప్రహారముల క్షోణిరుహోత్కరతాడనంబులన్
దారుణ ముష్టిఘాతముల దంతనఖాహతులం బరస్పరరో
చ్చారితరోషభీషణవచశ్శితసాయకములఁ గడుంగడుం
గ్రూరత నాటిమర్మములునొవ్వఁగ నిర్వురుఁ బోరిరుద్ధతిన్ 334

సీ॥ ఇబ్బంగిఁదలపడి యింద్రార్కతనయులు తమశరీరము లంబుదములుకాఁగ
నన్యోన్యచటులాట్టహాసమహారావములు మేటిభయదగర్జలనుగాఁగఁ
జులుచుఱ నొండొంటులఁ మిఱుమిట్లు గొనఁజూచు చూపులగమియె మించులనుగాఁగ
నితరేతరప్రయుక్త తతభయంకరకుజ శిలాతతులు పిడుగులనుగాఁగ
గీ॥ మఱిపరస్పరతనువులఁ దఱుచుగా స్రవించుచుండినరక్తంబు వృష్టి కాఁగఁ
బోరఁదొడఁగిరి వానరవీరవరులు, భూతమండలకసమితికిఁ బ్రీతిఁగూర్ప 335

## శ్రీరాముఁడు వాలిని వధించుట

సీ॥ అప్పుడు తరుమూలమందునఁ బ్రచ్ఛన్నగతుఁడయియున్న రాఘవుఁడు శరము
సత్వరంబుగ వింటసంధించి చక్కఁగాలక్షించి యాసహస్రాక్షతనయు
నేసె నేసిన మంటలెగయుచు నమ్మహామోఘదివ్యాస్త్ర మద్భుతముగాఁగఁ
బిచ్చలపిడుగట్లు చెచ్చెఱఁజనుదెంచి యురమున నాటుటయును గరంబు
గీ॥ వివశుఁడై శోణితంబు స్రవించి పాఱ, నమితవిక్రమశాలియైనట్టి వాలి
భూమిపైన హాహారావములు చెలంగఁ, గూలెఁ గత్తిచే నఱికినకుజము మాడ్కి 336

గీ॥ అంత నాతనిసతి తారయాత్మజుఁడగు, నంగదునితోడ నచ్చటి కరుగుదెంచి
వాలిపైవ్రాలి యార్తయై పనవిపనవి, యిట్లువిలపింపసాగెఁ బేరెలుఁగు దోప 337

సీ॥ 'బలవద్విరోధంబుఁ బాటింప నెంతటివానికైనను హానివచ్చునంటిఁ
దమ్ముభార్యనుగొంట తగవుగాదనిచెప్పి వెస నారుమాదేవి నొసఁగుమంటిఁ
బరమసాధువయిన భానుజుతోఁ గంటు విడిచి సఖ్యంబుఁగావింపుమంటిఁ
గారుణ్యనిధియగు నారాముశరణంబువేడుము నిన్నుఁ గాపాడునంటిఁ
గీ॥ గాని నాపల్కు నీవింత్తుకేనివినక, రామభద్రుని సునిశితాస్త్రంబునకును
గట్టి! బలియైతె! నాగ్గతియెట్టులింక?, నిన్నువిడనాడి నేనెట్లు నిర్వహింతు'? 338

కం॥ అని యివ్విధముగ వయిఁబడి, ఘనమ్ముగవిలపించుచున్న కాంతాసుతులం
గనికరమున నూరార్చిన ఘనుఁడగు నవ్వాలి రాముఁగని యిట్లనియెన్. 339

సీ॥ 'పావనంబైన యిక్ష్వాకుకులాంభోధిపూర్ణచంద్రు(డవౌచు( బుట్టినాడ
వామూలముగను సర్వాగమశాస్త్రముల్ శ్రద్ధాపరుండవై చదివినాడ
వెల్లధర్మంబుల నెఱిఁగినదక్షుండ వని జగత్ప్రఖ్యాతి నందినాడ
వవనిలో(గల్గు మహావీరులకునెల్ల( దలమానికంబవై వెలసినాడ
గీ॥ విట్టి మహనీయుడ(వు నీవు కట్ట! వీర, ధర్మమించుకయైనను( దల(ప(బోక
హీనమానవువలె నన్ను మ్రానిచెంత(, బొంచి వంచించి కొట్టంగ భూప! తగునె?·340

సీ॥ సంగరభీరుండు శౌర్యవిహీనుండు నధమాధముండగు నర్కసుతుని(
జేపట్టి త్రిజగదజేయపరాక్రమశౌర్యధుర్యుండన( జనెడునన్ను
నిర్హేతుకంబుగ నిర్జింప(దగునయ్య? యదియె నాతోడిసఖ్యంబె యున్న
నీవఱకేపోయి రావణునేపెల్లమాపి తదీయలంకాపురంబు
గీ॥ వీకమై నేనుబెరికి నాతోకచేత, నెలమిబంధించి కొనితెచ్చి లలనతోడ
నీకడనెపెట్టియుండనె? నృపవరేణ్య!, యేలచేసితి వీపాపకృత్య మీవు? 341

కం॥ శూరశిఖామణివయ్యును, జోరునివలెఁ గొట్టితీవు క్షోణీశ్వర! త
త్కారణమున(జేసి నినున్, దూరవలసివచ్చె నాకు ద్రోహివటంచున్. 342

గీ॥ మీ రఘుకులాన(బుట్టినమేటిరాజు, లిట్టిదుష్కార్యమొనరించి యెఱు(గరెవ్వ
రెన్న( డపకృతి(జేయని నన్ను( జంపి, పొందితివి చిరస్థాయిగా నిందనీవు' 343

సీ॥ అని రామునిందించి యమరేంద్రనందనుం డినజునిదెస(జూచి యిట్టులనియె
'నోరి! సుగ్రీవ! నీ యుల్లంబులోపల గెలిచితినని నీవు తల(ప(బోకు
మిదిగెల్పుగాదు నన్నెంతయువంచించి యినకులపతి కూలనేసెఁగాని
నీవేమిచేసితి? రాము నాశ్రయమున విజయంబునీకు( బ్రాప్తించెఁగాక!
గీ॥ యింతమాత్రమునకె నీవు స్వాంతమందు, వీరపురుషుండనని విఱ్ఱవీగవలదు
నిక్కమూరసిచూచిన నీవొకరణ, భీరు(డవుగాక వీరుండవే? దురాత్మ! 344

ఆ॥ సంగరంబులోన శాత్రవకోటిని(, జంపు(గాక! తాను జచ్చు(గాక!
చేవవీడియిట్లు నీవలె నొరుకోడు, వీరు(డైనవాడు కోర(డెవ(డు'. 345

గీ॥ అనవు( డావాలితోడ సూర్యాత్మజుండు, మారుమాటాడ( దనకష్టు నోరురామి
'మౌనమేమంచి' దనుచు నెమ్మదిదల(చి, తాను మిన్నకయుండ భూజానిపలికె. 346

కం॥ 'ఓయింద్రజ! నీదురణ, న్యాయోపన్యాసమింక వాకడఁజాలున్
మాయుమునోరు యథార్థ, న్యాయము నీయందుఁగలదె యావంతేనిన్? 347

సీ॥ పావనచరితుఁడౌ భానుజుఁ బురినుండి వీతదయుండవై వెడలఁగొట్టి
పాపంబునకుభయంపడక తద్భార్యను బలిమిమైఁగైకొని పట్టినీవు
భోగించుచుంటివి పుడమిలోపలనింక నింతకంటెను ద్రోహ మేమికలదు?
నిర్దోషివలెనీవు నీతులఁబేర్కొని మాపయిఁ దప్పును మోపఁదగునె?
గీ॥ తథ్యమారసి చూచినఁ దప్పనీదె, కాని మాయందు లవమైనఁ గలుగఁబోదు
జగతినీవంటిదుష్టుల సంహరించి, శిష్టులనుగావఁ బ్రతినచేసితిని వినుము. 348

కం॥ కావున ఖలసంహారం, బేవిధిఁ జేసినను దోష మించుకయైనన్
భావింప మాకుఁజెందదు, నీవెటుదూరినను వాలి! నిష్ఫలమెయగున్'. 349

చం॥ అనవిని వాలి తెల్విఁగని యంగదునప్పుడు చేరఁదీసి యా
తని వగమాన్పి యిట్లనియెఁ 'దామరసాప్తతనూజతోడ నే
ననయము వైరమూని తుదకక్కట! యిట్టియవస్థఁ బొందితిం
దనయ! విరోధ మేరికయినం గొనితెచ్చును ముప్పవశ్యమున్ 350

చం॥ మదిఁగడుఁగ్రొవ్వి నేను గృపమాలి సహోదరు నుత్తమున్ మహా
సదయుని భానుపుత్త్రు నగచాట్లనుబెట్టితిఁ గాన తత్ఫలం
బొదవెను నాకు నేటికి సహోదరు హింసలఁబెట్టు దుర్మతుల్
తుదకిటుకూలి నావలెనెదుర్దశలొంది నశింతు రిమ్మహిన్. 351

కం॥ కావున బాలక! నాదగు, చావునకున్ వగవవలదు జననమరణముల్
జీవులకు నైజధర్మము, భావింపఁగ వీనిఁగూర్చి వగవరు ప్రాజ్ఞుల్. 352

గీ॥ సర్వసామాన్యజనులచేఁ జావఁబోక, శ్రీమహావిష్ణువైనట్టి రాముచేత
వీరమరణంబునేను బ్రాపించుచుంటిఁ, జింతయేటికిఁ? బుత్ర! నిశ్చింతగాక! 353

కం॥ నీవిఁక సుగ్రీవునితోఁ, గావింపుము కంటువిడిచి ఘనసఖ్యంబున్
నావలెనె యతఁడు నినుస, ద్భావంబున నరయుచుండుఁ బరమప్రీతిన్ 354

చం॥ అదియునుఁగాక రామవసుధాధిపుమన్ననఁ బొందుమన్న! యా
సదయుఁడు దుష్టశిక్షణవిచక్షణుఁ డాశ్రితవత్సలుండు స
మ్ముదముదలిర్ప సంతతము భూరికృపామతిఁ గాచునిమ్ము నీ
కొదవుచునుండు భవ్యమహోన్నతసౌఖ్యపదాధికారముల్'. 355

సీ॥ అని పుత్రునకుఁజెప్పి యారామచంద్రుని నిసిజునిఁజూచి తా నిట్టులనియెఁ
'బుణ్యాత్ములార! దుర్బుద్ధినై నేను గావించియున్నట్టి తప్పిదములెల్ల
క్షమియింపుఁడీ! నాకు జ్ఞానోదయంబయ్యె నస్మత్తనూభవు నంగదునిఁక
మీకప్పగించితి మీపుత్రుఁగానెంచి యీబాలు రక్షింపు డెలమిఁ దోప
గీ॥ మఱియు మద్దార తారనేమరక సర్వ, విధములం బెద్దగా గౌరవింపుచుండు'
డనుచుఁ బ్రార్థించి నుడివి యయ్యనిమిషపతి, సుతుఁడు వెండియు సుగ్రీవుఁజూచి పలికె.

సీ॥ 'నాసుతునంగదు నీసర్వవానరసామ్రాజ్యమునకధీశ్వరునిఁగాగ
నీయనంతరమందుఁ జేయుము సుగ్రీవ! యిదియె నాకడకోర్కె యెట్టులేని
దీనినిశ్రద్ధతోఁదీర్చి నాయాత్మసంతృప్తిఁ గావింపుము ధీరచరిత!'
యనిచెప్పి యతఁడంత నమరనాథప్రసాదితము భాసురరత్నదీపితంబు
గీ॥ ప్రకటవానరరాజ్యాధిపత్యయోగ్య, సముచితైకలాంఛన నిజచారుహేమ
దామ మినజునకొసఁగి యాదరముతోడ, వెండియును నాతఁడిట్లని విన్నవించె 357

కం॥ 'అనఘా! నీపీహారం, బనియముధరియింపుచుండు మతులశుభంబౌ
వినుఁ భవదనంతరంబిది, ఘనముగ నీయంగదునకుఁ గరుణనొసఁగుమీ' 358

సీ॥ అని తమ్మునకుఁజెప్పి యారామభూపాలునీక్షించి నమ్రుఁడై యిట్టులనియె
'శ్రీరామ! రక్షితశిష్టజనస్తోమ! దూషించితిని నిన్ను ద్రోహినగుచు
నాతప్పుఁగావు పద్వైతస్వరూపుండవగు నిన్ను ద్వంద్వంబు లంట వెట్టి
పాపంబులనునైనఁ బరిహరింపఁగనేర్తు వర్కుండుతిమిరంబు నడఁచునట్లు'
గీ॥ అనుచు వాలిపశ్చాత్తాపమంది రాము, వేయివిధముల స్తోత్రముఁజేయుచుఁ దన
కప్పు డాయాసమెంతయు నధికమగుడు, నసువులనువీడి మోక్షంబునందఁ బోయె. 359

గీ॥ అంతఁ దారయు నంగదుం డతనిపైనఁ, బడివిలాపింపఁ దొడఁగిన వారిఁజూచి
తనకునున్ దుఃఖముదయింపఁ దరణితనయుఁ, డింద్రసుతుఁజేరి తానిట్లు లేడ్వసాగె

సీ॥ 'సకలలోకములేలఁజాలు సప్రతిహతశక్తిసామర్థ్యముల్ చాలియుండి
మేటివీరులలోనమేటివీరుండన ఘనతరప్రఖ్యాతి గలిగియుండి
పేర్కొనఁగారాని వివిధమహైశ్వర్యభోగభాగ్యంబులఁ బొందియుండి
జగతినెవ్వరుఁ బొందఁజాలని గౌరవప్రాభవకీర్తులఁ బడసియుండి
గీ॥ కట్ట! దౌష్ట్యంబుకతమునఁ గడకునీవు, దుర్మరణమును బొందితే? ద్రోహులెల్ల
నిట్లె చత్తురుకాఁబోలు నెవ్వరైన, శాత్రవోన్మాలి! దోర్బలశాలి! వాలి! 361

గీ॥ చారుతరచందనాగరుచర్చితమయి, హంసతూలికాతల్పమం దనవరతముఁ
జేర్పఁదగియెడునీమేను క్షితినిపకట!, ధూళిధూసరితముగాఁగఁ దొడరవలసె 362

గీ॥ నిన్నుఁగూరిచి వాపోవుచున్ననన్నుఁ, గన్నులంజూడ విదియేమికారణంబు?
నిన్నుఁ గృపలేక చంపించియున్న క్రూర, కర్ముఁడనటంచుఁ గాఁబోలుఁ గపలితీవు

కం॥ నీయట్టియగ్రజన్మం, డేయెడనైనను లభించునే యిఁక నాకున్?
నీయెడఁబాటునకోరిచి, పాయక యేపగిదినేను బ్రదుకుదు? వాలీ!' 364

సీ॥ అని యీతెఱంగున నార్తులైపలవించు నాయర్కసుతునిఁ దారాంగదులను
నయ్యయివిధముల ననునొప్పబోధించి శమితశోకులఁజేసి సదమలాత్ముఁ
డైన సుగ్రీవుని నాలోకనముచేసి శ్రీరాముఁడిట్లనుఁ బ్రియముదోపఁ
'దరుచరేశ్వర! యింకఁ దడవుసేయఁగనేల? యింద్రతనూజున కీక్షణంబ
గీ॥ దహనసంస్కారమొనరింపఁ దత్పరుఁడవు, గమ్ము' నావుఁడు రామాజ్ఞ మనుఁడురవిజుఁ
డెంతయునుఁదాను శిరసావహించి యప్పు, డగ్రజునిశవ మగ్నిదాహంబొనర్చె 365

కం॥ తిలపిండోదకదానం, బులు ఘనముగఁజేసె భానుపుత్రకుఁడు మహా
బలశాలికి జయశీలి క, విలరిపువనదావకీలికిని వాలికినిన్ 366

కం॥ ఆవిధమున సుగ్రీవుం, డావాలికి నుత్తరక్రియలఁ జేయఁగఁ దా
బావంబున హర్షించుచు, బూవరుఁడిట్లనియెఁ బ్లవగముఖ్యులకెల్లన్ 367

## సుగ్రీవుని కిష్కింధారాజ్యపట్టాభిషేకము

సీ॥ 'కపిముఖ్యులార! మద్వ్రతరాజ్ఞనుబొంది వేగమె కిష్కింధకేగి మీరు
భానుతనూభవు పట్టాభిషేకంబు సర్వులకును బ్రకాశంబుఁజేసి
నానావిధంబుల నగరంబుఁగైసేసి రమణీయశోభనద్రవ్యసమితి
నంతట నెలకొల్పి యరుదెండు పొం' డన వారును హర్షించి వల్లెయనుచుఁ
గీ॥ బోయి పురమును ద్రుటికాలమున నలంక, రించి సుగ్రీవవిజయసమంచితోరు
ఘనపతాకాళి రచ్చలఁగ్రాలఁజేసి, వివిధవస్తువుల్ సమకూర్చిపేడ్కతోడ 368

సీ॥ అటు పదంపడి కొందఱగచరప్రవరులు పరమసముత్సాహభరితులగుచు
వందిమాగధసూతవైతాళికులతోడ గాయకపండితగణముతోడఁ
బరతత్త్వబోద్ధ సద్గురువరేణ్యులతోడ వినుతపుణ్యాంగనావితతితోడ
నాశీర్వచఃప్రౌఢులగుమహాత్ములతోడ వివిధమంత్రరహస్యవిదులతోడఁ

గీ॥ బటహకాహళగోముఖపణవశంఖ, తూర్యములతోడ వైభవౌదార్యలీల
నెలమినేతెంచి వానరకులపవిత్రుఁ, దోయజాప్తతనూజు నెదురుకొనుటయు. 369

కం॥ అతఁడును బరమానందభ, రితుఁడై సద్భక్తితోడ శ్రీరామునకున్
నతిఁజేసి యిట్లుపలికెను, మితహితవాక్చతురతాసమేతుం డగుచున్ 370

కం॥ 'విచ్చేయు డింక మాపురి, కచ్చుగ మీరుచితవాహనారోహకులై
సచ్చరితులార! మిమునే, నిచ్చలు సేవించుచుందు నిర్మలభక్తిన్' 371

కం॥ అనవిని సుగ్రీవునితో, జనపతియిట్లనియె 'వినుము! జనపదముల మే
మినసుత! తపసులమౌటం, జనదుప్రవేశింప నీవు చను మీపురికిన్ 372

గీ॥ మేమిచట మాల్యవంతమన్ మేటినగము, మీద నివసించుచుందుము మిహిరతనయ!
నీవు శంకింపఁబోకుము భావమందు, వినుము మఱియును నొకమాట విన్నవింతు 373

కం॥ భావింపఁగ నాషాఢము. పోపును నైదాఘదివసములలో నసఘా!
భూవిదితంబుగ నటుపై, శ్రావణమును భాద్రపదము సన్నిహితములౌ 374

కం॥ ఆరెండుమాసములునున్, నారసభపుత్ర! వృష్టిసమయమగుటచే
నారయఁగ జైత్రయాత్రా, ప్రారంభోద్యోగ మనుపపడ దెబ్బంగిన్ 375

కం॥ కావునఁ బ్రావృట్కాలము, పోవుదనుకనుండి మనము పోవుద మవలన్
రావణుఖేఁదునిమి సీతా, దేవినిఁగొనివత్త మార్య! ధీరవిచారా!' 376

కం॥ అని కార్యపుఁదెఱఁగంతయు, నినజునకెఱిఁగించి యంత నినకులపతి యా
తనివీడ్కొని తమ్మునితోఁ, బనివినియెందాను మాల్యవంతంబునకున్ 377

సీ॥ అంత సుగ్రీవుఁ డత్యంతప్రముదితాంతరంగుఁడై సపరివారముగఁ బురముఁ
జొత్తెంచి యొకమహాశుభలగ్నమునఁ దాను గీశరాజ్యమున కధీపఁడగుచుఁ
బ్రాకంటంబుగ యువరాజుఁ యవ్వాలికొమరుండు దీపింప రుమనుగూడి
రోహిణీసహితుఁడై రూఢివెలైడుశీతభానుఁడో! యన నొప్పి వైభవముగఁ
గీ॥ గరము బుజువర్తనుండయి కపిసమూహ, మెలమిఁబొందుచుసేవింప నేలుచుండె
మఱియుఁ దారాదులైయున్న మఘవసుతుని, భార్యలెల్లరు నానందభరితలైరి 378

## వర్షాకాల – శరత్కాలవర్ణనము

సీ॥ తదనంతరంబ సీతావియోగక్లేశపరవశుండగు నిజవంశమణిని
రామునిఁగన్గొని రవి దుఃఖమునమున్గి తనప్రతాపంబెల్ల దాచెననఁగఁ
గ్రమముగా గ్రీష్మము కడునడంగఁగఁజొచ్చెఁ బరబలంబుల రామభద్రుఁడిట్లె
భంజించునన్నట్లు వనవృక్షములఁ గూలఁద్రోయుచు గాలి తోడ్తోడవీచె
గీ॥ దానవులపైకిఁ గోదండధారియగుచు, నంబుదశ్యాముఁడగు రాముఁ డరయ విశ్వ
రూపమిటుపూనెనోయన రూఢిమింట, ఘనపటల మింద్రధనువుతోఁ గలయఁబర్వె. 379

సీ॥ వర్షర్తువిజ్బృంగిఁ బ్రారంభమగుచునా రాముధనుర్గుణరవము లనఁగ
గర్జలొప్పారెఁ దద్దసకోపకలితదృగ్జ్వాలలోయన క్షణప్రభలు పొడమె
రవివంశ్యబాణముల్ రావణుపైనిట్లెపడుననఁ బిడ్గు లెల్లెడలఁ బడియెఁ
దోడ్తో నసురుమేనఁ దొరఁగునిమ్మెయిరక్తధారలునాగ సాంద్రముగ వాన
గీ॥ కొలఁకులును నదులునునిండఁ గురియసాగెఁ, గడుమురిసి సర్వభూతసంఘంబులెల్ల
దశముఖుని రక్తమునఁదోగి త్రాగి యిటులె, కేకలిడునన్నగతినొప్పె భేకరవము 380

కం॥ ఆరెండునెలలు వర్షము, ధారాపాతముగనట్లు ధరయింతయునున్
వారిమయముగాఁగఁ గురిసి, యారయఁదదనంతరంబ యదియుడుగుటయున్ 381

గీ॥ కష్టతిమిరంబునుంబాసి కడకు రాముఁ, డరయ నిమ్మెయిదీపించు నన్నమాడ్కి
మబ్బులెల్లఁ గ్రమంబుగ మాసిపోవఁ, బ్రస్ఫుటంబుగ వెల్గొందెఁ బద్మసఖుఁడు. 382

శా॥ శ్రీరామక్షితినాథు శాశ్వతసుకీర్తిజ్యోత్స్న యీభూమిపై
నారూఢస్థితి నిట్టులేనిలుచుస మ్మన్నట్లు సూచించుచున్
నీరేజారి చకోరసంతతులకుం జిత్తప్రమోదంబుఁ జే
కూరంజేసి శరత్ప్రబోద్ధయయి చక్షుఃప్రీతిగా రాజిలెన్ 383

ఉ॥ రావణుతోడఁబోరుటకు రాముని వెంట నగణ్యకీశసే
నావళియిట్లెపోవునన నభ్రపథంబునఁ జంద్రుఁగూడి తా
రావళి తల్కుతల్కుమని యారయ లెక్కకు మిక్కుటంబులై
క్ష్మావిదితంబుగా వెలుఁగసాగెను శారదరాత్రులందునన్ 384

## శ్రీరాముఁడు సీతావియోగముచే దుఃఖించుట

కం॥ ఆశారదరాత్రులలో, నాశరదిందుముఖియైన యాజానకినిన్
దాశరథి కరము మదనా, వేశమునస్మరించి యిట్లు పేర్కొని వగచెన్ 385

గీ॥ 'ఈశరద్రాత్రులందు నేనింతిఁగూడి, యెలమిఁగ్రీడించుభాగ్యంబు కలుగదయ్యె
నెటుభరింతు? వియోగాబ్ధినెటుతరింతు?, నిమ్మహోమన్మథోద్రేక మెటుహరింతు? 386

ఉ॥ మాటికిమాటికింజెలఁగి మంజులశింజినిరావమొప్పఁ బెం
గాటముగాఁ బ్రసూనశితకాండపరంపరనెక్కువెట్టి బల్
సూటిగ నాపయింబఱిపి స్రుక్కఁగఁజేయుచునున్నవాడు మో
మోటయొకింతలేక సిరిపుత్రకుఁ డక్కట! యేమిసేయుదున్? 387

గీ॥ నాడు రావణుచేత జానకినిఁగోలు, పోయి యవమాన మదికొంత పొంచవలసెఁ
బువ్విలుతుచేత ధృతినిఁగోల్పోయినేడు, పూర్ణపరిభూతి నిజముగఁ బొందుచుంటి. 388

సీ॥ ఆసీతముఖచంద్రుఁడస్మన్నయనచకోరములకు నెప్డు దర్శనమొసంగు?
నాసాధ్విమృదుమధురాలాపములుపల్కి వీనులకెప్పుడు విందుఁగూర్చు?
నానాతివాతెఱతేనియల్ గ్రోలించి ఘనతృప్తియెప్పుడుకలుగఁజేయు?
నాతన్వినిజశరీరాశ్లేషసుఖమిచ్చి దేహతాపమెపుడు దీర్చితేర్చు?
గీ॥ తెఱవపొందెప్డు నాకుసిద్ధించునొక్కొ?, యెప్పుడీయంగజోన్మాద మీగుడునొకొ?
మఱల మునుపటియట్టుల మహిత లలిత, సౌఖ్యములనెప్డు ప్రాపింపఁజాలుదునొకొ?'

సీ॥ అని రాముఁడివ్విధంబునఁ జింతసేయుచు విరహతాపంబు దుర్భరమయి తను
బాధింపఁ గాలయాపనమునకోర్వక తనపట్ల భానునందనుఁడుపేక్ష
వహియించెననుచు భావంబుననూహించి యతనిపైఁ దద్దయు నాగ్రహించి
కనుఁగవవిస్ఫులింగమ్ములురాలంగఁ గనుబొమల్ముడివడఁ గటములదరఁ
గీ॥ బండ్లుపటపటగొఱుకుచు భయదచటుల, జలదగంభీరపరుషభాషణములొప్పఁ
బావనుండగు లక్ష్మణస్వామితోడ, నిట్టులనియెను వీరత్వ ముట్టిపడఁగ. 390

సీ॥ చూచితే సౌమిత్రి! సుగ్రీవువైఖరి మదనుగ్రహంబున మహితరాజ్య
విభవంబుఁబ్రాపించి వీతజ్ఞుఁడై క్రొవ్వి నన్నేమి తలఁపకయున్నవాడు
కన్నులు తలకెక్కఁగాఁబోలువానికి లేనిచో నింతయెల్లిదముగాఁగ
నన్ను భావించునే? నాతినిఁగోల్పోయి పరితపించుచునుండ భార్యతోడఁ

గీ॥ దాను బురియందు సుఖముండె( దగ వెఱుంగ, కిట్టిఖలుని( గృతఘ్నుని నేమిసేసి
నను నసుములేదు నరకమంతకునులేదు, కాన వధకర్తు( డా పాపకర్ము( డీపుడు. 391

గీ॥ వానకాలంబు(గడపి రావణుని పైకి, దండువెడలుదమనిచెప్పు( దరణిసుతు(డు
వల్లెయని నేడునను(దనపనులుదీర, మఱచియున్నాడుగద! రాజ్యమదము చేత 392

కం॥ కావున( దత్ఫలమిప్పుడె, నావలనం బొంద(దల(చె నగచరపతి సు
గ్రీవు( డటులేకయుండిన(, గావరమున నన్ను పేక్షగావింప డిటుల్ 393

చం॥ తనకు వినాశకాలమదిదాపురమై విపరీతబుద్ధి యా
తనికుదయించె(గాక! మఱి దానికినిన్ మనమేమిసేయనౌ?
ఘనవిధియెట్టులుండె నటుగాకది యెమ్మెయినైన( దప్పునే?
దినకరసూనునిన్ వలయుతీరున దండితు(జేయ(గా( దగున్' 394

కం॥ అని కోపంబున( బలుకుచు, జనపతి తానపుడు విల్లు(జయ్యన(గొనుడుం
గని భావికార్యవిధమె, ల్లను మదినూహించి పతికి లక్ష్మణు( డనియెన్ 395

చం॥ 'ఇనకులనాథ! మీరు మదినించుక శాంతము(బట్టుకొల్పి నా
మనవిని( జిత్తగింప(దగు మంచియు(జెడ్డయు బాగుగావిమ
ర్శనమొనరింప కేపనులు సైతము(జేయ నుపక్రమింపరా
దనుటకు లేడియే ప్రబలమైన నిదర్శనమయ్యె( జూడ(గన్ 396

గీ॥ కాన తొందరపడి యెట్టికార్యమేని(, జేసినను గీడుమూడుట సిద్ధమనఘ!
పొస(గ యోచించి మది శుభము(దలపోసి, కార్యనిర్వహణమునకు( గడ(గవలయు.

గీ॥ మనకు సాధింపరాని యాపనులుగలవె?, చేయవలెనన్న నెపుడైన( జేయ(గలము
కాని తొందరయేటికి? దేనికైన(, జెల్లియుండియు సైరణసేయుటొప్పు 398

సీ॥ ఇంతకు మనమిప్పు డినతనూభవు నభిప్రాయంబెఱుంగక వైరమూని
హింసించుటకు నుత్సహింపంగనేటికి? నే(బోయి తదుదంతమెల్ల నెఱి(గి
కొనివత్తు మీరింక(గోపంబువీడుడు తథ్యంబుగావాడు తప్పు(దల(చి
యున్న నిప్పుడొనర్పునున్న యాదండన మప్పుడొనర్పమే తప్పకుండ?'
గీ॥ నని యనేకవిధంబుల నాసుమిత్ర, పట్టిచెప్పిన నాలించి భానువంశ్యు(
డాగ్రహాటోపమొక్కింత నిగ్రహించి, యనుజుదెస(జూచి తగనిట్లు లనుచునుడివె 399

## రామాజ్ఞచే లక్ష్మణుఁడు కిష్కింధకేగి సుగ్రీవునిఁదోడ్కొని వచ్చుట

సీ॥ 'మంచిది! సౌమిత్రి! మఱి యట్టులేనినీ వింకనుదడసెద వేటి? కిపుడె .
భానుతనూభవుపాలికిఁ బనివిని మనకార్యమున కణుమాత్రమైన
తగుయత్నమాతఁడు తాఁజేసియుండెనా యిందుఁదోడ్తెమ్ము లేదేనివాని
వాలిపోయినత్రోవఁ బంపింతుమనిచెప్పి ననుజేరరమ్ము పొ' మ్మనివచింప
గీ॥ రామునకుమ్రొక్కి లక్ష్మణస్వామియపుడు, ధృతతనుత్రాణుఁడును మహాదివ్యబాణ
చాపధరుఁడయి రౌద్రంబు రూపమూనె, ననఁగ రోజుచుఁ గిష్కింధ కరుగుదెంచె. 400

చం॥ అట రవిపుత్రుఁ డాత్రమున నాచసుదెంచుచున్న లక్ష్మణుం
బటుతరవిక్రమోజ్జ్వలునిఁ బాయక దవ్వులఁజూచి తన్మహో
చటులదురాగ్రహాకృతికిఁ జాలభయంపడి చెంతనున్న మ
ర్కటులను జీరి యిట్లనియెఁ గంపితుఁడై చెమటల్స్రవింపఁగన్. 401

చం॥ 'ఇటు తిలకింపుడీ తరుచరేశ్వరులార! సటావిలుంఛనో
త్కటచటులాగ్రహెలాన్మదమృగప్రభుచందముఁ దోపఁగన్ సము
ద్భటసముదగ్రరోషమయపావకుఁడై విలుఁబూని లక్ష్మణుం
డిట కరుదెంచుచుండె మఱి హేతువదేమయియుండునో గదా? 402

కం॥ తనయందుపేక్ష సేసితి, నని రాఘవుఁడాగ్రహించి యక్కట! యితనిన్
ననుదండితుఁజేయుటకై, పనిచెను లేకున్నవేఱుపనియే మలుగన్?' 403

కం॥ అని తర్కించుచు రవిజుఁడు, మనమున భయభక్తిసంభ్రమంబులు దోడ్తోఁ
బెనఁగొన వనచరులును దా, నినవంశ్యునకెదురువచ్చి యెంతయుఁబ్రీతిన్. 404

కం॥ ఆసౌమిత్రికి నొకయుచి, తాసనమిడి 'కూరుచుండు' డనివేడిన నం
దాసీనుఁడుగాక యతం, డీసునురోసంబు దోప నిట్లని పలికెన్. 405

కం॥ 'నీకార్యముకొనసాగఁగ, మాకార్యంబపుడె నీవు మఱచితివౌరా!
నీకంటెఁ గృతఘ్నుండా, లోకింప మఱొకఁడుగలఁడె లోకములోనన్? 406

శా॥ చాలుంజాలు భవత్సపర్యలఁగొనన్ స్వాంతంబునం గోరి నే
రాలేదిప్పుడు నీమదంబడఁప శ్రీరాముండు తాఁబంపినం
గూళా! వచ్చితి మాటలేల? మఱి నీకుంజూపుసిద్ధంబు కా
నీ లాభంబిఁకశ్రేధు .ధూర్తవిషయం బీవెంతగాఁ జూపినన్. 407

శా॥ వాలింగీటడఁగించి రాజ్యము భవత్స్వాధీనముం జేయఁగా
వాలాయంబుగ నేలుకొంచు మదిగర్వంబెక్కి నీవౌర! మా
మేలుంగోరఁగనొల్లవైతివటె! దుర్మేధానిధీ! నీకిదే
కాలంబిప్పుడె మూడనున్నయది మత్కాండప్రహారంబులన్ 408

ఉ॥ అక్కఅలెల్లఁ దీరిన మహాత్ముల నిమ్మెయి ధిక్కరింపఁగా
నక్కట! న్యాయ్యమే? పరకమందఁదలంచితె క్రొవ్వి? రావణుం
డొక్కఁడె మాకుశత్రువని యుల్లములోఁ దలపోయుచుండ వే
ఱొక్కఁడ నీవుసైతము సముద్భవమొందితివా? మదాంధుఁడా!' 409

కం॥ అనవిని గడగడవడఁకుచుఁ, దనువున స్వేదంబుపొడమఁ దడఁబడనుడువుల్
జనితభయుఁడగుచు లక్ష్మణుఁ, గని రవిజుఁడుపలికె నిటలఘటితాంజలియై. 410

చం॥ 'కరుణదలిర్ప నాకు నుపకారమొనర్చినరామచంద్రునిన్
నిరతము వాఙ్మనఃక్రియల నేఁబరదైవముఁగాఁగఁ గొల్తు ని
చరణములాన నాపలుకు సత్యము లక్ష్మణ! ద్రోహబుద్ధినై
హరి! హరి! స్వప్నమందయిన నమ్మహనీయుని విస్మరింతునే? 411

కం॥ ఆరామునకునుఁ బ్రత్యుప, కారముఁజేయక యుపేక్షగావించినచో
వారావణువలె నిహపర, దూరుఁడనై చెడనె? నేను ద్రోహినిఁగానే? 412

శా॥ ఈనా వానరరాజ్యమెల్ల మఱి మీదేకాదె? నా భృత్యులున్
నేనున్ మీయుపచారతత్పరులమై నిశ్చింతగా నెద్దియేఁ
గానీ తీర్పఁగలార మల్లమునఁ గిన్కన్ వీడుడీ! నేనుదా
హీనత్వంబువహింపలేదు వినుఁడీ! శ్రీరాముకార్యంబునన్ 413

గీ॥ జగతిఁ బలుచోట్లనున్న మాసైన్యములకు, నరయ నాహ్వానపత్రము లంపినాడ
వారికై వేచియుంటిఁ దత్కారణమున, నించుకాలస్యమయ్యె మన్నించవలయు'. 414

గీ॥ అని యనేకవిధంబుల నర్కసుతుఁడు, వేడికొనుటయు సౌమిత్రి విగతరోషుఁ
డగుచుఁ దత్పర్యలఁబొందె నంతలోన, నలుదెసలనుండి కీశసైన్యములు వచ్చె 415

సీ॥ అప్పుడు సుగ్రీవుఁ డతివినమ్రుండయి యినవంశ్యతోడఁ దా నిట్టులనియె
'చూచితే? లక్ష్మణ! క్షోణియానినయట్లు చనుదెంచెఁ గపిసైన్యసముదయములు
వీరందఱును మహావీరులు వీరుచూడనియట్టి నెలవు లెందునులేవు
జానకియెందున్నఁగాని తప్పకచూచిరాఁగల రిది యథార్థం' బటంచుఁ

ఆ॥ బెక్కుగతులఁ బ్లవగవీరులనగ్గించి, రామునను జువెంట రవిసుతుండు
సకలవానరబలసహితుఁడై యమ్మాల్య, వన్నగంబుఁజేర బయలుదేరె. 416

కం॥ కపిసేనలకోలాహల, విపులరవంబాలకించి పృథ్వీశుఁడు తా
నపుడు విగతకోపుండై, యపరిమితానందమొందె నా తరుణమునన్ 417

సీ॥ అంత వానరనాథుఁ డామాల్యవంతముపైనున్న శ్రీరామభద్రుకడకు
నరిగి సేనలనెల్ల నచ్చటవిడియించి తాను లక్ష్మణసమేతముగ రాము
పాదపద్మములకు భక్తిభావంబునఁ బ్రణమిల్లుటయు భానువంశతిలకుఁ
డతనిలేవఁగనెత్తి యనునయంబుగఁబల్కె. 'నీకు సౌఖ్యమెకద? యోకపీంద్ర!
గీ॥ నాకు నీదర్శనంబెన్నినాళ్ళకయ్యెఁ, గార్యభారమొ॥ నాయభాగ్యంబొ! కాని
యింతవఱకును నీకువిశ్రాంతిలేక, పోయెఁగాఁబోలు రాలేకపోయితీవు! 418

చం॥ అవసరమెల్లఁదీరె నిఁక నారఘురామునిచెంతకేగ నా
కవసరమేమిలే దనుచు నాత్మగతంబున నిశ్చయించియో
రవిసుత! నీవు నాకడకురాక మదించి యుపేక్ష చేసినా
డవని మనంబునందున దృఢంబుగ నేఁదలపోసియుండితిన్ 419

ఉ॥ చుక్కలఱేనికై యెదురుచూచెడునట్టి చకోరకంబటుల్
పెక్కుదినాలనుండియును వేచితి నీదగురాకకేను నీ
విక్కడికింకరావనుచునెంచి తపించితి నేటి కెట్టులో
చక్కగ నాకుదర్శనమొసంగి కృతజ్ఞుఁడవైతి వర్కజా!' 420

కం॥ అనిపలికిన యాపలుకులు, తనకున్ బాణంబులట్లతాక హరి! హరీ!
యని చెవులుమూసికొని యి, ట్లనియెం గేల్మోగిచి రవిజుఁ డతివినయమునన్. 421

ఉ॥ 'మీకరుణావిశేషమున మేటివిపత్తులనెల్లఁబాసి నే
బ్రాకటరాజ్యముంబడసి వర్ధిలుచుంటిని ద్రోహబుద్ధినై
మీకుపకారమొల్ల కెటుమిన్నకయుందును? రామచంద్ర! నన్
లోకులుతిట్టరే పరమలోభి కృతఘ్నుఁడటంచు నిచ్చలున్? 422

కం॥ ఆయపకీర్తిభరించుమ, హేయంబుగమనుటకంటె వెలమిఁ ద్వదర్థం
బీయంగమ్ముఁ దృజియించిన, శ్రేయోదాయకముగాదె? చిరకాలంబున్ 423

సీ॥ మీకుభృత్యుండను మిత్రుండనేకాని తలఁపశత్రుఁడఁగాను తథ్యముగను
నన్నుమన్నింపుడు నరనాథ! మీపట్ల నిర్లక్ష్యమునఁజేసి నేనుపేక్ష
గావింపఁగాలేదు నావిన్నపంబిదేచిత్తగింపుడు నాదు సేనలెల్లఁ
బలుచోట్లనుండుటవలన వారలఁ బిల్వనంపుచు మఱి కాలహరణమయ్యెఁ
గీ॥ గాని నినువిస్మరింప నిక్కముగ నేను, బ్రాణమర్పించియైన మీపను లొనర్తు
నిపుడె సీతనువెదుక నాకపిబలముల, నలుదెసలకన్పువాఁడ' ననివిని నృపతి 424

ఆ॥ 'అట్టులేనినింక నాలస్యమేటికిఁ, బంపుమనఘ! నీదుభటుల' ననినఁ
బ్రముఖులైనయట్టి వానరోత్తములను, దరికిఁజీరి యపుడు తరుచరపతి 425

గీ॥ భూరిబలుఁడైన వినతునిఁ బూర్వదిశకు, ధీరునిసుషేణుఁ బశ్చిమదిక్కునకును
శతబలిని నుత్తరమునకుఁ జనుఁడనిపచి, యించి యొక్కమాసమవధి యిచ్చి మఱియు

గీ॥ నీలుఁడును జాంబవంతుఁడు వాలికొడుకు, గాలికొమరుండు గవయుఁడు గంధమాద
నుఁడు గవాక్షుఁడు గజుఁడు మైందుఁడు ద్వివిదుఁడు, విజయుఁడును దారుఁడను
కపివీరవరుల- 427

కం॥ సన్నిధికిఁజీరి వారిని, మిన్నగనగ్గించి పలికె 'మీరీక్షణమే
యెన్నఁగ దక్షిణదిశకుం, బన్నిద్ధులుపోయి సీతవార్తను దెండీ! 428

గీ॥ గడువుదాటకమున్నె యాపుడమిపట్టి, జాడఁగనిపెట్టి చనుదెండు సత్వరముగ
గర్వమున నాలసించినఁ గఠినముగను, శ్రీరఘూద్వహునెదుట శిక్షింతుమిమ్ము'. 429

## శ్రీరాముఁ డాంజనేయునకుఁ దనముద్రిక నిచ్చుట

కం॥ అనికరినంబుగ భానుజుఁ, డనుజ్ఞయొసఁగి పయనమున కభిముఖులను జే
సినసప్పుడు శ్రీరాముం, డనిలతనూభవునిఁజూచి యాత్మగతమునన్ 430

చం॥ 'తనకును సూర్యసూనునకుఁ దద్దయు సఖ్యముసంఘటించియుం
డినమహితాత్మకుండుఁ గడునిర్మలభావుఁడు మేటిధీరుఁడా
ఘనుఁడగు వాయుజుండు నిజకార్యముసేయఁగనోపు' నంచుఁ దా
ఘనముగవిశ్వసించి కుతుకంబుననాతనిఁజీరి యిట్లనున్. 431

కం॥ 'నీవందఱిలో ఘనుఁడవు, పావని! మత్కార్యమెల్లభంగుల నీచేఁ
గావలయు ననుచుఁ దలఁచెదఁ, గావున నొకమాటవినుము కడుశ్రద్ధమెయిన్ 432

కం॥ వాయుతనూభవ! సీతకు, మాయోగక్షేమమెల్ల మఱితెలియంగా
'నాయుంగరమిచ్చెదఁ-గొని, పోయియొసఁగు' మనుచు రామభూవరుఁ-డంతన్.- 433

కం॥ తన వ్రేలిముద్దుటుంగరం, మనిలసుతునకొసఁగి 'యింకనరుగుం' డని య
య్యినకులపతి దీవించిన, ఘనులాపన్నిద్ద అమితకపిసేనలతో 434

కం॥ రామునకును రవిసుతునకు, వేమఱు జోహారొనర్చి వెడలిరి చటులో
ద్దామపరాక్రమభుజబల, ధాములు కపియోధవరులు దక్షిణదిశకున్. 435

గీ॥ వినతుఁడాదిగాఁ గల కపివీరులు పరి, వారములతోడఁ బూర్వదిగ్భాగమునకు
నరిగి నానాస్థలములందు ధరణిసుతను, వెదకి రాహారనిద్రలు విడిచిపెట్టి. 436

కం॥ ఘనుఁడు సుషేణుఁడు పశ్చిమ, మునకున్ సైన్యములతోడఁబోయి మహోకా
నన గిరిజనపదములయం, దును నన్వేషణము సేయఁదొడఁగె నవనిజన్. 437

కం॥ శతబలి కపిసేనాసం, యుతుఁడయి యుత్సాహమొప్ప నుత్తరదిశకే
గి తరణికులుఁడగురాముని, సతినిని వెమకసాగె నన్నిస్థలములయందున్. 438

కం॥ ఇక్కరణిఁబోయి బహువిధ, పక్కణములు గిరులు వనులు బహుదేశములుం
బెక్కులగుపురద్వీపము లక్కజముగ వెదుకఁదొడఁగి రగచరు లతివన్ 439

గీ॥ ఇటు రఘూత్తముఁ డావానరేంద్రుతోడఁ, దమ్ముఁడునుదాను మాల్యవంతంబుపైన
నుండి తహతహతో వేచియుండె సీత, వార్తయేమనితెత్తురో వనచరులని. 440

సీ॥ అంత నాపిమ్మట నరయఁబ్రాక్పశ్చిమోత్తరదిగంతరముల కరిగియున్న
విపులపరాక్రమోపేతుఁడౌ వినతుండు కేసరివిక్రముఁ డాసుషేణుఁ
డరిభయంకరుఁడైన యాశతబలియును దమతమకీశసైన్యములతోడ
నఖిలదేశములందు నన్వేషణముచేసి జానకియుండిన జాడనెందుఁ
గీ॥ గాన కందఱు మిక్కిలిదీనవదను, లగుచు మాసంబులోపల మగిడివచ్చి
రామచంద్రున కాదినరాజసుతున, కాయుదంతంబునెఱిఁగించి రానతులయి. 441

చం॥ అదివిని యుత్తలంబొదవ నారఘురాముఁడు వారినెల్లరం
బదుడని యాత్మభూములకుఁ బన్నుగఁబోవఁగఁబంచి 'యింక యా
మ్యదిశకుఁబోయినట్టి కపు లంగనపోఁబడి యేమితెత్తురో
యదియునువిందుఁగాక, యని యాతురుఁడై తగవేచియుండెఁ దాన్ 442

సీ॥ అటనాడు యామ్యదిగంతంబునకుఁబోయినట్టి యంగదముఖ్యు లదియిదియన
కఖిలప్రదేశంబు లవలీలఁగ్రుమ్మరి పొలఁతినివెదకుచుఁ బోవుచుండ
నొక్కచో నీరువట్టొదవిన నడవిలో వారికెందును వారియున్న
చోటుగాన్పింపమి స్రుక్కుచు 'హారామ! యిట్టిపిపాస మేమెఱుఁగ మెపుడు.

ఆ॥ పెదవులెండిపోయె నుదకముల్మాకిందుఁ, జూపువారలెవరుఁ దోపరకట!
యేమిసేయువార? మింకనెయ్యదిదారి?, భరముగాఁగఁదోచె బ్రదుకుమాకు. 443

ఉ॥ ఐనను మేము చాపునకునంతగభీతిలఁబోము నీకునై
మేనుఁదొరంగుటెల్లఁ గడుమేలయగుం బరికించిచూచినం
గాని మహానుభావ! తమకార్యముమాత్రముఁ బూనితీర్పఁగా
లేని కొఱంతయొక్కటె చలింపఁగఁజేయుచునున్న దిత్తఱిన్' 444

కం॥ అనియిట్లు పరస్పరముగ, ఘనచింతాక్రాంతులగుచుఁ గపివరులుండన్
వినవచ్చెను గొండొకడ, వ్వన బహువిధజలవిహంగభూరిరుతంబుల్, 445

ఉ॥ వారలు తత్క్షణంబ యట వారిరుహాకరమొం డవశ్యముం
జేరువనున్నదంచుఁ దమచిత్తములందుఁ దలంచి గ్రక్కునన్
ధీరగుణోత్తరుల్ బయలుదేరఁగ నాడెన కొక్కబల్బిల
ద్వారము లోచనంబులకు బాగుగగోచరమయ్యె ముందటన్. 446

ఉ॥ అప్పుడు వానరప్రవరు లాగుహడాయఁగఁబోయి చీకటుల్
గప్పి మహాభయంకరముగాఁ గనుపట్టుచునున్నదానిలోఁ
దప్పకచొచ్చి భీతిలక తారటు కొండొకదవ్వుఁబోవుచో
విప్పగు చీకటుల్విరిసి వెల్తురుదోచెఁ గ్రమక్రమంబుగన్. 447

ఆ॥ అమ్మహాప్రకాశ మదియేమొచూతము, గాక యనుచుఁదలఁచి కపులుపోవ
వచట నద్వితీయమైనపట్టణమొండు, లోచనోత్సవముగ గోచరించె. 448

ఉ॥ ఆనగరం బపూర్వమహిమాద్భుతసుందరమయ్యు నిర్జనం
బైనటులుండఁజూచి కపులందఱు నచ్చెరువొంది 'బాపురే!
దీనికి నేపురంబులును దీటనిచెప్పఁగరాదు భారతీ
జానికినైననుం బొగడసాధ్యముకాదుగదా' తలంపఁగన్ 449

కం॥ ఇట్టియసమానసుందర, పట్టణమున హేతువేమొ? ప్రజలెవ్వరుఁజూ
పట్టరుగద! దీనినిమతి, నట్టడవిని వెవఁడుగట్టె? నాథుండెవఁడో?' 450

కం॥ అని తలపోయుచుఁబొగడుచుఁ వనచరులాపురముఁజొచ్చి వడి వెల్లెడలం
గమఁగొనుచుఁదిరుగుచుండఁగఁ, గమద్దోయికి విందుఁగూర్చఁగా వారికటన్ 451

కం॥ ఒకదివ్యసౌధరాజము, ప్రకటితముగఁ గోటిసూర్యభాసురమై వా
రికిఁగాన్పించుటయును గదుఁ, జకితులగుచు దానిలోన సత్వరమెతగన్. 452

కం॥ బెదరకప్రవేశమొనరిచి, తదీయనిర్మాణచతురతకుమెచ్చుచు నా
సదనమునఁగల్గువింతలు, పదిలంబుగఁగాంచుచుండ వారికి నచటన్. 453

## అంగదాదివానరులు స్వయంప్రభను దర్శించుట

సీ॥ చందురులోనున్న సౌందర్యసారంబు మూర్తీభవించి విస్ఫూర్తిమించి
మరుశరంబులగెల్చి మహితచంచలలకుఁ జపలతనొసఁగు దక్షతవహించి
తుమ్మెదబారుల తోరపుఁగప్పెల్లఁ గలయంగఁబెరసిన కరణినొప్పి
చక్రవాకంబులసరకుసేయకమేల్మి బంగరుబంతుల బాగునంది
గీ॥ ముద్దుమొగమును గందోయి ముంగురులును, నొద్దికలకిక్కలైపొల్పు నురుకుచంబు
లందమునుఁగూర్ప సర్వాంగసుందరియగు, కామినీరత్నమోర్తు సాక్షాత్కరించె. 454

కం॥ ఆనారీమణి తల్పము, పైనందనమేనుఁజేర్చి భావింపఁగ బ్ర
హ్మానందమయాకారము, తానయనఁగ నెగడియుండి దరిసినకపులన్ 455

కం॥ కనుఁగొని సంభ్రమమొలయఁగ, ఘనతల్పముడిగ్గనటికి కపులకెదురుగాఁ
జని తోడితెచ్చి యుచితా, సనములఁగూర్చుండఁజేసి శ్రద్ధాపరతన్. 456

పంచచామరము॥ తదీయదీనభావముల్ నిదానమొప్పఁజూచి బల్
క్షుధార్తులుం దృషార్తులౌచు స్రుక్కిరంచు నాకపుల్
మదిందలంచి కొన్నిపండ్లు మంచినీరుఁదెచ్చి తా
నుదారబుద్ధిదోప నప్పుడుత్పలాక్షి యిచ్చినన్ 457

ఉత్సాహవృత్తము॥ ఆదరంబుతో ఫలంబు లారగించి యంబువుల్
మోదమొప్పఁగ్రోలి యామెబుద్ధి కాత్మమెచ్చుచున్
సేదదేరిరంతవారు చెల్వతోడ వాయుజుం
డౌదలంగరంబువంచి యబ్లెమొక్కి యిట్లనున్. 458

శా॥ 'అమ్మా! యెంతటిపుణ్యశీలవొకొ! మా కాతిథ్యమర్పించి జీ
వమ్ముల్నిల్పితి నిన్ను సంస్తవమొనర్పన్ శక్యమే? నీదు వం
శమ్మున్ నామమదేదొ? యెవ్వతెవు? దాచంబోక నీవీయర
ణ్యమ్మందొంటిరిగ్గాగనుండఁబనియేలాకల్గెనో తెల్పుమా?' 459

కం॥ అనవిని హనుమంతునిఁగని, మనమునహర్షంబునొంది మధురోక్తిలని
ట్లనిపల్కె మహితసద్గుణ, ఖనియగు నాయన్నుమిన్న కపులెల్లవినన్. 460

కం॥ 'నాపేరు స్వయంప్రభ వినుఁ, డీపురము మయాఖ్యదనుజుఁ డిటనిర్మాణం
బోపికతోఁజేసి ముదం, బేపారఁగ దివ్యవనిత హేమాభిఖ్యన్. 461

కం॥ తనయిల్లాలిగఁగైకొని, యనిశంబీపురమునన్ మయాసురుఁడుండం
గినిసి సురాధీశ్వరుఁడా, దనుజునివధియించి హేమఁ దాఁగొనిపోయెన్ 462

శా॥ నేనాహేమకుఁజెల్మికత్తెనగుదున్ నిర్వాణవాంఛారతిన్
శ్రీనారాయణపాదపద్మయుగముంజింతించి సేవించి ని
త్యానందంబును బొందుచుందుఁ గపులారా! మీరలెవ్వారలో
వీనున్దోయికి విందుఁగూర్పఁగ భవద్వృత్తాంతముం దెల్పుడీ? ' 463

## హనుమంతుఁడు స్వయంప్రభతో సీతాన్వేషణవృత్తాంత మెఱిఁగించుట

కం॥ అనవుఁడు వాయుసుతుండా, వనితామణికిట్టులనియె 'వనజాతాక్షీ!
విను సాకేతపురనిలయుఁ, డినవంశ్యుండైన దశరథేశునితనయుల్. 464

సీ॥ రామలక్ష్మణులనురాజన్యశేఖరుల్ దండకాటవులందుఁ దండ్రిపంప
వచ్చి పావనపంచవటియనుస్థలమున వసియించుచుండ రాక్షసకులేశుఁ
డైనరావణుఁడు మహాపతివ్రతయగు నారామునతినిఁ దానపహరించి
కడిమిమైఁ దనదు లంకాపురంబునకును గొనిపోవుటయు రఘుక్షోణిధవులు

గీ॥ పడఁతిమిన్నను రోయుచు నడవులందుఁ, దిరుగుచుండఁగ శబరియం దెఱవ తమకుఁ
బేర్మిఁదోపఁగ సుగ్రీవుఁ బెంపునుడివి, యతనితో సఖ్యమొనరింపు డనివచించె 465

గీ॥ ఆమెపలుకులుపాటించి యర్కవంశ్య, లాక్షణము ఋష్యమూకాద్రి కరుగుదెంచి
కీశనాయకుఁడైన సుగ్రీవుతోఁడఁ, జెలిమిగావించి పిమ్మటఁ గలహమందు. 466

కం॥ వాలిని శాత్రవమదని, ర్మూలినిఁ బరిమార్చి భానుపుత్రకునిం ద
త్పాలితకిష్కింధాపురి, కేలికఁగాఁజేసె రాముఁడెంతయును గృపన్ 467

సీ॥ అప్పు డస్మత్ప్రభుఁడగు సూర్యసుతుఁడు సుగ్రీవుండు హర్షించి భావమందుఁ
దనకటు లుపకారమొనరించియుండిన యారామమూర్తికి నరయఁదాను
గ్రమ్మఱఁ బ్రత్యుపకారంబుఁగావింపఁదలపోసి తనకపిబలములనొక
నెలకులోపల రామునెలఁతయౌ సీతను వెదకిరండనిచెప్పి వేగఁబంప

గీ॥ గొందఱుం దూర్పుదిక్కునకు మఱికొంద, ఱుత్తరమునకుఁ బడమర కొనరఁగొంద
ఱేగియున్నారు యామ్యదిగ్భాగమునకు, వచ్చితిమిమేము కపిసేనబలిసికొలువ. 468

కం॥ అరిగినచోటికెక్రమ్మఱ, నరుగుచు నిదియదియనక యన్నినెలవులం
దిరుగుచు మదివేసారక, తరుణివెదకుచుంటిమమ్మ! తరుణేందుముఖీ! 469

ఆ॥ కాని యింతవఱకుఁ గాంతజాడయునొండె, మఱియు లంకయుండు మార్గమొండె
నెలత! యెఱుఁగమమ్మ! నేడుపిపాసచే, నోడి యిట్లొ దైవయోగమునను 470

ఉ॥ చొచ్చినవారమీబిలముఁ జూడఁగఁగంటిమినిన్ను నిచ్చటన్
హెచ్చుగఁబండెమాసుకృత మేమనిపల్కుదు? క్షుత్పిపాసలం
జచ్చెడువారమైన మముస్వాదుఫలాంబుపులం బ్రియంబుగా
నిచ్చి సముద్ధరింతె? వనజేక్షణ! నింగొనియాడ శక్యమే? 471

## స్వయంప్రభ సంపాతివృత్తాంతమును గపులతోఁ జెప్పుట

సీ॥ నీవు మాపాలిటిదైవంబవని సదా విశ్వసింతుము మేము వెలఁదిమిన్న!
నిన్నొకటడిగెద నెనరుంచి యాలంక యేవంకనున్నదో యెఱిఁగియున్న
నెఱిఁగించి పుణ్యంబుమఱిగట్టుకొ'మ్మని బ్రతిమాలు హనుమను వానరులను
గరుణాకటాక్షవీక్షణములదర్శించి యాస్వయంప్రభ యిట్టులనుచు నుడివె

గీ॥ 'వనచరేశ్వరులార! నాపలుకువినుఁడు, కలదు దక్షిణవార్ధికివల మహేంద్ర
మను నగంబొండు దానిపై ననవరతముఁ, గలఁడుసంపాతియను పక్షికులవిభుండు.

గీ॥ ఆఖగేంద్రుఁడు చూడనియట్టిస్థలము, లీప్రపంచములోన నెందేనిలేవు
కాన మీరిప్పుడాతనికడకుఁబొండు, చెప్పునాతఁడు లంకావిశేషమెల్ల' 473

సీ॥ అని స్వయంప్రభ యిట్టులానతిచ్చి మహేంద్రధరణీధరమునకు దారిఁజూపి
'కనుదోయిమూసికొం' డని తక్షణమె బిలద్వారంబుబయట నత్తరుచరులను
జేర్చెఁ జేర్చినఁ దమచిత్తంబులందున నామెశక్తికిఁజాల నద్భుతపడి
శ్లాఘించుకొనుచు నచ్చటువాసి యెప్పటియట్టు లాకపు లరణ్యంబులోనఁ

ఆ॥ బెక్కులైననెలవు లక్కజంబుగదాటి, యరిగి కతిపయప్రయాణములకు
బహువిచిత్రధాతుపటలశోభితమహేం, ద్రాచలంబుఁజేరి యంతవారు 474

కం॥ దానిసమున్నతశృంగము, పై నధిరోహించికనిరి భయదతరంగ
ధ్వానసమేతను బహువిధ, మీనమకరముఖరజంతు మిళితాంభోధిన్. 475

కం॥ ఘనభుజు లిట్లాశతయో, జనవిస్తీర్ణంబుగలుగు జలనిధిఁగని నె
మ్మనములసక్కఁజపడి త, ద్వనతీరము దరియనేగి కపికులవర్యుల్ 476

సముద్రముకడఁ బ్రాయోపవిష్టులైన వానరులయొద్దకు సంపాతివచ్చుట

సీ॥ 'ఈవార్ధియెంత నేనెగిరెద' నని మీసమునుదువ్వి లంఘింపఁబూనునొకఁడు
'ఎగురుచూతమునీదుమగతనం' బని వాని మాటికిఁ బురికొల్పు మఱియొకండు
'వలదు దీనినిదాటవశముగా' దని పట్టి వెన్కకులాగును వేఱొకండు
'దాటలేక యిచటఁదడవుండఁగానేల? యధిపుచెంతకుఁ బోద' మనునొకండు
గీ॥ 'స్వామికార్యముఁదీర్పక చనునెమనకు, వెనుకకుసీరిత్తపోవంగ' ననునొకండు
'కడవలేమబ్ధి వెన్కకునడువఁదగదు, తలఁపఁ గర్తవ్యమే' దని పలుకునొకఁడు 477

సీ॥ ఇట్లు వారందఱు నేమిసేయుటకును దపబుద్ధికిన్ స్ఫురింపమిఁ గలంగి
యూహలపైనూహలొనరించుచుండంగ నప్పుడిట్లనిపల్కె నంగదుండు
'కపులార! వినుఁడయ్య! కడలిదాటఁగరాదు వెనుకకురిత్తవో వీలుగాదు
కటకట! మనమిప్డు డెటుసేయనగు ముందునకుఁబోవనూయి వెన్కకునుబోవ
గీ॥ గోయి యన్నట్టులాయెఁగదోయి! చూడఁ, గడకు మనప్రస్తుతావస్థ కాన పలుకు
లింకనేటికి? నాయాశ్వరేచ్ఛయెట్టు, లున్ననట్లగు నాలింపు డొక్కమనవి. 478

కం॥ కార్యముఁదీర్పకపోయిన, సూర్యకులులు తన్నుమెచ్చ సుగ్రీవుఁడు తాఁ
గ్రౌర్యంబెంతయుఁదోప న, వార్యగతిన్ మనల చిత్రవధగావించున్. 479

కం॥ కావున నెట్లును దప్పదు, చావుమనకు హింసఁబొంది చచ్చుటకంటెం
జేవదలిర్పఁగనిచ్చట, జీవత్యాగంబుఁజేయ శ్రేయముకాదే?' 480

కం॥ అని యంగదుండుపలికిన, విని యాకపులెల్ల 'నిదియెవెరవగు నిట్లే
యొనరింత' మనుచు దర్భా, సనముల నేర్పఱచుకొని యశంకితులగుచున్ 481

కం॥ ఉపవాసదీక్షఁగైకొని, యపుడాప్రాగ్దిశకు నందఱభిముఖముగఁ దా
రుపవిష్టులగుచు రూఢిగఁ, గపులటఁ బ్రాయోపవేశకరణోత్సుకులై. 482

గీ॥ తమశరీరములను బాయఁదలఁచియుండు, నంతలోనాసమీపగుహాంతరగతుఁ
డౌను సంపాతియను విహంగాదినేత, పర్వతాకారులైయున్న వానరులను 483

చం॥ కనుఁగొని సంతసించి 'బహుకాలమునుండియు క్షుత్తుపెల్లునన్
వనరుచునున్ననాకు భగవంతుఁడుతాఁ గరుణించి నేటికిం
దినుమని యీప్లవంగులను దెచ్చియొసంగి కృతార్థుఁజేసె నీ
దినమెగదాదినంబు కడుఁదృప్తిగవీరి భుజింతునిత్తఱిన్' 484

చం॥ అని తలపోసి తత్క్షణమె యవ్విహగాధిపుఁ డామిషార్థియై
మును రవిరశ్మిచేఁ గమరిపోయి జవంబఱియున్న ఱెక్కల
ల్లనవిదళించుకొంచుఁ గడులాఘవమొప్పఁగ మెల్లమెల్లగా
వనచరులుండునాదెసకు వచ్చుటయుం గపు లాఖగేంద్రునిన్. 485

కం॥ దవ్వులనచూచి తద్దయు, నివ్వెఱపాటొదవుచుండ నెవ్వగ లెదలన్
నివ్వటిలఁగఁ దమలోఁదా, మివ్విధమునఁ దలఁపఁజొచ్చి రెంతయు నార్తిన్. 486

చం॥ 'ఇదియొకమేటిపుల్గు గణియింపఁగ నిచ్చటికేగుదెంచుచు
న్నదిగద! దీనివైఖరిఁగనన్ మనలం దగనాహరింపఁ దా
నెదఁ దలపించెఁగావలయు నింతిస్వయంప్రభ మాయమాటలన్
హృదయములందునమ్మఁ దుద కెంతవిపత్తుఘటిల్లె నక్కటా! 487

ఆ॥ ఏమిసేయవలయు? నెయ్యదికర్తవ్య?, మీవిపత్తుఁ బాయుటెట్టు లొక్కొ?
దైవమా!' యటంచుఁ దమలోనఁదామార్తిఁ, బొందుచుండ వాలిపుత్రుఁ డనియె. 488

సీ॥ 'వానరవరులార! వగవంగఁబోకుడీ! వెఱపేల? యొకపల్కువినుతువినుఁడు
మనము కృతార్థసంభవులమై వెలసితి మాత్మహత్యాదోష మందకుండ
మనయందుఁగరుణించి మఱిరామదేవుఁడే దీనిని నిటకుఁ బుత్తెంచెఁగాక!
యిఁకఁ దడయక పక్షి కెరయౌదమెల్లర మింతకంటెను బుణ్యమేమికలదు?
గీ॥ శిబిదధీచ్యాదులైన ప్రసిద్ధపురుషు, లెందఱో తమదేహంబు లిచ్చిపరులఁ
దనిపియున్నారు సుగతికిఁజనినవారు, వారివలె నిప్డు వర్తింపవలదె మనము? 489

గీ॥ ధరఁ బరోపకారార్థ మీతనువుపుట్టె, నిది పరాప్రయోజనకారియేని వాని
జీవితంబేల? వైభవశ్రీయదేల?, మనుజపశువనవాడెపో మహిఁజెలంగు 490

కం॥ కావున శంకాభయములు, పోవిడువుడు రామకార్యమునకై మన మీ
జీవంబులఁదొరఁగితిమా, కేవలశుభదంబకాక కీడొకటున్నే?' 491

సీ॥ అని యాతెఱంగున నందఱితోఁజెప్పి యంగదుండంత విహంగపతికి
నభిముఖుఁడై యిటులనియె 'నోపక్షీంద్ర! యాలసింపఁగనేల? యరుగుదెమ్ము
చావవింతకుమున్న సమకట్టియేయుంటి మారగించి బుభుక్షనడఁచుకొమ్ము
మాకోర్కెలీడేరు మఱిరాముకార్యార్థ మాజటాయుపు తొల్లియాజిఁ గూలి
గీ॥ యేసుగతిఁబొందియుండె మేమాసుగతియె, చూఱఁగొందు మవశ్యముసు'మ్మటంచు
పలుకునంగదుపలుకులు పక్షినాథుఁ, డెడనెడన్విని నిర్విణ్ణహృదయుఁ డగుచు 492

## అంగదుఁడు సంపాతికి జటాయువు మరణవార్తను దెలుపుట

ఉ॥ గ్రక్కున డాయవచ్చి విహగప్రభుఁ డంగదుఁజూచి యిట్లనున్
'మిక్కిలిశౌర్యధుర్యులరు మీరెవరో? మఱియే నిమిత్తమై
యిక్కడికేదుదెంచిరిపు? డేర్పడఁదెల్పిన యాజటాయువం
బక్కియుదంతమంతయును వానరవర్య! వచింపవేదయన్' 493

కం॥ అని వినయవిధేయుండై, ఘనకాతరభావమొప్పఁగా నడుగుటయున్
ఘనుఁడంగదుఁ డిట్లనియెన్, వినుమని సంపాతితో సవిస్తరభంగిన్ 494

గీ॥ 'అవధరింపుము తమతండ్రియాజ్ఞవడసి, రవికులశ్రేష్ఠుఁడైనట్టిరామచంద్రు
డంగనాయుక్తుఁడై దండకాటవులకు, వచ్చెఁ దమ్ముఁడుఁదానును బక్షివర్య!. 495

ఉ॥ ఆరఘురాము నంచితగుణాకరు మోసముచేసి తత్సతిం
గ్రూరతబల్మిఁబట్టి చెఱఁగొంచు దశాననుఁ డాత్మలంకకుం
జేరఁగఁబోపుచున్నతఱిఁ జెచ్చెఱవచ్చి జటాయువన్మహా
వీరుఁడు మార్గమధ్యమున వీతభయుండయి తాకె దైత్యునిన్. 496

కం॥ తాకినవానికిఁదనకును, భీకరసంగ్రామమయ్యెఁ బెద్దయుఁ బ్రొద్దుం
బ్రాకటముగనటుపిమ్మట, రాకాసులఱేడు పక్షిరాజుం దునిమెన్. 496

కం॥ తునిమి లతాంగినిఁ గైకొని, తనలంకాపురికిఁజనియె దశకంధరుఁ డా
వనితనువెదకుచు రాఘవుఁ, డనుజునితో ఋష్యమూకమనునద్రికినిన్. 498

కం॥ చనుదెంచి రామలక్ష్మణు, లనఘుఁడు సుగ్రీవుఁడనెడు హరికులపతితో
ఘనమైత్రిసలిపి తద్భ్రాతనువాలినిఁ గెడపి యర్కతనయునిఁ గరుణన్ 499

కం॥ వరకిష్కింధాపురమున, కరయ నధీశ్వరునిఁజేయ నవనీపతికిం
దరుచరపతి ప్రత్యుపకృతి, నిరవుగఁ గావింపఁ దానుగృతనిశ్చయుఁడై 500

కం॥ ఆరామునతిని వెదుకఁగ, ధీరులఁ దనభటుల నఖిలదిశలకుఁ బంపం
దూరపునకు నుత్తరమున, కారయఁబడమరకుఁ గొందఱరిగిరి ప్లవగుల్. 501

కం॥ మేమీ దక్షిణదిశకును, రామాంగనరోయుపొంటె రవిజుఁడు పంపన్
ధీమణి! వచ్చినవారము, వేమఱులెల్లెడలఁదిరిగి వెదకితి మతివన్ 502

కం॥ కాని ప్రయోజనమేమియుఁ, గానక వేసారివిసిగి కడకిచ్చోటన్
మేనులవర్జింపఁగ మఱి, పూనితిమిఁక శంకయేల? భుజియింపు' మనన్ 503

## సంపాతి కపులతో జటాయువువృత్తాంతము నెఱిఁగించుట

కం॥ విని యాసంపాతియపుడు, కనుఁగొలఁకులనుండి యశ్రుకణములు దొరఁగం
దనతమ్ముని చావునకై, ఘనముగశోకించి పలికెఁ గపివర్యులతోన్. 504

శా॥ 'దయపెంపారఁగ నాజటాయువు మహాహ్లాదంతంబెఱింగించి యా
రయ నాకుంగడుమేలుఁగూర్చి రపకారంబెన్న నేనంతదు
ర్ణయచిత్తుండనె? కట్ట! మామకచరిత్రంబున్నివేదింతు సం
దియమున్మాని వినుండు మీవుశుభముల్ నిక్కంబుచేకూరుతన్. 505

సీ॥ అజటాయువు తమ్ముఁడగునాకు నాపేరుసంపాతియందురు జలజబంధు
సారథియైన యనూరునకునుమేము తనయులమగుదుము వినుఁడు తొల్లి
'నీకంటెనధికుఁడనేనహో' యనిపల్క 'నీకంటెనధికుఁడనేన' యనుచు
మేమిర్వరము క్రొవ్వి మీదెఱుంగక వివాదమునల్పుచుండ నాతరుణమందు
గీ॥ మామదమడప నారదమౌనివచ్చి, 'భానుమండలమెవఁడు మిాలోనఁదాకి
వచ్చునోముందు వాడెపోప్రబలుఁ' డనిన, దానికిన్వల్లెయనిమేము తక్షణంబ 506

కం॥ ఇమ్ముగబలాబలంబుల, నిమ్మెయిఁదెలియంగఁగోరి యిరువురమొకమొ
త్తమ్ముగ మింటికెగసి త్వరి, తమ్ముగఁబయనించి కొంత దవ్వేగుటయున్. 507

కం॥ దైవవశంబున నిరువుర, మావల నెడఁబాసి మింట నరుగుచునుండన్
భావింప నాదుతమ్ముం, డేవైపునకేగుటెఱుఁగ నేనిందాకన్. 508

సీ॥ ఇంక నావృత్తాంతమెఱిఁగింతు నాలింపు డటు నేవినువీది నరిగియరిగి
గణియింపరాక యిక్కడికినిఁ బెక్కామడలదూరమునసున్న జలజబాంధ
వునినమీపించుటయును దదీయోర ప్రచండాతపాగ్నికపుండనగుచు
నాదుఱెక్కలుగాలి మేదినిపైఁగూలియుండ నిను నిశాకరుండనుముని

గీ॥ కాంచి కరుణించి 'విను! పెద్దకాలమునకు, నగచరులు రామకార్యార్థులగుచుఁ గొంద
ఱిద్దెసకువచ్చి దర్శనమిత్తు రెఱక, లపుడు క్రమ్మఱమొలుచునీ' కని వచించె. 509

కం॥ అమ్మునినాథునివాక్యము, నెమ్మనమునవిశ్వసించి నేనిట బహుకా
లమ్మునుండియు మీకై, యిమ్ములఁదగవేచియుంటి నిపుడది పొసఁగెన్ 510

కం॥ ఇఁకఁ బక్షంబులు క్రమ్మఱఁ, బ్రకటితముగ మొలుచునాకుఁ బరమమునీంద్ర
ప్రకరములపలుకుతప్పునె, సకలజగజ్జాలమెల్ల సమసినయేనిన్?' 511

## సంపాతి కపులతో లంకనుగూర్చి వివరించుట

గీ॥ అనుచువచియించి సంపాతి యాక్షణంబ, జలధిజలములఁ దాఁగృతస్నానుఁడగుచు
ననుజునకుమత్తరక్రియలంచితముగఁ, జేసి కపులతో నిట్లని చెప్పసాగె. 512

గీ॥ 'జలధిదాటుటయెట్లని తలఁపఁబోకు, డపరిమితమైనయట్టి భవాంబురాశి
దాటనేర్తురు శ్రీరామదాసులన్న, నీమితాంభోధిలంఘించు టెంతమీకు 513

ఉ॥ కావున సంశయింపకు డెకాయెకి మీరలు వార్ధిదాటిపొం
డావలతీరమందుఁగల దద్రులమేటి సువేలమన్ మహా
గ్రావము దానికావలనె గ్రాలుఁ ద్రికూటనగంబు దానిపై
రావణుఁడేలులంక కడురాజిలుచుండును స్వర్గతుల్యమై' 514

చం॥ అనియిటులానతిచ్చి యరుణాత్మజుఁ డెప్పటియట్ల పక్షముల్
మునివచనానుసారముగమొల్చుటయుం గరముబ్బి యప్పడ
త్యనుపమశక్తియుక్తుఁడయి యాకపివర్యులవీడుకొంచుఁ దాఁ
బనివినె నాయనంతరము వానరులంగని యంగదుండనున్. 515

## అంగదుఁడు కపులతో సముద్రలంఘనమునుగూర్చి చర్చించుట

కం॥ 'ఎవరెన్నియోజనములీ, లవణపయోరాశిఁ గడఁగి లంఘింతురో! మీ
జవసత్త్వంబులకొలఁదులు, వివరించివచింపు డేనువినవలతు' ననన్ 516

కం॥ పదియును నిర్వదియును ము, ప్పదియు నలువ, దేఁబది యరువదియును మఱిడె
బ్బదియును, నెనుబదియును, దొం, బదియోజనములనుదనుక వరుసగవార్ధిన్. 517

కం॥ ఎగురంగలమని యొకరొక, రుగఁ దొమ్మంద్రుగురుకపులు రూఢిమెయి వచిం
పఁగవిని భల్లూకవిభుఁడు, వగభేదిమనుమవితోడ నమ్రుఁడయి యనున్. 518

గీ॥ 'అవధరింపుము యువరాజ! యౌవనమున, నాయొనర్చినకృత్యము లేయుగమున
నేరుసుం జేసియుండంగఁ బోరటన్న, విశ్వసింపర యైననువిన్నవింతు 519

చం॥ ఇరువదియేడుసారులు మహీస్థలిచుట్టును నశ్రమంబుగా
నురుజవమొప్పనేఁదిరిగి యున్నమయూఖునకుం బ్రదక్షిణం
బరుదుగఁ జేసినాడ మును పప్పుడుకొండలు గండశైలముల్
చరణములందునాటుకొని చాలఁగనొప్పలుపట్టె నంగదా! 520

కం॥ అదికారణముగ మఱియును, ముదిమికతంబుననుజేసి పూర్ణంబుగము
న్నదివఱకుండిన యతులిత, మదీయజవసత్త్వములుసమసె నిపుడనఘా! 521

శా॥ పోనిమ్మిప్పటికేని నాబలముఁ బెంపుంజూడుడీ! యెవ్వెయిం
గానీ తొంబదియెదుయోజనములేగంజాలుదున్' నాపుఁడా
పైనిట్లంచువచించె వాలిసుతుఁ 'డోభల్లూకరాజా! వినుం
డేనీసాగర మశ్రమంబున జవంబేపార లంఘించెదన్ 522

గీ॥ కాని యొక్కశంకకలుగునాచేతను, గార్యమగునొ! లేకకాదొ! నిజము
నుడువఁజాలనేను గడపరానివిపత్తు, కలిగెనేమిసేయవలయు సకట?' 523

గీ॥ అని యనేకపిసంఘుల సంగదుండు, వ్యసనపడుచుండ నతనితోఁబాటు నంద
అగచపలుర్ఖండఁగాఁ జొచ్చి రపుడువాయు, సూనుఁ డేమియునొల్లనివానిపగిది 524

గీ॥ వారికెడఁగల్గి యొక్కెఁడేకూరుచుండి, మౌనముద్రవహించి తామాటలాడ
నొల్లకయెయున్న యాతనియొద్దకేగి, పినయముననుజాంబవంతుఁ డిట్లని వచించె 525

## హనుమంతుఁడు సముద్రమును లంఘించుట

కం॥ 'ఈకంధినిలంఘింపఁగ, మాకునలవిగాకకుంది క్రుందుచునుండన్
నాకేమియవసరంబని, నీకూరకయుండఁదగునె? నెచ్చెలి! చెపుమా! 526

కం॥ జవసత్త్వోపేతుండవు, పవనసుతుఁడవీవు రామభద్రుండు సదా
మిమ్ములుగనమ్మినభక్తుఁడ, వపుడుష్కర యూరకుండ న్యాయ్యమె? హనుమా! 527

చం॥ ఇఁకఁడ మదీయకార్యపది యెట్లు విధంబులఁ జేయఁజాలుద
క్షతగలవాడటంచు మదిఁ జాలఁగనమ్మి కృపాలశేఖరుం
డతివసునిప్పటంచుఁ దనదైన సముంచితరత్నము ద్రికన్
హితమతినీకొసంగెఁగద యింకటిపో మఱువంగవాఁడియే? 528

గీ॥ లెమ్ము మౌనంబువీడు కార్యమ్మదెల్ల, నీవయిననిల్చెఁ దొలఁగరా దీపయోధి
మాకలవిగాదు దాటుముమారుతసుత!, ప్రాజ్ఞఁడవు నీకువేఱ చెప్పంగనేల?' 529

కం॥ అని యిట్లుజాంబవంతుం, డనిలజుబోధింప నాతఁ డమితోత్సాహం
బునఁబొంగుచు నిట్లనియెను, వనచరులాలింప జాంబవంతునితోడన్ 530

కం॥ 'ఓతాత! జాంబవంతా!, యీతోయధిదాట మీరలెవరోపనిచో
ఖ్యాతిగలంఘింపఁగనే, నేతుంగనుఁగొనుఁడు కరము నిశ్చింతులరై. 531

ఉ॥ చొత్తు నిమేషకాలమునను మ్మిదెవార్ధినిదాటి లంకలో
వ్రత్తుదశాననున్ సపరివారముగా ననికేగుదెంచినం
దెత్తు నవశ్యమెట్లయిన దేవియుదంతము జేడుమెచ్చఁగన్
వత్తును మిమ్ముఁజేర ననివార్యజవంబున భల్లుకేశ్వరా!' 532

కం॥ అని వీరోక్తులునుడువుచు, ఘనుఁడాహనుమంతుఁడపుడు కపులెల్లఁ దనుం
గనుఁగొని భీతిల్లఁగ నిజ, తనువునుగడుఁబెంచె మిన్నుఁదాకన్ వీకన్. 533

కం॥ ఇక్కరణిఁదనశరీరముఁ, జుక్కలుదాకంగఁ బెంచిచూపఱకెల్లన్
మిక్కిలిగవింతఁగొల్పుచు, నక్కజముగనొప్పె మారుతాత్మజుఁ డంతన్ 534

గీ॥ అందఱుందన్నువీడ్కొల్ప నార్చిపేర్చి, వలయముగవాలమున్రదిప్పి బాహులగణి
తముగఁబెల్లూచి పాదఘాతమునక్రది, క్రుంగఁగుప్పించి రివ్వన నింగికెగసె. 535

## హనుమంతునకు మైనాకుఁ డాతిథ్యమిచ్చుటకై వచ్చుట

సీ॥ ఇట్లబ్ధిలంఘించి యేగుచోఁ బావనికాతిథ్యమీఁగోరి యబ్ధిపంప
మైనాకుఁడనునొక్క క్ష్మాభృద్వరేణ్యుఁడు నిజపక్షయుగసంజనితమహాని
లమ్మున కంబుకణమ్ములు చిందరవందఱకాగ సమందగతినిఁ
గడలిలోపలనుండి పొడసూపి హనుమంతుకట్టెదుటనునిల్వ గాడ్పుపట్టి
గీ॥ 'వీడొక సురారియగును భావింపనేను, జనెడుకార్యంబు విఘ్నంబునలుపుపొంటె
వచ్చెఁగాఁబో' లటంచు భావమునఁనెంచి, యంఘ్రితలమున నాగిరినట్లె త్రొక్కె. 536

కం॥ అదియును దత్పాదహతికి, మదిఁదల్లడమంది నెండి మనుజాకృతితో
నుదయించి యాంజనేయుని, పదములకున్మ్రొక్కి యిట్లుపలికె వినీతిన్. 537

సీ॥ 'దండంబునీకిదే దయఁజూడుహనుమంత! నేనుపంచకుఁడనుగాను వినుము
మైనాకుఁడనువాడ మాతండ్రిహిమవంత ( డంభోధిపుఁపున నసఘ! నీకు
నాతిథ్యమీయఁగ నరుదెంచినాడను తొల్లియొకప్పడ్రిఁఒకగఁయులు
కలిగి విహారంబుగావించుచున్ జగక్షోభంబుఁగల్గింప సురవిభుండు
గీ॥ కనలి పవిచేఁదదీయపక్షములనటికె, నపుడు భీతిల్లి మాయయ్య యనిలువేడ
నమ్మహామహుఁడాదరమతిశయింప, నమరపతికాసికుండ నన్నబ్ధిదాచె. 538

శా॥ నాటంగోలె సురక్షితుండనగుచున్ నాకేఁచే నంతయుం
జేటుంబొందక యాసమీరుకృపచేఁ జెన్నారఁగా నేనుము
న్నీటన్వాసముసేయుచుంటినిసదా నీతండ్రికెవ్వారిలం
బొటింపన్‌సరిదూగ రాతఁడు జగత్ప్రాణాఖ్యకర్తుండగున్ 539

కం॥ ఆవాయుదేవునకునున్, నీవుకుమారుండవట్టె నిర్మలగుణస
ద్భావుఁడవు మఱియు రామ, క్ష్మావరహితతత్పరుఁడవు సామాన్యుఁడవే? 540

కం॥ భవదీయదర్శనంబది, భవహరమగు నీదుసేవప్రాప్తించినచో
భవబంధమోచనంబును, బ్రవిమలకైవల్యపదముఁబడయుట యరుదే?' 541

గీ॥ అనుచు శ్లాఘించిమైనాకుఁడనియె మఱియు. 'నిన్నుఁగనుఁగొన్నకతమున నేడునాదు
పుణ్యముఫలించె ననుచు నేబుద్ధిఁదలఁతుఁ, గాని విన్నపమొక్కటికలదు వినుఁడు. 542

సీ॥ బహుదూరమునసుండి పయనించుటంజేసి యలసినవాడవీ వట్టిగాన
మార్గశ్రమముదీర మఱికొంతతడవిందు విశ్రమింపుము ఫలవితతులివిగొ!
భక్షించి నీదుబుభుక్షనడఁచుకొమ్ము నముధన్యుఁజేయుము చనుముపిదప
నీకుశుభంబగు నిర్మలగుణవంత! హనుమంత!' యనివేడ నాదరించి
గీ॥ యంజనీసుతుఁడిట్లను 'నయ్యవినుము, రాముకార్యార్థినై సత్వరముగనేను
బోవుచున్నాఁడ నిపుడు నీపూజలుగొన, నముఁపుగా దిదొచెప్పెద నవధరింపు 543

ఆ॥ ఏనులంకకేగి యాత్రోవచేవెండి, తిరిగివత్తు నపుడు స్థిరతనీదు
పూజలెల్లఁగొందుఁ బోవలెమ్మిప్పటి, కనఘ! స్వీకరించితిట్ల తలఁచి'. 544

చం॥ అని వచియించి తత్క్షణమ యయ్యనిలాత్మజుఁ డద్రిరాజప్రా
ర్థనమునుద్రోసిపుచ్చక పదంబటఁ గొండొకసేపుమోపి యొ
య్యన నటుపిమ్మటంగడఁగి యభ్రపథంబున కుద్గమించితాఁ
జనఁవొకఁగెనే సుహావసలు చాలునుతించుచుఁ డన్నుఁ జూడఁగన్. 545

కం॥ రాముని భక్తుఁడు భృత్యుం, డౌమారుతినట్లు భక్తి నర్చింపఁగ సు
త్రాముఁడు తెక్కలనఱుకక, యామైనాకునకునప్పు డభయంబొసఁగెన్. 546

## దేవతలపంపున సురస హనుమంతుని శక్తిని పరీక్షించుటకై వచ్చుట

సీ॥ ఇట్లు మైనాకుని నెలమిమైవీడ్కొని యత్యంతజవమున నరుగుచున్న
హనుమంతుఁగన్గొని యమరులుతమలోనఁ గార్యమీతఁడు చేయఁగలఁడొ! లేదొ!
యనుచుసందేహించి యప్పుడు తద్ధైర్యశౌర్యసామర్థ్యదోర్వీర్యములను
దారుపరీక్షింపఁగోరి సురసయను భామినినొక్కర్తుఁ బంపనామె
గీ॥ భీకరాసురాకృతితోడవికవచ్చి, యనిలనందనుఁబోనీక యడ్డగించి
భూమియును నాకసంబును బూరటిల్ల, నట్టహాసముచేయుచు నిట్టులనియె 547

గీ॥ ఓరి! వానర! నిలుమునాబారినుండి, వశమెతప్పించుకొన నెంతవారికైన?
నీవనఁగనెంత నమలెద నే నటన్న, దానికిట్లను బెదరక తరుచరుండు 548

గీ॥ 'అతివ! శ్రీరామభద్రుకార్యార్థినగుచు, నరుగుచున్నాడ నిప్పుడు తిరిగిమఱల
వత్తు నాహారమైనీదు క్షుత్తుఁదీర్తు, నమ్ము మీపల్కు మృషగాదు నెమ్మనమున 549

కం॥ అనఫుఁడుఁ దద్వచనంబులు, విననొల్లకకినిసిపల్కె వెలఁది యతనితో
'వనచర! ప్రేలకునీప, న్నినపన్నాగంబెఱుంగనే యనితలఁతే? 550

కం॥ గికురించిపోవఁజూచెద, వికలాభములేదు సాగనిత్తునె నేనీ
గికురింతలు? నిన్నిదెమెస, వకమతిపోవిడువ నెల్లభంగులఁ గోతీ!' 551

కం॥ అని యూరగవను కైవడిఁ, దననోరుంచెఱచుటయును దశయోజనముల్
పవచరుఁడుపెరిగె నదికని, వనితయు ద్విగుణితముఁగాఁగ వక్త్రముఁ బెంచెన్. 552

గీ॥ ఈతెఱంగున సురసయువాతసుతుఁడు, క్రమముగాగను దమవక్త్రగాత్రములను
వీక శతయోజనంబులదాకఁబెంచి, రటు పదంపడినేర్పున ననిలసుతుఁడు 553

కం॥ అంగుష్ఠమాత్రతనుఁడై, యంగనవక్త్రంబుఁజొచ్చి యావలవెడలెన్
సాంగత్యబంధములకున్, లొంగకవెల్వడు విరాగిలోకము మాడ్కిన్. 554

చం॥ అపుడు తదీయయుక్తికి మహాద్భుతమొందుచునున్నదానితోఁ
గపికులవర్యుఁడిట్లనియెఁ 'గామిని! తీర్చితి నీదువాంఛితం
బపరిమితప్రమోదమున నాత్మనివాసముఁజేరఁ బొమ్మికన్
విపులకుమారికన్ వెదుక వేగమెనేనును బోదు' నావుడున్. 555

యవు డాయసురాకృతి, వదలి యతని(జూచిపల్కె 'వత్సా! నీక
యంబగు నాచరితము, విదితము గావింతువినుము విశదముగా(గన్ 556

మర్థ్యము శక్తియు, వాసిగనెఱు(గంగ(గోరి వచ్చినదానన్
వముఖ్యులపంపున, నేనురసయనంగ నొప్పనెల(తను వీరా! 557

(గొంటి నీదుబలమును, వనచరవర! నీకుసాటివత్తురె యేరున్?
మానసాబ్జమున( గా, దనితల(ప(గ(బోకు కార్యమగు నీచేతన్'. 558

యిట్లుతెలిపి కపివరు(, జనుమని దీవించి తానుజని సురపురికిన్
ధిపై నెప్పటిక్రియ(, జన(దొడ(గెన్ సత్వరంబ సామీరియునున్. 559

శ్రీ సింహికయనెడుఛాయాగ్రాహి యశనార్థియగుచు నాయాంజనేయు
తనుచ్ఛాయ నాకర్షించి చెన(బట్టి కబళింప బెదరక గడ్డుపట్టి
మె( దత్కుక్షి భేదించుకొని బహిర్గతు(డయి దానిని( గడలిలోన(
చి దేవతల్ కడునుబ్బిశ్లాఘించి యరుదుగసుమవృష్టి( గురియుచుండ
వలీలగాదాటి యానువేల, పర్వతముమీదనెక్కె నాపద్మబాంధ
కు చెన్నార(దూరువు(గొండపైన, నెలమినధిరోహణముసేయు చెలువుదోప 560

గిది వాయునందను( డేపుమీర(, బర్వతారోహణముచేసి ప్రాకటముగ
యుత్తుంగశృంగంబుపైనెక్కి, దక్కినపుదిక్కునకు( జూడ్కి( జక్కనిలిపి 561

తగోపురవప్ర, స్థాపితమై భోగభాగ్యసంపచ్ఛ్రీకిం
రమై వెలసెడులం, కాపురమును గనులవిందుగా(గం గనియెన్ 562

పగలు దానిలో(జొ, చ్చిన దనుజులు చూతురనుచు( జిత్తంబున( దా
ముగళంకించుచు( బొ, వనియటునున్నంత(గ్రుంకె వనజాప్తుండున్. 563

వైధవ్యదుఃఖంబువలన(జేసి, పంక్తికంఠునిభార్యల వదనము లిటు
ననన( గమలములు దోడ్తోడ లోక, బాంధవువియోగకతమున వాడిపోయె. 564

దికాలములో రఘుకులునిచేత, బింకమంతయు(గోల్పోయి లంకలోని
హాదుల కలకలంబీవిధమున, నడ(గుననగ(, బక్షికలకలంబుడిగె నంత. 565

వణునకు నిటు దుర్దశ, లావహిలునవనంగ( దిమిరమంతట( దోచెన్
వింప(గ( బొడసూపెను, ఖ్మావరుభావిశుభసూచకములై చుక్కల్. 566

గీ॥ అంత నారాత్రి కడుమంచియదనుగాఁగ, నెంచి పావని యటనుండి యేగి లంక
యుత్తరద్వారమునుజేరె నురరయమున, నద్రిగుహఁజేరఁబోవు హర్యక్ష మనఁగ. 567

గీ॥ అప్పు డపరులకలకలంబడఁగుటయును, మారుతసుతుండు మార్గాలమాత్రుఁ డగుచు
లంకయందుఁ బ్రవేశింపలగ్గగునని, యాత్మగతమునసూహించె నంతలోన 568

## హనుమంతుని లంకిణి యడ్డగించుట

గీ॥ జారచోరాదిదుష్టప్రచారయోగ్య, మైన యాకాలరాత్రిలో నావిధమున
నతినిగూఢముగాఁ జనుహనుమఁజూచి, పురబహిర్ద్వారమున నొక్క పొలఁతుఁదిండి 569

కం॥ లంకిణియనునది కరముభ. యంకరముగ నార్చిపేర్చి యనిలతనూజున్
శంకింపకడ్డగించి ని, రంకుశగర్వాతిరేకమగపడఁ బలికెన్. 570

కం॥ 'ఓరీ! కోతీ! యెవ్వఁడ? పూరంబేరేమి? శంకనొందక యేలా?
చోరుసివలె మాపురి కీ, పీరాతిరివేళవచ్చి తెఱఁగింపు' మనన్ 571

సీ॥ విని హనుమంతుఁడిట్లనియె 'నోకామిని! యెవతెవు? నన్ను నిర్హేతుకముగ
నీవేలయడ్డగించితివో తెల్పుము తొల్తఁ? బిదప నాయూరునుబేరు నీకు
విశదంబుగావిన్నవించెద' నని దానిఁగడలెక్క సేయక నుడుపటయును
కినిసిలంకిణిపల్కె 'వనచర! వినుమోరి! లంకిణినాపేరు లంకఁగాతు

గీ॥ వెట్టిపీరాధివీరులనేని నేను, జక్కడంచెద నిట్టినన్ లెక్కగొనక
లంకఁజొఱనెంచితే? మూర్ఖ! శంకలేక, నిన్నిదేవట్టికబళింతు నన్నెఱుఁగవె?' 572

గీ॥ అనవుఁడిక సామవాక్యంబు లానికాట, వనితయెడలను ఫలియింపవనుచుఁ దలఁచి
మహితగుణవంతుఁ డాహనుమంతుఁడంతఁ, బరుషభాషలదానితోఁ బలికెనిటు 573

కం॥ 'ఓలంకిణీ! మచ్చరితం, బాలింపుము నాదుపేరుహనుమంతుఁడు క్ష్మా
పాలుఁడగురాముబంటను, గాలుఁడమీజాతికెల్ల ఘనవిక్రముఁడన్. 574

కం॥ మీరాజు రావణుఁడు తా, నారాముని పత్నియైన యవనీతనయం
జోరత్వంబునఁదెచ్చిన, నారమణిన్ వెదకనిటకు నరుదెంచితినిన్. 575

ఆ॥ కాని నన్నులంకలోనికిఁ బోనిమ్ము, నీకుకుభ ముకలుగు లేకయున్న
నిన్నుఁగూల్చియైన నేఁబోదు' ననిపల్కు, దనుజయలిగి కాలఁదాచె నతని. 576

కం॥ ఇమ్మెయిఁ బదతాడితుఁడై, వెమ్మదిఁగోపించి హనుమ నిజదేహముపై
దమ్ముగఁబెంచి వికాటియు, రమ్మును దృఢముష్టిచేతఁ బ్రహరించెవెనన్. 577

శా॥ ఆముష్టి ప్రవిఘాతవేగమున కత్యంతవ్యధం జెందుచున్
భూమిం ద్రెళ్లి నిశాటకాంత తనయేపుం జేవయున్ వీడియా
ధీమంతున్ హనుమంతుఁ జూచి పలికెన్ 'దేవా! నమస్కారమ
ప్పా! మాంపాహి ప్రముద్ధతిని క్రమింపంబోలు నానేరమిన్. 578

మ॥ విను మింకన్ వివరించిచెప్పెదను నావృత్తాంతమున్ సర్వమున్
మను నీలంకనుగట్టునాడు తగనంభోజాతగర్భుండు న
న్నసయం బీపురరక్షణార్థముఁ బ్రియంబారన్ నియోగించి యి
ట్లనియెం 'గామిని! పెద్దకాలమున కాయర్కాన్వయోత్తంసుఁడౌ. 579

కం॥ శ్రీరామునిపంపున నొక, వీరుండగువానరుండు విచ్చేసి భవ
ద్వీరత్వముడుపఁగలఁ డా, కారణమున లంకలోనఁగలదేవారుల్. 580

కం॥ నశియింతురెల్ల' రనుచున్, విశదంబుగఁ జెప్పె నజుఁడు వృషగాదింకం
బిశితాశనులు నశింతురు, కుశలంబగునీకుఁ బ్లవగకుంజర! పొమ్మా. 581

కం॥ పోడిమిచెడినీచే నే, నోడితి మద్గర్వమెల్లనుడిగెను గనుఁకన్
వీడుము పోయెద నబలను, గూడదునను జంప నీతికుశలుఁడవగుటన్' 582

కం॥ అని యాలంకిణి యిమ్మెయిఁ, దనవృత్తాంతంబుఁ దెలిపి తద్రూపమువెం
టనెవిడిచి యొక్కదివ్యాం, గనయై యాత్మేచ్ఛఁజనియె గాథముదమునన్. 583

## హనుమంతుఁడు లంకలోఁ బ్రవేశించి సీతను వెదకుట

గీ॥ అటు పంపడి తాను సూక్ష్మాకృతిఁగొని, యా పురద్వారమునుదాటి యవల నేడు
కోట లవలీలఁగడచి యమ్మేటిప్లవగుఁ, డతినిగూఢముగా లంకయందుఁ జొచ్చె. 584

ఉ॥ చొచ్చి నిశాటులెల్లఁ దనుఁ జూడక నిద్రవోయియుంటకున్
మెచ్చి సమీరజుం డవటిమేడలు మిద్దెలు మేల్మిసౌధముల్
రచ్చలు రాజమార్గములు రాజితగోపురమండపాదులున్
హెచ్చుకవాటదేహళులు హేమమయంబగు స్తంభపంక్తులన్. 585

గీ॥ చూచి తనమానసంబునఁ జోద్యమంది, మఱియు నిదియది యనరాని మహితచిత్ర
భవనములు పెక్కు మితశోభలఁ బొసఁగుచుఁ, గనలపండుచు సేయు నిట్లని తలంచె. 586

శా॥ 'ఔరా! యీపురరామణీయకము నా కగ్గింపశక్యంబె? శృం
గారస్థానమిదే యనందనరి నాకశ్రీమహావైభవో
దారస్ఫూర్తిని ధిక్కరించుచెటు సందర్శించినంగాని బం
గారంబున్ మణులే వినిర్మితముకాఁగన్ మేడలొప్పారెడున్ 587

గీ॥ ఇట్టి సుందరపట్టణ మేలుకొనెడు, భాగ్యమదిలేకకాఁబోలుఁ బరమభాగ్య
హీనుఁడగు పంక్తికంఠుఁడు జానకిఁ జెఱఁ, దెచ్చి మృత్యువుఁదాఁ గొనితెచ్చుకొనియె.' 588

గీ॥ అని తలంచుచు మఱియుఁ దానందనేక, ములగు వింతలును విశేషములను గనుచు
క్ష్మాతనూజను వెదకుచు గాడ్పుపట్టి, సంచరింపఁగ నయ్యయిస్థలములందు. 589

కం॥ వివిధవికారాకారులు, మిపుల భయంకరులునగుచు మిక్కిలినిద్రా
వివశలయియున్న బహుదా, నవులు తనకుఁ గానుపింప నగచరుఁడాత్మన్. 590

కం॥ అక్కజమందుచుఁ గ్రమముగ, నక్కరువలిసుతుఁడు కరిహయాలయములు బల్
రొక్కఁపుఁగొట్లును దేరుల, యిక్కలుగలచోట్లుఁ గనుచు నేఁగఁగ నొకచో 591

గీ॥ మున్నుఁ బౌలస్త్యుగెల్చి తాఁగొన్నయట్టి, పుష్పకంబను నొక్క యద్భుతవిమాన
మక్షిగోచరమగుటయు నాత్మమెచ్చి, దాని నిర్మాణనైపుణిఁ దద్దపొగడి 592

కం॥ ఆవలఁజనుచు దశాస్యుఁడు, దేవతలన్‌గెలిచి బల్మిఁదెచ్చిన నానా
దేవమరుద్గంధర్వ, స్త్రీవారము లున్నయట్టి చెఱసాలలునున్. 593

కం॥ క్రమముగఁ బరికించుచు నం, దమలచరితుఁ డాంజనేయుఁ డాజానకినిన్
నెమకుచు నివ్విధమున నా, తమినిం గ్రుమ్మరుచునుండఁ దత్తరుణమునన్ 594

సీ॥ ఆనిసిన్ సతిరోయ ననువుగానుండుట కమరులుంచిన దీపమనఁగ నొప్పి
దశకంధరుని గర్వతపము రాఘవుఁ డిట్లె మాయించుననఁగఁ దమంబు దోలి
సీత కిమ్మెయి వాతసూతి సంతోషముఁ గలిగించుననఁ గలువలను దేర్చి
రావణుఁ దత్సతిన్ రాముఁ డీవిధిఁ బాపఁగలఁడనఁ జక్రవాకములఁ బాపి
గీ॥ లచ్చిసైదోడు వేలుపులకునుబంట, పంటయెకిమీఁడు విరహులమంటయగుచు
ధవళకాంతుల దిశలందుఁ దాండవింపఁ, జేసి యుదయించెఁ దూరపుశిఖరిపైని 595

గీ॥ ఇట్లు చంద్రోదయముకాఁగ నెల్లచోట్లు, కరము విశదముగాఁగను గానుపింప
గూఢసంచారుఁడగుచు వాక్షోటిసుతము, వెదకఁదొడఁగెను వానరవీరుఁ డపుడు 596

సీ॥ సందులుగొందులు చావడుల్సత్రముల్ గుళ్లను మఠములు గోపురములు
బావులుచెఱువు లుప్పరిగెలు పరిఖలు కోటలు బురుజులు కోష్ఠములును
చంద్రశాలలు బహుచతురంగశాలలు కేళీగృహంబులు కేళివనులు
సురుచిరాట్టాలక శుద్ధాంతమండపప్రాసాదసౌధహర్మ్యప్రతతులు
గీ॥ మఱియు రావణుమంత్రిసామంతభృత్యు, లైన యుద్యోగుల గృహంబు లాదిగాఁగ
సర్వసామాన్యులగువారి స్థానములును, గ్రమత శోధించుచుంజని కపివరుండు. 597

సీ॥ ఘటకర్ణుఁడువసించు ఘనని కేతనమును కుంభ నికుంభుల గురునిలయము
లతికాయునెలవు మహాకాయువేశ్మంబు పార్శ్వమహాపార్శ్వ భవనములును
దేవాంతకునియిల్లు త్రిశిరుసద్మంబును నల ప్రహస్తనరాంతకాలయములు
నా మేఘనాదుగేహంబు విభీషణు సురుచిరవాస మక్షునిగృహంబు
గీ॥ మఱియు మాల్యవదాదుల మందిరములు, కాలనేమిమహోదరుల్ గాపురంబు
సేయుసదనముల్ వెదకుచు వాయుసుతుఁడు, రావణునగరుఁజేర శీఘ్రమునఁబోయి.598

ఉ॥ కావలివారలెల్లఁ దసఁగానకయుండఁగ లోనఁజొచ్చి నా
నావిధదివ్యసౌధములు నవ్యశిరోగృహహర్మ్యపంక్తులుం
గేవలచిత్రశాలలును గేళిగృహంబులు రత్నతల్పముల్
రావణుకొల్వుకూటములు రమ్యమహానస పానశాలలున్. 599

గీ॥ ఆదిగాఁగల మహితచిత్రాతిచిత్ర, భవనములు పెక్కు తన కగపడుచునుండ
నద్భుతంబందుచు బహుకక్ష్యాంతరములు, గడచిచని కాంచె రావణు పడకటిల్లు. 600

సీ॥ కాంచి యందుండిన కాంచనమణిమయ చారువితర్దికా స్తంభములును
లాలితస్ఫటికశిలావినిర్మితములౌ కుడ్యముల్ సుందరకుట్టిమములు
బాగైన బంగారుతూగుటూయెలలును బర్యంకములు చిత్రఫలకములును
గర్పూరచందనకస్తూరికాదులౌ పరిమళవాసనావస్తువులును
గీ॥ దనకు సంప్రీతిఘటియింపఁ దరుచరుండు, తఱచు మెచ్చుచు లోకవిద్రావణుండు
రావణుఁడు శయనించిన రమ్యమైన, రత్నపర్యంకమును సత్వరముగఁ జేరి 601

సీ॥ తన చుట్టునున్మూగి దానవాంగనలెల్ల వింజామరంబులు వీచువారు
పాదములొత్తువా రాదరంబును భక్తియొప్పఁ గప్రపువిడె మొసఁగువారు
నాడెడువారును బాడెడువారును నిష్ఠరతులఁ దనియించువారు
సరసనల్లాపాది సముచితబహువినోదములనుదేలించి తనుపువారు

గీ॥ నగునవేకులు నిద్రింప నధికవైభ, వాన్వితుండయి నడఁగొండ యనఁగ నెగడి
కోరమీసలు నిడుదలౌ కోరలొప్ప, సుప్తుఁడైయున్న రావణాసురునిఁ గనియె. 602

కం॥ కని తలయూచుచు నాతని, యనుపమవైభవముఁబొగడి యందలి నారీ
జనములఁ బరిశీలించుచు, ననఘుఁడు హనుమంతుఁడుండె నాతరుణమునన్. 603

గీ॥ ఆదశాననుకౌగిట సణఁగిపెనఁగి, యసమరతిసుఖపారవశ్యమునఁ జేసి
మైమఱచి నిదురించెడు మగువమిన్న, యైన మందోదరి తనకుఁ గానుపించె. 604

గీ॥ కానుపించుటయును నిజమానసమున, నావరారోహ శుభలక్షణాంగియగుట
రామునతిఁగాఁగ భావించి ప్రముదితుఁడయి, యిట్టు లనిలజుఁ డప్పు డూహించుకొనియె.

కం॥ 'రాముఁడు చెప్పిన చందం, బీ మానినియందుఁ దోచె నిది దబ్బరకా
దీమెయె ఘుమ్మాటికి శ్రీ, రామాంగనయైన జనకరాజతనయయౌ 606

ఉ॥ కంటిని నేటికీ కలువకంటిఁ గృతార్థుఁడనౌచు నేనిఁకన్
ఘంటిని రామభూవిభుని మన్నన మిక్కిలిఁబొందఁగంటి నా
బంటుతనంబుఁ జేవయును బౌరుషమెప్పఁగ నీ మహాజగ
త్కంటకు రావణుందునిమి కాంతను జేర్చెద రాముచెంగటన్' 607

కం॥ అనినిర్ణయించి రావణుఁ, డునుమఁగ నుంకించుచుండఁ దోఁతో హనుమం
తునకొక్క యూహ పొడముడు, మనమునశంకించి యిట్లు మఱి తలపోసెన్. 608

ఆ॥ 'ఈమె సీతయేని నింద్రారినింగూల్పు, లాభమేమిగలదు? లలన మఱల
స్వీకరింపఁ డనుచుఁజేపట్టెనని, రాముఁ, డేమిసేయువలయు నింక నకట? 609

శా॥ ఈకాంతామణి బుద్ధిపూర్వకముగా నింద్రారినిం బొందెనో!
లేకీ దుర్మతియైనరావణుఁడు బల్మింబట్టి భోగించెనో!
నాకింతేనియుఁ దోప దీయతివ యా నాకీశ్వరోరత్నమో
నో! కాదో! మతిఁగోలుపోయి యిటులే నూహించి యున్నాడనో' 610

గీ॥ అని వితర్కించి 'లోకంబునం దనేకు, లొకరిఁ బోలినవారొక రుందురనియు
రావణునిపత్నియే కానిరమణి రాము, భార్యగా' దని భావించి పవనసుతుఁడు. 611

చం॥ 'పరమపతివ్రతామణియుఁ బావనినాఁ జనుసీతయేడ న
చ్చరితుని రామునిన్విడిచి సమ్మతి రావణుఁబొందుటేడ! నేఁ
బొరపడి యిట్లు కానితలపోతకుఁ జొచ్చి యఘంబుఁ బొందితిన్
హరి! హరి! రామచంద్ర! సుగుణాకర! నన్ క్షమియింపవే దయన్.' 612

గీ॥ అని తనకుఁదాన కుత్సించుకొనుచు నచటు, పీడి మఱియును బెక్కెడల్ వెదకివెదకి
గాసిఁజెంది హతాశుఁడై కడకునిట్లు, ధీరుఁడగు వాయుజుండు చింతింపసాగె. 612

కం॥ 'ఈలంకాపురమంతయు, గాలించి వెదకితిఁగాని కట్టా! మఱి నా
కేలయొకో కనఁబడదా, లీలావతియున్నచొప్పు లేశంబైనన్. 613

ఉ॥ జానకివార్తఁదెత్తునని చాలప్రగల్భములాడి వచ్చితిన్
నానయొకింతలేక మది నంగని యెల్లరునవ్వ వెన్కకున్
నేనెటు రిత్తవోదు? 'నవనీసుతఁగంటివె నీ?' వటంచు న
న్నా నరనాయకుండడుగ నక్కట॥ యాతని కేమి చెప్పుదున్?· 614

ఉ॥ ఎచ్చటనున్నఁగాని వనజేక్షణ నారసివత్తునంచు నా
సచ్చరితుండు రామనృపసత్తముఁడెంతయు విశ్వసించి నా
కచ్చుగ సీతకిమ్మనుచు నాదరమొప్పఁగ నానవాలుగా
నిచ్చె నిజాంగుళీయక మిఁకెట్టులఁబోవుదు? నేమిసేయుదున్? 615

ఉ॥ నే నరుదెంతునం చెఱిఁగి నిర్జరవైరి ధరాతనూభవం
దానిటనుంచ కెందయిన దాచెనొ! లేక లతాంగి తన్ను నె
ట్టైన వరింపదంచు హృదయంబునెంచి వధించియుండెనో!
మానసమందు నొక్కయణుమాత్రముఁ దోపదిఁకేమిసేయుదున్?' 616

కం॥ అని తర్కవితర్కంబులు, మనమునఁ బెనఁగొనఁగ నిందు మహినందనలే
దని యున్నదనియు మారుతి, ఘనముగభావించి కనలి కడకిటులెంచెన్. 617

శా॥ 'ఈలంకాపురమంతయున్ భుజబలంబేపారఁగా లీలమై
వాలాగ్రంబున నేఁబెకల్చికొనుచున్ వైలంబ కొంపోయి భూ
పాలగ్రామణియైన రాముని సమీపంబందునం జేర్చెదన్
రోలంబాలకయైన సీత నతఁడే రూఢిన్ గవేషించెడున్. 618

ఉ॥ అప్పటికేనియున్ సరసిజానన తాఁ బొడసూపదేని యా
కప్పురగంధిఁ జూపుమని గర్వితుఁడౌ దశకంఠు ద్రేల్మిడిం
దప్పక కట్టికొట్టెదను దథ్యముగా నపుడైనఁగాని తాఁ
జెప్పకయున్నె నాకు మఱి సీతయుదంతము సర్వముం దగన్?· 619

సీ॥ సప్తసాగరముల జలము లేకుండఁ గడిమిమై నింకించి కలఁతునొండె
దిక్కులన్నింటిని నొక్కచోటికిఁ దెచ్చి బలిమిమై బంధించి పెతునొండెఁ
గులపర్వతములు వ్రక్కలుగాఁగఁ గొట్టి బల్చూర్ణంబుఁ జేసి జాలుదునొండె
బ్రహ్మాండభాండకర్పరమెల్లఁ ద్రుటిలౌను విసికి మొద్దగను గావింతునొండె
గీ॥ సురఖచరసిద్ధసాధ్యకిన్నరనరాది, భూతసంతతులనుబట్టి పొడవడంతు
నొండె సూర్యచంద్రాదుల యురుగతులను, మాన్పుదునొండె జానకి లేనియెడల. 620

గీ॥ క్రమముఁదప్పక నడచెడు కాలచక్ర, మట్లనిల్పుదునొండె సద్దాసనుండు
సలుపుచున్నట్టి యీసృష్టి సాగనిత్తు, నే? ధరాసుత పొడసూపదేని నాకు?'- 621

కం॥ అని రోషమున మరున్నం, దనుఁడు విజృంభించి పలుకఁ దద్దయు భీతిం
డినకమరులు బోధించిరొ, యన రావణు నుపవనంబునందు జనకజన్ 622

ఆ॥ వెదుకవలయుననుచు హృదయంబునందున, నూహపొడమ గంధవాహతనయుఁ
డాక్షణంబ దానవాదీశ్వరుని యశో, కవనమునకుఁ జనియెఁ గడఁగి తాను 623

కం॥ ఈవిధమున మారుతి యా, రావణునారామమునకు రయమునఁజని నా
నావిధభూరుహగుల్మల, తావసలంగాంచి మిగుల నక్కజమొదవన్ 624

సీ॥ శారికాకీరమయూరకోకిలముల రమణీయకాకలీరావములను
మధురసాస్వాదనోన్మత్త ద్విరేఫసంఘాత మనోజ్ఞఝుంకారములను
బహువిధపరిమళ స్వాదుఫలోత్కరభరిత నానానేకపాదపముల
మల్లెలు మొల్లలు మఱిజాజిసంపంగి విరజాజులాదియౌ విపులగములఁ
గీ॥ గాంచి నేత్రోత్సవముఁగూర్పఁ గడుమురియుచు, 'భళిరె! దీనికి నందనవనియుఁ జైత్ర
రథమునైనను సరిఁబోల్పరా' దటంచు, వేయివిధములఁ బొగడుచు వాయుజుండు 625

ఉ॥ అందుఁ బరిభ్రమించుచు మహాబలసూనుఁడు వింతవింతలౌ
సుందరకుట్టిమంబులను శోభలనీనుచుఁ గన్నుదోయికిన్
విందొనఁగూర్చు రత్నమయవేదులు మేల్మినికుంజపుంజ మం
దందు మనోజ్ఞమైన కృతకాద్రులు కన్పడ సంతసించుచున్ 626

గీ॥ మఱియు నావనమందలి మహితచిత్ర, మలరు రాజితబహుశిల్పములను గనుచుఁ
జిత్తమంతయు సచ్ఛకాయత్తమగుచు, నడచుఁదిరుగుచు సతినాతఁ డరయుచుండ 627

కం॥ 'హారామ! రామ!? యనుచున్, బోరునవిలపించుచున్న భూమితనయ యా
ర్తారావముపీకెంచిన, నారయ నద్దెసకుఁబోయి యనిలజుఁడు తగన్. 628

సీ॥ కంటికిమంటికిఁ గడునేకధారగాఁ గన్నీరునించుచు నున్నదాని
మాటిమాటికి రామ! మాంపాహి! యనుచును ఖిన్నయై శోకించుచున్నదానిఁ
బలువురు దైత్యాంగనలు చుట్టునుంజేరి పొరిపొరిఁగారింపఁ బొగులుదాని
నన్నపానాదిసౌఖ్యంబులవర్జించి యతికృశీభూతాంగి యయినదాని
గీ॥ అవనతాస్యయగుచు నవనీరుహముచెంతఁ, దగవసించియున్న తలిరుఁబోఁడిఁ
బరమపూతచరిత బహుపుణ్యసాధ్వని, జనకసుతను గాంచె ననిలసుతుఁడు 629
గీ॥ ఇట్లు కనుఁగొని యామెయే యినకులపతి, దేవి యనియెంచి పావని భావమందుఁ
దన్నుఁ గృతకృత్యుఁగాఁ గను దలఁచి కరము, నిర్భరానందభరితుఁడై నేర్పుమీర.
గీ॥ పలువు రసురాంగనలు చుట్టు బలిసియుండఁ, గాంతతోడ సంభాషింపఁగాఁ దనకది
యదనుగాదని భావించి యాక్షణంబ, వాతనందనుఁ డురుజవోపేతుఁ డగుచు. 631
కం॥ ఏవృక్షమవనిసుతకుఁ జి, రావాసంబగుచుఁ దనరు నావృక్షంబే
పావనియధిరోహించి ల, తావళిమఱుఁగునవసించె నాతరుణమునన్ 632

## రావణుఁడు సపరివారుండై యశోకవనమునకు వచ్చుట

సీ॥ అట నిద్రితుండగు నాదశగ్రీవున కొకకోతి కలలోన నొనరఁదోచి
సీతతోభాషించి చెలఁగి యారామము ధ్వంసంబుఁజేసి తత్పాలకులను
బలువురదైత్యులఁబట్టి విదారించి లంకాపురంబు నిశ్శంకతోడ
దహియించి శ్రీరామధరణీశుపాలికిఁ, జనుటాదిగాఁగల చర్యలెల్లఁ
గీ॥ గాంచి భీతిల్లి యాసురకంటకుండు, తక్షణమ యుల్కిపడిలేచి 'తఱచుగాను
స్వప్నమున వానరుండు సాక్షాత్కరించి, నట్లయిన హానికరమగు' నని తలంచి 633
శా॥ ఆదుస్స్వప్నఫలంబు పోవుటకునై యత్యంతశాంతిక్రియల్
వేదోక్తంబుగ నాచరించి తనుఁ బూవిల్తుండు ప్రేరేప సీ
తాదేవిన్ స్మరియించుకొంచుఁ గర ముత్సాహంబుతో మన్మథో
న్మాదుండై మఱి నిద్రరామి నపుడామందుండు శీఘ్రంబునన్. 634
ఉ॥ ఆనడురేయియందు వివిధాభరణాంబరగంధమాల్యముల్
తాను ధరించి దైత్యసముదాయము భార్యలు వెంటరా మహా
నూనవిభూతిదోపఁగ మనోముదమొప్పఁగఁ బాదచారియై
యా నరభోక్త వేఁబయసమయ్యె నశోకవనంబుఁ జేరఁగన్. 635

గీ॥ ఈ విధంబునఁ గైసేసి రావణుండు, సపరివారముగాఁ జనుసమయమునను
బటహకాహళగోముఖప్రముఖతూర్య, తతులు బోరన మ్రోసెఁ గుతలముపగుల. 636

సీ॥ ఊర్వశీరంభాది సర్వాప్సరోవ్రాత మతికౌశలమున నృత్యములుసలుప
గానవిద్యావేత్తలైన గంధర్వులు స్తవగీతములు మనోజ్ఞముగఁ బాడ
వందిమాగధసూతవైతాళికులుచేరి పొలుపుగఁ గైవారములు నొనర్ప
మంత్రిసేనానిసామంతభృత్యులు నిరువంకలఁ గాల్నడ వచ్చుచుండ
గీ॥ యక్షకిన్నరచారణాద్యమరసతులు, కొందఱు గొడుగులనుబట్టి కొందఱు మఱి
చామరంబులువీవ సేసలనుగొంద, ఱెలమిఁజల్లుచు వెంటరా నింద్రవైరి· 637

గీ॥ అనుపమానవైభవమున నట్లతండు, సీతయున్నయశోకంబుఁ జేరఁబోయి
సముచితాసనాసీనుఁడై జనకసుతకుఁ, దనమహోరీవిఁజూపు చిట్లసుచుఁ బలికె 638

ఉ॥ 'కోమల్లి! బేలవైయిటులఁ గుందుచునున్నఫలంబు సుంతయున్
లేమి యథార్థ మింకఁగడలిం గడులాఘవమొప్పదాటి నీ
రాముఁడుగేముఁ డిచ్చటికిరాగలఁడే? యడియాసలేల? నం
బ్రేమదలిర్ప భర్తగవరించి సుఖింపఁగరాదె నిచ్చలున్? 639

ఉ॥ నాతిరో! వార్ధిదాటి రఘునాథుఁడు తానొకవేళవచ్చెఁ బో
భ్రాతృయుతంబుగా సమరరంగమునన్ నిజగర్వమేది నా
చేతనుజచ్చుఁగాని విను! సిద్ధము చంపఁగలేడు నన్ను నిన్
భూతలనాయకుండు గొనిపోవు టసత్యము నమ్ము మీసుడుల్. 640

సీ॥ ప్రకటలంకారాజ్యపరిపాలకుఁడనేను రాజ్యవిహీనుఁ డారాఘవుండు
శౌర్యసాహసబలసంపన్నుఁడనునేను రహితవిక్రముఁడు నీరాఘవుండు
చిరభోగరతమహాశ్రీమంతుఁడనునేను రమణి! దరిద్రుఁ డారాఘవుండు
సంగరవిద్యావిశారదుండనునేను రణరంగభీరుఁ డారాఘవుండు
గీ॥ ఘనమహోదాత్తవిజ్ఞానధనుఁడనేను, బ్రథమగణ్యుఁడు జడులలో రాఘవుండు
నిఖిలజగదధినేతను నేన సుమ్ము!, రాజముఖి! నాకు సరిరాడు రాఘవుండు. 641

గీ॥ భామ! వేయేల? నాకును రామునకును. హస్తిమశకాంతరము గల దరసిచూడ
మూడులోకముల జయించినాడ నేను, చెప్ప మానరుఁడేమేమి చేసినాడొ. 642

ఉ॥ అన్నమునీరముంగొనక యక్కట! యానరుమీది భ్రాంతిచే
నన్నులమిన్న! నీదుబ్రదు కారడిపోవఁ గృశించెదేల? నీ
మన్ననయున్నఁజాలు నణుమాత్రము లోపముఁజేయ నిష్టమృ
ష్టాన్నములన్ భుజించుచును హాయిగఁగాలముఁ బుచ్చు రాణివై'. 643

చం॥ అని మదనాతురుండయి దశాననుఁడాడెడు దుష్ప్రలాపముల్
విని సహియింప కప్డు డరవిందదళేక్షణ సీత వానినిం
గనుఁగొననొల్ల కొక్కతృణఖండముఁగైకొని దానిఁ జూచుచున్
మనమున నాగ్రహించి యనుమానము భీతియులేక యిట్లనున్. 644

ఉ॥ 'అందనిమ్రానిపండ్ల కిటు లబ్బులుసాచిన లాభమున్నె? యో
మందుఁడ! నాదుచిత్త మణుమాత్రము రామునిఁబాసి యన్యునిం
జెందదు మిన్నకుండుమిఁక ఛీ దురితాత్మక! మూయునోరు నీ
యందనురాగమెన్నటికినైన జనింపదునాకు సుంతయున్. 645

ఉ॥ ఎమ్మెయినైనఁగాని గుణహీనుఁడ! రామునిచేత నీకు ని
క్కమ్ముగఁ జావుమూడియె సగర్వముతోఁ గడుసాధ్వినైన న
న్నిమ్మెయిఁ బాపభీతిగణియింపక బల్మినిఁ దెచ్చితీవు సి
ద్ధమ్ముగనుండు మాఫలముఁ దప్పకపొందెదు సత్వరంబుగన్. 646

ఉ॥ రాము గుణాభిరాము రణరంగవినిర్జితఘోరరాక్షస
స్తోము నమేయవిక్రమయశోబలధాముఁ దిరస్కరించి నీ
వీమెయి దుష్ప్రలాపముల నేటికిఁ బ్రేలెదు? దుష్టుఁడా! తదీ
యామలపాదధూళికినినైనను బోలుదువే నిజంబుగన్?. 647

ఉ॥ మానవమాత్రుఁగాఁగ మతి మానసమందున నెంచఁబోకు మీ
దానవవంశమంతయును దథ్యముగా వధియించుపొంటె నా
దానవవైరియే యిటుల ధారుణిలోపల రామచంద్రుఁడై
తానుదయించినాఁడు విను! దైత్యకులాధమ! మాటలేటికిన్?. 648

ఉ॥ రాముని శాతసాయకపరంపరచేత విఖండితంబులై
భూమిపయిం ద్వదీయదశమూర్ధము లొక్కటఁగూల నీసతుల్
వేముఱు మీఁదఁ ద్రెళ్లి పలవించుచునుండఁగ నప్పుడైననున్
రామునిఁబాపుఁ జేవయును రావణ! నీక యెఱుంగనౌ సుమీ. 649

చం॥ సురగరుడోరగాదులను భారతగెల్వఁగవచ్చుఁ గాని స
చ్చరితుని శౌర్యధైర్యబలసాహసవిత్తసమగ్రు రాఘవున్
దురమునగెల్వరాదు విను! దుర్మతి! నీవిఁకనైన నన్ను దా
శరథికి నిచ్చి వేశరణు సమ్మతివేడుము నిన్నుఁగాచెడున్ 650

ఉ॥ అందఱుయాంధ్ర బల్మిఁగొనినట్ల మదిండలపోసితేమొ నీ
వెందులకేగినన్ రవికులేశుఁడు రాముఁడుగాంబడించి తా
వందలు వేలుగా నిశితబాణపరంపర వెల్లిఁగొల్పి నిన్
మందఁగఁజేసి నన్ను ననురాగముతోఁ గొనిపోవు నీచుఁడా! 651

కం॥ అని జానకి తృణఖండం, బును నుపలక్షించి కరము మూర్ఛఁడగు దశా
ననునుద్దేశించి మనం, బున జంకక దూరియిట్లు పొరిపొరిఁ బలుకన్. 652

మ॥ విని యాపంక్తిముఖుండు తత్క్షణమ యాభీలక్రుధావిష్టుఁడై
కనులన్ నిప్పులురాలుచుండఁగ మహాగర్వాతిరేకంబుతో
ననివార్యంబుగఁ బొడ్డుగీటుచు సముద్యత్కాలమేఘార్భటిం
దన చుట్టుంగలవారితో జనకజాతంజూపి తానిట్లనున్. 653

సీ॥ 'విన్నారుకద! మీరు వెలఁదిదుర్భాషలు కన్నారుగద! దీని గడుసుఁదనము
త్రైలోక్యభయదప్రతాపసమగ్రుఁడనగు నన్ను లవమాత్రమైనఁ గాని
సరకుసేయక యవాచ్యములు ప్రేలఁగఁజొచ్చె నౌర! యీ గర్వమేమనఁగవచ్చుఁ
గన్నులుతలకెక్కెఁ గాఁబోలుదీనికి నిఁకను పేక్షింపరా దిపుడనాదు
ఆ॥ ఘనతరాసిచేతఁ గడఁగి యీగయ్యాళి, నెలమి ఖండఖండములుగ నఱికి
రక్తమాంసములను రక్షఃపిశాచాది, భూతతతికిఁబెట్టి ప్రీతిఁగూర్తు' 654

మ॥ అని శీఘ్రంబునఁ గత్తిదూసి పటుశౌర్యస్ఫూర్తి శోభిల్లఁగా
ఘనరౌద్రాకృతి లేడిపైదుముకు వ్యాఘ్రంబోయనన్ రావణుం
డనివార్యోద్భటవృత్తి జానకిని సంహారంబుగావింతుఁ గా
కని తాముందునకేగుఁదెంచె సతిహాహారావముల్ సేయఁగన్ 655

సీ॥ ఇట్లు తన్నువధింప నిం దారి యేతేరఁగని సీత కడు భయాక్రాంతయగుచు
గోడుగోడునవేడ్వఁ గోపలితోఁబాటు నందున్న వేలుపు టతివలెల్లఁ
దద్దయుజాలిమెఁ దాపినొక్కుమ్మడి బిగ్గరగా విలపించుటయును
హనుమంతుఁ డవిచూచి యాగ్రహంబును బట్టలేక యాఖలుఁ గూల్చఁగాక యనుచు

గీ॥ వానిపైఁ దాను లంఘింపఁబూని వెండి, యిట్లుతలపోసె 'నేనిప్పు డీదురాత్ము
హతము గావించితిన యెట్టులైనఁగాని దానవులచేత సీతకు హానిగలదు. 656

గీ॥ అదియునుంగాక నేను దశాస్యుచేత, బంధితుఁడనైన జానకివార్త నెవరు
క్ష్మాపతికిఁ దెల్పువారింకఁ? గాన పీనిఁ, గూల్చుయత్నంబు విరమించుకొనుట లెస్స' 657

గీ॥ అని విచారించి హనుమంతుఁ డలుకవీడి, యూరకయెయుండె మ్రానిపై నుచితమెఱిఁగి
యపుడు నిజభర్తతో వినయంబుదోపఁ, బ్రథమభార్య మందోదరి పలికె నిట్లు. 658

గీ॥ 'సకలశాస్త్రంబులెల్లను జదివినారు, మీకుఁ దెలియనిధర్మముల్ లోకమందుఁ
జూడనెందేనిలేపు మచ్చునకునైన, నాడుదానినిఁ జంప న్యాయ్యంబె? నాథ!. 659

కం॥ గోహత్యయు శిశుహత్యయు, స్త్రీహత్యయు బ్రహ్మహత్య చింతింప మహా
ద్రోహమని బుద్ధిమంతులు, బాహాటముగావచించు పలుకులు వినరే? 660

చం॥ దురమున నష్టదిక్పతులఁ దోరపువిక్రమమొప్పగెల్చి త
త్పురములనెల్లఁ గొల్లఁగొని భూరిసముజ్జ్వలకీర్తివైభవ
స్ఫురితుఁడవైన నీవిటులఁ బుణ్యచరిత్ర యనాథయైన యీ
పరమపతివ్రతన్ నఱుకఁబాడియె? పౌరుషమే? మనోహరా!. 661

ఆ॥ ఎవ్వరైననొండె నెదిరించిపోరాడి, వైరుల వధియింపవచ్చుఁ గాని
యమలచరితలైన యబలలఁజంప మీ, వంటివీరుల కిది పాడిగాదు 662

కం॥ నావిన్నపమాలింపుడు, పోవిడువుడు సాహసంబు పూతచరితయౌ
ఈవనితనుబరిమార్చినఁ, గేవలపాపంబుగాక క్షేమంబున్నే?'. 663

కం॥ అని కడువిధేయురాలయి, తనకరములురెంటుపట్టి తగఁబేర్కొను న
వ్వనితామణి పలుకులువిని, దనుజేంద్రుఁడు గొంత శాంతితత్పరుఁడగుచున్. 664

సీ॥ హేమాస్య త్రిజట యయోముఖి హరిజట ప్రఘస మహోదరిప్రముఖదైత్య
కాంతలఁ బెక్కంద్రఁ గడుశీఘ్రమునఁజీరి రెండుమాసంబులు ఖండితముగ
నవధి యొసంగితి నంతకులోపల నాకు వశీభూతగాకయున్న
ముక్కముక్కలుగాఁగ గ్రక్కునఖండించి మక్కువతోదీని మాంసమెల్ల
గీ॥ నారగింపుడు మీరంద' అనుచునుడివి, సకలపరివారములుగొల్వ సరభసముగ
దమజవల్లభుఁ డటనుండి చనియె నాత్మ, పదనమునకు మందోదరీసహితుఁడగుచు. 655

ఉ॥ అంత నిశాటకాంతలు దశాననునానతి చొప్పునన్ వ్యథా
క్రాంతమనస్కయైన జనకక్షితిపాత్మజచెంతఁ జేరియ
త్యంతనయోక్తులొప్పఁగఁ బ్రియంబున నిట్లని రావెలందిలోఁ
'గాంతరొ! చూచితే దనుజకాంతు నిరంకుశశాసనంబులన్?. 666

కం॥ ఈరెండునెలలలోపల, మారావణు నొల్లకున్నమదిరేక్షణ! ని
ష్కారణముగ మాచేతను, దారుణమరణంబు నీకుఁ దప్పదు సుమ్మీ 667

సీ॥ ఈమౌర్ఖ్యమేటికి? మామాటలాలించి రావణుఁబొందుము రమణి! నీకు
సర్వకాలము సౌఖ్యసంపదల్ సిద్ధించు ననయంబు నిన్నుమే మందఱము ను
సేవించుచుందుము నీవయేలికవౌచు నీలంకయెల్లను నేలుకొమ్మ
యింతకంటెను మఱియేమి కావలయును? రావణుసంతటిరాజు తాన
ఆ॥ నిన్నువలచెనట్టి నీయదృష్టముకాదె?, యేల యొల్లవీవుబేల! చెపుమ?
యిట్టిగౌరవార్హు నెందైన భర్తఁగాఁ, బడయువలయునన్న వశమెనీకు?. 68

గీ॥ అడవిఁగాచినవెన్నెలయట్లు నీదు, ప్రాయమంతయునం బాడుసేయనేల?
నన్నివిధముల ననుకూలుఁడగు దశాస్యుఁ, గూడి సుఖియింపరాదె నీకోర్కెదీర?. 66

చం॥ తినుటకుఁ దిండిలేక కడుదీనతనొందుచుఁ గాననంబులో
ననిశము సంచరించు మనుజాధముఁడౌ రఘురామునైనఁ గూ
డని యనురాగమొంది యకటా! వెతలందఁగనేల? రావణుం
బెనిమిటిఁగాఁగ నేలుకొని పేర్మిసుఖింపుము నీవు జానకి! 67

చం॥ సతతము దేవభామినులుసైత మమూల్యమహాధనాదులం
చితముగఁ గానుకల్ దగవిశేషముగాఁ గొనివచ్చి యిచ్చుచున్
రతులను దేల్చుచుండుదురు రావణు నీవనచెంత? యింక నో
యతివ! నిరాకరింపక సురారికులేశ్వరునేలుకోఁగదే!. 6

సీ॥ కులమనుమాటను దలఁపనేవలవదు పరమపావనమైన బ్రహ్మకులము
శీలమా విను పరిశీలింపఁబనిలేదు సర్వలోకనుతప్రశస్తతరము
విద్యయంచను నాల్గువేదముల్ తుదముట్టఁజదివినయట్టి విజ్ఞానధనుఁడు
గుణములనెంతుమా కొరతయేమియులేదు సుగుణులలో మేటిసుగుణశాలి
గీ॥ ధనముసంగతి చెప్పనేతరముగాదు, ధనదుసంపదలెల్లనుఁ దానకొనియె
రూపమా కోటిమదనులు నోపరట్టి, యిట్టి మారాజుఁ జేపట్టనేల శంక?. 6

సీ॥ లేలెమ్మ! శోకంబు చాలింపు మబ్జాక్షి! మారావణబ్రహ్మ మంచిమంచి
వెలలేనిచీరలు వెలలేనిసొమ్ములు నీకునైతెప్పించెఁ బ్రాకటముగ
వానిని ధరియించి దానవాధీశుని పట్టపురాణివై వైభవమునఁ
గులుకుచు మానేత్రములుచల్లఁబడఁ గాపురంబుసేయుము గౌరవంబుమీర
ఆ॥ నీకుఁ గొఱతలేదు నిత్యశుభములొందు, నిఖిలదనుజగణము నిన్నుఁ జేరి
పరమభక్తితోడఁ బరిచర్యసేయుచు, నుండఁ దేజరిల్లుచుండవలదె?. 673

సీ॥ చిక్కకయెట్టటో చక్కనికాంతవు మాకుఁజిక్కితివీవు మందగమన!
తప్పించుకొనిపోవఁ దరముగాదింక నీరాముఁడు మఱి సముద్రంబుదాటి
రాలేడు నినుఁ గొనిపోలేడు నీవిటు లూరక యడియాస లొందనేల?
నీమపుణ్యముపంకియే దశాస్యుఁడు తాను గొనివచ్చినాడు నీకోర్కెదీర
గీ॥ నతనినింగూడి సౌఖ్యంబులవిరళముగ, నిచ్చవచ్చినరీతి నీవెల్లకాల
మనుభవింపుము నీజన్మ మతికృతార్థ, తను వహించును నిజముగాఁ బలికెఁ గోతి'' 674

కం॥ అని యిట్లనేకభంగులఁ, దనకుఁ బ్రబోధించుచున్న దనుజాంగనలం
గనుఁగొని సవిషాదంబుగ, జనవినుతచరిత్రయైన జానకి పలికెన్. 675

సీ॥ 'కామినులార! మీరేమిచెప్పినఁగాని నామానసంబు శ్రీరామవిభుని
నెడఁబాసి యన్యుల నిచ్చగింపఁగనొల్ల దతులితంబుగ మీకు నతులొనర్తు
నన్నివిధంబున నవయఁజేసెదరేల? నేకాలముననైన లోకమందుఁ
బరమపతివ్రతల్ పరపురుషులఁగూడి వ్యభిచరించుట యెటనైనఁ గలదె?
గీ॥ మీకునైతము కూతులు లేకపోరు, వారలకు నిట్టులే యసద్వర్తనంబు
బోధసేయుదురో? కాక బోద్ధలార!, నాకుమాత్రమె కఱపుచున్నారొ! చెప్పుడు. 676

గీ॥ పరసతిని సాధ్వినగు నన్నువార్యముగను, దయయు దాక్షిణ్య మించుకంతయునులేక
కర్కశంబుగ మీరిట్లు గాసిపఱుపఁ, గటకటా! న్యాయ్యమగునె? యో గరితలార. 677

సీ॥ కులహీనుఁడగుఁగాక! గుణహీనుఁడగుగాక! యత్యంతమూఢాత్ముఁ డగునుగాక!
మానంబు మర్యాద లేనివాడగుఁగాక యాచారశూన్యుఁడే యగునుగాక!
బలవిక్రమప్రాభవరహితుండగుఁగాక! యందంబులేనివా డగునుగాక!
కాననవాసియై కడగంటఁబడుఁగాక! కడునిరుపేదయై క్రాలుఁగాక!
గీ॥ అన్నివిధముల మీరావణాసురునకు, రామచంద్రుండు తాసాటి రాకపోవుఁ
గాక! త్రికరణశుద్ధిగాఁ గాంతలార!, యతఁడె నాపాలిదైవమై యలరుచుండు. 678

గీ॥ కుంటియైనను జడుఁడైన గ్రుడ్డియైన, రూపహీనుండయైనను రోగియైనఁ
బెండ్లియాడిన తమపతిన్ విడిచి యన్య, పురుషసంగతిఁ గోరసాధ్వులకుఁ దగునె? 679

కం॥ మీరావణుఁ డెంతమహా, గౌరవసంపన్నుఁ డైనఁగానీ మదిలోఁ
గోరను దత్సంగమమును, గారింపఁగనేల నన్ను? కామినులారా!' 680

గీ॥ అనుచు నిబ్బంగి వారికి నప్రియముగ, వెలఁది ప్రతికూలవచనముల్ పలుకుచుండ
విని సహింపక యప్పుడా దనుజకాంత, లతిదురాగ్రహావేశలై యాక్షణంబ. 681

కం॥ 'దాక్షిణ్యముఁ జూపవలవ, దీక్షణమే దీనిఁబట్టి యెంతయుఁ గడిమిన్
శిక్షింతము భక్షింత ము, పేక్షింపక రావణుండు పెద్దగమెచ్చన్'. 682

## త్రిజట తనస్వప్నవృత్తాంతమును రాక్షసస్త్రీలకుఁ జెప్పుట

సీ॥ అని యిట్లు దానవాంగనలు భర్జించియుఁ దర్జించియును మహాదారుణముగ
బాధించియును గడువేధించియును బెక్కురీతుల నా ధరిత్రీకుమారి
నలయించుచుండ నయ్యవసరంబున సాధుశీలయౌ త్రిజటనాఁ జెలఁగునింతి
కొండొకయెడఁదాను పండి నిద్రించుచునుండ రాముఁడు లక్ష్మణుండు తాము
గీ॥ తరుచరులఁగూడి లంకకునరుగుఁదెంచి, రణములోపల సపరివారముగఁ బంక్తి
ముఖునివధియించి సీతఁగొంపోయినట్లు, లొక్కస్వప్నమురా నామె యులికిపడుచు. 683

గీ॥ గ్రక్కునన్‌లేచి తనతోడిగరితలైన, యసురకాంతలఁ దనచెంత కాక్షణంబ
పలుమరులుఁజీరి మిగులసంభ్రమముదోప, వారలెల్లరు విననిట్లు పలికెఁ ద్రిజట. 684

ఆ॥ 'కాంతలార! యొక్కకలఁగంటి వినుఁడింకఁ, బ్రబలకీశ సేన బలిసికొలువ
దశరథాగ్రసుతుఁడు తమ్మునితోఁగూడి, వచ్చివిడిసెనట్టె వార్ధిచెంత. 685

సీ॥ అటనుండి పిమ్మట నాసముద్రమునకు సేతువుఁగట్టించి స్థిరయశుండు
రాఘవుం డుదధి నశ్రమమునదాటి వానరసేనతో లంక కరుగుఁదెంచి
రణములోపల మనరావణాసురు సబాంధవముగా వధియించి ధర్మచరితుఁ
డగుచు నొప్పినయట్టి యావిభీషణు లంక కధిపతిఁగాఁజేసి యవనిసుతను
గీ॥ గొనుచుఁ గపిసైన్యయుతముగాఁ, గొమరుమిగులఁ, బుష్పకారూఢుఁడై నిజపురమునకును
దమ్ముఁడునుదాను హర్షంబుతాండవింపఁ, బోవఁ గలలోనఁగంటిని బొలఁతులార! 686

ఆ॥ వినుఁడు మఱియు రామవిభునకు శుభసూచ, కములు చూడఁ బంక్తికంధరునకు
నశుభసూచకంబు లైనవిశేషముల్, పెక్కు కానఁబడియె వెలఁదులార! 687

కం॥ ఈకల యథార్థమనుటకు, నాకున్ సందియములేదు నక్తంచరులన్
భీకరరణమునఁ బొరిగొని, రాకాశశిముఖినిఁగొనుచు రాముఁ డరిగెడున్. 688

కం॥ చేడియలారా! స్వప్నము, మూడవయామమునరాగ మప్పని విందన్
మూడవయామమె యియ్యది, కీడొందకపోదు పూర్వగీర్వాణులకున్. 689

కం॥ కావున మనమిఁక సీతా, దేవిని బాధింపవలదు చిరయశుఁడు రఘు
క్ష్మావరుఁడరుదెంచినచో, భావింపఁగ మున్న మనలఁబట్టి వధించున్' 690

ఆ॥ అనుడుఁ ద్రిజటపలుకు లాలించి యాదైత్య, కాంతలెల్లభీతిఁ గదురనంతఁ
దమకుఁదామె యిటులఁదలపోసి రీసీత, సుద్దియింక వలదు సుమ్ము మనకు. 691

ఆ॥ ఈసరోజముఖిని హింసింపనేటికి?, మనము రాముచేత మడియనేల?
యూరకుండుటెల్ల నుచితంబయొఁగాదె?, నడుమ మనకు వీరి గొడవయేల? 692

గీ॥ దక్కిటెద్దులుపోట్లాడి దూడకాలు, విఱిచె నన్నట్లు వీరిర్వు రటిమఁటి నిటు
తారుకలహించుకొని మనల్రా ళ్ళఁ ద్రెంపఁ, జూచుచుండిరి నిజముగా సుదతులార! 693

కం॥ అని కొండొకయెడనుఁ దొలఁగి, దనుజాంగనలెల్ల నిద్ర తమ్మొందఁగయున్
ఘనముగ మదిరాపానం, బొనరిచి శయనించి రొక్కరొకరే పుడమిన్. 694

సీ॥ అప్పుడు జానకి యమితంబుగా దుఃఖబాష్పముల్ వరదలై పాఱుచుండ
గోడుగోడున నిట్టులేడువఁగాసాగె 'కట్ట! నాగతియింక నెట్టులొక్కొ
దైవమా! దానవాధముఁడు మాసద్వయ మవధిమొసఁగిపోయె నట్టెనాకు
వంతకులోపల నర్కకులేశుఁడు చమదెంచి నన్నుఁదాఁ గొనుచుఁబోవఁ
గీ॥ డేని ననుఁ దమప్రభుని యాజ్ఞానుసార, మీవెలందులు చంపుదు రెట్టులైనఁ
జావుసిద్ధము వీరిచేఁ జచ్చుకంటె, నాత్మహత్యయె యుక్తమౌ' సంచు వెంచి. 695

గీ॥ తక్షణమె జానకీదేవి తనదువేణి, చేత నురివేసికొని మటిజీవములను
బాయుదుంగాక యను నభిప్రాయమొదవ, లేచి తరుశాఖనూది నిల్చినను జూచి, 696

## హనుమంతుఁడు చెట్టుపైనుండి సీత వినునట్లు రామకథను జదువుట

కం॥ అదియే సంభాషించుట, కదనని డెందమునఁదలఁచి యనిలతనయుఁ డ
మ్మదిరాక్షి సీతవినఁగాఁ, జదువఁదొడఁగె నిట్లు రాముచరితంబెల్లన్. 697

సీ॥ 'దశరథుండనురాజు ధారుణిఁబాలించె నతనికి నల్వురసుతులు పుట్టి
రందు రాముఁడు తండ్రియాజ్ఞ నౌఁదలఁదాల్చి భార్యతోననుజతోఁబడియున్నాల్గు
వత్సరంబు లరణ్యవాసంబొనర్చుట కరుదెంచి యచ్చట నతివఁ గోలు
పడి ఋష్యమూకపర్వతమునకేతెంచి జలజాప్తసూతితోఁ జెలిమిచేసి
గీ॥ తాను సుఖమున్నవాడు సోదరునిఁగూడి, యే సతనిపంపువడసి పెక్కెడల వెదకి
వెదకి యిచ్చట నేటికి వెలఁదిమిన్నఁ, గంటిని గృతార్థతనుబొందఁ గంటినింక'. 698

సీ॥ అని యిట్లు హనుమంతుఁ డవనీతనయవినఁ దాను రామునిచరిత్రంబుఁ జదువ
విని యామహాసాధ్వి తనమనంబునఁజాల నక్కజమొంది యిట్లని తలంచె
'నౌర! యీ చిత్రమేమైయుండునోగద! యిందులే రెవ్వరు నెంచిచూడ
నంతరిక్షమునుండి వింతవాక్కులు నేడు వీతెంచుచున్నవి విశదముగను
ఆ॥ కలయొ! లేకనాకుఁ గరము మతిభ్రమ, కలిగెనొక్కొ! యట్లు గాకయున్న
దనుజమాయయగునొ! తలపోయ నాకాశ, వాణి యివ్విధమునఁబలికె నొక్కొ'. 699

కం॥ అని యూహాపోహలకున్, జనకజ గుఱియౌచు మిగుల శంకితమతియై
ఘనముగఁ గొండొకవడిని, ట్లనితాఁదలపోయఁజొచ్చె నాత్మగతమునన్. 700

గీ॥ 'ఎవ్వఁడైననునేమి? యాయినకులపతి, యైనరామునిచరితంబు వీనులలరఁ
దెలిపెఁ గావున నెల్లభంగులనతండు, నాకుఁ బరమాప్తుఁ డనియె డెందమునఁ దలఁతు'

గీ॥ అనుచు సంతోషితస్వాంతయై లతాంగి, నింగిదెసఁజూడ్కులన్‌నిల్పి 'నీవెవఁడవొ?
రాముచరితంబుఁ జదివి మత్ప్రాణరక్ష, ణంబుసేసితి వనఘ! వందనమొసర్తు. 702

కం॥ దేవతలలోనఁ దలఁపఁగ, నీవెవఁడవొ! చూడఁదలఁతు నేను మహాత్మా!
వేవేగమె పొడసూపుము, పావనురాలగుదు' ననుచుఁ బ్రార్థించుటయున్. 703

కం॥ తరుశాఖనుండి మారుతి, ధరణీస్థలి కవతరించి తా జనకక్ష్మా
వరపుత్రీరత్నమునుం, దర నంగుష్ఠప్రమాణతనుఁడై నిలిచెన్. 704

గీ॥ ఇటు హనుమంతుఁ డామెకట్టెదుటనిలువఁ, గడునెగాదిగఁజూచి యాకాంచనాంగి
తనమనంబున నయ్యది దనుజమాయ, గాఁగశంకించి తలపోయసాగె నిట్లు. 705

కం॥ 'నితరం బీకడగండ్లను, భరియింపఁగలేక నేను బలవంతముగం
దొరఁగుదు జీవములని తాఁ, గరమరుదుగ రావణుండు కడుశంకితుఁడై. 706

కం॥ ననుఁదేర్చుటకై యిమ్మెయి, ఘనముగఁ బన్నుగడఁబన్నెఁ గానియెడల నీ
వనచరుఁడేడమ శతయో, జనవిస్తీర్ణాబ్ధిదాట శక్యంబగునే? 707

గీ॥ ఇది యసత్యము నమ్మరా దింద్రవైరి, పంప దానవుఁడెవఁడొ యీపగిది నన్ను
వంచనముసేయుపొంటెఁ దావచ్చెఁగాక', యనుచుఁ దలవంచి మాటాడవయ్యె సీత 708

గీ॥ అట్లు మౌనంబుఁ బూనియున్నట్టిసీత, చిత్తవృత్తియెఱింగి విశేషభక్తి
ధరణిపై సాగిలంబడి తత్పదముల, కెఱగి వాతూలనందనుఁ డిట్టులనియె. 709

## హనుమంతుఁడు సీతతో సంభాషించుట

ఉ॥ 'మాయలు నింద్రజాలములు మాతరొ! కావివి విశ్వసింపుమా
పాయక నిన్నరోయుటకుఁ బంకజచారువిలోచనుండు నా
రాయణునంశజుండయిన రాముఁడు పంప గవచ్చినాడ నే
వాయుతనూభవుండ ననివార్యపరాక్రమశౌర్యధుర్యుఁడన్ 710

గీ॥ అవధరింపుము హనుమంతుఁడండ్రు నన్నుఁ, గిరికులనాథుఁడైన సుగ్రీవునకును
బంటనగుదును శ్రీరామభద్రునకును, బరమభక్తుఁడఁ దల్లి! నీపాదమాన 711

గీ॥ నిన్నుఁ గానలో వెదకుచు నీదుభర్త, రామచంద్రుండు తా సుమిత్రాత్మజుఁ
గూడి ఋష్యమూకాద్రికి నాడువచ్చి, రవిసుతుండైన సుగ్రీవరాజుతోడ. 712

కం॥ స్నేహంబుచేసి పిమ్మట, నాహవమున నతనిభ్రాతయగు వాలినిఁ దా
బాహుబలమునఁ జదిపి కృప, తో హరికులుఁడైనదశరథుని సుతుఁడంతన్. 713

గీ॥ మాప్రభుండైన సుగ్రీవు మహితకీశ, రాజ్యమున కధిపతిఁజేసెఁ బ్రాకటముగ
నామహోపకారమునకు నవనిపతికిఁ, దాను బ్రత్యుపకృతిసల్పఁ దలఁచి యపుడు. 714

కం॥ ఒకనెలలోపలసీతను, బ్రకటితముగ మీరు చూచిరండని కపులన్
సకలదెశాభాగములకు, నకలంకయశుండు కపికులాధిపుఁ డంపెన్. 715

ఆ॥ నిన్ను వెదకుకొఱకుఁ బన్నిద్దఱము మహా, బలపరాక్రమాన్వితులము పెక్కు
వనచరబలములనుగొని యామ్యదిక్కున, కరుగుఁ దెంచినార మమ్మ! మేము. 716

ఆ॥ అలఘుశౌర్యధుర్యులైన యంగదముఖ్యు, లబ్ధి యవలితీరమందు నున్న
వారు నేనొకండ వచ్చినవాఁడను, నిన్నరోయ నిటకు నెలఁతమిన్న! 717

సీ॥ కరమవలీలగాఁ గడలిని లంఘించివచ్చినవాఁడ నేనిచ్చట మఱి
కన్నులారఁగ నిన్నుఁగనుఁగొంటి నెమ్మదిఁ గడుఁ గృతార్థతఁ బొందఁగంటి' యనుచు
నీవిధంబున నాతఁడెల్లవృత్తాంతంబు లింపారఁజెప్ప మహీతనూజ
విని మనంబునఁ దాను విశ్వాసముంచక హనుమంతుతోడ నిట్లనుచుఁ బలికె.

గీ॥ 'నరులు మావారు మీరు వానరులు తలఁప, వారికిని మీకు మైత్రి యేపగిదిఁ గలిగె?
నిది మహాచిత్రముగనుండె నెన్నఁడైన, నిట్టివిపరీతములు వింటిమే? కపీంద్ర!. 718

గీ॥ అదియునట్లుండె వినుము నీవరయ రామ, చంద్రునకు దూతవైయుంట సత్యమేని
రాఘవుల రూపరేఖాదిరమ్యములగు, గుణవిశేషములెల్లఁ బేర్కొనుము వేగ'. 719

కం॥ నాపడు వినుమని సీతా, దేవికి ధీరుండు వాయుదేవకుమారుం
డీవిధమునఁ జెప్పఁదొడఁగె, భూవరసుతులైన రాఘవులరూపాదుల్. 720

మ॥ 'కడుశౌర్యాఢ్యుఁడు నీలనీరదనిభాకారుండు నాజానుబా
హుఁడు పద్మాయతచారునేత్రుఁడు విశాలోరస్కుఁ డౌదార్యవం
తుఁడు గాంభీర్యదయాదిసద్గుణనిధానుం డర్కవంశావతం
సుఁడు మీనధ్వజకోటిసుందరుఁడు రాముం డోసతీరత్నమా!. 721

గీ॥ మఱియు నారాయణాంశసంభవుఁడు సకల, మౌనిజనగేయుఁ డసురవిమర్దనుండు
సాధుజనపోషకుఁడు దయాసత్యశౌచ, శమదమాన్వితుఁ డారామచంద్రుఁడమ్మ'. 722

గీ॥ మాత! చెప్పెదవినుము లక్ష్మణుఁడు పరమ, సాత్వికుఁడు మేల్మిబంగారుఛాయవాడు
నన్నివిధములఁ దనయన్నయైన రామ, భూపతిలకుని నిజముగాఁ బోలియుండు'. 723

చం॥ అని యిటురామలక్ష్మణుల యంచితరూపగుణాదులెల్లనున్
ఘనముగఁ దాసవిస్తరముగా హనుమంతుఁడు వేఱువేఱవ
ర్ణనమొనరించి చెప్పి క్షితినందన సందియమంత తీరఁగాఁ
గొనుమని రామముద్రికను గొబ్బున నామెకొసంగి యిట్లనుల్. 724

చం॥ 'జననిరో! నీకొసంగుమని చాలప్రియంబున నానవాలుగాఁ
దనదగు ముద్దుటుంగరముఁ దామరసాప్తకులైకభూషణుం
డనఘుఁడు రామభూరమణుఁ డారయ నాకునొసంగెఁ గాన దీ
నినిఁగయికొమ్ము నాపలుకు నీవిఁకనైనను విశ్వసింపుమా!' 725

సీ॥ అనవినిజానకి యత్యాదరంబున నారాము నంగుళీయకముఁ గొనుచు
నందలి రామనామాంకితదివ్యాక్షరంబులు పరిశీలనంబుఁ జేసి
కడుమురియుచు దాని గనులకద్దుకొనుచు నానందబాష్పంబు లగ్గలమ్ము
గాస్రవింపఁగ ముద్రికనుగూర్చి పెక్కుభంగుల నుగ్గడించి యాకోమలాంగి

ఆ॥ కరము వినయమొప్పఁ గరువలిపట్టితో, నిట్టులనియె 'వానరేంద్ర! నిన్ను
దనుజమాత్రుఁగాఁగఁ దలఁచి యవజ్ఞగా, వించియుంటి నను క్షమించు మనఘ! 726

కం॥ నను రక్షించుటకై యిటు, చనుదెంచినయట్టినీవు సాక్షాద్దేవుం
డనియెంతుఁగాక కేవల, వనచరమాత్రుఁడవె తలఁప? వాయుతనూజా!. 727

కం॥ రాముని క్షేమోదంతం, బామూలాగ్రముగఁదెలిపి యస్మదసువులన్
ధీమణి! కాపాడితివి కృ, పామతి నినుఁబొగడనాకు వశమే? హనుమా!. 728

గీ॥ నేను వేబాములకునైనఁ గాని నీదు, ఋణముఁదీర్పఁగఁజాల నీ వెల్లకాల
మవని మనియుండెదవుగాక!' యనుచు సీత, యతనినాశీర్వదించి యిట్లనియె మఱియు

గీ॥ 'ఎంతకాలమునుండి నీవీవిధమున, నెలమి నాతోడభాషింప వలనుగాక
తరువుపైనుంటివోకద? తరుచరేంద్ర!, దర్శనంబిచ్చితివి నేడు దైవమట్లు' 730

కం॥ అని యిట్లభినందించుచు, జనకక్షితిపాలతనయ సద్భావుండౌ
హనుమంతునిఁగనుఁగొని యి, ట్లనివెండియుఁ బలుకఁజొచ్చె నాకులమతియై 731

కం॥ 'ఈరాక్షసవనితలు ననుఁ, గారించుటలెల్ల నీవు గాంచితివికదా?
మారణకృత్యముకంటెను, మారుతి! యీబాధమిన్న మదిభావింపన్. 732

గీ॥ దశముఖుండిప్డు నాసన్నిధానమునకు, వచ్చియాడినదుష్ప్రలాపములు నీవు
వినియెయుందువు నేనింకవేఱచెప్ప,నేల? ధీమంత! హనుమంత! శీలవంత! 733

కం॥ ఇఁక రెండునెలలుమాత్రమె, ప్రకటితముగ గడువొసంగెఁ బంక్తివదనుఁ డం
తకులోపలఁ దన్నువరిం, పకయుండిన వీరు చంపి భక్షింత్రుననున్ 734

కం॥ కావున నింతకులోపల, రావణువధియించి నన్ను రాముఁడు దాఁ గొం
పోవకయుండిన నేనిఁక, జీవింపనటంచు నీవు చెప్పు మధిపుతోన్ 735

కం॥ తనువిందున్నదికానీ, తనపైననె నాదుమనముఁ దగనిల్పి సదా
ఘనతరభక్తిపరత్వం, బుననే ధ్యానించుచుంటిఁ బూతచరిత్రా! 736

గీ॥ ఇట్టి నన్నేల శ్రీరాముఁడిన్నినాళ్లు, తానుపేక్షించెనో మఱి తలఁపరాదు?
చిరపరాధీననగునన్ను స్వీకరింపఁ, బాడికాదని శంకించినాడొ? చెపుమ. 737

కం॥ అపకారికి సైతముఁదా, నుపకృతియొనరించునట్టి యురుపుణ్యుండా
నృపకులమణిరాముఁడు న, న్నుపేక్షసేయంగ నేటికో యిందాకన్? 738

గీ॥ వినుము! త్రికరణశుద్ధిగా విన్నవింతుఁ,జూడ నాయందుఁ దప్పొకించుకయునైన
లేదనుచుఁ జెప్పుటకుఁ బృధివ్యాదిభూత, పంచకముసాక్షి! తానును బ్రబలసాక్షి'. 739

కం॥ అని యివ్విధమున జానకి, హనుమంతునితోడ నుడివి యతికరుణముగాఁ
బెనురోదన మొనరించుడు, ఘనుఁడా కపివర్యుఁడనియెఁ గనికరమొదవన్. 740

కం॥ 'అమ్మా! పగవకు నీకష్టమ్ములు కడచనిసుఖించు సమయమువచ్చెన్
నెమ్మనమున భయపడకుము, నిమ్మళముఁవహింపు మింక నీకుఁ గుశలమౌ. 741

చం॥ నీకుఁ గలట్టి బాధలను నిక్కముగానెఱిఁగించి రాము న
స్తోకగుణాభిరాము వెసఁదోడ్కొనివత్తు పవేకవానరా
నీకసమన్వితంబుగను నిర్జరవైరుల నాహవస్థలిన్
వీకమెయిన్ వధించి పతి నీచెఱఁ దావిడిపించు జానకీ!. 742

గీ॥ వినుము, నీకడగం ద్దర్కతనయుతోడఁ, దెలిపి డెబ్బదిరెండువెల్వల ప్లవంగ
సేనతో నాతనిన్ వేగ నేను దోడి, తెత్తు నీచెఱవిడిపించి తీరఁగలము. 743

సీ॥ మదమున నాపంక్తివదనుఁ డిచ్చటికిప్డు చనుదెంచుటెఱుఁగుదు సాధ్విపెన
నిన్ను మదాంధుఁడై నీచోక్తులాడుచుఁ దునుమటకై కత్తిదూయు టెఱుఁగు
దును నేనపుడు కోపమును బట్టలేక యానీచునిఁ దెగటార్ప నిశ్చయించి
పూనియుఁ గ్రమ్మఱ హానిగల్గుట మదిభావించి విరమింపవలసెఁ గాక!
గీ॥ లేకయుండిసఁ గరమవలీలగాను, రావణాసురు సపరివారముగ నేడు
పుచ్చియుండనె కీనాశపురమునకును?, జేర్చియుండనె శ్రీరాముచెంత నిన్ను?' 744

గీ॥ అనుడు జానకీదేవి యాతని ప్రగల్భ, వాక్యములు విని 'చూడ నీవానరుండు
జేనెడంతలే డుడుసత్త్వుఁడైన రావ, ణాసురునిఁ దానుగెల్వంగ నలవియగునె?. 745

గీ॥ అదియు నట్లుండె మఱియు సూర్యాత్మజునకుఁ, దల ప డెబ్బదిరెండువెల్వలప్లవంగ
సేనగలదని నాతోడఁజెప్పె నీతఁ, డించుమించుగవారును నిట్టివారె. 746

ఆ॥ ఇట్టి యల్పదేహులేడ! మహాబలు, లతులితదృఢకాయులైన యసుర
లేడ! గెల్చులేడ! నితఁడు ప్రగల్భముల్, పలికెఁగాక! నమ్మవచ్చు నెట్లు?' 747

కం॥ అని శంకించుచు జానకి, హనిమంతునితోడ నిట్టులనియె మృదూక్తిన్
'వినుమొక్కటి నిన్నడిగెద, వనచరవర! నాదుశంకవాయఁ దెలుపుమా. 748

గీ॥ పరగడెబ్బదిరెండువెల్వలప్లవంగ, సేనగలదని నాతోడఁజెప్పి తీవు
వారుసైతమునీవంటిస్వల్పదేహు, లేకదా? యనికపివర్య! యెంతునేను. 749

గీ॥ మనశరీరులు సమరధీకషలునైన, దనుజవేదను! మారేత! దంతికీగ
కంఠీరవంబెంతయుండునో యంతగలదు, కలన మారెట్లువైరుల గెలువఁగలరు? 750

కం॥ ఇది నేనించుకయైనను, మదినమ్మఁగఁజాల' ననుచు మానిని నుడువన్
సదమలపరితుఁడు పావని, మదిరాక్షినిఁ జూచిపలికె మధురోక్తి నిటుల్! 751

ఉ॥ 'నానిజరూపమింతెయనినమ్మకు మమ్మరో! విమ్మతెల్పెదన్
నేనిట విస్నురోయనెడ నిర్దరవైరులకంటఁబడ్డచో
హానికరంబటంచు నిటులల్పశరీరముఁ బూనియుంటి నే
కాని! మదీయరూపమిదికాదు మనంబున శంకవీడుమా. 752

కం॥ చూతఁదలంచెదవేనిం, జూడుము నారూప' మనుచుఁ జుక్కలుదాకన్
గాడుపుఁగొమరుఁడు పెరిగినఁ, జూడఁగనొప్పారె మేటిక్షోణీధ్రమటుల్. 753

గీ॥ అప్పు డావురుంకరమైన యాంజనేయు, స్వస్వరూపముఁగనుఁగొని స్వాంతమందు
నచ్చెరుపు భీతిపెనఁగొన నవనిజాత, యతనితోనిట్లనుఁ గంపితాంగియగుచు. 754

ఉ॥ 'ఓపవమాననందన! మహోజ్జ్వలతేజను నిండఁబర్వి నా
చూపులనంధతంగొలుపఁజొచ్చె భయంబును హెచ్చెడున్ భవ
ద్రూపముఁజూడఁజాల నిఁకరూఢిగ దిగ్ధరణీనభోంతర
వ్యాపితమైన నీదుభయదాకృతివే నుపసంహరింపుమా'. 755

గీ॥ అనుచు వినయపూర్వకముగ నవనితనయ, తన్నుఁ బ్రార్థింప నాతఁడు తక్షణంబ
యా మహావిశ్వరూపంబు నట్లెవిడిచి, మగుడనంగుష్ఠమాత్రుఁడై యగపడుటయు. 756

చం॥ కనుఁగొని సీతయిట్లనియెఁ 'గాంచితి నీబలవిక్రమాదులన్
ఘనుఁడవునీవు రావణునిగర్వముఁబాపఁగనోపునట్టి య
త్యనుపమశక్తియుక్తుఁడవె యౌదువు! భానుసుతాదులైనయా
వనచరముఖ్యులందఱు భవత్సములే యనియెంతు మారుతీ!' 757

కం॥ అని యీవిధమున మారుత, తనయునిసగ్గించి వెండి తనమాఁటగరా
మునితో నిట్లనుమని యా, జనకప్రియతనయ పలికెఁ జాలవినీతిన్ 758

సీ॥ 'పదిమాసములనుండి పంక్తికంఠునివీటఁ బడరానియిడుమలఁ బడితినన్ను
ఇఁక రెండుమాసంబులే నేను దలపోయ నుర్విపైజీవించియుందు నన్ను
అన్నపానాదిసౌఖ్యంబులవజ్జించి యతికృశీభూతాంగినైతి నన్ను
త్రికరణశుద్ధిగా దేహమిట్ల నానెమ్మదిఁదల్చి ధ్యానింతు నన్ను

గీ॥ తప్పులేమేమియుండినఁ దలఁపఁబోక, దాసురాలిని మన్నింపఁదలఁపు మనుము
సర్వవిధముల నన్ను రక్షణముసేయు, నట్టిభారమతనదని యంటిననుము. 759

గీ॥ మఱియు నాశ్రమమెల్లను మఱచిపోక, తెలిపి మాసద్వయంబులోపలఁ గపీంద్ర!
రాముఁడెట్లేనిఁ దోడ్కొనిరమ్ము నాదు, చెఱనువిడిపించి పుణ్యసంసిద్ధిఁగనుము 760

గీ॥ అదియునుంగాక వినుము నాయనుఁగుమఱది, సదమలస్వాంతుఁ డనఘుఁడు సద్గుణఖని
యైన లక్ష్మణుతోడ నిట్లని మదీయ, వాక్యములుగాఁగఁ జెప్పుమువాయుపుత్ర!. 761

చం॥ 'తెలియక నాడు బేలనయి ధీరగుణున్ విను దూరినట్టి యా
ఫలమునుబొందఁగంటిని గృపామతిదోఁపఁగ నాదునేరమిం
దలఁపఁగఁబోకుమయ్య త్వరితంబ విపన్నను నన్నుఁ గావము
ద్ధులమరఁదీ! రణార్థివయి తోడుగరమ్మిఁక నీవు భ్రాతకున్'. 762

గీ॥ అనుచు విస్మరింపక సుమిత్రాత్మజునకుఁజెప్పు' మని పల్మరులుచెప్పి సీతమఱియు
నిట్టులనియెను 'వినుము! నేనినతనూజుఁ, జాలనడిగితినని చెప్పు సచ్చరిత్ర!. 763

కం॥ కపిసేనాపరివృతుఁడై, నృపునకుఁ దాఁదోడువచ్చి నీచుల దివిష
ద్రిపులను జక్కాడి ననుం, గృపతోరక్షింపు మనుము కీశవిభునితోన్. 764

కం॥ తడయక నీవిఁక రాముని, కడకుంబోపొమ్ము ఖలులకంటఁబడినచోఁ
గడుమోసమ్ముఘటిల్లును, జెడు మనకార్యంబులెల్లఁ జిక్కులుకలుగున్'. 765

ఆ॥ అని ప్రయాణమునకు నాతనిఁబురికొల్పి, రాముముద్దుటుంగరంబు మగుడ
స్వామికిమ్మటంచు సాధ్వియొసంగఁగ, బుచ్చుకొనుచు వాయుపుత్రుఁడనియె. 766

చం॥ 'వినుఁగనివచ్చినాడనని నేనువచించిన మానసంబునన్
వను మఱిరామభూవిభుఁడు నమ్మునొ! నమ్మఁడొ! కాన దేనినై
ననుదయచేసి నీవు నరనాయకచంద్రున కానవాలుగా
జననిరొ! యిమ్ము కొంచుఁజని స్వామికిఁ బ్రీతిగనిత్తు' నాపుడున్! 767

గీ॥ తనదు చీరచెఱంగునదాచుకొన్న, మేల్మితలమానికముఁ దీసి మేదినిసుత
యిచ్చినన్ వాయుపుత్రుండు పుచ్చుకొనుచు, నింతికిన్మ్రొక్కి నమ్రుఁడై యిట్టులనియె.

కం॥ 'ఇదె వాయువేగమున నే, సదయుండైనట్టి రామచంద్రునికడ కే
గెదఁగావి! కలదొక్కటి; మదీయమగు విన్నపంబు మాతరొ! వినుమా॥ 769

## హనుమంతుఁడు రావణుని వనమును జెఱుచుట

సీ॥ ఆరాముఁడంపిన దాదినుండియు నేను విశ్రాంతినెఱుఁగను వేఁకశన
మంతకెఱుంగ నీయామ్యదిక్కునఁగల సకలప్రదేశముల్ ప్రకటలీల
నొక్కెడ నైనఁ గాలూదకతిరుగుచుఁ గడుదస్థితిని గ్రమక్రమముగాను
నావసత్త్వముల్ నానాటికినిఁ జాలసన్నగిల్లుచువచ్చె జనని! నేడు
గీ॥ పరగ శతయోజనంబుల పరిమితిగల, వననిధిన్ దాటుటకతంబునను మఱింత
యంతరించినయది శ్రమంబధికమాయె, సమసెఁ బోత్ఫోడ నుత్సాహశక్తిగూడ. 770

కం॥ కావున నిప్పుడు నాకెఱు, గావలయును నీవనుజ్ఞ కాదన కిమ్మా
యీవనమునఁగల ఫలముల, దేవీ! తినిపోదు రామదేవుని కడకున్. 771

కం॥ ఒకసారి యెట్లొ దాటితి, నిఁక దాటఁగఁజాలనగ్గి నెంతయు నమసెం
బ్రకటజవసత్త్వములు నా, కకటా! యాకలియు నధికమయ్యెం దల్లి!' 772

కం॥ నాపుడు జానకిపలికెను, 'గావలివారుండ్రు వారు కానకయుండన్
నీవతినిగూఢముగ నోపావని! భక్షింపుమయ్య! ఫలము' లటంచున్. 773

కం॥ అనుమతియొసంగె మఱియును, జనకజ పలుమారు లనిలసంభవుతోడన్
'వనికేమాత్రము నష్టం, బొనరింపకు భద్ర' మనుచు నొయ్యనఁ బలికెన్. 774

కం॥ ముదమున వల్లెయటంచున్, మదిరాక్షికి మ్రొక్కి యంత మారుతసుతుఁ డా
త్రిదశారివనముఁ జొచ్చెను, బెదరక తనగుహను జొచ్చు బెబ్బులిమాడ్కిన్. 775

కం॥ ఈవిధమునఁ బదివేవురు, కావలివారున్న పంక్తికంఠుని వనిలో
నావంతయు శంకింపక పావని తాఁ జొచ్చి యంత భయరహితుండై. 776

కం॥ తదనంతర మాహూపము, వదలి వియత్తలముఁదాకువఱకును గడిమిం
దుదిమొదలులేక యింతని, మదిని నిరూపింపరాక మారుతి పెరిగెన్. 777

కం॥ ఈకరణి విశ్వరూపముఁ, గైకొని సుప్తులయియున్న కావలివారిన్
వీకమెయిన్ లెక్కింపక, యాకలిదీరంగ మెసవె నందలిఫలముల్ 778

సీ॥ అంజనీసుతుఁ డట్టు లాహారసంతృప్తి నందినవాడయి యతులితజవ
సత్త్వముల్ పెంపారఁ జాలనిరంకుశత్వమునోప నుద్యానవనములోన
విచ్చలవిడిగఁ దావిహరించుచున్ మఱి యసురేంద్రుఁడగు రావణాసురునకుఁ
దనరాక వెల్లడింపఁ దలఫోతకలుగుడుఁ జైలరేగి వనమిట్లు చెఱుపఁదొడఁగె

గీ॥ నాకులనురాల్చి విరులనువీకడుల్చి, తరుఫలసుగూల్చి గుల్మసంతతులఁద్రుంచి
లలితలతలనుద్రెంచి కొమ్మలనువిఱిచి, చెఱిచెవాతూలతనయుఁడు చేవదనర. 779

సీ॥ మఱియు నందున్నట్టి మహితకేళీగృహగోపురపంక్తులఁ గూలఁద్రోసి
బహుళవాపీకూపపద్మాకరంబులఁ బూడిచి బహుచిత్రములగురత్న
వేదికల్ పడఁద్రోసి వివిధంబులగు కట్టడములనెల్లను రూపడంగఁ జేసి
యదియిదియననేల? యావనంబునఁగల భూమిజయున్న శింశపముఁదక్క
గీ॥ నింకఁ దక్కినవృక్షంబు లేపుమీర, నొకటిసైతము మిగులకయుండ నపుడు
నిమిషమాత్రములోన నన్నియునుఁగూడఁ, బెఱికిపవమానసూనుఁడు చెఱిచె వనము.

## హనుమంతుఁడు వనపాలకులను వధించుట

కం॥ ఆగడబిడవిని యప్పుడు, వేగమె వనపాలురెల్ల విక్రమమెప్పన్
లోఁగకవచ్చి మదంబున, నాగాడుపుసుతునిఁదాకి రతులితబలులై. 781

కం॥ ఈవిధమున సాయుధులై, కావలివారెల్ల మిగుల గర్వోద్ధతులై
పావనినెదిరించుటయును, జేవసెడక యాప్లవంగశేఖరుఁ డంతన్ 782

కం॥ లీలమెయిన్ వనపాలుర, వాలాగ్రముచేత వీక బంధించి వెసన్
నేలపయి విసరికొట్టఁగఁ, గూలిరి యాదనుజులెల్లఁ గుయ్యనకయసన్. 783

కం॥ ఈతెఱఁగున వనపాలుర, వాతూలతనూభవుండు వధియించి కడున్
పీతభయుండై సింగము, భాతిన్ విహరింపసాగె వనమధ్యమునన్ 784

కం॥ అప్పుడు దానవకాంతలు, తప్పకమేల్కాంచి బెదరి ధరణిజకడకుం
దప్పించుకొనుచుఁ బరుగిడి, దెప్పరమున శరణుఁజొచ్చి దీనతదోపన్. 785

ఆ॥ అమితవినయభరితలై తమదేహముల్, కరము భీతిచేతఁ గంపమొంద
నసురవనితలెల్ల నైకకంఠ్యంబుగ, నింమవదనతోడ నిట్టులనిరి. 786

ఉ॥ 'ఎక్కడిదమ్మకోతి? మఱి యెవ్వరుదీనినిఁబంపినారు? తా
నిక్కడికేగుఁదెంచుటకు హేతువదేమయియుండు? వచ్చెఁబో
యిక్కరణిన్ వనింజెఱుప నెవ్వరుచెప్పిరి? పాడిదప్పి యీ
రక్కసిమూకలం దునుమ రాజముఖీ! తగవే? వచింపుమా. 787

కం॥ ముంముగ నీవానరుఁడో, యిందువదన! యిచటకువచ్చి యేమోనీతోఁ
బొంముగ గుసగుసలాడియె, యిందుండి చనెం గదమ్మ? యెఱిఁగింపఁగదే? 738

సీ॥ నావుడు జానకీదేవి వారలతోడ నిట్లనిపల్కె 'నోయింతులార!
యీవానరేంద్రు నేనెఱుఁగను మఱి దీని నంపినవారిని నంతకెఱుఁగ
నీకోతి నాచెంతకేతెంచి నాతోడ మాటాడుటెంతయు బూటకంబ
యేకాకినై దిక్కులేక కుందెదునాకు నితరచింతలఁ బనియేమిగలదు?
గీ॥ తఱచుగా నిట్టిమాయ మీదానవులకుఁ, గరతలామలకమ్మగుఁ గాన యిదియు
మీకె తెలియంగనగుఁగాని నాకునెట్లు, తెలియఁగలదమ్మ? తెల్పుడీ తెల్లముగను' 789

కం॥ అనవుఁడు దనుజాంగనలా, హనుమంతుని చర్య నప్పు డాపంక్తిగ్రీ
వునితోఁ దెలుపుటకై రయ, మునఁ దామందఱును బాఱిపోయిరి భీతిన్ 790

ఆ॥ అట్లు పాఱిపోయి యత్యంతవినయసం, పన్నలగుచు దనుజపతికి మ్రొక్కి
యసురవనిత లప్పు డందఱొక్కుమ్మడి, నింద్రవైరితోడ నిట్టులనిరి 791

## రాక్షసస్త్రీలు రావణునితో హనుమంతుని చర్యను దెలుపుట

సీ॥ 'దనుజేంద్ర! మీరువచ్చిన పదంపడి యట జరిగిన యద్భుతచర్య వినుఁడు!
కోతియొక్కటి వచ్చి సీతతోభాషించె వనమెల్లఁ బెఱికి నాశనముఁజేసెఁ
గావలివారైన దేవారులను క్షణకాలంబులోఁ గాలుకడకుఁబంపె
నీవార్త మీతోడనెఱిఁగించుటకునయి యరుదెంచినార' మటంచుఁ జెప్పి
ఆ॥ యంజనాతనూజు నద్భుతచర్యను, గూర్చి దశవదనునకు విపులముగఁ
దాము తెలుపుటయునుఁ దద్దయుఁగోపించి, యసురనాధుఁ డిట్టులని వచించె 792

గీ॥ 'అనుపమంబగు నాయుపవనములోన, వేల్పులున్ సైతముం జొఱ వెఱతురట్టె!
కోతి వనమెల్లఁ జెఱిచి తా భీతిలేక, పెక్కుఱను రక్కసులనెట్లు చక్కడంచె? 793

కం॥ ఇది కడువింతగనున్నది, మదిఁదలఁపఁగ మీరుపొండు మఱి యాకోతిం
దుదముట్టించుటకై యిదె, మదీయకింకరులఁబుత్తు మానితబలులన్'. 794

గీ॥ అనినుడివి వారినింబోవఁబనిచి తాను, దక్షిణమె యుషఃకాలకృత్యములఁ దీర్చి
కొని దశాస్యుఁడు తనకొల్వుకూటమునకు, వచ్చె సామంతసచివాళి బలిసికొలువ. 795

ఆ॥ ఇట్లు సభకువచ్చి యెల్లరువినుచుండ, నసురసైన్యనేత యగుప్రహస్తుఁ
గాంచి భయదజలదగంభీరభాషల, నిట్టులనియె దావవేశ్వరుండు. 796

సీ॥ 'ఓయి! ప్రహస్త! నేడొక వింతవార్తను వినుము తెల్పెద నొక్కవనచరుండు
మనయశోకవనికిఁ జనుఁదెంచెనట! మఱి సీతతోఁ గొండొక సేపు తాను
భాషించెనట! పదంపడి వనమంతయుఁ జెఱిచి పెక్కండ్ర నక్షిణబలులఁ
గావలివారినిఁ గఱచిచంపినదట! యాకోతి గర్వ మేమనఁగవచ్చు?
గీ॥ నాప్రతాపముఁ జెప్పిన నాకవాసు, లైన గడగడవడఁకుదు రట్టినన్ను
సరకుసేయక యిట్టిదుశ్చర్యఁజరిపె, హేతువేమియియుండునో యెఱుఁగరాదు. 797

గీ॥ సర్వవిధముల నావనచరుఁడు రాముఁ, డంపినన్‌వచ్చెఁగాఁబోలు నట్లుగాక
పోయినం దామ ధారుణీపుత్రితోఁడ, నేలభాషించు? వనవన మేలచెఱుచు? 798

కం॥ కావున నా కీశాధము, కావలమంతయు నడంచి కాకుత్థ్సునకున్
రావణుఁడన్నను గడుభయ, మావహిలంజేయువాడ' ని నుడివి వెనన్. 799

## రావణుఁడు హనుమంతునిపై కి రాక్షససేనలను యుద్ధమునకుఁ బంపుట

సీ॥ అశ్మవక్షునిఁ బింగళాక్షుని దీర్ఘజిహ్వుని వక్రనాసుని నురుబలాఢ్యు
శార్దూలముఖుఁ జీరి 'చయ్యన మీరశోకవనికిఁబోయి యాకపికులాధ
మునిఁ జంపిరం' డని మొదలయినంగిన వారును సైన్యముల్ బలిసికొలువ
స్యందనారూఢులై సరభసంబుగ యుద్ధసాధనంబులఁగొంచు సత్వరముగ
గీ॥ సమరభేరీనినాదసంచలితభూమి, భాగులై పేర్చి యార్చుచుఁ బ్రబలశూరుఁ
డైన హనుమంతుమీది కాహవముసేయ, వెడలి రుత్సాహ మాత్మల వెల్లివిరియ 800

గీ॥ అంత సూర్యోదయంబైన ననిలసూనుఁ, డందలి యొక మహోన్నతమైనయట్టి
తోరణస్తంభమెక్కి దైత్యులను దవ్వు, దవ్వులన చూచి తనదు డెందంబునందు. 801

ఉ॥ 'వెండియుఁ జూడనాకు రణభిక్ష లభింపఁగఁబోలు' నంచు నా
దండిమగండు మిక్కిలిగఁ దాముదమొందుచు గంతువైచి యు
ద్దండతవచ్చు దైత్యసముదాయముఁ గన్గొని 'దుష్టులార! మీ
గండడఁగింతురండనుచు గ్రక్కునఁ బిల్చుచునుండె నాజికిన్ 802

ఉ॥ అప్పుడుచేరవచ్చి బహుళాస్త్రము లాతనిపైన దానవుల్
గప్పుచుఁ జుట్టుముట్టి కడు గాసిలఁజేయుచునుండ సుంతయున్
డప్పియునొప్పిలేక కపినాయకుఁ డార్చుచు వారిబాణముల్
తప్పక మేటివాలమునఁ దావితథంబులుగాఁగఁ జేయుచున్ 803

సీ॥ కొండొకవడిఁబోరి కుప్పించి తోరణస్తంభంబుపైనుండి తరుచరుండు
సేనపైదుమికి యక్షీణవిక్రమమొప్పఁ గాల్బలంబులఁజంపి కపిలఁదునిమి
రథములఁబొడిసేసి రథ్యములనుగూల్చి రథికులనొంచి సారథులఁద్రుంచి
హస్తిపకులబాది యాశ్వికులనుమోది యశ్మవక్షాది నాయకులఁ జంపి
గీ॥ మఱియు నొక్కొక్కపరిఁ బెక్కుమందినిఁ దవ, వాలమునఁజేసి బంధించి వసుధ పైన
గిరగిరంద్రిప్పివైచుచు సురవిరోధి, సైన్యములనెల్ల మర్దించె సాహసమున 804

గీ॥ నిమిషమాత్రములోన నిట్లమరరిపులఁ, జదిపి వెండియుఁ దోరణస్తంభముపయిఁ
దానధిష్ఠించుటయు నంత దానవపతి, కాయుదంతంబు హతశేష లరిగి చెప్ప 805

కం॥ విని యాదశాననుఁడు తన, మనమున నచ్చెరువు భీతి మల్లడిఁగొనఁగా
హనుమంతుని యుద్ధతి క, త్యనుపమకుపితాంతరంగుఁడై యాక్షణమే 806

## రావణుఁడు హనుమంతునిపైకి రుధిరాక్షాదులను యుద్ధమున కంపుట

సీ॥ రుధిరాక్షుఁడును రక్తరోముండు వృశ్చికరోముండు శూలదంష్ట్రుండును మఱి
యును విరూపాక్షుఁడు యూపాక్షుఁడును భాసకర్ణుండు నాదిగాఁగల ప్రచండ
దానవవీరులఁ దగఁజీరి వారితో 'నాకోతినెట్లైన హతముఁజేసి
రండుమీ' రనిచెప్పి రయమునఁబుత్తేర వారును గోదండధారులగుచుఁ
గీ॥ ప్రాసముద్గరతోమరప్రముఖనిఖిల, సమరసాధనములఁ గొని సత్వరముగ
వివిధవాహనారూఢులై వెడలిరనికి, దిశలు పగులంగనార్చుచు ధృతిచెలంగ 807

ఆ॥ ఇట్లశోకవనికి నేతెంచి దానవు, లనిలసుతునిమీద నగ్గలముగ
బహుశితాస్త్రతతులఁ బరగించి నొప్పింప, నతఁడు చాలఁగినిసి యాక్షణంబ 808

కం॥ ఆకొని పులి లేళ్ళపయిన్, దూకెడుచందానఁ గడిమి దోషాటులపై
దూకి యొకమేటివృక్షముఁ, గైకొని ప్రహరింపసాగెఁ గడునుద్ధతుఁడై 809

ఉ॥ అప్పుడు రక్తరోముఁడు మహాకుపితుండయి లోచనద్వయిన్
నిప్పులురాల 'నోరి! కపి! నిల్వుము నీదగు గర్వమంతయుం
దప్పకరూపడంతు' ననిశాతదలించుచు నొక్కశక్తిచే
నప్పవమానసూతికరమందలి వృక్షముఁ ద్రుంచె వ్రేల్మిడిన్ 810

సీ॥ అయ్యెడ దుర్ముఖుండనువాడు తొంబది యూపాక్షుఁడెనుఁబదియును మఱియు వి
రూపాక్షుఁ డరువది రుధిరాక్షుఁడేఁబది వృశ్చికరోముండు వింశతియును
భాసకర్ణుండు ముప్పదియును నాగ్రమునంగైదు శూలదంష్ట్రుండు పదియు
నింకననేకు లనేకమార్గణముల నేసి విదారితుఁ జేసి యార్వ
గీ॥ నాంజనేయుండు రక్తసిక్తాంగుఁడగుచుఁ, బుష్పితాశోకవృక్షంబువోలె నొప్పి
కేవలము కుపితుండయి చేవసెడక, సింహమోయన మిగుల గర్జించి యపుడు 811

సీ॥ పటుజవోపేతుఁడై చటులగతిన్ దూకి తొలుత వాజుల సారథులను గెడపి
రథసంతతులను దూర్ణంబ చూర్ణముఁజేసి వారణసమితిని వసుధఁగూల్చి
తదుపరి రథికబృందములలోఁ జొరఁబడి రుధిరాక్షు వృశ్చికరోము రక్త
రోము యూపాక్షు విరూపాక్షు శూలదంష్ట్రుని భాసకర్ణు దుర్ముఖునిఁ బ్రఘసుఁ
గీ॥ దునిమి రణముపై నింకను దనివిచనక, కాల్బలంబులపైఁబడి కసిమసంగి
మారిమసఁగినయట్లు సమీరుపట్టి, కరముఁజెలరేగి మర్దింపఁగాఁ దొడంగె· 812

కం॥ కొందఱినిం బిడికిళ్లను, గొందఱ నఖదంతహతులఁ గొందఱఁ గాలం
గొందఱఁ గేల శిలాదులఁ, గొందఱ వాలమునఁజేసికొందఱఁ జంపెన్ 813

కం॥ ఈవిధమున సమరంబున, దేవారులనెల్లరన్ వధించినవాడై
పావని యధిరోహించెం, దావెండియు మేటి తోరణస్తంభముపై 814

కం॥ అప్పుడు హతశేషులు చని, తప్పకరావణునితోడఁ దమయపజయముం
జెప్పిన నిర్విణ్ణుండై, యిప్పగిదిం బలికెనాతఁ డెల్లరువినఁగన్. 815

ఉ॥ 'పేరుగలట్టిదైత్యులను బెక్కురఁబంపితి నొక్కఁడైననుం
గారణమేమొకాని మఱి క్రమ్మఱవెన్కకురాక మంటపై
దారుణభంగి బల్మిడుతతండము కూలి నశించుమాడ్కి నౌ
రౌర! యిదేమిచిత్రమొకొ! యందఱుచచ్చిరి కోతిచే ననిన్. 816

గీ॥ దనుజకులనాశనార్థ మాతరుచరుండు, పుడమిని నకాలమృత్యువై పుట్టెనేమొ!
లేకపోయినఁ గటకటా! లోకమందు, సర్వసామాన్యకపులకీ శక్తియున్నె?' 817

గీ॥ అనుచుఁజింతించి సేనానియగు ప్రహస్తు, తనయు నత్యంతజయశీలి ధైర్యశాలి
జంబుమాలినిఁజీరి తచ్ఛక్తియుక్తి, నెలమినగ్గించి రావణుఁడిట్టులనియె 818

గీ॥ 'ఓయి! నీవశోకవనికిఁబోయి దుష్టుఁ, డైన యావానరాధముఁ హతముఁజేసి
రమ్ము! సన్నద్ధుఁడవుగమ్ము! రథమునెక్కు, విల్లునమ్ములుఁగైకొమ్ము! వేగఁబొమ్ము' 819

మ॥ అనిపుత్తెంచిన జంబుమాలి నగవాస్యంబందుఁ గన్పట్టఁగన్
ఘనచాపాదిసమికసాధనములం గైకొంచుఁ దానప్పుచ
య్యనఁ దేరెక్కి యనేకరాత్రిచరసేనానీకముల్ వెంటరాఁ
జనె నుద్యానవనంబుఁజేర సమరోత్సాహంబు సంధిల్లఁగన్. 820

## జంబుమాలి హనుమంతునిపైకి యుద్ధమునకు వచ్చుట

ఆ॥ ఇట్లశోకవనికి నేతెంచి యాజంబు, మాలి యంజనీకుమారుఁ గోప
వీక్షణములఁజూచి విగతభయుండయి, సింహగర్జనంబుచేసి పలికె. 821

కం॥ 'వనచర! యెవఁడవురా? మా, వనమేటికిఁ బెటికితీవు? వనపాలకులం
దునుమాడనేలమదమున?, నినురణమున సంహరింతు నిలునిలుమింకన్ 822

కం॥ వీరుఁడఁ బ్రహస్తునకునే, గూరిమితనయుండ సమరకోవిదుఁడ మహా
ధీరుఁడ శూరుఁడ ఖలుఁడా!, యారయనే జంబుమాలినౌట యెఱుఁగవే?. 823

కం॥ నను ముక్కిడిమూకలవలె, మనమునభావింపవలదు మఱి నీమదమె
ల్లను సడఁగించియెకానీ, వెనుకకునేరిత్తపోను వినురా! కోతీ!' 824

కం॥ అని తర్జించిపలికి యా, దనుజుఁడు తాఁదక్షణంబ తనధనువునకున్
గొనయంబెక్కించి మహా, ఘనతీవ్రశరంబులేసె గాడ్పుకొడుకుపై 825

ఆ॥ ఇట్లు జంబుమాలి యిన్నిన్నియనరాని, మార్గణమ్ములు హనుమంతుపైన
సాంద్రముగనుగప్పి చాలనొప్పించినఁ, గినిసి వానికిటులనియె నతఁడు 826

కం॥ 'నీవలెఁగారులుప్రేలిన, మీవారేమైరొ చూచి మేల్కొనుమోరీ!
కావరమునఁ బ్రేలిన నీ, జీవంబులుదక్కవింక సిద్ధము కుమతీ! 827

కం॥ ప్రేలినలాభములేదుర, నీలావును నాదులావు నీకెవిదితమౌ
నాలములో నిమిషార్ధము, బాలిశుఁడా! నిలువుమింకఁ బారకుమోరీ!. 828

కం॥ చచ్చుటకై తలపొగరున, వచ్చితివనిసేయ రమ్ము పౌరుషమున్నం
గ్రచ్చఱ నీయుదరంబిదె, వ్రచ్చెద గ్రద్దలకు నీదు పలలమువైతున్' 829

కం॥ అనితీవ్రంబుగఁ బలుకుచు, ననఘుఁడు హనుమంతుఁడంత నవనికి దిగి చ
య్యన నొక్కగండశైలముఁ, గొని దానవుమీదవైచెఁ గోపోద్ధతుఁడై. 830

గీ॥ ఆశిలాపాతముచఁజేసి యసురకులుఁడు, వివశుఁడై విల్లునొక్కెడవిసరివైచి
తాను జచ్చినయట్లు రథంబుమీదఁ, ద్రెళ్లి కొండొకసేపు మూర్ఛిల్లుటయును 831

కం॥ ఆలోనఁ బవనసుతుఁ డొక, పాలముఁగొని యశ్వములను సారథినిన్ దో
ర్లీలంజావఁగ మోది మ, హాలయకాలుండనంగ నత్యుగ్రుండై. 832

కం॥ కేసరివలె గర్జిల్లుచు, నీసునరోసంబుదోప నెంతయుఁ గడిమిం
గేసరి పుత్రుం డారా, కాసులఁ బెక్కండ్రఁ దునిమె ఖచరులుమెచ్చన్. 833

గీ॥ ఇంతలో మూర్ఛఁదేరి యెంతేనిఁగినిసి, జంబుమాలి విరథుఁడయ్యు సరకుఁగొనక
పలకయున్ వాలునుంగొని భయదలీలఁ, దేరిపైనుండి లంఘించి ధీరుఁడగుచు. 834

ఉ॥ వెండియు వాయునందనుని పీకమెయిన్ వెసఁదాకి వాడు దో
ర్దండపరాక్రమంబెసఁగఁ దత్కరమందలి మేటివృక్షమున్
ఖండితమై ధరందొరఁగ ఖడ్గముచేతను జెండిపైచి యు
ద్దండతఁ బేర్చి బెబ్బులివిధంబున గర్జిలె దారుణంబుగన్, 835

కం॥ తరువట్లు భగ్నమగుటయుఁ,దరుచరవరుఁ డించుకైనఁ దాబెదరక స
త్వరముగఁ గ్రమ్మఱ వేఱొక, తరువునుగొని కొట్టఁబోవుతఱివాడు వడిన్. 836

కం॥ తనపలక నొడ్డుటయు నది, తునిసి ధరాతలమునందుఁ దొరఁగినఁగని యా
దనుజుఁడు కినిసి పవననం, దను నసిచే నురముగాడ నఱికె నఱికినన్. 837

కం॥ బోరన రక్తంబొలుకఁగ, మారుతియట్టిట్టుసోలి మగుడఁదెలిసి యా
క్రూరుఁడగు జంబుమాలిని, దారుణవృక్షంబుచేతఁ దాడితుఁజేసెన్. 838

## హనుమంతుఁడు జంబుమాలినిఁ జంపుట

సీ॥ ఆ వ్రేటుచే శిరంబవిసి హాహారావములు చెలఁగన్ రణస్థలమునందుఁ
గులిశాహతంబైన కులగిరివలెఁ గ్రుళ్లి యేఱులై నెత్తురుపాఱుచుండఁ
గొండొకసేపు తాగుఱులువెట్టుచుఁ బెద్దనిద్దురఁజెందె నద్దురాత్ముఁ
డంతవానిమృతిని హతశేషులెల్లరుఁ గనులారఁగనుఁగొని కాందిశీకు
గీ॥ లగుచు లంకలోపలఁ జొచ్చి రాక్షసంబ, జంబుమాలిని నిమ్మెయిఁజంపి దివిజు
లెల్లరగ్గింప వాయుజుఁ డెప్పటివలెఁ, దోరణస్తంభమెక్కి తాఁగూరుచుండె! 839

కం॥ అంతట హతశేషులచే, నంతయునాలించి రావణాసురుఁడు నిజ
స్వాంతమునఁ గోపతాపము, లెంతయుఁ బెనఁగొనఁగ నప్పుడిద్ధబలాఢ్యున్. 840

ఆ॥ తనకుమారు ధీరు ననుపమసుందరా, కారుఁగదనశూరు వీరు నక్షు
సత్వరముగఁ దనదుసభకును రప్పించి, యిట్టులనియెఁ బ్రీతి యిమమడింప. 841

కం॥ 'ధీరుఁడవు వీరుఁడవు రణ,శూరుఁడ వీవరయ నెట్టిజోదులనైనం
బోరున గెలువఁగలాడవు, లేరెవ్వరు నీకు సములులేరు కుమారా! 842

ఆ॥ నీవు విల్లుఁబూని నిలిచిన దేవత, లైనఁగాని నిన్ను నాహవమున
గెలువలేరు సుమ్ము తెలిపెదనొకవార్త, వినుము వీనులలర వీరవర్య! 843

గీ॥ ఎవ్వఁడో వానరుం డొక్కఁడేగుదెంచి, సీతతోడను భాషించి భీతిలేక
మనవనంబెల్లఁజెఱిచి సమరములోన, రక్కసులఁ బెక్కుమందినిఁ జక్కడంచె. 844

సీ॥ రుధిరాక్షుఁడున్ రక్తరోముండు మడిసిరి భాసకర్ణుఁడుచచ్చెఁ బ్రఘసుఁ డీల్గె
మన విరూపాక్షుండు మరణించె వృశ్చికరోముండు కూలె దుర్ముఖుఁడుగెడసె
పశ్మవక్త్రుఁడు పింగలాక్షుఁడు గతియించె రాదీర్ఘజిహ్వుండు నంతరించె
యూపాక్షుఁ డర్కఁజనొద్దకుఁబనివినె జంబుమాలియుఁగూడ సమసిపోయె
గీ॥ శూలదంష్ట్రుండు మఱియు శార్దూలముఖుఁడు, వక్రనాసుఁడు మొదలైనవారు పెక్కు
మంది రాక్షసవీరులు ప్రుందిపోయి, రాప్లవంగాధమునిచేత నకట! పుత్ర!. 845

గీ॥ వాడు తలపోయ సామాన్యవానరుండు, కాడు వీరాధివీరుఁడు కాన నీవు
జాగరూకుఁడవైపోయి సత్వరముగ, సమరమున నాప్లవంగునిఁ జంపిరమ్ము' 846

## అక్షుఁడు హనుమంతునిమీదికి యుద్ధమునకు వెడలుట

సీ॥ అనిచెప్పి పుత్తేరఁ నక్షుఁ డాక్షణమునఁ దేరాయితముఁజేసి తేరఁబంచి
బాణబాణాసనపాణియై తద్రథారోహణంబొనరించి యాహవమున
కమితసైన్యంబులు నసుగమించుచురాఁగఁ బ్రముదితహృదయుఁడై బయలుదేరె
పటహకాహళశంఖపణవాది బహుతూర్యరావముల్ సింహగర్జారవములు
గీ॥ హరులహేషలు కరిబృంహితారవములు, చాపములటంకృతులు గుణశబ్దములును
నాదిగాఁగల సైన్యాట్టహాసములకు, నఖిలదిశలును మార్మ్రోసె నట్టియెడల. 847

కం॥ ఆకోలాహలశబ్దము, లాకపికులతిలకుఁడైన హనుమంతుఁడు తా
నాకర్ణించి తలంకక, వీకం బ్రతిరవములిడుచు వేగ ధరణికిన్. 848

సీ॥ లంఘించి మేటిసాలం బొండుఁగైకొని సమరసన్నద్ధుఁడై సైన్యములను
వెలుఁగెత్తి పిలుచుచుఁ గులగిరివలెనిల్చె నంతనక్షకుమారుఁ డయ్యశోక
వనముఁ బ్రవేశించి పాఱునెత్తురుటేర్లఁ దునిసినమాంస మస్థులును మెదడు
పగిలినతలలును దెగినహస్తాదులు రాలిపోయినయట్టి రదవివహము

ఆ॥ నై పరేతభూమి ననుకరించుచు ననే, కదనుజశవమయముగాఁగ నుండఁ
గని మనంబునందుఁ గడువింతనొందుచు, ననిలసుతుని డాసి యతఁడు పలికె. 849

శా॥ 'ఓరీ! వానర! నీవెవండవు? భయంబొక్కింతయున్ లేక మా
యారామంబును బాడుసేయఁదగునేరా? క్రూర! యీరీతి మా
వారింజంపఁగఁ గండకావరమ? దుర్వారోగ్రశాతోల్లస
న్నారాచంబుల వెల్లిఁగొల్పి యనిలోనన్ నిన్ను మర్దించెదన్ 850

గీ॥ వాడిమగలకుమగఁడ రావణునకేను, సుతుఁడ నక్షాభిధానుండ సుమ్ము! నిన్ను
ఖండములుగాఁగ ఖండించి కాకములకు, గ్రద్దలకుఁబంచిపెట్టుదుఁ గండలెల్ల 851

చం॥ నిలు! నిలు! పారిపోవకుర! నీవెటఁజొచ్చిన నందుఁజొచ్చెదన్
ఖలుఁడ! రణంబునందుఁ గడికండలుగా నినుఁగోసి మాంసమిం
దలిమృతులైనదైత్యులకుఁ దర్పణముం దగఁజేయువాఁడ! మ
ద్బలముఁ బరాక్రమంబుఁగని పంక్తిముఖుండు కరంబు మెచ్చఁగన్' 852

చం॥ అనుచుఁ బ్రగల్భవాక్యముల నాడుచునుండిన రావణాత్మజుం
గనుఁగొని వాయుజుండనియె 'గర్వితచిత్తుఁడ! నీప్రగల్భముల్
విని భయమందువాడనని లేశమునెంచఁగఁ బోకుమా భయం
బనిన మతెట్టిదోయెఱుఁగ నారయఁ బుట్టినదాదినుండియున్. 853

ఆ॥ ఖలుఁడ! నన్నెఱుఁగవుకాఁబోలు మీజాతి, కెల్లనంతకుఁడను గల్లగాదు
వినుము లంకలోని దనుజులనందఱఁ, జంపికాని రిత్త చననునేను 854

శా॥ క్రూరా! చాలును నీప్రగల్భములు నీకుంజావుసిద్ధంబు నా
బారిం జిక్కితి వెందుఁబోయెదవురా? వైలంబ రారమ్మిఁకం
బోరంగూలిన మీకులస్థులు భవత్పూజార్థులై వేచియు
న్నారాకాలునివీట వారికడకుం డథ్యంబ నిన్నంపెదన్' 855

సీ॥ అనుచు వీరోక్తులనాడుచుండిన గాడ్పుపట్టిపై నలిగి రావణుని పట్టి
ధనువున కల్లెత్రాడునువేగఁదగిలించి వందలకొలఁదిగా బాణములను
నోనాటనేపినఁ దానలెక్కింపక యట్టహాసముఁజేసి యనిలసుతుఁడు
తనచేతితరువుచేఁ దద్రథాశ్వములను సారథినిన్మోది సంహరింప

గీ॥ వాడువేటొక్కతేరెక్కి ప్రళయకాల, మేఘమోయన గర్జిల్లి మేటిమఘవ
శరము సంధించియేసి యాతరుచరేంద్రు, కరమునందలి తరువు భగ్నంబుఁజేసె. 856

కం॥ ఇమ్మెయి వృక్షంబును భ, గ్నమ్మునుగావించి యనిలనందనుపై నొ
క్కుమ్మడి శతములువేలును, నమ్ములనోనాటనేసి యక్షుఁడుమతియున్. 857

మ॥ తనకోదండమె శక్రచాపముగతిం దానేపయోదంబటుల్
తనదౌ భీకరసింహనాదమె మహోద్యద్గర్జచందంబుగాఁ
దనబాణంబులె వర్షధారలుగ బల్‌తండోపతండంబులై
యనఘాత్ముండగు వాయునందనుశరీరాద్యంతమున్ ముంచినన్ 858

గీ॥ పవననందనుఁ డాశరవర్షమునకు, నించుకైనను దాను జలించఁబోక
కొండవలెనిల్చి తరుపులు గండశిలలు, సాంద్రముగ రువ్వసాగె నాశాత్రవుపయి 859

గీ॥ అట్లిరువురు ఘోరంబుగ నాహవంబు, సలుపుచుండఁగ నంతంత సైన్యమెల్లఁ
జుట్టు మిన్నకనిలుచుండి చోద్యమంది, యట్టె తిలకించుచుండి రాయవసరమున 860

## అక్షకుమారుని హనుమంతుఁడు వధించుట

గీ॥ అక్షుని కవచానలు కరమద్భుతముగ, విశిఖశాస్త్రంబులగుటయు వెరవకతఁడు
ప్రాసములు తోమరములు నారాచములును, శక్తులాదిగఁగల పెక్కుసాధనములు 861

కం॥ తాను బ్రయోగించియు నవి, వానరునొంపంగలేక వమ్ములగుటయున్
మానసమున నింతింతన, రాని మహారోషమొదవ రావణియంతన్ 862

చం॥ కరమునసున్న కార్ముకము గ్రక్కుననొక్కెడఁ బాఱవైచి తా
నరుదుగ నొక్కమేటిపరిఘాయుధముంగొని సత్వరంబుగా
నరదముపైననుండి కరమార్పులతోడ మహాజవంబునన్
ధరణికిదూకి వాయుజునిఁదాకెఁ బరాక్రమవిక్రమంబులన్. 863

కం॥ తనశక్తికొలఁది నక్షుం, డనిలతనయునురముగాడ నత్యుగ్రుండై
ఘనపరిఘముచేఁ బ్రహరిం, చిన రక్తముకారసాగె సెలయేర్లవలెన్. 864

గీ॥ మారుతాత్మజుఁ డట్లు విదారితుఁడయి, యిట్టటులసోలి వెండియు నేపుమీరఁ
దెలిసి మిక్కిలి కోపసందీప్తుఁడగుచు, బెబ్బులివిధాన గర్జిల్లి యబ్బురముగ. 865

కం॥ ఒక్కమహాగండశిలను, రక్కసుపైవైవ నదియు రయమునఁ బిడుగ
ట్లక్కజముగఁ దలపైఁబడ, నుక్కఱి యక్షుండు నేలకొఱిగియు మగుడన్. 866

గీ॥ వైరి పరిఘాయుధంబుచే మారుతసుతుఁ, గదిసి ప్రహరింపఁబోవ లాఘవమునసుఁబ
వనజుఁ డా వ్రేటుఁ దప్పించుకొని తదీయ, నాసపై గ్రుద్దెఁ బిడికిట రోసమునను. 867

కం॥ అమ్ముష్టిఘాతమున కొ, క్కుమ్మడి ఘ్రాణంబుపగిలి ఘోరముగా ర
క్తమ్ము స్రవింపఁగఁ దొడఁగుడు, నమ్మనుజాశనుఁడు వివశుఁడై సోలుటయున్ 868

సీ॥ ఆలోనఁ దత్కరమందలి దారుణపరిఘాయుధముజారి ధరణిమీదఁ
బడనది తఱిగాఁగ భావించి హనుమంతుఁ డాపరిఘయెకొని యాక్షణంబ
యక్షునితల చూర్ణమగునట్లుమోదిన నా వ్రేటుచేవాడు తీవ్రముగను
రోదనంబొనరించి మేదినిపైనబొంగరమట్లు గిరగిరఁ దిరుగుచుఁబడి
గీ॥ జీవములఁబాసెనప్పుడు సింగమువలె, పీకమైదూకి వానరవీరవరుఁడు
కలఁచి నొంచియుఁద్రుంచియు గడియలోన, సన్నమొవరించె నాదైత్యసైన్యములను 869

కం॥ హతశేషులంత దానవ, పతిచెంతకుఁబఱచి యక్షువార్తఁ దెలిపినన్
మితిలేని దుఃఖమున భూ, పతితుండై రావణుండు పలవించెనిటుల్, 870

ఉ॥ 'హాసుత! నిన్నుబాసి మఱియక్కట! నేనెటు నిర్వహింతురా?
యీసున బ్రహ్మనీనొసట నిమ్మెయి వానరుచేతఁజావఁగా
వ్రాసెనె! యెన్నినోములుఁ దపంబులు సల్పినఁగాని పుత్రకా!
నీసముఁడైపనందనుని నేనిఁకమీదటఁ బొందశక్యమే?. 871

కం॥ ప్రకటబలు లసురులుండఁగ, ముకుపచ్చలునారనట్టి ముగ్ధునినిన్నున్
సుకుమార! రణమునకునే, నకటా! పంపంగనేల యదయుఁడనగుచున్? 872

గీ॥ బుద్ధిపూర్వకముగఁ గోతిపొట్టలోన, నిన్నుఁబెట్టితిఁ గఠినుఁడ నీచమతినిఁ
గనికరములేక పగతుచేఁ గన్నసుతుని, నిట్లుచంపించుఖలుఁడున్నె? యేనుగాక' 873

గీ॥ అనుచుఁ బదినోళ్లఁదెఱచిదశాననుండు, చాలవిలపించుచుండ నాసమయమందుఁ
దత్సుతుఁడు జ్యేష్ఠుఁ డత్యంతధైర్యశాలి, యింద్రజిత్తాతనింజూచి యిట్టులనియె. 874

కం॥ మరణించినవానికినై, దురపిల్లినలాభమేమి? దోషాటకులా
భరణ! మృతుఁడయినమనవా, డకుమగవెండియు సజీవుఁడై రాఁగలఁడే?. 875

చం॥ మనమున నూరడిల్లు దశీమానపరాక్రమశాలివైన నం
బనుపుడు సర్వలోకములు భస్మముఁజేయుమటన్నఁజేసెదన్
వనచరుఁ డొక్కలెక్కయె? ధ్రువంబుగ వాని నిమేషకాలమం
దనిఁ బరిమార్చివత్తు దివియందును బ్రాకిన భూమిదూరినన్'. 876

చం॥ అనపుఁడు మేఘనాదుఁగని యాదరమొప్పఁగఁ బంక్తికంఠుఁ డి
ట్లనియెఁ 'గుమార! పీవనినయంతకు నెక్కుడుసేయనోపు న
త్యనుపమశక్తియుక్తుఁడ వనంతబలాఢ్యుఁడ వౌట నేనెఱుం
గనె? రణమందు నిన్నుఁ ద్రిజగంబులునైన జయింపనేర్చునే? 877

గీ॥ అ(శ్రమంబున దేవేంద్రునంతవానిఁ, బట్టి చెఱఁబెట్టినాడవు పట్టి! నీవు
వానరుండన నెంతటివాడు నీకు?, నేరినైననుగాని జయింపఁగలవు. 878

గీ॥ ఊరఁబిచ్చుకపై నతిఘోరమైన, యట్టిబ్రహ్మాస్త్రమేసినయట్లుకాద?
యనుచుఁ దలపోసి కోతితోననియొనర్పఁ, దొలుత నిన్నంపకేను దత్ఫలముఁగంటి 879

కం॥ హమ్మింక శీఘ్రముగ నీ, వమ్ములనున్విల్లుఁగొమ్మ! యాకోతిని జీ
వమ్ములతో నాకడకుం, దెమ్మెచందమునసైన ధీరవిచారా!' 880

## ఇంద్రజిత్తు హనుమంతునిపైకి యుద్ధమునకుఁ బోవుట

కం॥ అనిపలికి మేఘనాదుని, ననికిన్ సన్నద్ధుఁజేయ నతఁడును జిత్తం
బునఁ బెండ్లికేగువిధమున, ననుపమసంగ్రామకుతుక మావహిలంగన్. 881

కం॥ అక్షయిశరధులు పిలుఁగొని, యాక్షణమే యరదమెక్కి యాహవమునకున్
రక్షస్సేనాన్వితుఁడై, రక్షఃపతినందనుండు రయమున వెడలెన్ 882

కం॥ ఈపగిది నుపవనంబున, కాపంక్తిగ్రీవునిసుతుఁ డరుదెంచి మహా
కోపారుణితనయనుఁడై, యాపావనితోడ నిట్టులనియెం గడిమిన్. 883

కం॥ 'కోతీ! నీవెవఁడవురా?, భీతియొకింతయునులేక విబుధారుల నీ
రీతిగఁ బెక్కంద్రను ని, ర్హేతుకముగఁ జంపఁదగు నటేరా? క్రూరా!. 884

కం॥ నిలు! నిలుమిఁక నన్నెఱుఁగవె?, యలఘుబలుఁడ మేఘనాదుఁ డందురు నన్నొ
ఖలుఁడా! విను! రావణునకుఁ, దలపఁగ నేనగ్రసుతుఁడ దండిమగండన్ 885

ఉ॥ ముప్పదిమూడుకోట్ల సురముఖ్యులఁ బోరునఁ బాఱఁద్రోలి పెం
పొప్పఁ దదీయనేతఁ బురుహూతునివేఁజెఱఁబెట్టినాడ నా
కిప్పుడునాల్గులోకముల నెవ్వరులేరెదు రష్టదిక్పతుల్
కప్పములిచ్చి కొల్చెదరు గర్వమొకింతయులేక నిచ్చలున్. 886

కం॥ భువి దూరిన దివికేగిన, బవరంబున నిన్నుఁబట్టి భంజింపకనే
ప్లవగాధమ! యొకయడుగై, నవెనుకకును రిత్తవోను నమ్మొపలుకుల్'. 887

కం॥ నావిని హనుమంతుండా, రావణితో నిట్టులనియె 'రాక్షస! వినరా!
నీవలెఁగారుల్ప్రేలిన, మీవారేమైరొ చూడు! మిడిసిపడకురా 888

గీ॥ ప్రల్లదంబులతోడ లాభంబులేదు, వదరుఁబోత! యించుకసేపు పాటిపోక
నాయెదుటనిల్వు మాజిరంగముననీదు, కావరంబెల్ల నడఁగింతు క్షణములోన'. 889

## ఇంద్రజిత్తు హనుమంతునితో యుద్ధము చేయుట

మ॥ అనికోపంబున గండశైలమొకఁ డుద్యల్లీలమైఁగొంచు నా
హనుమంతుండు దశాననాత్మజునిపై నత్యుద్ధతిన్వైచె వై
చిన దానిన్ వెసరెండుబాణములచేఁ జెండాడి దైత్యుండు గ్ర
క్కునఁ దత్కాయముపైఁ బదేనునిశితక్రూరాస్త్రముల్ నించినన్ 890

ఉ॥ అప్పుడు వాయుసూనుఁడు మహోహివిధంబునమండి కన్నులన్
నిప్పులు రాలుచుండ రజనీచరుపైన శిలల్ మహీజముల్
తప్పక వర్షమట్లు కడుదారుణభంగిని వైచుచుండ నే
ర్పొప్పఁగవాడు నన్నిఁటిని నుద్ధతినంతరమందె త్రుంచుచున్. 891

కం॥ తండోపతండములుగాఁ, గాండము లాయింద్రజిత్తు కపివరుపై ను
ద్దండతనేయఁ దొడఁగె నా, ఖండలముఖ్యులు కనుఁగొని కళవలపడఁగన్. 892

కం॥ తొడిగెడు బాణమునకు మఱి, విడిచెడుబాణంబునకును వివరింపఁ గరం
బెడతెఱపిలేక తూపుల, జడి దండడిఁగురియసాగె సామీరిపయిన్ 893

కం॥ ఆశరవర్షంబునకు మ, హాశోణితపుసెలయేఱు లతిముతిఁ బాఱం
గిశకులవర్యుఁడప్పుడు, దాశైలమువోలెనిల్చి దర్పోద్ధతుఁడై 894

సీ॥ ఓరోరి! నిలుమని వీరోక్తులాడుచు రావణియేయు మార్గణపరంప
రలునాటి తనశరీరంబెల్ల క్షతములుగావించుచుండ నాగాడ్పుపట్టి
సరకుసేయక మహా సంరంభమేపారఁ దరుశిలాప్రతతులు దనుజుపైనఁ
దఱచుగా రువ్వుచుఁ దదభిముఖుండయి తాఁబోయి వానిరథంబుడాసి
గీ॥ నొగలు వెసఁబట్టి జవమొప్ప జగతిమీద, గిరగిరంద్రిప్పి తాడించి తురగసార
థియుతముగఁ జూర్ణమొనరించెఁ దేరు తక్ష, ణంబ వాడు వేఱొక్కస్యందనమునెక్కి. 895

కం॥ మునుపటివలెరావణి కడు, ఘనముగ శరవృష్టిఁగురియఁ గడఁగుడుఁ దోర్దో
వనచరుఁడు చలముడింపక,-దనుజునిపై రువ్వసాగెఁ దాను శిలాదుల్. 896

గీ॥ ఇట్లు తలపడి తద్దయు నేపుమీర, నొకరికొక్కరు లొంగక యుగ్రభంగి
సమముగాఁ బెద్దయును(బోద్దు సంగరంబు, సలిపి రిరుపురు దేవతానమితిపొగడ. 897

గీ॥ అపుడు పావని తనవాలమట్లెపెనిచి, వానిరథమును బంధించి వసుధమీద
విసరికొట్టుటయును దేరువిఱిగిపోయెఁ, జావునకుఁదప్పి రావణి సాహసమున 898

గీ॥ ఆక్షణంబ యదృశ్యుఁడై యాకసమున, కెగిరిపోయి యా మాయావి యగణితముగఁ
దనదు మాయాబలంబుచే దారుణమగు, గాఢతమమును గల్పించి గండుమీర 899

చం॥ పటుతరమార్గణంబు లనివార్యగతిం గపివాధుమీద ను
త్కటముగ నేయుచుం బ్రబలగర్వితమానసుఁ డింద్రజిత్తు ది
క్తటములుబూరటిల్లఁగను దారుణశంభదుద్రగవిస్ఫుర
చ్చటులమహాట్టహాసములు సల్పఁదొడంగెను నత్తఱిందగన్, 900

కం॥ ఆవిపులతమములోనం, బావని యావంతయేని భావమునందుం
దావికలత్వమునొందక, స్థావరమటునిల్చి ధైర్యసారంబొప్పన్ 901

సీ॥ తరుపులు శిలలు సందలిదానవులయొక్క మృతకళేబరములుఁ బతితములగు
గజవాజిశవములుఁ గడుశిథిలంబులై యిలఁద్రెళ్లియున్న తేరులనుగొనుచుఁ
బ్రతిపక్షుఁడేసెడు బాణజాలంబులు తనకుఁదాకకయుండఁ దరుచరుండు
నేర్పుమైనొడ్డి వానినివ్యర్థములుగాఁగ జేయుచు లావును జేవ యొప్పఁ

గీ॥ గరము నిరపాయకరముగాఁ గ్రాలుచున్న, వాయుతనయునిఁజూచి రావణతనూజుఁ
'డౌర! యీకోతిప్రతిభ యేమనఁగవచ్చు?, భరముగాఁదోచె నాకు నీప్లవగుగెలువ'. 902

గీ॥ అనుచు మిక్కిలిచింతించి తనదుమాయ, చేత మఱియును నాయింద్రజిత్తు భయద
సింహశరభశార్దూలాది చెడుమృగములఁ, దానుసృష్టించి పురికొల్పెఁ దరుచరుపయి 903

కం॥ అవియును హనుమంతునిపైఁ, గవిని మహాఘోరభంగి గానిపఱుచుడున్
లవమైన సరకుసేయక, పవనజుఁడాజంతువులను భంజించెవెసన్. 904

గీ॥ ఇట్లు తానెన్నిమాయలు నింద్రజాల, ములను బన్నినఁగాని యాభూరిబలుఁడు
వృక్షచరుఁ డవన్నియును మాయించుచుండ, నెంతయునుమండి యప్పుడాయింద్రజిత్తు.

గీ॥ పరశుముద్గరతోమరప్రాసపరిఘ, భిండివాలాదులును బహువిధములైన
శక్తులును నారసంబులు సాంద్రముగను, గిశకులవీరుపైఁ బ్రయోగించి మఱియు. 906

గీ॥ వారుణాగ్నేయయామ్యకౌబేరనాగ, గారుడైంద్రంబులాదిగాఁగల మహాస్త్ర
ములు ప్రయోగించి యవియు నావలిముఖునెడ, నిష్ఫలములైన నటుపయి నిర్జరారి. 907

మ॥ అభిమంత్రించి సురాసురుల్ బెగడ బ్రహ్మాస్త్రంబు నావానర
ప్రభుపై నేయుటయున్ మహాచటులసంభద్రౌద్రకాలాగ్నినా
నభమున్ దిక్కులు నాక్రమించుకొని మంటల్ గ్రక్కుచుం దద్దయున్
రభసంబొప్పఁగ దారుణప్రభలతో రాసాగె నయ్యస్త్రమున్ 908

గీ॥ తలఁప బ్రహ్మాస్త్రమాదిగాఁగలుగునట్టి, యస్త్రములతోడఁ దామృతినందకుండ
నబ్జభవుచేత వరములనందెఁగాన, దానికప్పుడుబెదరక తరుచరుండు 909

గీ॥ అభయంకరమైన బ్రహ్మాస్త్రమునకు, నెదిముఖంబుగ నిల్చెఁ దానచలుఁడగుచు
నదియుమంటలుగ్రక్కుచు నరుగుదెంచి, కదలనీయకబందించె గాడ్పుసుతుని 910

## ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రబంధితుఁడైన హనుమంతుని రావణుకడకుఁ గొంపోవుట

సీ॥ అనిలజుండట్లు బ్రహ్మాస్త్రంబునకుఁజిక్కి, తద్బంధముక్తికిఁ దానుజాలి
యుండి రావణదర్శనోత్కంఠుఁడగుచు మిన్నకయుండె నాకట్టునకునులొంగి
తదుపరిఁ బంక్తికంధరునితనూజుండు దానవుల్ దానును దరియవచ్చి
యందఱొక్కుమ్మడి నంజనాతనయునిఁ జుట్టిముట్టికరంబు బెట్టిదముగఁ
గీ॥ బట్టియును గొట్టియును మతిపలువిధముల, గాసిపఱుచుచు రావణుకడకుఁగొనుచుఁ
బోవుచుండఁగ నాతఁడు భావమందు, భయమునొందక చనుచుండె వారివెంట. 911

గీ॥ ఇట్లు హనుమంతుఁగొనిపోయి యింద్రజిత్తు, నిఖిలపరివారయుతముగ నిండుకొలువు
లోన నొకగద్దెపైనున్న దానవపతి, కట్టెదుటనిల్పె నాతని గారవించి 912

కం॥ దానవపతిప్రముదితుఁడై, సూనుపరాక్రమముతనకుఁ జోద్యముఁ గూర్పన్
వేనోళ్ల మేమనాదునిఁ, దానభినందించె నపుడు తరుచరుఁడాత్మన్ 913

కం॥ రావణునివైభవముఁగని, పావనితలయూచిమెచ్చి భావించెనిటుల్
'భూవలయంబున నిట్టిమ, హావైభవసాంద్రుఁ డెవ్వఁడైననుఁ గలడే?. 914

కం॥ అష్టైశ్వర్యంబులలో, నష్టదిశాపతులనైన నయ్యారే! యీ
దుష్టాత్మునితోడ జగ, త్స్రష్టయు సరిబోల్పలేడు సర్వవిధములన్ 915

కం॥ పాపాత్ముఁడుగానియెడల నీపమనాలుగు జగంబులేల సమర్థుం
డీపంక్తిముఖుడు నిక్కము, బాపురె! యేమందు వీనిప్రతిభాళక్తుల్. 916

గీ॥ ఈమహాభోగభాగ్యంబు లీసుఖంబు, లనుభవించెదు ప్రాప్తిలేకునికిఁ జేసి
పరమసాధ్విని సీతను బలిమిఁదెచ్చి, తానధోగతిఁ బొందంగఁ దలఁచెవీఁడు' 917

గీ॥ అనిమనంబునఁ దలపోసి యనిలతనయుఁ, డతులమణిమయరమ్యసింహాసనమున
వాడదిష్ఠించియుండఁగ వసుధమీదఁ, దానుగూర్చుండనొల్లక తక్షణంబ. 918

కం॥ తనవాలముఁబెంచి మహా, సనముగనిర్మించికొనుచుఁ జతురుఁడయి దశా
ననుకంటె నున్నతంబుగ, ననిలజుఁడాసీనుఁడయ్యె నతిధైర్యమునన్ 919

గీ॥ అదికనుంగొని రావణుఁడాగ్రహించి, 'యౌర! యీకోతిగర్వ మేమనఁగవచ్చు?
తనదు రాజసమును రీవియును మదీయ, సన్నిధినిఁజూపుచుండె లక్ష్యంబులేక'. 920

గీ॥ అనిమనంబుననెంచుచు నాదశాస్యుఁ, డాప్రహస్తునిఁజూచి యిట్లనుచుఁ బలికె
'నన్నుఁజీరికిఁగొనక యీనగచరుండు, విఱ్ఱవీగుటకంటివే? వీరవర్య! 921

కం॥ తోకయెగద్దియకాఁగా, నాకంటెసమున్నతముగనయహీనుండై
యీకోతికూరుచుండెను, లౌకికమీమృగమెఱుఁగదు లవమాత్రంబున్. 922

గీ॥ కాన నీవు తడయక యీవానరునియు, దంతమరయుము' నాపుఁ డాతఁడు తదాజ్ఞ
నౌఁదలందాల్చి మేదురనాదమొప్ప, నాంజనేయునిఁగని యాప్రహస్తుఁడనియె. 923

గీ॥ 'ఎవఁడపుర? కోతి! నిన్నిటకెవడుపంపె?, నేలవచ్చితి? వూరుఁబేరేది నీకు?
మావనంబునుజెఱిచి దుర్మదముతోడ, నిట్లుమావారిఁజంపంగ హేతువేమి? 924

గీ॥ వానరాధమ! నీవుమాప్రభునితోడ, నిజముచెప్పుము లేనిచో నిన్నుఁబట్టి
నిలువునంగోసి మాంసమునెమ్మదిగను, నారగింతుము కడుఁదృప్తి దీరమేము' 925

కం॥ అనిగద్దించి ప్రహస్తుం, డనిలజుఁబ్రశ్నింప నాతఁడాతనిమోమై
ననుఁజూడనొల్లకదశవ, దనుదెసఁదనచూడ్కినిలిపి తగనిట్లనియెన్ 926

## హనుమంతుఁడు రావణునితో సంభాషించుట

ఉ॥ ఓయి! దశాస్య! నాచరిత మొప్పగఁజెప్పెద నాలకింపు నే
వాయుసుతుండఁ గీశకులవల్లభుఁడౌ దినవాథసూతికిం
బాయకబంటనేనగుదు బాహుపరాక్రమవంతుఁడన్ జగ
న్నాయకుఁడైనరామునకు నమ్మినదూతను మేటిభక్తుఁడన్. 927

కం॥ రాముఁడు సౌమిత్రియునున్, భూమిజవెదకుచును ఋష్యమూకాద్రికినిం
దామరుదెంచి ప్లవంగ, గ్రామణితో నాడుమైత్రిఁగావించి తగన్. 928

ఉ॥ రాముఁడు ఘోరరాక్షసవిరాముఁడు పిమ్మటఁ దత్సహోదరున్
భీమబలాఢ్యునిన్ విమతవీరవిభంజను నేడువార్ధులన్
వేమరు నిన్నుముంచి మును నీమదమెల్ల నడంచినట్టి సు
త్రాముకుమారు వాలినిఁ గరంబవలీలవధించె ధీరతన్. 929

గీ॥ అట్లు వాలినిఁబరిమార్చి యాప్లవంగ, రాజ్యమునకును సుగ్రీవు రాజుఁజేయ
నతఁడు హర్షించి రామభూపతికిఁ దాను, బ్రత్యుపకృతియొనర్ప భావముననెంచి· 930

కం॥ తనవానరపరివారము, లను మాసంబవధియొసఁగి లలనామణినిం
గనుఁగొని గ్రక్కునరండని, యనఘుండర్కజుఁడు పంపె నఖలదిశలకున్ 931

ఆ॥ ఏను యామ్యదిశకు నేతెంచినాడను, వాలిసుతుఁడు జాంబవంతుఁడాది
ఏగచరప్రముఖులు నాకంటెబలవంతు, లున్నవారు పల్వు రుదధిచెంత 932

సీ॥ వారిపంపున నేను వనరాశిలంఘించి యీలంకకేతెంచి యెల్లచోటు
లరయుచు నీవసమందున్నసీతను గనుఁగొంటి రామభూకాంతుకుశల
మెఱిఁగించి యామెతో నెలమిసంభాషించి యధిపుచెంతకు పెండి యరుగుచుండి
నీకును నాదైన రాకఁదెల్పుటకయి వనమును జెఱిచి నీవారినెల్ల
గీ॥ దునుమవలసెను నన్ను నీమనమునందు, ననదుగానెంచవలదు బ్రహ్మాస్త్రమాది
గాఁగ నేయస్త్రములకైనఁ గట్టువడను, గాని నినుఁజూడఁదలఁచి నేఁగట్టువడితి 933

ఆ॥ ఆంజనేయుఁడనియు హనుమంతుఁడనియునుఁ, బిలుచుచుంద్రు నన్నుఁ బేర్మిదోప
శౌర్యధైర్యవీర్యసాహసవంతుడఁ, బావమతులఁగన్న సైపనుమ్ము, 934

గీ॥ వినుము నీతోడఁభాషింపఁ బనియొకండు, కలిగివచ్చితి నాయెడఁ గవలఁబోక
సావధానంబుగా మతినేవచించు, పలుకులాలించి శుభమొందు పంక్తివదన! 935

ఉ॥ అంచితమైన బ్రహ్మకులమందు జనించినవాడవీవు శో
ధించితివెల్లశాస్త్రములు దిక్పతులందఁగరానియట్టి ప్రా
పంచికభోగభాగ్యసుఖవైభవగౌరవలక్ష్మియెల్లఁ బ్రా
పించితి నీవమేటివనఁ బెంపుగడించితి పోదశాననా!. 936

గీ॥ ఈవెఱుంగని ధర్మంబులెందులేవు, ఖలులశిక్షించి ధర్మరక్షణముసేయ
నీప్రభుస్థానమునునుంటి విట్టినీవ, క్రౌర్యమునకును బాల్పడఁ గట్ట! తగువె?. 937

కం॥ తెలిసియు బలిమిని నీవిటు, కులసతులంబట్టి చెఱుపఁ గోరందగునే?
కులమును గిరియుఁ జెడదే?, కలుషంబదిపొందకున్నె కలకాలంబున్ 938

కం॥ ఈ యనుచితకృత్యంబును, జేయఁగ నీచాత్ములకును జెల్లునుగానీ!
నీయోగ్యతకుందగియెడి, దేయిది? యోజించుకొమ్ము! ధీరవిచారా! 939

కం॥ పరవనితాసంగమమున, దురితంబదియట్టులుండ దుర్మరణంబుం
బొరసిరి తొల్లిననేకులు, సురారికులవర్య! వినియుఁ జూచి యెఱుఁగమే? 940

కం॥ నామాటలుపాటింపుము, రామునకున్ సీతనిమ్ము రాక్షసనాథా!
భూమీశుఁడు నినుఁగాచును, క్షేమంబొడఁగూడునీకుఁ గిరియు నిలుచున్ 941

ఉ॥ దేవుఁడు రామచంద్రుఁడు తదీయకళత్రము సీత యిందిరా
దేవి త్రిలోకమాత కడుధీర పతివ్రతకాన జానకిం
గేవలమానవాంగనగ నెమ్మనమందుఁ దలంపఁబోకు మో
రావణ! యింకనైన రమురామునకిమ్ము పయోరుహాననన్ 942

ఉ॥ మాటలువేయునేల యిఁక? మంచిగ రామునిచెంతకేగి యా
పాటలగంధి జానకినిఁ బార్థివచంద్రునకిచ్చి కాళ్లకుం
బాటిగఁ జాగిమ్రొక్కి పొరపాటుక్షమింపుడటంచు వేడు మే
చేటునులేదు నీకుఁ బతికేకొని పోదును నిమ్మరావణా! 943

ఉ॥ నీదుహితంబుఁగోరి మఱి నేనువచించుచునుంటిఁ గావునం
గాదనఁబోక భూసుతను గ్రక్కున రామునకిమ్ము లేనిచో
లేదిఁకనీకుజీవితము లేమశుభంబు నిజంబు బూదియై
పోదువుచూవె బల్మిడుతపోలికఁ దద్ఘనకోపవహ్నికన్ 944

సీ॥ శివునికార్ముకదండ మవలీలమోపెట్టి కడిమిమై విఱిచె నేఘనబలుండు
ఖరదూషణాదిరాక్షసులను బదునాల్గువేవురఁ గూల్చె నేవీరవరుఁడు
నిరుపమశౌర్యుఁడై నెగడువాలిని నొక్కకోలచే నెవ్వఁడు కూలనేసెఁ
గార్తవీర్యార్జును గర్వంబుమాపిన పరశురాము మదంబుఁ బాపెనెవ్వఁ
గీ॥ డట్టి శ్రీరాముఁ డెల్లితానరుగుదెంచి, నిమ్ము నీవారినెల్లర నిర్దహించి
వనరుహాక్షిని సీతనుఁ గొనుచుఁబోవఁ, గలఁడు రావణ! నాపల్కు కల్లగాదు. 945

గీ॥ అవధరింపుము! మఱియు సూర్యాత్మజుండు, చెలఁగి కెబ్బదిరెండు వెల్లవలప్లవంగ
సైన్యములుగొల్వ శ్రీరామచంద్రునకును, దాను దోడయివచ్చును దధ్యముగను. 946

ఉ॥ ఆ కపిసేనయందు నొకఁడైనను దక్కువవాడులేడు ము
ల్లోకము లెత్తివచ్చినను లొంగరు చెంగరు సంగరంబునన్
వీకమెయిన్ సురాసురులు వేఁజనుదెంచినఁగాని గెల్తు ర
స్తోకబలాఢ్యులందఱును శూరులె వీరులె ధీరులే సుమీ!. 947

కం॥ వానరపతి వారందఱి, లోనన్ నేనొక్కరుండ లొచ్చనియెంచుం
గాన మఱిదూతకృత్యముఁ, దాను నియోగించుచుండుఁ దఱచుగనాకున్. 948

గీ॥ సారవంతముల్ సుగ్రీవు సైన్యతతుల, సారముల్ నీదుసైన్యముల్ సమరమందు
వారిచేఁ జావఁగలరు మీవారలెల్లఁ, బిదపనీవు చత్తువు రామవిభునిచేత 949

కం॥ వారిని వీరిని గెలిచిన, వీరుఁడనని నీవు విఱ్ఱవీగవలదు దు
ర్వారోగ్రశాతశరముల, నీఱుంగావించునిన్ను నృపుఁడు నిజముగన్! 950

గీ॥ దానవేశ్వర! రాముఁడులేనివేళ, నాడు దొంగపై యెట్లొ జానకినిఁ గొనుచు
బ్రదికి రాఁగల్గితివి కాని పార్థివేంద్రు, వారిఁబడినేడు చావక బ్రదుకవశమె?. 951

కం॥ కావున సీతనొసఁగి యా, క్ష్మావరుఁడగురామతోడ సద్భావముతో
నీవింక సంధిసేయుము, రావణ! సిద్ధించు శుభపరంపర నీకున్' 952

కం॥ అని యిట్లనేకవిధములఁ, దనకుహితముఁ గఱపుచున్న తరుచరమణినిఁ
గనుఁగొని రావణుఁ డందఱు, వినినిట్లను నమితరోషవివశుండగుచున్ 953

సీ॥ 'ఈకోతి దుర్భాషలెల్ల మీరందఱు వింటిరే? దానవవీరులార!
గర్వించి నాముందఁ గరము నిర్భీతిగాఁ బలుకంగఁజొచ్చె దుర్భాషణములు
వీని కావరమేమొ వినఁ క్షోద్యమయ్యెడు నష్టదిక్పాలకులంతవారు
మన్నామమన్న సింహస్వప్నముగనెంతు రట్టి నన్నించుకయైనఁగాని
గీ॥ యీదురాత్ముఁడు లెక్కింప కెల్లిదముగఁ దలఁచుచున్నాడు కాఁబోలు దండనమున
కర్హుఁడగునెల్లభంగుల నట్టుగాన, చిత్రవధసేయుఁడీ! యుపేక్షింపకితని' 954

కం॥ అని రావణుండు మారుత, తనయునకున్ మరణశిక్షఁ దావిధియింపన్
విని తత్సహోదరుండతి, వినయనిధి విభీషణుండు విబుధారి కమన్. 955

ఉ॥ ఆతతధర్మసూక్ష్మముల నెన్నియెఱింగినవాఁడ వీవిటుల్
నీతిఁ దొఱంగి భూజనులు నిందియొనర్పఁగ దూతయైన యీ
కోఁతినిఁ ద్రుమ్మఁగాఁదగవె? గోవుల బాలుర స్త్రీల విప్రులన్
దూతలఁజంపరాదని బుధుల్ వచియింపరె? పంక్తికంధరా! 956

కం॥ తమప్రభువులు నుడివిన చం, దమునం బల్కుటలు దూతధర్మం బరయన్
విమలాత్మ రామునందే, శముఁ జెప్పట యాతనికినిఁ జను దనుజేంద్రా! 957

కం॥ అదియట్లుండె నితఁడు నె, మ్మది వినయముఁ బీడి యిట్లు మతి సభలో నె
ట్టిదముగ భాషించుట త, ప్పిదమేయగుఁగాన విసఁడు వేతొకభంగిన్ 958

కం॥ ఈవృక్షచరుని శిక్షితుఁ, గావించి విడువు' మటంచు గౌరవసుగుణ
ద్భావుఁడగు నవ్విభీషణుఁ, డీవిధమునఁజెప్ప దానవేశ్వరుఁ డంతన్. 959

కం॥ తమ్ముని వాక్యంబులఁ దన, నెమ్మదిఁబాటించి [illegible] సంహా
రమ్మొనరించెడుయత్నం, బిమ్ములవిరమించుకొనుచు నింద్రారితగన్. 960

గీ॥ 'వసుధ వానరజాతికి వాలమరయఁ, గరమలంకారమైయుండుఁ గాన వీని
తోకఁగాల్పించి పుచ్చినఁ దోనవిసిగి, ప్రాణమునువీడు నవమానభరము కతన'. 961

కం॥ అని నిశ్చయించి రావణుఁ డనుచరులను జీరి యిట్టులనియెన్ 'మీరీ
వనచరుని తోకఁగాలిచి, పనుపుఁడు' నావిని నిశాటభటు లాక్షణమే 962

## రావణాజ్ఞచే రాక్షసులు హనుమంతుని తోకకు నిప్పంటించుట

ఉ॥ సంతతపుణ్యుఁడౌ పవనసంభవు గ్రక్కునఁజుట్టుముట్టి యు
క్కింతయుఁ గాలుఁగేల్కదలనీయకయుండఁగఁబట్టి కొట్టుచుం
గంతములాడుచుం దఱచుపాతఁబఁ జింపులునైన వల్వల
త్యంతముఁదెచ్చి చుట్టిరి మహాబలపుత్రుని మేటితోకకున్ 963

గీ॥ ఈవిధంబున రాక్షసు లెన్నియేనిఁ, బుట్టములఁదెచ్చి తోకకుఁ జుట్టుచుండ
నాంజనేయుఁడు తనవాల మంతకంత, కెక్కుడుగఁబెంచుచుండెఁ దానక్కజముగ. 964

సీ॥ అప్పుడు నిర్విణ్ణులై చేయునదిలేక యసురులు చేతులు పిసికికొనుచుఁ
దాకుండ నదికని దానవేంద్రుఁడు చాలనద్భుతమొందుచు నాక్షణంబ
'ధరణీతనూభవ ధరియించుమేలిమి పుట్టంబుఁ గొనితెండు వాం' డటంచు
భటులకానతి యొసంగుటయుఁహాపావని యదివిని 'యీఖలు లవనిసుతకుఁ

గీ॥ బరిభవముఁగూర్తు'రనుచు భావంబునందుఁ, జాలశంకించి తనమహోవాల మపుడు
పెంచుటుడిగిన దానవుల్ పెనుకడవల, కొలఁదిఁ దైలంబు వేగంబ కొనుచువచ్చి 965

కం॥ హనుమంతుని వాలముపై, ఘనముగఁ దైలంబుఁబోసి కరముఁదడిపి తా
రినలంబంటించుటయుం, బెనుమంటలతోడఁ దోకపెద్దగ మండెన్. 966

ఉ॥ అప్పుడు రావణాసురుని యానతిచొప్పున దైత్యులెల్లరుం
దప్పెటలున్ మృదంగములు తాసెలు భేరులు మేళతాళముల్
తప్పక మ్రోగుచుండ మఱి తాముపెనం బురి నాల్గువీధులం
ద్రిప్పఁదొడంగి రాయనిలదేవకుమారుని నుత్సవంబటుల్ 967

గీ॥ అంత నావార్తవినిసీత చింతనొంది, 'కట్ట! మత్ప్రాణదాతయైనట్టి గాడ్పు
పట్టికిం జేటుమూడెనే యెట్టులింక, నీవిపత్తునుబాపువా రెవరుగలరు?. 968

గీ॥ భానువంశ్యున కితఁడు మద్వార్తదెలిపి, నాచెఱం బాపఁగలఁడని నమ్మియుంటి
నింక నాస్థితి పతికెవ్వఁ డెఱుకఁబఱుచుఁ? గట్ట! నాయాసయకుగంటెఁ దుట్టతుదకు 969

గీ॥ ఏమిచేయుదు? నాగతి యెట్టులొక్కొ!, కాయతెగి యేటిలోమున్గిపోయినట్టి
నరునిచందమయ్యెనుగద నాయవస్థ, కటకటా! దైవమా! నీకుఁ గరుణరాదె? 970

కం॥ అని యిమ్మెయిఁగొండొకవడి, మనమున దుఃఖించి సీత మఱి యాహనుమం
తునకు శుభంబునుగోరుచు, ననలునిధ్యానించె నిట్టు లతిభక్తిమెయిన్ 971

కం॥ 'నానాధుఁడు సత్యాత్ముం, డేనియు నేసాధ్వినగుదునేనియు నీవా
వానరునెడ సుష్టత్వముఁ, బూనక శీతలుఁడవగుచుఁ బ్రోవుమహాత్మా'. 972

కం॥ అని యీవిధమున జానకి, ఘనముగఁ బ్రార్థింప మిగులఁ గరుణాలుండై
యనిలతనూభవునెడ నా, యనలుఁడు తాఁజల్లనయ్యె నద్భుతభంగిన్ 973

## హనుమంతుఁడు లంకాదహనము చేయుట

సీ॥ అప్పుడా హనుమంతుఁ డనలుఁడుతనపట్ల శీతలుండగుటకుఁ జిత్తమందు
నచ్చెరువొందుచు 'నయ్యారె! యిదియేమివింతయో! యెఱుఁగరాదింతవట్టు
వేడిమిఁజూపెడు వీతిహోత్రుండిప్పు డరయనాయెడఁ జల్లనగుటకేమి
హేతువైయుండునో! యెన్న నా జానకిమహితపాతివ్రత్యమహిమవలన

గీ॥ వనలుఁ డీరీతి శీతలుండైనవాడొ! లేక రాముని సత్కరుణాకటాక్ష
వీక్షణామృతధార లీవిధమునఁ గఱుఁ, జల్లగా మీదఁ బ్రవహించినసాగె నేమొ. 974

కం॥ కాకుండిన నీశైత్యము, నాకెక్కడినుండివచ్చు? నన్నాపదపాల్
గాకుండఁగరుణఁ బ్రోచిన, యాకారణదంపతులను నర్ధించలఁతున్' 975

కం॥ అని సీతారాములఁ దన, మనమున ధ్యానించి బ్రహ్మమంత్రంబులఁ దా
ఘనముగఁ బఠియించుచుఁ ది, ద్ఘనమహిమంజేసి యపుకు గాత్రుసుకునకున్. 976

గీ॥ తక్షణంబ బ్రహ్మాస్త్రబంధంబు వాయ, నిరుపమోత్సాహభరితుఁడై నెగడె నతఁడు
జనన మరణాదిబంధమోచనముకాఁగ, మోక్షసుఖమొంది మరియు ముముక్షువట్లు. 977

కం॥ ఇమ్మెయి బ్రహ్మాస్త్రపుఁగ, ట్లిమ్మగఁ బాయుటయు హనుమయెంతయువేడ్కన్.
నెమ్మనమున లంకాదహ, నమ్మొనరింపంగఁ దలఁపు నాటుటయు వెసన్! 978

సీ॥ పంక్తికంఠుని మేడపైదూకి జాజ్వల్యమానంబుగా మఱి మండుచున్న
తనమహావాలంబు దానికంటించిన నదియును జల్లార్ప నలవిగాక
యుండఁ బెన్మంటలు మండనారంభించె నంత నాహనుమంతుఁ డసురులెల్ల
గగ్గోలుపడఁగ నాక్షణమెయందుండిన కొలువుకూటంబులు గోపురములు
గీ॥ వివిధమండపప్రాసాదభవనములును, నిమిషమాత్రములోఁగాల్చి నీఱుజేసి
మఱియుఁ గుంభకర్ణాదులమందిరముల, దెసకు లంఘించి యాతండు ధృతిచెలంగ 779

సీ॥ క్రమముగా నాకుంభకర్ణునిసదనంబు నాయింద్రజిత్తుని యాలయంబు
నతికాయునిల్లు మహాకాయుగేము ధూమ్రాక్షుగేహంబుఁ బ్రహస్తుగృహము
నానరాంతకుఁడు దేవాంతకుఁడువసించు మహనీయసుందరమందిరములు
కుంభ నికుంభుల గృహనివాసంబులుఁ బార్శ్వమహాపార్శ్వభవనములును
గీ॥ అదియు నిదియననేల? యయ్యనిలసుతుఁడు, సత్యభాషణుడౌ విభీషణుని గృహముఁ
దక్కనారాచనగరునందలి ప్రసిద్ధు, లయిన దైత్యుల గృహములన్నియు దహించె. 980

గీ॥ ఇట్లు రావణునగరు దహించివైచి, తరుచరేంద్రుఁడు తదుపరిఁ దత్పురిఁగల
పూరికొంపయులేకుండఁ బూర్ణముగను, దగ్ధమొనరింపసాగె నాతరుణమందు. 981

## హనుమంతుఁడు లంకను దహించుట చూచి రాక్షసస్త్రీలు దుఃఖించుట

గీ॥ అంత నావీటఁగలదైత్యకాంతలెల్ల, నచ్చటచ్చటగుమిగూడి యమితమైన
దైన్యమేపారఁ దమలోనఁదామె యిట్లు, లనుచుఁదలపోయఁగాఁ జొచ్చి రార్తలగుచు 982

కం॥ 'చేడియలారా! చూడరె, వీడెక్కడివానరుండె వీతదయుండై
వీడెల్లనుదహియించెం, బాడియొకింతయునులేక పాపాత్ముండై. 983

గీ॥ రావణుఁడు వైరియగుటచే రాముఁడతని, కొంపఁగాలిచి రమ్మని పంపియుండుఁ
గాని మనకొంపలిమ్మెయిఁ గాల్చుమనుచు, నాతఁడేటికిఁదాఁజెప్పు నీతిఁదప్పి. 984

గీ॥ మనదశాననుకంటె నీవనచరుఁడు, చాలఁగ్రూరాత్ముఁడగును గాఁబోలుఁజూడ
లేనిచోఁ బాపమొక్కింతయేనిఁజేసి, యెఱుఁగమే? యిట్టి మనకొంపలేల కాల్చు? 985

గీ॥ ఏమిసేయుద? మెటఁబోద? మెట్టులింక?, నీవిపక్షునుబాపువా రెవరుగలరు?
దానవులనెల్లఁ జంపియేకాని రిత్త, పోదు పోదమ్మ! యీకోతి పొలఁతులార!. 986

గీ॥ కాల మాసన్నమగుడు రక్కసులనెల్లఁ, దీసికొనిపోవఁగాఁ జనుదెంచినట్టి
కాలకింకరుఁడగుఁగాని గరితలార!, వీఁడు సామాన్యకీశుఁడు గాడు కాడు. 987

కం॥ వలదనియెందఱుచెప్పిన, బలిమిని జానకినిఁదెచ్చి పంక్తిముఖుండిం
తలుసేసెఁ గటకటా! యీ, ఖలునకుఁ జావేలరాదొ? కామినులారా!'. 988

గీ॥ అని యనేకవిధంబుల నాదళాస్యుఁ, దిట్టిపోయుచు మఱియును 'దీనికెల్ల
శంకరయును ద్రోహియనునసైన శూర్పణఖయె, మూల' మని యిట్లు దూరి రాపొలఁతివారు.

కం॥ కటకట! కొంపకుఁదిప్పలు, కుటిలాత్మక శూర్పణఖయె కొనితెచ్చెఁ గదా?
మటుమాయలాడి దానిని, నెటుసేసినఁ గలుషమంట దించుఃయెనన్. 990

సీ॥ రామభూవిభునిఁ దాఁగామింపఁగానేల? ముక్కుఁ గర్ణములఁ గోల్పోవనేల?
తనయపరాధమాతనిపైననిడి రావణునిచెంతఁ జాడీలు నుడువనేల?
నుడివినంతనె మంచిచెడుగులెంచకయె యాక్షితిపుతో వాడు ద్వేషింపనేల?
ద్వేషించినంతనె త్రిభువనమాతయౌ వైదేహిఁదాఁ జెఱఁబట్టనేల?
గీ॥ కటకటా! దీనికెల్లను గారణంబు, తలఁప శూర్పణఖయె కాన దానిగళముఁ
ద్రెంపఁదగు నొంపఁదగు మఱిచంపఁదగును, మనకులంబునకది పెనుమారియయ్యె 991

కం॥ కాకుత్స్థకులుఁడు రాముం, డీకులటను నాడు దునిమియేయుండిన నీ
రాకాసుల కీప్రళయము, లేకుండుఁగదమ్మలార! లేశంబైనన్.' 992

గీ॥ అనుచు నోరికివచ్చినయట్లు శూర్ప, ణఖను దూరుచు దానవాంగనలు చాల
నిబ్బరముచెడి శోకంబు ప్రబ్బికొనఁగఁ, దాము విలపింపసాగి రాతరుణమందు. 993

సీ॥ పిల్లలఁ గోల్పోయి విలపించు తల్లులు తల్లులకై కుందు పిల్లవారు
భర్తలనెడఁబాసి పలవించుభార్యలు భార్యలవిడనాడి పనవుపతులు
పశు ధన ధాన్యసంపద్భ్రష్టులై కడు బోరుబోరునను వాపోవువారు
మృతులైనబాంధవ మిత్రులఁగూరిచి గోడుగోడున మొత్తుకొనెడివారు

గీ॥ నై మహారణ్యరోదనమగుచు నేరి, కైన వినుటకుఁ జూచుట కలవిగాక
యసురు లాబాలగోపాల మార్తులగుచుఁ, గరము శోకింపదొడగిరి కాకులట్లు. 994

## హనుమంతుఁడు లంకను దహించి సీతకడకువచ్చి సంభాషించుట

గీ॥ ఇట్లు హనుమంతుఁ డాలంకనెల్లఁ గాల్చి, తక్షణమ వార్ధికడకేగి తజ్జలములఁ
దోకఁ జలార్చుకొని జగదేకమాత, యైన యాసీతసన్నిధి కరుగుఁదేర 995

గీ॥ అతఁడు సలిపినకృత్య మాయవనిసుతకు, ననుచితముగాఁగఁ దోచిన ననిలసుతుని
తోడ భాషింపనొల్లక తోయజాక్షి, దిగులుచెందుచు నిట్లు చింతింపసాగె. 996

కం॥ 'లౌకికతత్త్వము సుంతయు, నీకపికులతిలకుఁ డేమియెఱుఁగం డకటా!
వీకమెయిలంక'గాలిచి, నాకిపు డురిత్రాడుఁదెచ్చినా డెటులింకన్?. 997

గీ॥ కాంచిరమ్మన్న నీతఁడు కాల్చివచ్చు, వాడగుటయెఱుంగక రామభద్రుఁడకట!
యిట్టివానినిఁ దానఁపనేల? కార్య, మెల్లఁజెఱచె నీవానరుఁ డెట్టులింక? 998

గీ॥ ఈ యుపద్రవములకెల్ల నేనకర్త, ననుచు భావించి నన్ను దశాననుండు
చిత్రవధసేయుఁగలఁ డేమిచేయుదాన?, నాకుఁగొనితెచ్చెముప్పు నీనగచరుండు'. 999

కం॥ అని మనమునఁదలపోయుచు, ఘనచింతాక్రాంతయైన కాంతామణినిం
గని భక్తితోడఁ దత్పద, వనజయుగంబునకు మ్రొక్కి వాయుజుఁడనియెన్. 1000

కం॥ 'నారాకఁ దెలుపుటకునై, యీరావణులంక నే దహించితిఁ దల్లీ!
శ్రీరామునికడకేగెద, గారవమున నాజ్ఞయిమ్ము కరుణించి యిఁకన్'. 1001

కం॥ అన విని హనుమంతునితో, వనితామణియిట్లులనియె 'వానరవర్యా!
విను కార్యమెల్ల భంగ, మ్మొనరించితి వెల్లచేటులొదవెఁ గదయ్యా! 1002

గీ॥ ఈవు లంకాపురంబుదహించి నాకు, హానిఘటియిల్లఁజేసితి వక్కటకట!
యిట్లుసేయంగఁదగునయ్య? యింకనన్ను, బ్రతుకనిచ్చునె యాపంక్తివదనుఁ డనమ?

గీ॥ అనిన విని యాంజనేయుఁడు తనమనమున, 'నేను జనినపిదప దైత్యనేత తన్ను
హింసనొందించుననుచు నీయింతివెఱచె', ననితలంచుచు నతఁడిట్టులనియె సతికి 1004

గీ॥ 'అమ్మ! వెఱవకుమమ్మ! యీయలఁతికార్య, మునకు రామప్రభుండు రాఁబనియెలేదు
నాదు భుజమధిష్ఠింపుము మేదినీశ, కడకుఁగొనిపోదు నిన్నునేఁ గడుసుఖముగ. 1005

ఆ॥ వినుము! జనని శంకవీడుము దశకంఠుఁ, డిపుడెసగముచచ్చె నింకనిన్నుఁ
జెనకి బ్రతుకఁగలఁడె? చెఱబెట్టి హింసించి, నొంపఁగలసు నేను జంపఁగలను'. 1006

కం॥ అని పలుకువాయునందనుఁ, గనుఁగొని వైదేహినుడివెఁ 'గపికులవీరా!
వినుము! మదీయాగమనం, బనుచితముగఁదోచె నిప్పు డిదియెట్లనినన్ 1007

ఉ॥ నాడు దశాననుండు నరనాథుఁడులేనితఱిన్ మనంబునం
బాడిఁదొరంగి చౌర్యమునవచ్చి ననుంజెఱఁదెచ్చెఁ గాననన్
నేడటులే సురారివరు నేనువంచితుఁజేసి వచ్చుచో
నోడక రామభూవిభుని నుర్విజనంబులు నిందసేయరే? 1008

కం॥ ఏలయన రావణునితో, నాలముగావింపవెఱచి యారామక్ష్మా
పాలుఁడు చోరత్వంబున, నాలినిఁదాఁదెచ్చుకొనియె ననుచితమనుచున్. 1009

కం॥ అనిశంబు రామచంద్రుని, జనములు నిందింత్రుగాన చర్చింపఁగ నేఁ
జనుదెంచుటయుచితముకా, దనఘాత్మక! యొక్కమాట నాలింపుమిఁకన్ 1010

ఉ॥ రాముఁడువచ్చి రావణుని రాక్షససైన్యయుతంబుగాఁగ సం
గ్రామతలంబునందునిమి సంగొనిపోవుట చాలలెస్స కా
నీ మఱివేఱుమార్గమున నేనరుదెంచుట యెల్లభంగులన్
క్షేమకరంబుగాదు పతికీర్తికిభంగకరంబు' నావుఁడున్ 1011

కం॥ విని మారుతనందనుఁడా, జనకజతో నిట్టులనియె 'జననీ! యిఁకనే
జనపతికడకేగెద నా, కనుజ్ఞదయచేసియిమ్ము! యడలకుమమ్మా!. 1012

కం॥ ఎల్లి ససైన్యంబుగ నీ, వల్లభుఁడేతెంచుఁ బంక్తివదనుఁ దునిమి యో
తల్లీ! నినుఁ గొనిపోయెడు, నుల్లంబున వంతవీడు మూరడిలుమిఁకన్.' 1013

కం॥ నావిని 'రాముని దయచేఁ, బావని! సిద్ధింపఁగాత పరమశుభంబుల్
నీవింకఁబోయిర' మ్మని, దీవించి యనుజ్ఞనిచ్చె దేవి హనుమకున్. 1014

## హనుమంతుఁడు సముద్రమును దాటి యంగదాదులకడకు వచ్చుట

కం॥ హనుమంతుఁడంత వినయా, వనతశిరోభాగుఁడగుచు వసుతామణి పా
వనపాదపద్మములకున్, ఘనభక్తిం జాలమ్రొక్కి గమనోన్ముఖుఁడై 1015

గీ॥ అతిరయంబున నాసువేలాచలంబు, వాయుజుఁడు చేరవచ్చి తదీయమైన
ఘనశిఖరమెక్కి యంభోధిఁగలయఁజూచి, యెగసెఁగుప్పించి యచటనుండి గగనమునకు

కం॥ వాయుసుతుం డీవిధమున, వాయుమనోవేగములను వాసవముఖ్యుల్
పాయక కనుఁగొని పొగడఁగ, నాయంబుధిపైన నెలమి నరుగంబోవఁగెన్. 1017

గీ॥ అట మహేంద్రాద్రిపైనున్న యంగదాదు, లర్కనందనుఁడిచ్చిన యవధి నాటి
తోడఁదీఱచుండుటయు వాతూలసుతుఁడు, రాకపోవుటయును భయగ్రస్తులగుచు. 1018

కం॥ మనములఁ దహతహఁజెందుచు, ననుపనుబలవిక్రమాఢ్యులగు కపివర్యుల్
ఘనముగఁ దలపోతలుపై, కొనుటయు నిట్లనిరి మిగులఁ గొందలపడుచున్ 1019

సీ॥ 'అక్కటక్కట! మనయనిలతనూభవుఁ డింకరా' డనుచు నూహించువారు
'నతఁడందెమరణించె నట్లుగాకయెయున్న వేలరా?' డని సంశయించువారు
వచ్చును రాడనువానిరెంటినడుమ సందిగ్ధదశలోనఁ గుందువారు
'హనుమంతుఁడేలేని మనజీవితములేల? యరనితోడిదెలోక' మనెడువారు
గీ॥ 'సీతవృత్తాంతమట్లుండె వాతసుతుని, వెదుకవలసివచ్చుట మనవిధిగ నుండె
నెటులఁజేయుదర?' మనితటియించువారు, నైయనేకవిధంబుల నడలి కపులు 1020

కం॥ 'చనుదెంచుచుండెనేమో, యనిలజుఁ' డని యఖులెత్తి యామ్యదిశను న
వ్వనచరులుమాటిమాటికిఁ గనుఁగొనఁగాసాగి రుత్సుకత్వముదోపన్ 1021

శా॥ ఆలోసం దనదేహకాంతులు పృదివ్యాశాభ్రభాగంబులం
జాలం బర్వుచునుండ వారికి మనస్సంతాపముల్ దీరఁగన్
వైలంబే పవమాననందనుఁడు తద్వారాశిపైనం గడున్
లీలన్ రాఁదొడఁగెం బ్రభాకరునికాంతిన్ గేలిఁ గావించుచున్ 1022

కం॥ ఇవ్విధమునఁ జనుదెంచెడి, యవ్వాయుతనూజునంగదాదులు కడుదో
దవ్వులనచూచి మోదము, నివ్వటిలన్ సంభ్రమంబు నెతిఁ గన్పట్టన్ 1023

కం॥ 'వచ్చుచునున్నాడదెమన, సెచ్చెలికా' డనుచుఁ గపులు నిర్భరహర్షం
బచ్చుపడఁ దారు పొగడం, జొచ్చిరి తగనాంజనేయు నుజువిధేయున్. 1024

గీ॥ అంతలో వాయునందనుఁ డరిలవెగ, మున దరియవచ్చి తమకు దర్శనమొసంగ
నాతనిం గౌగిటంజేర్చి యాదరమున, నెలమి నుపచరించుచుఁ గపులిట్టులనిరి. 1025

కం॥ 'పోయినకార్యము పండో?, కాయయొ? యెఱిఁగింపు' మనుచుఁ గపు లడుగుటయున్
ధీయుతుఁడు మారుతాత్మజుఁ, డాయగచరవరుల కిట్టులని వాక్రుచ్చెన్. 1026

కం॥ 'కన్నులపండువుగాఁ, బన్నుగఁజూచితిని సతిని బాష్పించితి నా
పన్నయయి లంకలోపల, నున్నది బహుదనుజవనిత లొగిబాధింపన్. 1027

కం॥ కావునఁ దడయక సీతా,దేవియుదంతంబు రామదేవునితోడన్
వేవేగఁ దెలుపుదము పద, పోవుదమిఁక గడుపు దీరిపోవకమున్నే'. 1028

కం॥ అని జానకీవృత్తాంతము, వనచరులకుఁదెలిపి యతఁడు వారినిఁ బయనం
బున కభిముఖులను గావిం, చిని జాంబవదాదులెల్లఁ జెలఁగి మురియుచున్. 1029

కం॥ వాయుసుతుని శ్లాఘించుచు, నాయంగదుఁ డాదియైన యగచరముఖ్యుల్
చేయఁదొడంగిరి పయనము, వాయుమనోవేగములను బ్రముదితులగుచున్ 1030

## హనుమదాదివానరులు రామునికడకు బయలుదేరుట

సీ॥ అబ్బంగిఁ జనుచుండ నసదృశశౌర్యుఁ డామారుతి తన్మార్గమధ్యమందుఁ
గడువిపులముగ లంకాదహనాదికంబులగున ద్భుతకర్మములను నంగ
దాదులకెఱిఁగించు చారయ వారిచే వినుతింపఁబడుచు వేవేగఁ గొలఁది
పయనంబులకు మాల్యవంతంబుఁ జేరంగ నరుదెంచుటయు వారియాగమనము

గీ॥ నందు సంతోషచిహ్నంబు లంబుజాప్త, సుతుఁడు దూరంబునందె తాఁజూచిమురిసి
వానరావళినెదురుగాఁ బంపి రవికులేంద్రుఁడగు రామచంద్రుతో నిట్టులనియె. 1031

గీ॥ 'యామ్యదిశకేగినట్టి యాయనిలజాదు, లమితహర్షధ్వనులుసేయు చరుగుఁదెంచు
చున్నవారుగావున సీతయునికిపీరు, తెలిసికొనినట్లున్నది దేవదేవ!'. 1032

గీ॥ అనుచు శ్రీరామవిభునితో నాదివాక, రాత్మజుఁడు తాను జెప్పుచున్నంతలోన
నంగదాదికీశోత్తము లరుగుదెంచి, రామలక్ష్మణులకుఁ గపిరాజునకును, 1033

కం॥ దెండములు భక్తిదోపఁగ, వందనమొనరించి యపుడు వాయుతనూజున్
ముందఱనిడికొని వానరు, లందఱు నాసీనులైరి హరికులనాథున్ 1034

గీ॥ తాము పోయివచ్చినపనియేమియైన, దనుచుఁ బ్రశ్నించుటకుమున్నె యర్కవంశ
విభునితో సీతదభవార్తవిన్నవింప, మంచిదని యంగదాదులూహించి యపుడు. 1035

కం॥ హనుమంతునితో నిట్లని, 'యనిలాత్మజ! నీవు లంకకరిగి మహీనం
దనసుగనుంగొనివచ్చిన, ఘనబలశౌర్యాధికుఁడవు కావున వినుమా!. 1036

కం॥ నీవేరామునితోఁ ద, ద్దేవిశభోదంతమెల్లఁ దెలుపఁగవలయున్'
నావిని వల్లెయటంచుం, బావని యుత్సాహపూర్ణభావుండగుచున్. 1037

కం॥ ఆతతభక్తివినయనము, పేతుండై మ్రొక్కి రామపృథ్వీశునితో
వాతూలతనయుఁ డప్పుడు, సీతశభోదంతమిట్లు చెప్పఁదొడంగెన్ 1038

కం॥ 'దేవా! చూచితిసీతా, దేవిని నేమాటలాడితిని ఖలుఁడగు నా
రావణుని లంకలోపల, జీవచ్ఛవమటులుండెఁ జెఱఁ జిక్కవగన్. 1039

గీ॥ మీరు నాకిచ్చినట్టి యామేటిరత్న, ముద్రిక నొసంగితిని నేను భూమిసుతకుఁ
దిరిగి మీకానవాలుగాఁదెచ్చితినిదె, కైకొనుం డామెతలమానికంబు స్వామి!'. 1040

గీ॥ అనినుడివివాయుపుత్రుండు తనదుదట్టి, చెఱఁగునందునఁ గడుభద్రపఱచియున్న
రామముద్రికతోఁబాటు భూమితనయ, వరశిరోరత్నమును రఘువరునకొసఁగె 1041

ఉ॥ అప్పుడు దానిఁదీసికొని యర్కకులాభరణుండు రాఘవుం
డప్పవమానసూనుఁగని యారయనిట్లను 'నాంజనేయ! యా
కప్పురగంధి నాకొసఁగుకాలము నందరణంబుగాఁ గడున్
మెప్పుగనిచ్చె మైథిలుఁడు మేల్మిదలిర్పఁగ దీనిసీతకున్. 1042

కం॥ ఆనా డీముద్దులతల, మానికముంజూచియుంటి మగుడన్నాకున్
దీనినిఁగనుఁగొనుభాగ్యం, బీనాటికిలభ్యమయ్యె నిదిసుదినంబో'. 1043

కం॥ అని సీతశిరోభూషణ, మునుగూరిచి యుగ్గడించి పొరిపొరి వగపై
కొనుటయుఁ గొందలపడుచున్, మనుజోత్తముఁ డిట్టులనియె మారుతితోడన్. 1044

ఉ॥ 'ఇంతినిఁబాసి నేనకట! యిప్పటికిన్ బహుకాలమయ్యె నొ
క్కింతయులేదువిమ్మళ మికెట్లుభరింతును? సీత నెప్పుడేఁ
గాంతునొ! యీవియోగమను కంధిని నెన్నఁడు దాటనేస్తునో!
సుంతయు విస్ఫురింప దెటఁజొత్తును? బావని! యేమిసేయుదున్?'. 1045

కం॥ అనితలపోతలనుం జొ, చ్చినవాడై రాముఁడార్తిఁ జెందుచునుండన్
ఘనుఁడు సుమిత్రాతనయుఁడు, వనచరపతి యూరడిల్లఁ బలికిరి ప్రీతిన్. 1046

కం॥ అటుపిమ్మట శ్రీరాముఁడు, కుటిలాలకయైన సీతకుశలమువిన మి
క్కుటమైన వాంఛకలుగఁగ, నిటులన్ హనుమంతుతోడ నెలమిం బలికెన్. 1047

చం॥ 'ఎటువలెఁజొచ్చితీవు రిపులెవ్వరుఁగానకయుండ లంకలో?
వెటువలెఁజూడఁగల్గితివొ యింతిని సీతను? నేర్పుమీర నీ
వెటువలె మాటలాడితివొ! యెంతయుఁజోద్యము కల్గెనాకు మ
ర్కటకులవీర! చెప్పు' మని రాముఁడు మారుతితోడ వెండియున్. 1048

చం॥ 'నిరతము దానవాంగన లనేకవిధంబుల(బెట్టు హింసలె
క్కరణి భరించుచుండెనొకొ! క్ష్మాసుత తామదినెంత నొచ్చెనో!
యఢుగనన్ను( గూర్చిమతి యక్కట! యేమనిచెప్పెనో! నవి
స్తరముగనాకు(దెల్పుమిక( దచ్చరితం' బని పల్క( బల్కినన్ 1049

కం॥ విని మారుతనందను( డతి, వినయవిధేయతలుదోప విభునకుబహువం
దనశతముల నర్పించుచు, 'వినుడిదె సర్వంబు విన్నవింతు' నటంచున్ 1050

సీ॥ పృథ్వీతనూజను వెదకుచు(జనిచని యాస్వయంప్రభగుహయందు( దాము
చొచ్చుటయును మఱియచ్చోటనుండి సంపాతిదర్శనమును వారిరాశి
లంఘనం బటమీద లంకాప్రవేశము సీతనుజూచి భాషించుటయును
దదుపరి దనుజుల( దానుబెక్కుర(బట్టి వధియించుటయును రావణసుతుండు

గీ॥ కడ(గి బ్రహ్మాస్త్రమున(దన్ను( గట్టిపైచి, తనదుజనకునిసభకును గొనుచు(బోవు
టయును దోకను దహియించుటయును దాను, బిదపలంకను గాలిచివేయుటయును 1051

గీ॥ ఆదిగా(గల తనచర్యలన్ని రామ, చంద్రునకు(జెప్పి సదమలచరితు(డైన
యాంజనేయు(డు వెండియు నతివినయన, మేతుడై యిట్టులనిపల్కె సీత(గూర్చి. 1052

సీ॥ 'తరణివంశోత్తమ! దానవాంగన లట్లు తనచుట్టునుంజేరి దారుణముగ(
దర్జించియును మఱిభర్జించియును గడుబాధించుచుండ( బావనచరిత్ర
వైదేహి మిక్కిలి వగ(జెందుచున్ నిరాహారిణియు( గృశశరీరిణియును
తతమలీమసచేలధారిణియును నయి యన్యంబులగుచింత లన్నిమాని

గీ॥ 'హారఘూత్తమ! హారామ! యరివిరామ!, హాకృపాధామ! మాంపాహి!' యనుచు మాటి
మాటికిన్ నీదునామసంస్మరణమంత్ర, పరనమే సల్పుచుండును బగలురేలు 1053

కం॥ వేయేల? రామచంద్రా!, యాయవనిజవంత యింతయసనలవియె? ము
న్నే యుగముల నేసతులకు, నాయగచాట్లుండినోప వదియట్లుండెన్. 1054

కం॥ రెన్నెలలకులోపల మఱి, తన్నొలకయున్న వినుడు! దశకంధరు( డా
యన్నులమిన్నను( బొరి(గొని, బన్నుగ( దన్మాంసమెల్ల( బరమప్రీతిన్ 1055

కం॥ భక్షింపుడుమీరని యా, రక్షఃకామినులతోడ రావణు(డనియెన్
శిక్షితదానవ! కావున, వీక్షణమే సతిని(గావ నేగ(గవలయున్ 1056

కం॥ ఈరెండునెలలగడువది, తీరిన జానకిని(జంపి తిందురు దైత్యుల్
శ్రీరామ! లెండు తడయక, యారావణుసంహరింప యత్నింపు డిక(న్'. 1057

కం॥ అని పలికి మఱియు నాతఁడు, దినకరకులుఁ జూచిపలికె దేవా! మీతో
దనమాటలుగా నిట్లని, జనకజవాక్రుప్వమనియె శ్రద్ధన్‌వినుఁడీ 1058

సీ॥ తనకుఁగల్గిన కష్టదశయెల్ల మీతోడవిశదంబుగా విన్నవింపుమనియెఁ
దనతప్పు లేమియుండినఁగాని యన్నియుమన్నించి కరుణతోమనుపు మనియె,
నన్నుముంచినఁ దేల్చినను మీరెదిక్కని సీతమీతోడవచింపు మనియెఁ
దానింక రెన్నెలల్‌దాటిన నటమీద జీవింపనని మీకుజెప్పుమనియెఁ
గీ॥ దనకు నేతయుఁ ద్రాతయు దైవమైనఁ, దలఁప మీరేయటంచుఁ దాఁ దలఁతుననియె
దశవదనుఁగూల్చి తసచెఱఁ దలుగుఁడనుచు, దేవ! వైదేహి మీతోడఁ దెలుపుమనియె '

కం॥ అనియిట్లు వాయుపుత్రుఁడు, జనకజ వాక్రుప్వమన్న సంగతులెల్లన్
జనపతికిఁ జెప్పి మఱి యా, ఘనవిక్రముఁ దదనుజన్ముఁ గనుఁగొని పలికెన్ 1060

గీ॥ 'వినుఁడు లక్ష్మణదేవ! నావిన్నపంబు, మీవదిన జానకీదేవి మిక్కిలిగను
నడిగియున్నది మీసేమమదియుఁగాక సీతమీతోడ మఱియిట్లు చెప్పుమనియె 1061

కం॥ నాడట్లు తన్నుదుర్విధి, యాడింపఁగ నిన్ను నొవ్వనాడినఫలమున్
వేడందుచుంటిననియును, వేడెదమన్నింపుమనియు వెండియు నుడివెన్ 1062

సీ॥ బాణబాణాసనపాణివై నృపునకు బాసటగావచ్చి భండనమున
రావణు సపరివారంబుగమర్దించి తనచెఱ విడిపింపుమని మహిజ
నీకుఁ జెప్పుమటంచు నెమ్మినాతోఁజెప్పెఁ గాన తదీయరక్షణము సేయ
యత్నింపుమింక నీయన్నయుఁనీ' వని హనుమంతుఁ డాసుమిత్రాత్మజునకుఁ
గీ॥ జెప్పి పిమ్మట వానరశ్రేష్ఠుఁడైన, ఘనుని సుగ్రీవుఁజూచి యిట్లనివచించె
మిహిరనందన! జానకి మిమ్ముఁజాల, నడిగి మీతోడఁదగనిట్లు నుడుపుమనియె. 1063

ం॥ 'తనకపిబలములతో రామునకున్ బాసటగవచ్చి పోరదశాస్యుం
దునుమాడి నన్నుఁగావుండని మీకున్ మనవిసేయుమని సతినుడివెన్' 1064

కం॥ అని రవిసూనుతోఁ బలికి యాహనుమంతుఁడు వెండిరామునిం
గనుఁగొని యిట్లుతాఁదెలిపె గౌరవమొప్పఁగ 'రామచంద్ర! యిం
కను దడయంగనేల? దశకంఠుని గ్రక్కున సంగరంబునన్
దనుజయుతంబుగాఁ జదిపి ధారుణినందనఁ దెందు లెండొగిన్' 1065

కం॥ అనవుడుఁ దద్వాక్యంబులు, వినివల్లెయటంచు రామవిభుఁ డిట్లనియెన్
'నీనుఁబొగడవశమె? మారుతి!, ఘనుఁడవు నీవెల్లకపులకంటె నిజముగన్ 1066

గీ॥ ప్రాకటంబుగ జానకివార్తఁదెలిపి, నాదుజీవంబులను నిల్పినాఁడ వీవు
నేను వేజొమ్ములకునైన నీదుఋణముఁ, దీర్పఁజాల ముమ్మాటికి ధీరవర్య!. 1067

కం॥ తమ్ములు మువ్వురనుచు నే, నెమ్మది భావించియుంటి నీతోఁగూడం
దమ్ములు నలువురయిరివా, తమ్ములతోఁబాటు నిన్నుఁ దలఁతును హనుమా'!. 1068

గీ॥ అనుచు వాత్సల్యమేపార ననిలసుతుని, నక్కునంజేర్చికొని తాను బెక్కుగతులఁ
బొగడుచున్ మహాశీర్వచఃపూర్వకముగ, నిట్టులనిపల్కె నా రాఘవేశ్వరుండు. 1069

గీ॥ 'నాకథలు భూమిపైన నెందాకనిలుచు, నంతదనుక సత్కీర్తిసౌఖ్యములఁబొంది
నీవు చిరకాలజీవివై నెగడుచుండు', వనుచుదీవించె శ్రీరాముఁడనిలసుతుని. 1070

## అరణ్యకాండము సమాప్తము

# శ్రీమన్నిర్వచన
# వేంకట రామాయణము
## ఆయోధన కాండము

### రామలక్ష్మణులు కపిసేనలతో రావణునిపైకి దండెత్తుట

కం॥ ఇనవంశ్యుఁడు తదనంతర, మినసందనుదెసను జూచి యిట్లని పలికెన్
'వనచరవల్లభ! నీవిఁక, ననికిని నాయత్తపఱుపు మగచరబలమున్. 1

గీ॥ ఎలమి నాయాస్థలంబులం దెవ్వరెవరు, గలరొ మీవారు వారికిఁ గబురులంపి
జాగుసేయక రప్పింపు సత్వరముగ, సిద్ధపడుడెల్ల రెల్లియే యుద్ధయాత్ర' 2

కం॥ నావుడు భానుతనూజుఁడు, వేవేగమె కబురులంప విరివిగ నేత
ద్వ్యావలయం బపుడీనిన, కైవడి రాఁదొడఁగె నమిత కపిసైన్యంబుల్ 3

గీ॥ ఇట్లు వచ్చిన కపిసైన్య మెంతకలదొ, యెన్నుఁడనుచును సుగ్రీవుఁ డెలమిఁ బలుక
గణితవిద్వాంసులప్పుడు గణనచేసి, తలఁప డెబ్బదియునురెండు వెలువలసిరి 4

ఉ॥ డెబ్బదిరెండువెల్వలు కడింది బలాఢ్యులు వానరోత్తముల్
గొబ్బునవచ్చి యప్పగిదిఁ గూడుటయుంగని రాఘవుండు తా
నబ్బురమంది చిత్తమున హర్షముహోపఁగ నప్పుడే జయం 5
బబ్బినయట్టులెంచుచుఁ బ్రియంబున భానుజుఁజూచి యిట్లనున్

సీ॥ 'ఇనతనూభవ! విను మీసేనయందలి కపులలో నొకఁడైనఁగాని చూడ
మచ్చునకేనియు మఱి రణభీరులు లేరందఱును మహావీరవరులె
యందఱుశూరులే యందఱుఁ బ్రబలులే యందఱు సర్వసేనాధిపత్య
మువహింపయోగ్యులే బవరములం దంద ఱారితేరినవారె యైనఁగాని
గీ॥ సేన యెంతయుండినను సేనానిలేక, జయముఁబొందుట కరము దుస్తరముగాన
నీదుసేనకుఁ గొందఱ నిపుణమతుల, దండుదొరలుగ నియమింపు త్వరితముగను , 6

## రామలక్ష్మణులు కపిసేనలతో సముద్రమును దర్శించుట

సీ॥ అనఘుఁడు భానుజుం డౌఁగాకయని తనపరివారములఁబెక్కుభాగములుగ
విభజించి వీరాధిపేరులౌ శతబలి పనస సుషేణ గవయ గవాక్ష
నల గంధవాహనందన గంధమాదనప్రభృతులఁ దత్సైన్యభాగములకు
నాయకులనుజేసి యాయతభుజబలు నానీలు సర్వసేనాధిపతిగ

గీ॥ నపుడగావించి రాఘవుఁడాజ్ఞయొసఁగ, విపులరణభేరిమ్రోగించి రిపులుబెదరఁ
గీశకులనాథుఁడైన సుగ్రీవుఁడెలమి, దండువెడలించెఁ గడు మహోద్దండలీల.

గీ॥ రామలక్ష్మణులంత వర్మములఁ దొడిగి, చాపతూణీర ఖడ్గాదిసాధనములఁ
బూని యంజనీనందను భుజములపయిఁ, దగనధిష్ఠించి వెడలి రుత్సాహమెసఁగ

గీ॥ మఱియు జాంబవంతుఁడు పరిమాణరహిత, మైనభల్లూకసేన తన్ననుగమింప
రవికులపవిత్రుఁడైనట్టి రామవిభునిఁ, గొలిచి యాజికివెడలెను గుతుకమునను

గీ॥ ఇట్లు ఋక్షవానరసేనలెల్లఁగొలిచి, వెంటరా రామచంద్రుఁడు విజయసూచ
కములయిన పెక్కు శుభశకునములఁగనుచు, నచ్చటచ్చట విడియుచు నరిగియరిగి 1

కం॥ కొలఁదిపయనముల కారవి, కులుఁడగు రాఘవుఁడు మేటికొండలలోనం
దలమానికమగుచుఁ గరం, బలరారు మహేంద్రశైల మల్లనదరిసెన్ 1

గీ॥ ఆవిధంబున నామహేంద్రాద్రిఁజేరి, దానిపై దండువిడియించి దశరథాగ్ర
తనయుఁడు తదీయదక్షిణతటమునందుఁ, గల లవణవార్ధిఁ జూచి యక్కజముపొంది 1

కం॥ ఘనుఁడగు సౌమిత్రినిఁగని, దినకరకులుఁడైన రామదేవుం డనియెం
'గనుఁగొంటివె యోతమ్ముఁడ!, ఘననక్రగ్రాహమీనకలితాంభోధిన్? 1

గీ॥ దీనిపరిమాణమింతని తెలుపవశమె, ధాతకైనను మఱి వావి తాతకైన?
నెందువీక్షించినన్గాని సందులేక, జలమయంబౌచుఁ దోచె నీజలధియౌర! 14

కం॥ ఈవనరాశినినెట్లో, పావనిలంఘించెఁగాక పరికింపఁగ నీ
భూవలయంబున నెట్టిమహావీరులకైన దాటనలవియె దీనిన్' 1

కం॥ అని పెక్కుగతుల నుడువుచుఁ, దనమనమున నాసముద్రతరణోపాయం
బును జింతించుచునచ్చట, నినవంశ్యుఁడు విశ్రమించె నెల్లరుఁ దానున్ 16

## విభీషణుఁడు రావణునితో సీతను రామునకిమ్మని నీతిచెప్పుట

గీ॥ అంత నటలంకలో రావణాసురుండు, తాను మంత్రులతో సభాసీనుఁడగుచు
వారితో నాటి హనుమంతుదారుణంపుఁ, జెయ్వులనుగూర్చి మిగులఁ జర్చించుచుండ 17

గీ॥ అట్టితఱి రావణానుజుఁడగు విభీష, ణుండు కపిసేనతో రాఘవుండు వచ్చి
యామహేంద్రమహీధరమందు విడిసె, నన్నవృత్తాంతమాలించి యాక్షణంబ. 18

గీ॥ శీఘ్రమునఁ గొల్వుకూటంబుఁ జేరవచ్చి, భక్తితోఁ దనయన్నకు వందనంబు
సేసి యొకయాసనమున నాసీనుఁడగుచుఁ, గడువినమ్రుఁడై రావణుఁగాంచి పలికె. 19

గీ॥ 'అన్న! రావణ! యొకవార్త నవధరింపు, మగచరానీకపరివృతుఁడగుచు రాఘ
వుఁడు మహేంద్రాద్రిపై నేడు విడిసెనట్టె, వచ్చునట! యెల్లి మనపైకి బవరమునకు 20

సీ॥ కోతియొక్కటి నాడు సీతనుగనవచ్చి యెంతలుచేసెనో యెఱుఁగుదీవు
నేడట్టికోతు లనేకలక్షలు కోటు లారామునకు సహాయార్థమగుచు
మనపైకి ననిసేయ మఱి వచ్చుచున్నారు వారలంతులఁ బోవువారు కారు
బాహుబలాఢ్యులు భండనంబున మనవారలఁ ద్రుంపకపోరు కాన
గీ॥ వారితోఁ గంటునీకేల? వలదువలదు, నాదువిన్నప మాలించి నళిననేత్ర
యైనజానకి నిప్పటికైన నిచ్చి, సంధిసేయుట యుక్తము సౌఖ్యదంబు. 21

ఆ॥ రాముసేనకంటె రావణ! నీసేన, లెన్నిమడుఁగు లెక్కుడున్నఁ గాని
సంగరంబునందు జయమొందలే వెల?, యనిన చిత్తగించి వినుము వినుతు 22

కం॥ వారిది దైవబలము మన, వారిది పశుబలము కాన వారినిగెలువన్
భారము నాపనవినివిని, శ్రీరామునితోడ సంధిసేయుము శుభమౌ 23

గీ॥ పరసతిని బల్మిమైఁదెచ్చి పంక్తి వదనుఁ, డన్వయమునాశనముచేసె ననుచులోకు
లనవరతమును దూషింతు రక్కటకట!, దొడ్డవాడవు తగ దట్టిచెడ్డపేరు 24

కం॥ సోదరుఁడనగుటచేతను, నీదగుక్షేమంబుఁగోరి నేఁజెప్పెద నీ
తాదేవినిచ్చి రాముని, తోఁదగఁగావింపుసంధి దోషాటపతీ!. 25

కం॥ దూరంబాలోచింపుము, వైరమువగదెచ్చు నెంతవారలకైనన్
సారమతివి కట్టా! ని, ష్కారణవైరంబుదగునె కాకుత్థ్సునితోన్?. 26

కం॥ ఆరామవిభుఁడు సాక్షా, న్నారాయణుఁ డసురకులము నాశమొనర్పన్
ధారణిలో జన్మించెను, దారయశుండైన దశరథక్షితిపతికిన్ 27

కం॥ ఆతని భార్యయయిన యా, సీత జగజ్జననియైన శ్రీసతి చూవే!
పాతకముతొడరు ననకా, నాతింజెఱఁబట్టితేర న్యాయ్యమెనీకున్?. 28

కం॥ ఇప్పటికైనను సీతను, దప్పకరామునకొసంగి తగమను మయ్యా!
తప్పిదము లేదు మఱి నీ, గొప్పతనమ్మేమిచెడదు కూడు శుభంబుల్. 29

కం॥ ఆలమున సురలఁబాఱం, దోలితినని తలఁపఁబోకు దుర్వారబల
శ్రీలలితుని రామక్ష్మా, పాలకునిన్ గెలువలేవు పంక్తిగ్రీవా!' 30

గీ॥ అని యనేకవిధంబుల నగ్రజునకు, నీతిగఱపుచునున్నట్టి నిర్మలాత్ముఁ
డగు విభీషణుపైఁ గరమాగ్రహించి, యెల్లిదంబుగ నిట్లను నింద్రజిత్తు 31

## ఇంద్రజిత్తు విభీషణు నధిక్షేపించుట

కం॥ 'తగుఁ దగదనక విభీషణ!, పగవానినిఁ బెద్దసేసి బంటువలెఁ గడుం
బొగడంజొచ్చితి విదియొక, మగతనమని తలఁచితివు మఱి సభలోనన్ 32

కం॥ పినతండ్రివి నీవని నే, మనమున నోర్చితినిగాని మఱియొకఁడైనన్
మననిత్తునె యిటు ప్రేలిన?, విను నాలుకఁగోసియుంచు వేచిల్కలుగాన్. 33

కం॥ ఛీ! మాయుము నోరిఁక మ, మ్మేమో వెఱపింపఁజూతు వీవెఱుఁగవె మ
త్సామర్థ్యము శక్తియు? మా, కీమూడుజగంబులందు నెదురొకఁడున్నే?. 34

సీ॥ పంకయుతముగాఁగ వసనిధులేడింటి నిమిషమాత్రమున నింకింతునొండెఁ
గులపర్వతములతోఁగూడ నీధరయంతయును బెకలించివేయుదునునొండె
గ్రహములనన్నింటిఁ గదలనీయకపట్టి ధృతిసొంపుమీర బంధింతునొండె
మొనసి బ్రహ్మాండముల్ ముద్దగాఁజేసి బల్కందుకకేళి సల్పఁగలనొండె

గీ॥ నాకు నొకలెక్కకారు వానరులు నరులు, పారిపోవక నాతోల భండనమున
నిలిచిరేనియుఁ ద్రుటిలోన నీవుచూడ, నిక్కముగ వారినెల్లరఁ జక్కడంతు. 35

ఆ॥ వినుము రణముసేయ వెఱచితివేని నా, నీచనరులతోడ నీవొకఁడవె
సంధిచేసికొనఁగఁ జనుమింక మాకిట్టి, రండమాట చెప్పకుండుమయ్య! 36

గీ॥ క్షాత్రమున శాత్రవులతోడ సంగరంబు, సలిపి చంపుదుమొండెను జత్తుమొండెఁ
గాక మేనున నసువులుకలిగియుండ, సంధికిన్గింధి కొల్లము సత్యముగను' 37

కం॥ అని యాక్షేపించి దశా, వననందనుఁడైన మేఘనాదుఁడు పలుకన్
విని యావిభీషణుఁడు నె, మ్మనమునఁ గోపించి తాను మఱియిట్లనియెన్. 38

## విభీషణుఁ డింద్రజిత్తును దూఱనాడుట

కం॥ 'ఓరోరి! మేఘనాదా!, యాఠయ నీతోడ మాటలాడితినే? ని
ష్కారణముగ నాపై నీ, వీరీతిన్ మిడిసిపడెద వేలర? కుమతీ! 39

గీ॥ దశముఖునకేను వినుము సోదరుఁడనగుటఁ, జేసి యతనికి హితమును జెప్పచుంటిఁ
గాని నీవును నీబోటికలుషచిత్తు, లెల్లరేమైన మీసుద్ది యేలనాకు?. 40

గీ॥ నీవుఖలుఁడవు పాపివి రావణునకుఁ, దలఁపఁ జెడఁబుట్టినాడవు తథ్యముగను
వధ్యుఁడవె యౌదు విదెనీకువచ్చెగడువు, సిద్ధముగనుండుమీ చావబుద్ధిహీన! 41
గీ॥ నీవు చెఱఁబట్టితేర నాదేవవిభుఁడు, కాడు భుజవిక్రమాటోపకలితుఁడైన
రాముఁడౌట యెఱుంగవె? రణమునందు, నిన్నుఁ ద్రుంపకమానఁడు నీచహృదయ!. 42
గీ॥ ఇంద్రజాలముల్ మాయ లీవెన్నొనేర్చి, తనుచు గర్వింపవలవదు వినుము నీదు
మాయలన్నియు నడిగించి మనుజవిభుఁడు, ఘోరశరముల మఱినిన్నుఁ గూల్పఁగలఁడు
గీ॥ చేకొనవు నీతులెవ్వడు చేటుకార్య, ములకె సిద్ధపడెదుకట్టి! కులమదెల్లఁ
జెడియె నీతోడ నీవుశత్రుఁడవుగాని, రావణునకును సుతుఁడవుగావు చెనటి!· 44
గీ॥ నీవు మడిసివమానె నీనిఖిలదాన, వులు సుఖంబుగ జీవింపఁగలరు కాన
చెనటివై వీరినెల్లరఁ జెఱుపఁబోకు, మిదియె నాదైన విన్నప మింద్రజిత్త'! 45
కం॥ అనిన విని మేఘనాదుఁడు, ఘనతరకోపంబుగదురఁ గటకటఁబడుచుం
బినతండ్రినిఁ దున్మటకై, వినిశితఖడ్గంబుదూసి వేఁబఱతేరన్ 46
గీ॥ అప్పు డారావణుఁడు తనయగ్రతనయుఁ, డైన యీమేఘనాదుని ననునయముగఁ
దాను వారించి పిమ్మట ధార్మికుఁడగు, సోదరునిదెసఁ జూఱచుఱఁ జూచిపలికె 47
ఉ॥ 'ఓరి! విభీషణ! నిన్నుం, గూరిమితమ్ముండవనియు గుణనిధివనియున్
గారవముఁ జూపుకొలఁదిఁ, గాఱులఱచెదౌర! నీవు కడుగర్వమునన్ 48
గీ॥ వినుము పిలువని పేరంటమునకువచ్చి, నట్లు రప్పింపఁబడకయె యెట్లొసభకు
నరుగుదెంచితి విటఁ జచ్చినట్టులుండ, వలయునేకాని మితిమీరి వదరనేల?. 49
ఉ॥ అనుజుఁడవని యిప్పటికిన్, మనమునవోర్చితినిఁగాని మెఱిమఱీ యిట్లే
విను పగతురనగ్గించిన, నినుఁ గడికండలుగ నఱికి నేను వధింతున్?. 50

## రావణుఁడు విభీషణునిఁ బాదతాడితునిఁ జేయుట

ఉ॥ అని కఠినంబుగా నుడువు నగ్రజుఁగన్గొని సాదరంబుగా
వినయవిభూషణుండగు విభీషణుఁ డప్పుడు వెండియిట్లనున్
'వినుమసురేంద్ర! నన్నిటుల నీవు కడుంగడు దూరితంచు నె
మ్మనమునవాకుఁ జింతయణుమాత్రమునైనను లేదు చూచినన్ 51
గీ॥ నీవు మద్భ్రాతవగుటచే నీహితంబుఁ, గోరిచెప్పెద వినుఁ జెడఁగోరనెప్పు
డట్టినాపైన నీవిట్టులక్రమముగ, నాగ్రహింపఁగఁదగునయ్య? యసురనాథ! 52

గీ॥ అన్న! మ్రొక్కెద నీకు నావిన్నపంబుఁ, గైకొనుము కయికొనఁబోకుఖలులబోధ
జనకజనొసంగి శ్రీరాముశరణువేడు, సదయుఁడాతఁడు రక్షింపఁజాలునిన్ను'. 53

గీ॥ అనుచుఁ బెక్కుతెఱంగుల నవ్విభీష, ణుండు నీతులు పేర్కొనుచుండ నపుడు
విని సహింపక కడుఁగోపవివశుఁడగుచు, నతని రావణుఁ డంఘ్రితాడితునిఁ జేసి 54

కం॥ 'ఓరీ! భ్రాతృద్రోహీ!, శ్రీరామునికడకెపోయి జీవింపుమిఁకం
గ్రూరా! యిందుండిననే, నోరువ నొకనిముసమైన నుక్కడగింతున్'. 55

గీ॥ అనియె నట్లంఘ్రితాడితుఁడగు విభీష, ణుఁడు ధరాపతితుండయి కడిఁదివగల
నొందుచుం దఱచైన నిట్టూర్పులెసఁగ, మెల్లమెల్లగలేచి యామేటిసుగుణి. 56

గీ॥ తనతనువు ధూళిధూసరితమయియుండ, బాష్పపూరితనయనుఁడై పాపమతఁడు
డెందమునఁ గోపతాపముల్ సందడింప, నింద్రవైరినిఁ గన్గొని యిట్టులనియె. 57

## విభీషణుఁడు రావణుని నిందించుట

గీ॥ 'దశవదన! నేను నీదుహితంబుఁగోరి, నీతిచెప్పినఁ గరమవినీతితోడ
సోదరుండనుప్రేమ యించుకయులేక, కాలఁదన్నెదవా నన్నుఁ? గఠినహృదయ!. 58

ఆ॥ నేటినుండినాకు నీవుభ్రాతవుగావు, నేనునీకనుజుఁడఁగాను వినుము
నీదుపొత్తు తలఁప మీదుమిక్కిలి మహా, పాపహేతువగును పంక్తికంఠ!. 59

ఆ॥ వేయిమాటలేల? వినుము కులద్రోహి!, గడియకాలమైనఁగాని యింక
నీదు లంకలోన నేనుండఁగానొల్ల, నిపుడ రాముకడకు నేగువాఁడ 60

గీ॥ పంక్తికంధర! నా హితభాషణంబు, లరయఁ జెడుకాల మాసన్నమగుటఁ జేసి
నీకుఁ జేదయినవి యిఁక నీవతెలిసి, కొందు వచిరకాలమునఁ బేర్కొనఁగనేల? 61

కం॥ ఓయీ! రావణ! నీవ, న్యాయంబుగఁ దన్నుటరయ నత్యంతశుభం
బాయెను నాకిత్తఱి నిదె, పోయెదనిఁక నేన రామభూవిభుకడకున్' 62

కం॥ అని రావణునిందించుచు, ఘనుఁడు విభీషణుఁడు శోకకలితుండగుచుం
జనియెఁ దనజననిసద్గుణ, ఖనియగుకైకేశికడకుఁ గడుశీఘ్రముగన్ 63

గీ॥ అంతఁ గైకేశి తనసుతునంకపీఠ, మందునిడుకొని మూర్ధాఘ్రి యాదరమున
నామె తద్దుఃఖకారణమడుగుటయును, జననితో నిట్టు లావిభీషణుఁడుచెప్పె. 64

కం॥ 'ఓతల్లి! రామవిభునకు, సీతనుదగనిచ్చి సంధిసేయుమనుచు నే
నీతులుచెప్ప దశాస్యుఁడు, పాతకియై నన్నుఁ దన్నెఁ బదుగురిలోనన్. 65

గీ॥ అన్నసభలోన నమ్మెయి నన్నుఁబరిభ, వించి లంకలోనుండి పొమ్మంచుఁబలికెఁ
గాన శ్రీరాముచెంతకు నేను బోవు, చున్నవాఁడను నాకాజ్ఞయొసఁగు మమ్మ!'. 66

కం॥ అనవుఁడుఁ గైకేశి మనం, బునఁగడుహర్షించిపలికెఁ బుత్రునితోడన్
'వినుమయ్య! పుత్ర! యెంతటి, ఘనులకయిన విధికృతంబుఁ గడవఁగవశమే? 67

గీ॥ అనఘ! రావణకుంభకర్ణాదులైన, దుష్టరాక్షసులందఱు, దునుమఁబడుమ
రీవు చిరకాల మీలంక కేలికవయి, యేలఁగలవింక నీచింతలెల్లఁదీరు 68

కం॥ ఈ విషయము పూర్వమున, ద్భావుండగుమీదుతండ్రి పల్కరులనఁగా
నేవింటిని దద్వాక్యం, బావంతయుఁదప్పఁబోవ దట్టులెజరుగున్. 69

## విభీషణుఁడు కైకేశియనుజ్ఞఁబొంది రామునిచెంతకేగుట

కం॥ కావున నీవిఁక రాము, క్ష్మావరుకడకేగి యతనిమన్ననఁ గనుచున్
జీవింపుము శుభమగు' నని, దీవించుచు నాజ్ఞయొసఁగెఁ దివిరిసుతునకున్. 70

కం॥ ఆప్పుడు భార్యాసుతులను, రప్పించి విభీషణుండు రయమున వారిం
'దప్పకరక్షింపు' మనుచు, నొప్పుగఁ దాఁజెప్పి తల్లికొప్పించి తగన్ 71

కం॥ తనజననికిఁ బలుమారులు, ఘనభక్తిన్ వందనములు గావించి మహా
ఘనుఁడు విభీషణుఁడంతట, ననుచరపంచకముతోడ నతిముదిఁవెడలెన్ 72

గీ॥ ఇట్లు లంకాపురముఁబాసి యెలమి నవ్వి, భీషణుఁడు వెగ శ్రీరామవిభునికడకు
వచ్చుచుండ విలోకించివానరపతి, మనుజపతితోడఁ దానిట్టులని వచించె. 73

గీ॥ 'ఇనకులోత్తమ! యెవ్వరో దనుజులిటకు, వచ్చుచున్నారు వారురావణున కాప్తు
లగుమరెల్లవిధంబుల నబ్బులగుటఁ, గనికరముఁజూప పలవదా ఖలులమీద. 74

గీ॥ దప్పులకురాకమున్న యాదానవులను, గూల్చుటయెలెస్స యెల్లభంగులను గాన
మాకనుజ్ఞయొసంగుము మఱి నిమేష, కాలమున వారిఁజంపిరాఁగలము దేవ!' 75

కం॥ నావుడు రాఘవుఁడాను, గ్రీవునితో నిట్టులనియెఁ 'గీశవరేణ్యా!
నీ వాత్రపడెదవేటికి?, నావచ్చెడువారు మనకునాప్తులె సుమ్మీ! 76

గీ॥ వారు మనకు విరోధులుకారు వినుము, సైనికులులేరు సంగరసాధనంబు
లంతకునులేవు వారెట్లు లనికివత్తు?, రిదియపోహము తలపోయ నినతనూజ! 77

కం॥ కావున మనతో మైత్రిని, గావించునిమిత్తమిటకు ఘనులెవ్వరో సు
గ్రీవా! వచ్చుచునుండిరి, భావింపఁగ నేనువారిఁ బరిరక్షింతున్'. 78

గీ॥ అనుచు రాముడు పలుకుచున్నంత నావి, భీషణుఁడు డాయఁగావచ్చి విభునిపాద
పంకరుహముల కతిభక్తి వందనములు, చేసి యిట్లని సంస్తుతిసేయఁ దొడఁగె 79

## విభీషణుఁడు శ్రీరాముని స్తోత్రముచేయుట

దండకము॥ 'హేరామ! రామా! త్రిలోకాభిరామా! సురద్విడ్విరామా! ధరాభృల్లలామా!
గుణస్తోమ! సంగ్రామభీమా! దినేశాన్వయాంభోధిసోమా! ఘనశ్యామ! కారుణ్యధామా!
పవిత్రైకనామా! పరంధామ! రామా! భవల్లీల లగ్గింప శక్యంబె? సర్వేశ!
సర్వామరస్తుత్యపాదారవిందుండవై యెప్పుడున్ సర్వకాలంబులందున్ సదాసాక్షివై
వెల్గుచున్నట్టి సాక్షాత్పరబ్రహ్మమీవే! వికుంఠాధినాథుండవీవేకదా దేవ! యీరేడు
లోకంబులుంగూడ నీలోపలంబుట్టు నీలోపలన్‌గిట్టు నీవే జగత్సృష్టికిన్ హేతు
భూతుండవైయుండు వెల్లప్పు డాద్యుండ వాద్యంతశూన్యుండ వాత్మస్వరూపుండ
వానందరూపుండ వధ్యాత్మయోగక్రియాదక్షులైయున్న యోగీశ్వరుల్ జన్మరాహిత్యముం
గోరి నిష్కాములై నిన్ను నశ్రాంతమున్ భక్తి ధ్యానించిసేవించి కైవల్యలక్ష్మీ
ప్రసాదంబునుం బొందఁగాఁగాంత్రు! వేదాంతవేద్యా! చిదానందరూపా! గుణాతీత!
నిన్నెన్నలే రెవ్వరన్నన్న! సర్వక్రియాయంత్రవాహుండవై నీవు ద్వంద్వంబులం
జిక్కుకున్నాడ వయ్యారె! నీదౌప్రభావం బగణ్యం బనిర్వాచ్యమైయుండు నీవే
జగత్త్రాతవున్! నేతవున్! జ్ఞాతవున్! శ్రోతవున్! కర్తవున్! హర్తవున్! భర్తవున్!
వక్తవున్! భోక్తవున్! ద్రష్టవున్! స్రష్టవుంగావె? జీవుండు దేవుండనన్ నీవె! సర్వంబునున్
నీవె! వేయేటికిన్? నీవుగా కన్యమెద్దేనియున్‌లేమి తెల్లంబ! యిట్లున్నచో నీవు లీలా
మనుష్యావతారుండవై యి ట్లనేకంబులౌ పోకలంబోవ నీకేమిలాభంబొ! నీదౌ మహో
ద్దేశమేమో! విచారింపఁగా నీక వేద్యంబయౌఁగాని బ్రహ్మాదులున్ సైతమున్ నీదు
మర్మంబు భేదింపఁగాలేరు! నిన్నెన్న నేనెంతవాడం గడున్ దీనుఁడన్ నం గటాక్షింపవే!
త్రుంపవే! సర్వ దుష్టాసురానీకమున్, నింపవే లోకకల్యాణమున్ జానకీనాథ!
హేభక్తమందార! హేమన్మథాకార! హేపుణ్యసంచార! హేమేరుధీరా! జగద్వీర!
కోట్యర్కతేజా! రఘూత్తంస! మాంపాహి! దేవాధిదేవా! నమస్తేనమః 80

కం॥ శరణని వచ్చితి నీపద, సరసిజములఁగొల్వ రామచంద్రా! నన్నుం
బరిరక్షింపుము మ్రొక్కెదఁ, గరుణాతిశయంబుమీర గౌరవమొప్పన్. 81

కం॥ అని యిట్లు తన్ను మిక్కిలి, వినుతించుచునున్న యవ్విభీషణునిం దాఁ
గని హర్షించుచు రాముఁడు, హనుమంతునితోడ నిట్టులని ప్రశ్నించెన్ 82

సీ॥ 'వాతూలనందన! యీతఁడుచూడ లంకాపురస్థుఁడుగాఁగ నాకుఁదోచె
మఱి తాను దనుజవంశప్రసూతుండయ్యుఁ బరమసాధువురీతిఁ బరగుచుండె
బహువిపద్దశలలోపలఁ జిక్కియున్నాడు నాప్రాపునకువచ్చినా డితండు
పగతుఁడైనట్టి యాపంక్తికంఠుని యాప్తవర్గంబులోనున్నవాడు కాని

గీ॥ సర్వవిధముల నితని రక్షణముసేయు భారమది నాదుతలపైనఁబడియెఁ గాన
యీపులంకకుఁ జనునప్పు డెఱుఁగుదేని, నితనివర్తనమెట్టిదో యెఱుఁగఁజెపుమ'. 83

కం॥ అని రాముఁడడుగ మారుతి,వినయంబున నిట్లు విన్నవించె 'మహాత్మా!
విను మేనీతనిచరితము, వినిపింతును నీకుఁ జెపుల విందొనఁగూర్చన్ 84

గీ॥ ఇతఁడు రావణుతమ్ముఁ డాతతగుణాఢ్యుఁ, డాదశాస్యుఁడు నాడు నాకట్లుమరణ
శిక్షవిధియింప నిపుణ్యశీలుఁడె కద, నన్నుఁదప్పించి రక్షించినాడుదేవ! 85

కం॥ కావున నీవిఁక నీప, ద్భావునియెడ సంశయింపఁబనిలే దభయం
బీవచ్చు' ననుచు రామ, క్ష్మావరుతో విన్నవించె సామీరి తగన్. 86

## శ్రీరాముఁడు విభీషణున కభయదాన మిచ్చుట

కం॥ రావణుతమ్ముఁ డపుడు భ, క్త్యావేశముదోప నన్వయంబును బేరుం
దా విన్నవించి రాముని, తో వందనపూర్వకముగఁ దోడ్తోఁ బలికెన్. 87

కం॥ మాంపాహి రామచంద్రా', మాంపాహి మహీతలేంద్ర! మాంపాహి ప్రభూ!
మాంపాహి సుగుణసాంద్రా, మాంపాహి' యటంచు నతఁడు మఱి యిట్లనియెన్ 88

కం॥ 'శ్రీరామచంద్ర! నేనా, క్రూరుండగు రావణాసురునకుం దలఁపం
గూరిమిఁదమ్ముఁడ నగుదుం, బేరువిభీషణుఁడటంచుఁ బిలుతురు నన్నున్ 89

గీ॥ జానకినొసఁగి నీతోడసంధిసేయు, మనుచు నేఁజెప్పఁ బాపాత్ముఁడగు దశాస్యుఁ
డలిగి నన్ను సభాంగణమందుఁ బరిభ, వించి యదయుఁడై పురినుండి వెడలఁగొట్టె 90

కం॥ నేనిఁకఁ దత్సంబంధము, మానుగవర్జించి దేవ! మఱి నీకడకుం
బూని చనుదెంచినాడను, దీనుఁడ నాకభయమిచ్చి తేర్పుము కరుణన్'. 91

కం॥ అని యిట్లావిభీషణుఁ, డనముండగు రాముతోడ నాత్మచరితమె
ల్లను విన్నవించి తత్పద, వనజంబులమీద భక్తిఁవ్రాలుటయుఁ దగన్ 92

ఆ॥ అంత రామభద్రుఁ డత్యాదరంబున, లెమ్మటంచు నతని లేవనెత్తి
యభయదానమిచ్చి యావిభీషణుతోడ, నిట్టులనియెఁ గరుణ యుట్టిపడఁగ, 93
కం॥ 'తొరఁగుము శంకాభయములు, పరిరక్షించితిని నిన్ను భవ్యచరిత్రా!
శరణని వచ్చిన దశకం, ధరునకునున్సైత మభయదాన మొసఁగుదున్. 94
కం॥ ఇదిగో విభీషణ! చెప్పెద, మదీయమగుప్రతినవినుము మఱి దశకంఠుం
గదనమునఁజంపి లంకకు, విదితంబుగఁ బ్రభునిఁజేసి వెలయింతు నినున్' 95
గీ॥ అనుచు శ్రీరామభూవిభుఁ డాక్షణంబ, తనదు తమ్మునిచే సముద్రజలములను
సరగఁదెప్పించి యావిభీషణుని లంక, కపుడ యభిషిక్తుఁగావించె నంచితముగ 96

## (శ్రీరాముఁడు విభీషణాదులతో సముద్రలంఘనోపాయమునుగూర్చి చర్చించుట

చం॥ తదుపరిఁ బంక్తికంధరునితమ్మునిఁ గన్గొని యెల్లరున్ వినన్
సదయుఁడు రాముఁడిట్లనియెఁజాలవిచారముతో 'విభీషణా!
యుదధిని నెట్టుదాటనగునో యని చింతిలుచున్నవాడ నా
కెదియు స్ఫురింపకున్నదిఁక నెట్టులఁజేయుదు? నిప్పు డక్కటా!' 97
కం॥ అనిపలుకురామచంద్రుఁ, గనుఁగొని హనుమంతుఁడనియెఁ 'గాకుత్స్థవరా!
వినుము భవద్దాసుఁడనై, యనయమునేనుండఁ జింతనందెదవేలా? 98
సీ॥ భవదీయకరుణ నాపైనుండఁగా మఱి యీలవణాంభోధియెంత నాకుఁ'.
బదుగురనొండెను బలువురనొండె నేనెక్కించికొనిపోయి యేపుమీర
నావలి తీరమం దగచరసేనలఁ జేరుతునొండెను వారిరాశి
జలములన్నియుఁ బారఁజల్లెదనొండె లేకాయగస్త్యమునీంద్రునట్లు కడఁగి
గీ॥ పానమొనరింతునొండె నాకానతిండు', నాపు డాతనితో నరనాథుఁ డనియె
'ననిలనందన! నీవెంతకైనఁగాని, చాలుదువు నాదుపల్కుల నాలకింపు. 99
గీ॥ ఒక్కఁడవునీవు లెక్కకు మిక్కుటంబు, లైన వానరసేనల ననఘచరిత!
వనధిదాటించు టెంతయుభరము, భరమె కాదు బహుకాలమునుబట్టుఁ గానవినుము. 100
సీ॥ అదియట్టులుండె నీయంబోధి వారిహీనంబుగావింప ధర్మంబుగాదు
మఱియేలయనిన నోమారుతి! యిం దనేకములగు జంతువుల్గలవు గాన
వానికెల్లను గడుహానికరంబగునట్లొట నిదియును ననుచితముగఁ
దోచుచునుండె నాకేచందముననైన నవపాయమగు నుపాయమునఁజేసి

గీ॥ యబ్ధిదాటుట కడులెస్స' యనినవిని వి, భీషణుం డప్పు డత్యంత వినయమొప్ప
రవికులోత్తముఁడైనట్టి రామభద్రు, నెలమిఁగన్గొని మృదురీతి నిట్టులనియె. 101

## శ్రీరాముఁడు కపులచేత సముద్రముపై సేతువు నిర్మింపఁజేయుట

కం॥ భూతలనాథ! మనంబున, నీతెఱఁగునఁ గుందనేల? యీకపిసేనా
వ్రాతములచేత నబ్ధికి, సేతువుఁగట్టింపుమింకఁ జెచ్చెఱ' ననినన్ 102

కం॥ విని యప్పటికదియే తన, మనమునఁ గర్తవ్యమనుచు మనుజోత్తముఁడా
యనఘు విభీషణపలుకుల, ఘనముగ నంగీకరించి కౌతుకమెసఁగన్ 103

కం॥ వనచరసేనల నప్పుడు, జనపతి రావించిపలికె సమ్మదమొదవన్
'వనచరులారా! వినుడీ, వనధికి సేతువును గట్టవలయు రయమునన్ 104

కం॥ పొండిఁక సమస్తదిశలకుఁ, గొండలనెల్ల మఱిమోసికొనితెం' డనినన్
'రండోయి' యనుచు వానరు, లొండొరులనుబిలిచికొనుచు నుత్సాహమునన్ 105

కం॥ నాలుగుదెసలకుఁజని బహు, శైలాదులమోసికొనుచుఁ జనుదెంచి కడున్
లీలం బడవైవఁదొడఁగి, రాలవణాంభోధియందు నద్భుతభంగిన్ 106

గీ॥ ఇవ్విధంబున గిరులెన్నియేనిఁ దెచ్చి, వానరులు వార్ధిలోపలవైచుచుండ
నన్నియును వారిమగ్నంబులగుటచూచి, రావణానుజుఁగన్గొని రాముఁడనియె 107

గీ॥ 'ఓవిభీషణ! చూచితే? యుదధిలోన, మునిఁగిపోవుచున్నవి భూధరంబు
లేమిసేయుదు'? మనవుఁడారాముతోడ, నట్టితఱి నావిభీషణుఁ డిట్టులనియె 108

## శ్రీరాముఁడు సముద్రుని ధ్యానించుట

కం॥ 'ఓరామచంద్ర! తడయక, మీరింక సముద్రు నిష్ఠమెయి ధ్యానంబుం
గోరియొనర్పు డతఁడు మీ, కోరిక దీర్పంగఁగలఁడు కూడుశుభంబుల్' 109

గీ॥ అనవుఁ డుపవాసనియతిమై నధివసించి, యాసముద్రుని నిష్ఠతో నర్కకులుఁడు
ధ్యానమొనరింపసాగె నా యబ్ధియపుడు, రాముఁజేరికిఁగొనక గర్వంబుతోడ. 110

కం॥ మునుపటికంటెను నెక్కుడు, ఘనతరవీచికలతోడ గగనతలంబె
ల్లను నాక్రమించికొని యా, వననిధి యురువేగమునను బ్రవహించుటయున్. 111

గీ॥ ఇటు నిర్లక్ష్యమున వార్ధియేపుమీరి, యంతకంతకుఁ జెలరేగి యధికముగను
దాను బ్రవహించుచుండ నాతరణికులుఁడు, కినిసి తమ్మునిఁజూచి యిట్లనియె నపుడు. 112

కం॥ 'ఓతమ్ముఁడ! చాపంబిటు, తెతెమ్ముఁక నస్మదీయదివ్యవిశిఖసం
ఘాతమ్ములచే నిప్పుడ, యేతజ్జలరాశిఁ గడిమి నింకింతువెసన్ 113

కం॥ వినయముఁజూపుకొలఁది నను, వననిధి గర్వించి లాఘవమ్ముగఁ దలఁచుచున్
వినుమింక సన్నుఁగలఁచెడు, మనమున సైరింప వీని మదమడఁగింతున్' 114

కం॥ అనిపలుకుచు రాముఁడు తన,యనుజుండందిచ్చుచాప మతిశీఘ్రముగం
గొని బ్రహ్మాస్త్రముఁ గరమిా, సునఁ దాసంధించెనపుడు చూపఱుబెగడన్ 115

కం॥ మఱియును లోకములన్నియు, సఱిముఱి క్షోభంబునొందె నవనీధరముల్
తఱచుగ గడగడవడఁకెను, వెఱచిరి బ్రహ్మాదులైనవేలుపుమూకల్ 116

## సముద్రుఁడు శ్రీరామునకుఁ బ్రత్యక్షమై నలునివృత్తాంత మెఱింగించుట

గీ॥ అంత పయిమావహిల్ల నాయబ్ధిరాజు, మానవాకృతితోడ నామనుజపతికిఁ
దాను బొడసూపి వినయతత్పరతదోపఁ, జేతులెత్తి నమస్కృతుల్ చేసిపలికె 117

కం॥ 'శరణుశరణు శ్రీరామా!, శరణు సుగుణధామ! నీలజలదశ్యామా!
శరణు సురారివిరామా!, శరణు పరంధామ! రామ! జయరఘురామా! 118

కం॥ మీపదములంటివేడెదఁ, గోపంబుపసంహరించి గుణభావముతోఁ
గాపాడుడు మీదాసుఁడ, నైపుడు నాతప్పిదంబు సర్వావనిపతీ!' 119

ఆ॥ అని విధేయుఁడనుచు నారామునంఘ్రుల, కెఱగి యానముద్రుఁ డిట్టులనియె
'నాదుగర్వమడఁగె నోదేవ! కర్తవ్య, మెఱుకపఱుతు వినుడు హితముఁగూర్తు 120

సీ॥ జననాథ! యీ కపిసైన్యములోపలఁ గలఁడునలుండను కపివరుండు
తనదగు బాల్యంబునఁ బటికణ్వుఁడన్ మునిచెంతనాడుచు ఘనశిలండ
లువమున్నగాఁగొని లవణాంబునిధిలోనఁ బాఱవైచిన మౌనివరుఁడు విసిగి
బాలుఁడగుట శపింపక 'నలుఁడేమివైచిన వార్ధిఁదేలుఁగా' కని వరంబు

గీ॥ నొసఁగెఁ దద్వరశక్తిచే నుదధియందు, నితఁడువైచిన వస్తువు లెవియైన
నీటిపైఁదేలుఁ గావున నీరధికిని, నలుఁడె సేతువుఁగట్టంగవలయు సుమ్ము'! 121

మ॥ అనివాక్రుచ్చె సముద్రుఁ, డంతముదితుండౌచుం దదీయాజ్ఞచొ
ప్పున శ్రీరాఘవుఁడానలున్ విపులసత్త్వున్ సేతువుంగటు పొం
దెనియోగించి సమస్తవానరతతిన్ శీఘ్రంబ పుత్తెంచె గో
త్రనికాయంబులఁదేర నగ్గడల కత్యంతప్రయత్నంబునన్ 122

## నలుఁడు సముద్రముపై సేతువును నిర్మించుట

గీ॥ అధిపునానతిచొప్పున నరిగికపులు, తరులుగిరులును దండోపతండములుగ
మోసికొనివచ్చియందీయ మోదమెసఁగ, వాని నలుఁడందికొని వార్ధివైవసాగె 123

సీ॥ అయ్యెడ నొక్కఁడా యమరాద్రిఁగొనివచ్చె మాల్యవంతముఁదెచ్చె మఱియొకండు
నొక్కండుహిమవంత ముద్ధతిఁగొనివచ్చె వింధ్యాద్రిఁ దిగఁదెచ్చె వేఱొకండు
నొకఁడు మలయగిరిఁ బెకలించుకొనితెచ్చెఁ దివిరి మందరగిరిఁ దెచ్చెనొకఁడు
నొక్కఁడు నిషధాద్రి నుక్కునఁగొనివచ్చె ధీరుఁడై రజతాద్రిఁ దెచ్చె నొకఁడు
గీ॥ నొకఁడు చెట్టునుదెచ్చె వేఱొకఁడు గుట్టఁ, దెచ్చె నిమ్మెయి వానరుల్ తెచ్చియొసఁగ
వానిఁగొని నలుడబ్ధిలోవైచుచుండ, మునుఁగవయ్యెను నవియెల్ల మునుపటివలె 124

కం॥ అట్టి సమయమున నలుఁడా, చెట్టుల గుట్టలను గొనుచు సేతువు మిగులన్
దిట్టముగను మట్టముగను, గట్టఁదొడ గెఁ దీర్చితీర్చి కచుచేప్పమెయిన్ 125

సీ॥ మఱియు నాప్లవగు లమందసంచారులై కొండలు కొండలు గొనుచురాఁగఁ
గొండలు నడుమ నాకొండలనెల్లను గొబ్బున నెదురందుకొనెడువారు
కొండలానలునకు నందించువారును వార్ధిలోఁగొండలు వైచువారు
కొండలాసేతువుఁ గొలతవెట్టెడువారు కొండలు విశ్రాంతిఁగొనెడువారు
గీ॥ నై మహోత్సాహభరితులై యద్రిచరులు, శక్తివంచనలేకుండ సత్వరముగ
సేతువునుగట్టుచోఁ దరుశిఖరితతులు, తారు గొనివచ్చుచుండి రాతరుణమందు 126

కం॥ వానరులుదెచ్చు కొండల, నానలుఁ డవలీల నొక్కహస్తముచేతం
దానందుకొనుచునుండన్, మానుగనదిచూచి కినిసి మారుతి తనలోన్. 127

సీ॥ 'ప్లవగులందఱికంటె బలవంతుఁడనటంచు వాసికినెక్కినవాడనేను
నాకెనయగువారు లోకత్రయమునందు లేడట్టె యిట్టినన్ లేశమైనఁ
జీరికింగొనక దుశ్చేష్టితుఁడయి నలుఁడౌరౌర! నే శ్రమనంది తెచ్చి
నట్టి పర్వతముల నవలీలగా నొక్కహస్తంబుచేతఁ దానందికొనుచు
గీ॥ నన్నుఁ బరిభవమొందించుచున్నవాఁడు, వీఁడు గర్వించె నాదగువిపులబాహు
బలమెఱుఁగఁడయ్యెఁగాక యీపామరునకు, నిపుడ యెఱిఁగింతు' ననుచుఁ దా నెదఁదలంచి

గీ॥ ఆంజనేయుండు రోషతామ్రాక్షుఁడగుచు, వేగఁజని గొప్పగొప్ప యుర్వీధరములు
దెచ్చి కొమ్మని యానలు హెచ్చరించి, విసరివైచుచునుండఁ దద్విధముఁ జూచి 129

గీ॥ నలుఁడు తానప్పుడత్యంతసులభముగను, గడఁగి తచ్ఛైలములఁ గందుకంబులట్ల
యొక్కకరమునఁ బట్టుచునుండఁగాంచి, యంతకంతకు మండుచు ననిలజుండు. 130

ఆ॥ తాను మఱలఁ బర్వతంబులఁ గొనితేర, సరుగుటయును రాముఁ డతనికోప
కారణంబెఱింగి గ్రక్కున నలునిఁదాఁ, జీరి యిట్టులనియె గారవమున 131

సీ॥ 'వినుమోయి! నలుఁడ! పావని యాగ్రహించిన నెల్లచేటులుకల్గు నింకఁగాన
తద్గౌరవముపాటెఁ దానుదెచ్చెడి శైలతతులను రెండుహస్తములతోడఁ
బుచ్చికో' మ్మనవుఁ డాభూధవుమాటకు నెమ్మది నలుఁడు తాసమ్మతించి
యట్లెకావించె నాయాంజనేయుండప్పు డాగ్రహంబుడిగి శాంతాత్ముఁడయ్యె

గీ॥ నటుపదంపడి శ్రీరాముఁ డనుజుఁగూడి, వనచరేంద్రుఁడు దానవవల్లభుండు
తన్నుఁ గొలిచిరా సేతుసందర్శనంబు, సేయుచున్ మెచ్చి నృపుఁడు విశేషముగను.

గీ॥ ఆనలునిఁ గొనియాడుచు నర్కకులుఁడు, తాను దమ్ముఁడు రవిజుఁడు దనుజవిభుఁడు
తన్మహాసేతునిర్మాణదక్షతకును, గరము హర్షించుచుండె నాతరుణమందు

## ఉడుత శ్రీరామునిపైఁ దనకుఁగల భక్తిని నిరూపించుట

ఆ॥ ఒక్కయుడుత తనకు నుష్ణాంశు కులుపైన, గాఢభక్తియున్న కతనఁజేసి
యాత్మలోఁ దదీయమైనకార్యమునకుఁ, దాను సాయపడఁగఁ దలఁపు కలిగి 134

కం॥ తనశక్తికొలఁదిఁ దానును, మనమున నాసేతువునకుఁ గడఁగి సహాయం
బొనరింతుఁగాక యని యది, వననిధిలో మునిఁగి దరికివచ్చి యిసుకలో 135

సీ॥ అటునిటుపొరలాడి తటుకునఁదనమేఁ కిసుమునంటించుకొం చేగుఁదెంచి
సేతువుపైరాల్చుఁ జెచ్చెఱవార్ధిలో వెండియు మగ్నఁ దావెండిదరికి
వేతెంచి క్రమ్మఱ నిసుకలోఁ బొరలాడివచ్చి యాసేతువుపై విదుల్చు
నిట్టు లాయుడుత తానెంతేనిఁ గృషిసేయుచుండ వీక్షించి కోదండగురుఁడు

ఆ॥ తన యనుజుని వాలియనుజుని రావణా, నుజునిఁజూచి యిట్టు నుడివెఁ బ్రీతి
'ననఘులార! యుడుత యద్భుతచర్యను, జూడ నాకు మిగులఁ జోద్యమయ్యె 136

సీ॥ బహుపర్వతములచే బహుకోట్లవానరుల్ బహుదినంబులనుండి వారినిధికి
మీఁదిసేతువును నిర్మింప సాధ్యముగాకయున్నచో నీచిన్ని యుడుత యిసుకఁ
దాఁగొంతపోసినంతనె యెంత నెఱవేరఁగలదు? వట్టిశ్రమంబకాని సుంత
యేని ఫలములేమి నెఱుఁగదుకాఁబోలుఁ బాపము తాఁ గడుభక్తితోడ

గీ॥ నీయుడుత నాకొఱకునయి యెంతొకష్ట, మొందుచున్ జాలికలిగించు చుండెఁగాన
దానిఁ దోడ్తె' మ్మనుచు భానుసూనునంప, నాతఁ డుడుతనుదెచ్చి భూనేతకొసఁగె. 137

కం॥ ఇచ్చిన రాఘవుఁ డుడుతను, బుచ్చికొనుచుఁ దనదు హస్తమున వీపుపయిన్
మచ్చికతోడన్ దువ్విన, నచ్చోత్రిగతిఁ ద్రిరేఖలమరె నుడుతకున్. 138

కం॥ పుడమినదికారణంబుగ, నుడుతలకెల్లను ద్రిరేఖలొందెను నృపుఁడా
యుడుతనటు తనకరంబునఁ, గడుదువ్వుచు నిట్లుపలికెఁ గపినాథునితోన్. 139

గీ॥ 'ఈయుడుత నాకుఁజేయు సహాయ మల్ప, మైన భక్తితోఁగూడిన దగుటఁజేసి
యిదియె మేరుసమానమై యెసఁగుఁగాన, దీనికిన్ మోక్షములభించు భానుతనయ'! 140

కం॥ అని యాక్షణంబ యుడుతను, దినకరకులుఁడైన రామదేవుఁడు ప్రీతిన్
ఘనముగ సురక్షితంబుయి, తనరెడు నొకసుస్థలమునఁ దావిడియించెన్ 141

కం॥ తదుపరి సంపూర్ణంబుగ, నుదధికి నలుఁడపుడు సేతు వొప్పఁగఁ గట్టెం
ద్రిదశలు భళిరేయనుచును, దదీయనిపుణతకుమెచ్చి తద్దయుఁ బొగడన్ 142

గీ॥ అట్లు నిర్మింపఁగాఁబడినట్టిసేతు, వు శతయోజనముల పొడవును మఱి పది
యోజనంబుల పఱపునై యొప్పుచుండఁ, జూచి తలయూచి మెచ్చి యాసూర్యకులుఁడు 143

కం॥ అప్పుడు తత్సేతువుపైఁ, దప్పక శ్రీరామవిభుఁడు తాను నలునిపే
రొప్పగ లిఖించి పిమ్మట, నిప్పగిదింబలికెఁ బ్లవగులెల్లరు వినఁగన్. 144

గీ॥ 'సర్వజనసేవ్యమానమై చంద్రసూర్యు, లెంతకాలము తాముందురంతకాల
మీ మహాసేతు విలపైన నిల్గెనిలిచి, యంచితంబుగఁ బ్రఖ్యాతినందుగాత!' 145

కం॥ అని సేతువునన్ దీవిం, చినవాడై రాముఁ డిట్లుచెప్పె రవిజుతోన్
'విను సేతుమార్గమున నిఁక, వనఘాత్మక! సాగనంపు మగచరసేవన్.' 146

గీ॥ అవవుఁడర్కాత్మజుండు రామాజ్ఞ దండు, దొరలకెల్లనుజెప్పఁ దోడ్తోడ వారు
పయనమునకును దమతమవాహినులను, ద్వరగ సిద్ధముఁజేసి రాతరుణమందు 147

## సముద్రుఁడు రామలక్ష్మణులకు వివిధభూషణాంబరాదుల నొసంగుట

కం॥ ఆనీరధి రామునకున్, మానవరూపంబుతోడ మఱి ప్రత్యక్షం
బై నయముఁ బ్రియముఁ దోపఁగఁ, దానిట్లనిపలికె దశరథప్రభుసుతుతోన్. 148

ఆ॥ 'వినుడు రామచంద్ర! వినుతసద్గుణసాంద్ర!, రాజమాత్రులకును రణము పెండ్లి
తోసమంబుగాన దొరలైన మీరిట్టు, లనికిఁ దపసులట్ల యరుగరాదు 149

కం॥ క్రూరులగురిపులు మిమ్మతి, గౌరవహీనముగఁ జూడఁగల రట్లగుటం
గోరి ధరింపుడు మీరిఁక, వీరోచితమైన రాజవేషం బధిపా!' 150

సీ॥ అనిచెప్పి వెంటనే యాసముద్రుడు రామలక్ష్మణులకు బహులలితములగు
ఘనకిరీటాంగదగ్రైవేయకుండల రత్నహారాదికరమ్యభూష
ణంబులు గంధమాల్యాంబరంబులనిచ్చి మఱియును బహువిధమహితయుద్ధ
సాధనంబులొసంగి సన్మానమొనరింప సంతసించుచు రామచంద్రు డంతఁ
గీ॥ దమ్ముఁడుందాను దమతమ తపసివేస, ములను ద్యజియించి తగ నాసముద్రుఁడిచ్చు
భూషణాంబరములఁదాల్పఁ బుష్పశరుని, యందమంతయు వారిసొమ్మగుచు నొప్పె 151
గీ॥ ఇట్లుకైసేసి యారాఘవేశ్వరుండు, కూర్మితమ్ముఁడుఁ దానును గ్రొత్తపెండ్లి
కొడుకులన నెల్లరకు భ్రమగొల్పుచుండె, నంత జలనిధి వీడ్కొల్పె నర్కకులుఁడు 152
గీ॥ తాను దమ్ముఁడునున్ మహోత్సాహమునను, నీలునంసముపై నాంజనేయుభుజము
పైనధిష్ఠించి వెడలుచో వానరులును, వెంటనే తాముకదలి రవ్వేళయందు 153

**రామలక్ష్మణులు కపిసేనలతో సేతుమార్గమున సముద్రముదాటుట**

కం॥ పటుతూర్యరావములు మ, ర్కటసుభటానీకచటులగంభీరమహా
ర్భటులొక్కట కలిసి వియ, త్తటమును బగిలించుచుండె దారుణభంగిన్. 154
ఉ॥ అప్పుడు దేవతల్ జయజయధ్వనులిచ్చుచు 'రావణుం డిఁకం
దప్పక తాను సైన్యసహితంబుగఁజచ్చు' నటంచు నెంచి తా
ముప్పరవీధిపై నిలిచి యుబ్బుచు సంస్తవపూర్వకంబుగా
గొప్పగఁ బుష్పవృష్టి నృపకుంజరుపైఁ గురియించి రొక్కటన్ 155
కం॥ భూనాథతిలకుఁ డిట్లా, వానరసైన్యములతోడ వడి సేతువుపైఁ
దాను బయలించుచుండఁగ, నానగచరసేనలెల్ల నాసమయమునన్ 156
సీ॥ కొందఱు పరువిడి ముందేగువారును వరయఁ గొందఱు వెన్క నరుగువారు
కొందఱు నడుమ గ్రక్కున మఱిపోవవా రిరుఁగెలంకులఁ గొంద ఱేగువారు
కొందఱొండొరుమీరి కుప్పించి చనువారు వెగసి కొందఱు మింటనేగువారు
త్రోవచాలమిఁ గొందఱావార్ధిలోదూకి యీదుచు నవలీల నేగువారు
గీ॥ నై యనేకవిధంబుల నాప్లవంగు, లెవరియిచ్చకొలంది వారేగుచుండ
వారిగమనవేగమునకు వసిధికలఁగె, సేతువరయ నట్టిట్టు లుఱ్ఱూతలూగె 157
చం॥ ఒకనినిమించి యొక్కఁడు పయోనిధిదాటఁగనెంచి యిమ్మెయిం
బ్రకటజవంబునంబఱచు వానరులంగని భానువంశనా
యకుఁడు ప్రమోదమొందుచు నిజానుజుతో జలరాశిదాటి తా
సుకరముగా సువేలగిరిఁజొచ్చి యటన్ విడియించె సేనలన్ 158

## రావణుఁడు శుకసారణులను శ్రీరామునికడకు బంపుట

ఆ॥ అంతఁ బంక్తికంఠుఁడగచరసేనతో, నర్కకులుఁడు వచ్చినట్టి వార్త
నెఱిఁగి వారితెఱఁగులెల్లను బాగుగాఁ, దెలిసికొనఁగఁ దలఁపు కలుగుటయును. 159

ఆ॥ సూక్ష్మబుద్ధులైన శుకసారణులఁజీరి, కార్యరూపమెల్లఁ గఱపి పంపె
వారు తత్క్షణంబ వానరాకారులై, యాసువేలశిఖరి కరుగుఁదెంచి 160

కం॥ ఎక్కడఁజూచినఁగానీ, లెక్కకు మిక్కుటములగు వలీముఖసేనం
జక్కగఁ దిలకించి కరం, బక్కజపడి గూఢచారు లతిగూఢముగన్ 161

కం॥ కపిసేనలోనఁజొరబడి, కపటంబుగ వారి మర్మకర్మములెల్లన్
విపులముగ నెఱుఁగుచున్నెడ, విపులమతి విభీషణుండు వేగమె వారిన్. 162

గీ॥ తాను గుర్తించి రామభూధవునితోడ, నయ్యుదంతముఁ జెప్పిన నధిపుఁ డంత
'నాఖలులఁ బట్టితెం' డని యగచరులకు, నాజ్ఞయొసఁగుటయును వారలాక్షణంబ 163

గీ॥ ఆ కపటరాక్షసులఁబట్టి యాగ్రహమునఁ, గాలఁ గేలను దన్నుచుఁ గపులు నృపుని
కడకుఁ గొంపోవుటయును నాఖలులిరువురు, రాము శరణువేడిరి భయాక్రాంతులగుచు.

గీ॥ అపుడు శరణాగతావనుఁడైన రామ, చంద్రుఁ డనుకంపమెయి శుకసారణులను
విడిచిపుచ్చిన వారలు వేగఁబోయి, దశముఖునికొల్వుకూటంబుఁ దాము చేరి, 165

కం॥ అందొక పెనుగద్దియపైఁ, బొందుగ నాసీనుఁడగుచుఁ బొల్పెసఁగెడు నా
బృందారకవైరినిఁగని, వందనమొనరించి యిట్లుపలికిరి చారుల్' 166

కం॥ 'ఆకర్ణింపుడు దేవర! కాకుత్థ్సకులుండు బహుళకపిసేనలతో
పీకమెయివచ్చి విడిసెం, బ్రాకటముగ నాసువేలపర్వతముపయిన్. 167

కం॥ కోతులచేతన్ వార్ధిక, సేతువుఁగట్టించి తాను సేనలతోడన్
ఖ్యాతిగఁదన్మార్గంబున, క్ష్మాతలపతివచ్చె నశ్రమమున సురారీ!. 168

కం॥ మీపంపువడసి వానర, రూపంబులఁదాల్చి మేము రూఢిగఁ జనియా
భూపతిసేనలఁ గంటిమి, బాపురె! లెక్కింపరాదు వారి కొలఁదులన్. 169

కం॥ అక్కపిసేనలలోపలఁ, దక్కువవా డొకఁడులేడు త్రైలోక్యంబున్
మిక్కిలి బంటుతనంబున,నొక్కొకఁడేగెలువనోవు నురుభుజశక్తిన్. 170

గీ॥ 'ఎన్నఁ డాలంబులభియించు నెన్నఁడరులఁ, జించిచెండాడుదుమొ యని చివ్వకుఁ గడు
గాలుఁద్రవ్వుచునుందురా కపు లఖర్వ, బాహుబలగర్వమునఁ బేర్చి పంక్తివదన! 171

కం॥ దనుజకులేశ్వర! మఱియున్, వినుఁ డొక్కవిశేష మావిభీషణుఁడు మనం
బున మాయునికినెఱిఁగి త్వా, వనచరులకు సైగచేసి పట్టించుటయున్ 172

కం॥ ఆవానరు లతిదౌష్ట్యం, బావహిలన్ బహువిధప్రహారంబులచేఁ
గేవలము మమ్ముఁగలఁచుచు, భూవరుసన్నిధికిఁ గొనుచుఁబోయిరి పిదపన్. 173

కం॥ ఆరామచంద్రుఁ డతులిత, కారుణ్యసుధాపయోధి కావున మాపై
వైరంబుఁగొనక మిక్కిలి. గారవమున విడిచిపుచ్చె గ్రక్కునమమ్మున్. 174

కం॥ వెండియునసువులతో మీ, దండకువచ్చితి' మటంచుఁ దారు నుడివినం
గొండొకవడిఁ జింతించి ప్ర, చండబలుండైన రాక్షసప్రభుఁ డంతన్. 175

కం॥ శుకసారణసహితంబుగ, నొకయున్నతహర్మ్యమెక్కి యుపలక్షించెం
బ్రకటసువేలముపైఁ గల, యకలంకస్థితివహించు నాకపిసేనన్ 176

ఆ॥ ఇట్లు కలయఁజూచి యింద్రారి వేర్వేఱ, వారినామములను వారికొలఁదు
లడుగుటయును శుకుఁడు కడువినయంబుతోఁ, బంక్తివదనుఁజూచి పలికెనిట్లు 177

## శుకుఁడు రావణునితో వావరసేనల బలాతిశయములఁగూర్చి తెలుపుట

కం॥ మనసైన్యంబులకంటెన్ఁ వినుఁ డారఘురాముసేన వేయిమడుంగుల్
గన నధికంబయియుండెడు, ననుటకు సుంతైన సంశయములే దధిపా! 178

గీ॥ అమితబాహుబలాఢ్యు లాహవమునందు, నందఱును నారితేరినయట్టివారె
వారికొలఁదులుచెప్ప నెవ్వరుసునోప, రైన నుడివెద నాలింపు డసురనాథ!. 179

సీ॥ ప్రతిపక్షదారుణారణ్యదవానలుఁ డక్షీణబలుఁడు గవాక్షుఁడతఁడు
త్రిజగద్భయంకరదీప్తపరాక్రమకలితుఁడై యొప్పెడు గవయుఁడతఁడు
వివిధసంగరకళావేదినా నెగడుచు ఘనతకెక్కినయట్టి గజుఁడతండు
వాడిమగలకెల్ల వాడిమగండయి తనరారు గంధమాదనుఁడతండు
గీ॥ ప్రకటరణదోహలుండగు పనసుఁడతఁడు, ప్రథితపౌరుషుఁడౌ శతబలియతండు
సమదకేసరినిభుఁడు కేసరియతండు, నిరుపమబలాధికుండగు నీలుఁడతఁడు. 180

కం॥ అతులితబలవిక్రమసం, గతుఁడు ద్విషత్సమితికెల్లఁ గాలుండగుచున్
నుతికెక్కిన నలుఁడాతం, డతఁడే సేతువునుగట్టె నంభోనిధికిన్ 181

కం॥ ప్రాకటముగ నోషధులన్, సాకల్యముగనెఱిఁగిన భిషగ్వరమణియ
స్తోకభుజవిక్రముఁడు రణ, భీకరుఁడు సుషేణుఁడతఁడు వీక్షింపుడిఁకన్. 182

ఆ॥ వసుధయీనినట్లు భల్లూకసేనలు, బలిని తన్నుఁగొలువఁ బ్రాభవమున
నన్న మేటివీరుఁ డురుశౌర్యధుర్యుఁడౌ, జాంబవంతుఁడతఁడు సమరవిదుఁడు. 183

సీ॥ ఎవ్వఁడు మున్ను నిన్నేడువార్ధులయందు ముంచికలంచి బాధించియుండె
నెవ్వఁడు చివ్వలో నీరేడుజగములకేని నోడక చరియించియుండె
నెవ్వని శ్రీరాముఁడెంతయు నవలీలఁ ద్రుటికాలమందె తాఁదునిమియుండె
నెవ్వని శౌర్యాదు లీశ్వరాదులకైనఁ బొగడసాధ్యముగాక నెగడియుండె
గీ॥ నట్టివాలికి నందనుండంగదుండు, వాడె వీక్షింపు దసదృశవాహుబలుఁడు
వాలికేమిటఁ దక్కువవాడుకాడు, వాడె యువరాజు కపులలో వాడెమేటి 184

సీ॥ రాముఁ పంపున ౦మశిని వెదుకంగ నెవఁడు నాఁటిలంక కేగుఁదెంచెఁ
గావలివారినిఁ గడులెక్కసేయక చేవమైవనమెల్లఁ జెఱిచెనెవఁడు
ప్రకటబలాఢ్యులఁ బల్వురదనుజుల ధృతిసొంపుమీర వధించెనెవఁడు
భయముసుంతయులేక వాలాగ్నిచేతను మనపురంబెవఁడు భస్మంబుఁ జేసె
గీ॥ రామునకు ముఖ్యభక్తుఁడై క్రాలెనెవఁడు, పల్వలమువోలె నెవ్వఁ డావార్ధిదాటె
నట్టి హనుమంతుఁ డతఁడెసు మ్మందఱికిని, మేటి యాతనివెన్నంగ నేటికింక?'. 185

కం॥ అని వేర్వేఱుగ శుకుఁడా, వనచరముఖ్యులను జూపి వరుసగ నెఱిఁగిం
చినవాఁడై మఱియును నా, యినజునిఁజూపించి యాతఁడిట్లని పలికెన్. 186

గీ॥ 'అవధరింపుము దైత్యేంద్ర! యఖిలవాన, రావళికిఁ జక్రవర్తియై యలరునట్టి
ఘనుఁడు సుగ్రీవుఁడాతఁడు కనుఁగొనుఁడీకఁ, దత్పరాక్రమమెన్నంగఁదరము కాదు.

కం॥ తన పంచప్రాణంబుల, ననయము శ్రీరామవిభున కర్పణమొనరిం
చినవాఁడై సుగ్రీవుం, డరికాత్రముఁజెంపుచుండు నసురాధీశా!. 188

కం॥ ఆదశరథపుత్రునకున్, నీదగు గుట్టెల్లఁదెలిపి నినుఁ జంపింపం
దాఁ దలఁచినవాడు భవ, త్సోదరుఁడు విభీషణుండు సుమ్మతఁడు ప్రభూ!. 189

సీ॥ అసురేంద్ర! కనుఁగొనుఁ డానీలవర్ణుఁడే రవికులోత్తముఁడైన రామభద్రుఁ
డతనివిక్రమమెన్న హరిహరాదులకోప రతఁడుసల్పిన చర్యలద్భుతములు
శివువిల్లుఁదున్మి తాసీతనుబెండ్లాడె భార్గవరాముని భంగపఱిచె
ఖరదూషణాదిరాక్షసులఁ బల్వురఁజంపె వాలినిఁగెడపెఁ గబంధుఁ గూల్చె
గీ॥ మఱియు నిన్నిన్నియనచేల? మానవులకుఁ, జేయరానట్టిపనులెన్నొ చేసియుండె
నతఁడు దుష్టసంహారార్థమవతరించి, నట్టి సాక్షాన్మహావిష్ణువంద్రు జనులు. 190

కం॥ ఆరక్తవర్ణుఁ డారయ, ధీరుండగు లక్ష్మణుండు తిలకింపఁడు ఘో
రారివిమర్దనపటుఁడు, ర్వారపరాక్రమధనుండు పంక్తిగ్రీవా!'. 191

సీ॥ అని యీవిధంబున నాయామినీచరవిభునితో శుకుఁడు సవిస్తరముగ
నృపులయొక్కయు మఱి కపులయొక్కయు మహాశౌర్యధైర్యబలాతిశయములెల్ల.
విన్నవించుటయు నావిబుధారి తనలోనవెఱచియుఁ జలమును వీడఁబోక
యటనుండిగ్రక్కున నపుడెంచి సభలోనఁజేరినవాఁడయి శూరులైన

గీ॥ దనుజవీరులరావించి తాను వారి, తోడ యుద్ధయత్నములు తోడ్తోఁ జేయ
సాగె నప్పుడా శ్రీరామచంద్రురాక, యెఱిఁగి తనతల్లి కైకేశి యెడఁద వగచి. 192

## రావణునకుఁ దల్లియగు కైకేశి నీతులను జెప్పుట

సీ॥ తనతండ్రి మాల్యవంతుని వేగఁదోడ్కొని పరిచారికలవెంట బలిసికొలువ
నొక్కయాందోళికనెక్కి వైభవమెప్ప నవివేకియైన దశాననునకు
నీతులుగఱపంగ నెలఁతతత్సభకును శీఘ్రంబునంజాను జేంవచ్చె
వచ్చినతల్లికి వలనొప్పఁదాతకుఁ బంక్తిముఖుండు సపర్యచేసి

గీ॥ వారియాగమనమునకుఁ గారణంబు, పృచ్ఛచేసెఁ గైకేశి ప్రియముతోడ
సుతునిమోముపైఁ బ్రేమంపుఁజూడ్కినిల్పి. యెంతయును మృదురీతిఁ దానిట్టులనియె.

కం॥ 'ఓరావణ! నారాకకుఁ, గారణమది నీవలననె కలిగెంగాదే?
గౌరవభావముతో మ, త్సారయుతంబైన బోధ సమ్మతి వినుమా! 194

సీ॥ కపిసైన్యయుక్తుఁడై నృపపుంగవుండగు రామభూవిభుఁడు తారణమొనర్ప
వచ్చి సువేలపర్వతముపై విడిసినవాఁడట! యెల్లి యవశ్యముగను
మనలంకకేతెంచు మఱినిన్నుఁబోరిలో సపరివారంబుగ సంహరించి
సీతనుగొనిపోవు సిద్ధమీపల్కులు వారితోవైరంబువలవ దుడుగు

గీ॥ సురగరుడసిద్ధసాధ్యకిన్నరవిహంగ, నాగముఖ్యుల మును గెల్చినాడననుచుఁ
దలఁచి గర్వింపఁబోకు మీదాశరథులఁ, దాకి గెల్వంగనీకు దుస్తరము సుమ్మి. 195

సీ॥ నరులెంతనాకు వానరులెంతయనినీవు తలఁచితే? విను మును కలహమందు
నుక్కున నినుగెల్చి పెక్కేండ్లుచెఱలోనఁబెట్టి బాధించిన వీరవరుఁడు
కార్తవీర్యుండు తాఁగాడెమనుష్యుండు? కడునల్గి నిన్నేడుకడలులందు
ముంచికలంచిన భూరిబలాఢ్యుఁడు వాలి వానరజాతివాడుకాడె?

గీ॥ చూడ నరవానరులుగాని సురవిరోధి!, వారు దైవాంశసంభవుల్ వారికొలఁదు
తెన్నశక్యముగాకుండు నేరికైన, వారితోడ నిర్హేతుకవైర మేల?. 196
గీ॥ అదియు నట్లుండెఁ దొల్లి నీవజునివలన, సర్వదేవతాకోటిచేఁ జావకుండ
వరములందితివేకాని వానరులను, నరుల మఱచితి వాకారణమునఁ జేసి. 197
కం॥ నిన్నువధించుటకై శ్రీ, మన్నారాయణుఁడు తాను మానవుఁడయ్యెం
బన్నగదేవతలందఱు, నెన్నఁగ జన్మించియుండి రిలలోఁ గపులై 198
ఆ॥ కాన రాముతోడఁ గంటునీకేటికి?, సీతనొసఁగి సంధిసేయు మింక
నీకుహానిలేదు నిత్యశుభములొందు, నోదశాస్య! వినుము నాదుపలుకు. 199
ఉ॥ ఇంతకు నీకు రామవిభుఁ డెగ్గొనరించినవాడుకాడు నా
డెంతయునీవ చౌర్యమున నింతినిసీతను బల్మిఁదెచ్చితో
నింతలుపుట్టెఁగాక! మఱి యిందొకయించుకయైనతప్పు మీ
కాంతునియందునుండెనె? యకారణవైరముఁ బూనుటొప్పునే? 200
కం॥ ఇప్పటికైనను సీతను, దప్పకరామునకునిచ్చి తగ మనుమయ్యా!
తప్పెదవు మరణమునకుం, దప్పెదు కులనాశనంబు తనయా! వినుమా!'. 201
గీ॥ అనుచుఁ గైకేశి యాతని కవ్విధమునఁ, జెప్పఁదగు నీతులెన్నేనిఁ జెప్పచుండ
వినియు వినునట్టులూరకుండిన నిశాట, వల్లభునిఁజూచి యామాల్యవంతుఁడనియె. 202

## రావణునకు మాల్యవదాదులు నీతులను బోధించుట

కం॥ 'నీతల్లిచెప్పచుండిన, నీతినిఁ బాటించి వేగ నీవారామ
క్ష్మాతలపతికిఁ గుమారా!, సీతను దగనిచ్చి సంధిసేయుము శుభమౌ. 203
ఆ॥ నీశుభంబుఁగోరి నీకు మేము హితంబు, చెప్పవలసివచ్చి చెప్పుచుంటి
మంతెకాని రాముఁ డరయఁ జుట్టముకాడు, వైరివీవుగావు పంక్తివదన!. 204
కం॥ వేడెదమునిన్నుఁ వైరము, వీడుము జానకినొసంగి పృథ్వీశునితోఁ
గూడిమనుము క్షేమంబొడఁ, గూడును గులగౌరవంబు గొప్పగనిలుచున్' 205
ఆ॥ అనుచుఁ బెక్కుగతుల నామాల్యవంతుండు, తాను నీతిఁజెప్పె దనుజపతికి
మఱియుఁ బెక్కుమంది మాన్యులుచెప్పిరి, కానివినఁడు పంక్తికంధరుండు. 205

## రావణుఁడు సంధికంగీకరింపక తనయభిప్రాయము తల్లితోఁ జెప్పుట

కం॥ తనతల్లినిఁ గనుఁగొని య, య్యనిమిషపతివైరి యిట్లనియెం 'దల్లీ!
విను మెఱిఁగియెఱిఁగి యేనీ, వనితమదెచ్చితిని బెక్కుపలుకు లికేలా?. 207

ఉ॥ నీవనినట్ల యానరు(డు నిక్క్రముగా విను మద్వధార్థమై
భూవలయంబునందు మతిపుట్టియెయుండిన నెల్లఁ గలం
జావదినాఁడ(దప్ప దిఁక సంధియుగింధియునేటికమ్మ? ము
న్నావిధియెట్లు వ్రాసె నటులయ్యెడు(గాక విచారమేటికిన్?. 208

ఉ॥ రాము(డొకండెకాదు విను! రాములువేవురు వచ్చిరేని సం
గ్రామముచేసి చచ్చుటయె! కాకవధించుటొ! యొప్పు(గాని నే
భూమిజనిచ్చి సంధికయిపోవుట స్వప్నములోనివార్తగా
నీమదిలో(దలంపు జననీ! యిది నాతుది నిశ్చయంబగున్'. 209

సీ॥ అని సగర్వంబుగా నాదశకంఠుండు పలుకుటయును విని ప్రాజ్ఞురాలు
కైకేశి యిట్లను గడుఖిన్నురాలయి 'యోయి! రావణ! నీతు లొల్లవనుచు
వేనెఱుంగుదు నైన నీపునాకడుపున( బుట్టిన యాదోషమునను( జేసి
నేబుద్ధి(జెప్పితి నీవేలవిందువు? నీపాపముదిపండె నిశ్చయముగ(
గీ॥ దత్ఫలంబును బొంద సిద్ధముగనుండు', మనుచు( గరినొక్కిలాడి యాయతీవమిన్న
సత్వరంబుగ నటనుండి సదనమునకు(, బనివినియెఁ బరిచారికల్ బలిసికొలువ. 210

ఆ॥ అంత యుద్ధమునకు నఖిలప్రయత్నముల్, తానుజేయుచుండె దశముఖుండు
మమ(డు రాము(డంటఁ గపిసేనలకు లంకముట్టడింపు డనుచు ముదలయొసఁగె 211

కం॥ ఆరామునాజ్ఞచొప్పున, ధీరులు వానరులు లంకదెస కాక్షణమే
భూరత లంఘించి చని సు, రారిపురము ముట్టడించి రద్భుతభంగిన్. 212

ఆ॥ ఆటకపులచేత నాలంక చుట్టను, ననతిదూరమందు సక్రజముగ
ముట్టడింప జేసి భూనాధు(డప్పుడు, పీటిదెనకు( గన్నవిచ్చి చూచి. 213

కం॥ ఆలంకాసౌందర్యం, బాలోకనపర్వమగుచు హర్షము( గూర్పం
జాలు(గ(బొగడుచు సద్గుణ, శీలు విభీషణునితోడ క్షితిపతిపలికెఁ. 214

కం॥ 'ఈపురి శృంగారంబును, బాపురె వర్ణింప( బద్మభవునకు వశమే?
యీపురమిక(బాలింపగ, నాపం(క్తిముఖునకదృష్ట మదిలేదయ్యెన్. 215

ఉ॥ ఇప్పటికైన జానకినినిచ్చి దశాస్యు(డు సంధి(జేయచోఁ
దప్పక కాతువేనతని ధార్మికసత్తమ! యట్లు గావునన్
గొప్పగ సంధికై యటకు గొబ్బున నొక్కని రాయబారిగా
విప్పుడు పంపలెస్సయని యెల్లవిధంబులనాకుఁ దోచెడున్'. 216

ఆ॥ అనుచు రామభద్రుఁ డావిభీషణుతోడ, నుడివి యాక్షణంబ కడుకుశాగ్ర
బుద్ధియైన వాలిపుత్రుఁడౌ నంగదుఁ, జీరి యిట్టులనియె గారవమున. 217

రాముఁడు రావణునికడకు నంగదుని రాయబారము పంపుట

గీ॥ 'ఓయి! యువరాజ! చాలయోగ్యుఁడవు నీవు, పటుతరానర్గళస్ఫుట వాగ్విశార
దుఁడవు నేర్పున నెవ్వారితోడనైన, యుక్తముగ మాటలాడెద వుచితమెఱిఁగి. 218

కం॥ నీకొకవిషయము చెప్పెదఁ, బ్రాకటముగఁ బంక్తిముఖుని పజ్జకరిగి యా
రాకాసులెల్లవినఁగా, నీకరణిం జెప్పుమయ్య యినసమతేజా! 219

ఆ॥ ఇంతినొసఁగుదేని నిప్పటికైననీ, తప్పిదంబుసైచి దయదలిర్ప
నభయమిచ్చికాతు నని నాదుపలుకుగాఁ, బంక్తివదనుతోడఁ బలుకుమీవు. 220

ఉ॥ సంధికి నిన్నుఁబంప నను సంగరభీరునిఁగాఁ దలంచి గ
ర్వాంధుడు రావణుండు కడుఁగాఱులు ప్రేలెడుఁగాన వానితో
బంధురరాజధర్మమునుబట్టి యిటుల్ దగ రాఘవుండుతా
సంధినిఁగోరెఁ గాక నిశిఁజాలకకాదని నొక్కిచెప్పుమా!. 221

కం॥ ఎమ్మెయినైనను సంధికి, నమ్మూఢుఁడు సమ్మతింపనట్లయినను యు
ద్ధమ్మునకు నిఁక సంసి, ద్ధమ్ముగనుండుమని నుడివి తగఁజనుదెమ్మా!' 222

సీ॥ అని చెప్పి రాముఁడాతని రాయబారముపంపుటయును మహాప్రబలుఁడైన
వాలినందనుఁడంత వాయువెగంబున లంకకుఁబోయి నిశ్శంకతోడఁ
బంక్తికంఠుని సభాభవనంబులోపల శూరతబెదరక చొచ్చుటయును
రాక్షసు లాతని రవిసూనుగానెంచి 'పట్టుడు కట్టుడు కొట్టు' డనుచు
గీ॥ నందఱాయుధహస్తులై యాక్షణంబ, యంగదునిఁ జుట్టుముట్టిన నసురవిభుఁడు
వారివెల్లర వారించి వాలిసుతునిఁ, గాంచి యిట్లని పల్కె సగర్వముగను. 223

అంగదుఁడు రావణునితో సంభాషించుట

కం॥ 'ఓరీ! వానర! యెవఁడవు?, నీరాకకుహేతువేమి? నిజముగ నాతోఁ
గ్రూరత్వంబున బొంకక, యారయ నెఱిఁగింపుమింక నతివిపులముగన్ 224

సీ॥ ఇంతకు మును హనుమంతుఁడం బ్లవగుఁడు వైదేహినింజూడవచ్చి యిచటఁ
జిలిపిచేష్టలు కొన్ని చేసిన వానినిపీకమైఁబట్టి తెప్పించి నేను
దూతకావునఁ జంపనీతిగాదనియెంచి వాలంబుఁ బ్రెల్మిడిఁ గాలిపించి
విడిచిపుచ్చితి వానివిధమెట్టులున్నది వాడు నీకేమికావలయునోరి!

గీ॥ చెప్పి' మనపుఁడు వానరశ్రేష్ఠుఁడైన, యంగదుండప్పు డారావణాసురునకు
భయదవారిదగంభీరభాషణముల, నిట్టులనిపల్కె రాక్షసులెల్ల వినఁగ. 225

మ॥ 'వినుమోయీ! దశకంఠ! నీవు మఱి మద్వృత్తాంత మాద్యంతమున్
వినియేయుండుదు వైన వెండి వినుమా! నిన్నేడుసంభ్రంబులం
చన మున్నెవ్వఁడు ముంచి నీదగు మహాదోర్గర్వముంబాపెనో
ఘనుఁ డావాలికిఁగూర్మినందనుఁడ నిక్కమ్మేను వాక్రుచ్చితిన్ 226

మ॥ అదియట్లుండె జగత్ప్రసిద్ధపటుశౌర్యస్ఫూర్తిశోభిల్లఁగాఁ
గదనంబందున మున్ను నిన్ను జితునింగావించి పెక్కేండ్లవం
దదయుండై బెఱఁబెట్టి తాఁగలఁచెనో యాకార్తవీర్యార్జునుం
దుదముట్టించిన జామదగ్న్యుని మహాదోర్గర్వ మేపారఁగన్ 227

గీ॥ ఎవ్వఁడు తదీయపుగు గర్వమెల్లసుడిపె,నట్టి బలవిక్రమాన్వితుఁడైన రామ
భద్రునకు నేను నిక్కఁపుబంటనగుదు, నంగదుండని నన్నందు రసురవైరి! 228

సీ॥ నాడట్లు వాయునందనుఁడు నీచేఁ దోకఁగాల్పించుకొనిరాఁగఁ గపికులేంద్రుఁ
డైనట్టి సుగ్రీవుఁ డతనిపైఁ గోపించి 'పగవారిచేఁబట్టువడి యితండు
తనతోకఁగాల్పించుకొని వచ్చెఁ గావున నీహీనవానరుం డింకమీద
మనమూకలోపల మఱియుండరా' దని వేఱొండుకడకుఁ దావెడలఁగొట్టె
గీ॥ నాటినుండియు దౌత్యంబునడుపుటకయి, యనికిఁజాలని బాలకుఁ డంగదుఁడని
నన్ను నియమించె వానరనాయకుండు, కానవచ్చితి దూతనై నేనువినుము!. 229

కం॥ నీకుహితంబెఱిఁగించెదఁ, బ్రాకటముగ సావధానపరుఁడ వగుచు నో
నాకారాతీ! వినుమా!, చేకూరు శుభంబులెల్లఁ జెడఁదలఁపకుమీ 230

గీ॥ ధర్మసంస్థాపనముఁజేయ ధర్మపీర, మున నధిష్ఠించినాడవు మొఱకునట్ల
పాపకృత్యంబునకునీవు పాల్పడంగ, నిస్సిరో! న్యాయ్యమే చూడ? నింద్రవైరి! 231

గీ॥ పరసతీసంగమముఁగోరు పాపచిత్తుఁ, డిహపరంబులరెంటికి నెక్కఁడందు
రెఱిఁగియెఱిఁగియు రావణ! యేలయిట్లు, కొఱవిఁజేకొని తలఁ గోకికొందువీవు?· 232

ఆ॥ రామవిభుఁడు నీకు నెవ్వంతయపకార, మైనఁ జేసియెఱుఁగఁ డట్టిపరమ
నిర్మలాత్ముతోడ నీవునిర్హేతుక, వైరమూనఁదగునె? పంక్తివదన! 233

గీ॥ నీవుచేసిన యపకృతి నెమ్మనమున, నోర్వఁగాఁదగునట్టిదే యొరులకకట?
తాను శాంతాత్ముఁడగుటచేఁ ద్రవికులుఁడు, సంధినింగోరె నిమఁగూల్పఁ జాలియుండి.

గీ॥ తప్పుచేసినవాడవు తలఁపనీవు, తప్పుసుంతైనఁజేయని దాశరథియె
సంధిఁగావింపఁగాఁ దాను సమ్మతింప, సిద్ధ మిపొల్లకుండఁట చేటుకొఱకె 235

కం॥ కాన యిప్పటికైనను గానిబుద్ధి, కలిగి రామభూవిభునకు లలననొసఁగి
సందిఁగావించుచో నీకు సౌఖ్యమొదవు, తేడు నీతప్పుసైచి కాపాడఁగలఁడు 236

గీ॥ ఇంతచెప్పుటయెల్ల నీహితముకొఱకె, కాని యుద్ధంబునకు వోడికాదు వినుము!
లీలఁ ద్రిభువనములగెల్వఁజాలునట్టి, రామునకు నీవులెక్కయే? రాక్షసేంద్ర!. 237

## రావణుఁడు సగర్వముగా నంగదునితోఁ బ్రత్యుత్తరమిచ్చుట

సీ॥ తాటకిఁజంపి యాతపసియాగముఁగాచె మారీచదనుజుని మ్రందఁజేసె
శివధనుర్దండంబు చెఱకుతుంటయుఁబోలె విఱిచి యాసీతను బెండ్లియాడెఁ
బరశురాముని గర్వభంగంబుగావించె వాలినినొకకోలఁ గూలనేసె
ఖరదూషణాదుల గడియలోమర్దించె నా కబంధునిఁబట్టి హతముఁజేసె
గీ॥ నట్టి బలపరాక్రమధాముఁ డాజిభీముఁ, డసురకులవధార్థంబయి యవతరించె
నట్టి! సాక్షాన్మహావిష్ణువైన రాముఁ, డల్పుఁడనియెంచఁబోకుమీ యసురనాథ!'. 238

కం॥ అనిపలికెకు నంగదునిం, గనుఁగొని దశకంఠుఁడనియెఁ గడుగర్వమునన్
'వనచర! నోరిఁక మూయుము, మనుజుని నొకపెద్దఁజేసి మముబెదరింతే?. 239

కం॥ విను మాటాడించుకొలఁది, మనమున సిగ్గినలేక మనుజాధము రా
ముని నిటుపొగడఁజనునే, వనాట! నేనెఱుఁగనట్టె వానిని నిమ్నన్? 240

సీ॥ ఆడుదియైనట్టి యాతాటకినిఁ బోరమడియఁజేయుట యొక్కమగతనంబె?
కడుఁబ్రాతదైయున్న మృడునికోదండంబు మఱివిఱుచుటయొక్క మగతనంబె?
పాఱుని రణభీరు భార్గవరాముని మదమునుబాపుట మగతనంబె?
వనచరమాత్రుఁడౌ వాలినివంచించి మర్దించుటదియొక్క మగతనంబె?
గీ॥ యేలయుగ్గింతువోరి! నాయెదుటరాము?, వానిబలమెంత? చలమెంత? వాడునాకు
సాటివచ్చునె? వేయేల మాటలింక?, వినుము వానర! నాశక్తి విన్నవింతు. 241

శా॥ భీమప్రాభవశౌర్యధైర్యపటుదోర్వీర్యంబులొప్పార సం
గ్రామంబందు సమస్తదిక్పతుల గర్వంబంతయుంబాపి యు
ద్దామశ్రీమునకీర్తిగౌరవము లందంగంటి నెవ్వారు నా
కీముల్లోకములందు సుమ్మెదురలే కెల్లప్డుఁ గ్రీడించెదన్. 242

గీ॥ అబ్జభవుచేత మున్నెవ్వరందనట్టి, వరములన్నియునున్ నేను బడసినాడ
నాయురారోగ్యభోగభాగ్యాభివృద్ధు, లందఁగంటిని మత్సమ లవనిఁగలరె?. 243

కం॥ రవిశశితారాదిగ్రహ, నివహంబులు భీతిచేత నేనుడివినయ
ట్లవిరతము సంచరించును, భువనంబుల నెవరు నన్నుఁ బోలరు వినుమా!. 244

ఆ॥ ఇట్టినాకు రాముఁ డేమిటఁదులఁదూగు?, నెఱుఁగ కీవు ప్రేలెదేల? కోతి!
భండనమున వానిఁ బరివారయుతముగాఁ, వాఱద్రోలఁగలను బవుపునట్లు 245

చం॥ పలుకులువేయునేల యిఁక? వాసర! చెప్పెద నాలకింపుమా!
యలికులవేణియైఁ జనకాత్మజ రాముకకిచ్చి సంధినే
సలిపినచో నిరంతరము సర్వజనంబులు తాను బోరికిం
దలఁకె దశాననుండనుచుఁ దథ్యము నంగని నవ్వకుందురే? 246

గీ॥ ఆనడికి నొర్చుకంటెను నాహవమున, వీరమరణంబుఁబొందుట వేయిమడుఁగు
లన్నివిధములమేలగు నట్లుగాన, సంధిపొసఁగదు సమరమే సలుపువాడ' 247

ఆ॥ అనుచు నంగదునకుఁ దన మనోనిశ్చయ, మెఱుఁగఁజేసి మఱియు నింద్రవైరి
యతనితోడ విట్లులను 'వాలినందన!, వినుము! నీకు హితము విన్నవింతు. 248

కం॥ ఆవాలి నాకుమిత్రుఁడు, కావునఁ దత్సుతుఁడవగుట ఘనముగ నీపై
భావింపఁగ వాత్సల్యం, బావహిలంజొచ్చె వీనులలరన్ వినుమా! 249

గీ॥ నీదుతండ్రియౌ వాలిని నిహతుఁజేసి, నట్టి రాముఁడు నీకుఁదా నరియెకాడె?
యెఱిఁగియెఱిఁగియుఁ బందవై యిట్లునీవు, పగతు నాశ్రయింపగమతి తగునటేర? 250

కం॥ అవివేకివగుచు శత్రువు, నవిరతమును గొలువనేల? యస్మత్పక్షం
బవలంబింపుము నిన్నీ, దివిజారులకెల్ల నధిపతిం గావింతున్'. 251

కం॥ అని భేదోపాయముఁ బ, న్నినవాడై రావణుండు నిర్లక్ష్యముగాఁ
దనకుం బ్రత్యుత్తరమి, చ్చిన వాలికుమారుఁ డిట్లు చెప్పెందోడ్తోన్. 252

సీ॥ 'ఓరి! రావణ! నీకు గౌరవంబుననేను జెప్పనీతులు పెడచెవినిఁ బెట్టి
కాఱులు ప్రేలంగఁగడఁగితి వయ్యారె! నిష్కపటంబుగ మఱి నీకుఁ గాల
మాసన్నమయ్యె నిమ్మటుగాకయుండిన శ్రీరాముతోడ నిష్కారణముగఁ
బగఁబూనఁదగునేర?, పాపాత్మ! రవికులుఁ డఖిలలోకారాధ్యుఁ డాదివిష్ణుఁ

గీ॥ డాద్యుఁ డవతారపురుషుఁ డాగమాంత, వేద్యుఁ డాద్యంతశూన్యుండు విశ్వరూపుఁ
డమ్మహాత్ముని నిందింప న్యాయ్యమగునె?, తలఁప నీపాపమది-పండె ఖలుఁడ!-వినుము!

కం॥ ఆరామభూతలేంద్రుఁడు, మేరుసమానుండు మీదుమిక్కిలిఁ జూడం
గ్రూరా! నీవుతృణంబవు, పోరన్ నృపవరునిగెలువఁ బోలునె నీకున్?. 254

గీ॥ వినుము! లోకైకమాత సద్వినుతచరిత, జానకీదేవి నీకును జననికాదె?
అట్టి సాధ్విని( జెఱఁదేర నఘముకాదె?, పాపి! నీమోముఁజూచినఁ బాపమొదవు. 255

కం॥ కావునఁ దడయక సీతా, దేవిని నీవొసఁగి రామదేవునితోఁడం
గావింపుసంధి రావణ!, జీవింతు' వటంచుఁ బలికి చెప్పెన్ మఱియున్. 256

ఆ॥ 'ఇంకవేయునేల? యినకులు శరములే, యయ్యకొలుపు సంధికెట్టులైనఁ
గాన పోవుచుంటి ఖలుఁడ! నాకడపటి, పలుకు సావధానపరత వినుము! 257

ఉ॥ లంకను గీశసైన్యములు లగ్గలుపట్టకముందె వేగనీ
కింకరులెల్లరున్ సమరకేళినిఁ గూలకముందె నీవునున్
బింకముఁగోలుపోయి రఘువీరుని ఘోరశరాంబురాశిలోఁ
గ్రుంకకముందె దాసునకుఁ గోమలినిచ్చి సుఖింపు రావణా! 258

గీ॥ కాలహరణంబుచేసినఁ గలుగఁబోదు, లాభమారామభిక్షునకు లలననొసఁగి
మూర్ఖ! తత్పదాంభోరుహంబులకుమ్రొక్కి, శరణువేఁడుము నృపతి నింగరుణఁబ్రోచు'

కం॥ అని వాలితనయుఁ డివ్విధ, మునఁ దాసామాద్యుపాయముల బోధింపన్
విని రావణుఁడప్పుడు తన, కనుఁగవఁ గెంపావహిల్లఁ గాఱు లఱచుచున్ 260

కం॥ ఆసుత్రాముని మనుమని, నిసున బంధింప భటుల కెల్లరకుఁ గడున్
రోసంబునఁ గనుసన్నలు, చేసె దశాననుఁడు మిగులఁ జేవ దలిర్పన్. 261

## రావణుఁ డంగదుని బంధించుటకై తనభటుల కాజ్ఞయొసఁగుట

ఆ॥ ఆక్షణంబ రావణానుచరుల్ వాలి, సుతునిచెంతకేగి చుట్టుముట్టి
కాలుఁగేలుఁబట్టి కడిమిమైబంధింపఁ, బోవునట్టివేళ భూరిబలుఁడు 262

కం॥ ఆవాలిసుతుఁడు తనలో, నావంతయుభీతిలేక యతిశౌర్యమునన్
రావణుని భటులనెల్లర, నీవిధమునఁ దునుమసాగె నెంతయుఁగడిమిన్. 263

కం॥ కొందఱ బదములఁదన్నియుఁ, గొందఱ దంతములఁగఱచి కుందించియునుం
గొందఱ నఖములఁ బ్రచ్చియుఁ, గొందఱఁ బిడికిళ్లచేతఁ గ్రుద్దియు మఱియున్ 264

కం॥ వివిధప్రహారముల నా, ప్లవగోత్తముఁ డిట్లు దైత్యభటులను బెక్కం
డ్ర వధించి వెండి పైపైఁ, గవిసెడిమూకలను దవము ఘనవాలమ్మునన్. 265

కం॥ పీకమెయిన్ దానవులన, నేకులబంధించి కొనుచు నింగికి నెగమెం
గాకోదరములఁ గొనుచుం, బ్రాకటముగనెగసిపోవు పక్షీంద్రువలెన్. 266

కం॥ ఈకరణి వాలినందనుఁ, డాకసమున కెగసిపోయి యటనుండి వెనన్
రాకాసులనందఱఁ గను, భీకరగతి విసరివైచెఁ బృధ్వీస్థలిపై 267

సీ॥ వారెల్లఁ దన్మహాపాతంబునంజేసి తలలెల్లఁ బగిలినఁ దలరువారు
సంధిబంధంబులు సడలినవారును నస్థులు చూర్ణంబు లైనవారు
కాళ్లుద్రెస్సినవారు కీళ్లుదెగినవారు వ్రణములచేగాసిపడెడువారు
గాఢమూర్ఛలలోనఁ గడుమునిఁగినవారు ప్రాణంబులసలికోల్పడినవారు
గీ॥ నై యనేకవిధంబుల నానిశాటు, లెల్ల నాపన్నతనుబొంది రివ్విధమున
నంగదుఁ డరులఁ జీకాకునందఁజేసి, రాముచెంతకుఁ గరము శీఘ్రమునఁబోయి. 268

ఉ॥ సింధురవైరితుల్యుఁడగు శ్రీరఘురామునితోడ నమ్రుఁడై
బంధురవాగ్విశారదుఁడు వాలిసుతుండను 'రామభద్ర! గ
ర్వాంధుఁడు రావణుండు తనువందుసఁ బ్రాణములుండ నెమ్మదిన్
సంధికిసమ్మతింపఁ డిఁక సంగరదీక్ష వహింపఁబూనుడీ!' 269

మ॥ అను డాయంగదుఁ డన్నవాక్యములఁ దానాలించి శ్రీరాముఁ 'డ
ట్లనెకాని'మ్మని తామఁ దమ్ముఁడు రణోల్లాసంబురెట్టింపగన్
ఘనమౌ వానరసేన కట్టియెద 'లంకన్‌లగ్గలంబట్టుడీ'
యనివైలంబ యనుజ్ఞయిచ్చెఁ బటుశౌర్యాటోపమేపారఁగన్ 270

## శ్రీరామాజ్ఞచే వానరసైన్యములు లంకాపురము ముట్టడించుట

కం॥ ఎప్పుడు నృపుడాజ్ఞయొసఁగె, నప్పుడు తూర్యములతోడి యార్పులు చెలఁగం
దప్పక వనచరసైన్యం, బప్పురి లగ్గలనుబట్టి రసురులుబెగడన్ 271

ఆ॥ చుక్కలిన్నియనుచు లెక్కింపఁగావచ్చు, నిసుమునైనఁగాని యెన్నవచ్చుఁ
గాని యెన్నరాని కపిసైన్యములు చేర, నపుడులంకకపిమయముగఁదోచె. 272

కం॥ కోటపయికి లంఘించి మ, హాటోపముతోడఁ బ్లవగు లవిరళముగబల్
మేటిశిలావర్షము దో, షాటులపైఁగురియసాగి రద్భుతభంగిన్ 273

కం॥ ఊఅక నిశాచరులెల్లరు, నళిముఖినెదిరించి పోరి హతులగువారున్
వెఱచి పఱచువారును నై, తఱచుగ గగ్గోలుపడియెఁ దత్పురియెల్లన్. 274

సీ॥ ఇట్లు లగ్గలువట్టి యేపునవానరుల్ గోపురసంతతుల్ గూల్చివైచి
కోటలు బురుజులు గొబ్బునఁ బడఁద్రోసి పరిఖలుపూడ్చి కూపములఁ జెఱిచి
రచ్చలు రాజమార్గములు ధ్వంసమొనర్చి మేడలుమిద్దెలు పాడుచేసి
యారామములఁజొచ్చి యందలితరులతాగుల్మంబులను వేగఁ గూల్చివేసి
గీ॥ మఱియు నానావిధంబులౌ మహితచిత్ర, మండపాదికముల రూపుమాపి కపులు
జంకుగొంకింతయునులేక సాహసమునఁ, బట్టణంబంతటను జిచ్చువెట్టి రపుడు 275

సీ॥ అంతకుమున్ను దశాననునకునోడి తనతేజమేదియుండిన యనలుఁడు
వీతభయుండయి యాతఱి స్వామికార్యము స్వకార్యంబని యద్భుతముగ
మంటలు మిన్నంటి మఱిమండఁగాఁజొచ్చెఁ దనచెలిసైతముఁ దప్పెననుచు
నాసమీరణుఁ డప్పు డగ్నికిఁదోడయి ద్వేషించి మిక్కిలి వీవసాగె
గీ॥ నిట్లు వాయుసహాయుఁడై యేపుమీరి, యగ్నిలంకాపురంబెల్ల నాక్రమించి
కరముఁ జెలరేగి దహియింపఁగడఁగెఁ దనకు, నింద్రవైరిపైఁ గలకపియెల్లఁదీర 276

సీ॥ అత్తఱి నగ్నిభయము మిక్కుటముగాఁగఁ బట్టణవీధులఁ బఱచువారు
పఱిగిడఁ గాళ్లువెంబడిరాక యసువుల వీతిహోత్రునకు నర్పించువారు
మృతులైనవారికై మేదురారావముల్ చెలఁగ విలాపముల్ సేయువారు
ప్రాణభీతినిఁబొంది రక్షింపుమని యగ్నిదేవునిఁజాలఁ బ్రార్థించువారు
గీ॥ నైపురంబెల్ల సంక్షోభమందుటయును, రావణుండంత లేనిధైర్యంబుఁ బూని
'యగ్నిఁజల్లార్పుడీ' యని యగ్గలముగఁ, కేకలిడిచెప్పె నాత్మీయకింకరులకు· 277

గీ॥ అట్లురావణప్రేరితులైన దనుజ, వీరులెల్లఁ గడుంగడు వేగిరంబ
తోరపున్ దుత్తలకొలంది నీరుఁజల్లి, యగ్నిఁజల్లార్చి కాపాడి రపుడులంక. 278

## రావణునిపంపున మేఘనాదాది రాక్షసవీరులు యుద్ధమునకు వచ్చుట

సీ॥ తదనంతరంబ యాదశముఖుపంపున నానరాంతకుఁడు దేవాంతకుండు
నాహవదోహలుండైన ధూమ్రాక్షుండు పటువిక్రమాఢ్యుఁడౌ పంచశిరుఁడు
పార్శ్వుండునున్ మహాపార్శ్వుండు కుంభనికుంభులు సంగరకోవిదులగు
నాయకంపనుఁ డతికాయమహాకాయు లాప్రహస్తుండు మహాప్రసిద్ధ
గీ॥ బలపరాక్రమధుర్యుఁడై పరగుమేఘ, నాదుఁ డాదిగాఁగల దైత్యనాయకమణు
లమితసేనాసమేతులై యమగుఁదెంచి, రుత్తరపుగవనికడకు యుద్ధమునకు. 279

సీ॥ అంతకుమున్న యుద్ధార్థులై యాలంకయందలి కోట లేడాక్రమించి
కొని యెందువీక్షించిననుగాని తామెయై యున్నవానరులెల్ల నుబ్బియార్చి
'రండురం' డని చీరి రాక్షసవీరుల వీకమైఁదాకి రావిధముఁ జూడఁ
బ్రాక్పశ్చిమాంబుధుల్ పాయకయొండొంటితోఁ దాకునట్లుగాఁ దోచెనప్పు
గీ॥ డటుతలపడి వివిధప్రహారములను, గడిమి నొప్పించుకొనుచు రక్కసులు కపులు
కదనమొనరింపసాగిరి కలహభోక్త, యైన నారదుఁడీక్షించి హర్షమొంద. 280

సీ॥ బహుశరాసారముఁ బరగింత్రు రాక్షసుల్ శిలలు ఘోరముగ వర్షింత్రు కపులు
కరవాలముల నొంపఁగల్గుదు రసురులు నురువాలములఁ జంపుదురు ప్లవగులు
కుంతముల్గొని దైత్యసంతతుల్ పొడుతురు దంతహతులఁ గీశపతి కలఁతురు
గదలచేమొత్తుదురు దివిజులంఘ్రులచే హత్తుదురు రఘుక్షితిపుభటులు
గీ॥ వాకులున్ బల్లెముల్ గొనిప్రాకటముగ, దనుజవీరులు ప్రహరింత్రు తరుచరులను
శితనఖములచే వానరశ్రేష్ఠులపుడు, చించిచెండాడుదు రసురసేనవెల్ల 281

ఉ॥ కోటలపైననుండి మఱికొందఱు కీశులు గండశైలముల్
సూటిగవైచుచుండ మదిస్రుక్కక తగ్గక దైత్యవీరులా
కోటలపైకిఁ దాము నకుంఠితవిక్రమమొప్పనెక్కి పో
రాటముసేయసాగిరి సురప్రకరంబులు చూచిమెచ్చఁగన్ 282

సీ॥ కొందఱువానరుల్ స్యందనారూఢులున్నెడకు లంఘించి యహీనశౌర్య
మొప్పార యుగ్యంబు లుర్విపైఁగూలిచి రథములఁద్రుంచి సారథులనొంచి
విరథులఁగావింప వెఱవకదానవు లసిముద్గరాదుల నందికొనుచు
చెనుదెంచి వానరసైన్యంబులోఁజొచ్చి జయకాంక్షులై పోరుసలుపఁదొడఁగి
గీ॥ రప్పు డుభయసైన్యములకు నద్భుతమగు, ఘోరసంగ్రామమయ్యె సంకులముగాఁగ
నిట్లు పోఱుచో నెత్తురుటేర్లుపాఱె, బ్రుగ్గిపోయి రనేకులు మహితబలులు. 283

సీ॥ ఇవ్విధంబున నప్పు డిరువాగుసైనికుల్ ద్వంద్వయుద్ధమునకుఁ దాము కడఁగి
కోటలపైనను గోటకులోపల వెలుపల నయ్యయిస్థలములందుఁ
బోరుగావించుచో బొమ్మలాడినయట్లు దర్శనీయంబయి తత్ప్రదర్శ
నంబొప్పె నయ్యెడ నగచరుల్ రాక్షసుల్ భంజించుకొనువారు భండనమున
గీ॥ వెఱచఱచి నలుదెసలకుఁ బఱచువారు, చచ్చువారును మఱియును నొచ్చువారు
భూరిమూర్ఛలలోపల మునుఁగువారు, పంతములు తప్పఁ జెయ్యేది బడలువారు. 284

కం॥ తెగి పైననాడు తలలకుఁ, దగఁ దొరఁగెడుమొండెములకుఁ దలఁప నెడములే
కగణితముగఁ గొనసాగెన్, ఎగచరరాత్రిచరులకదనము ఘోరంబై. 285

కం॥ బాహాబాహి కచాకచి, సాహసమున నట్టు లుభయసైనికులు మహో
త్సాహభరితులగుచున్ ఘో, రాహవ మొనరింప దొడఁగి రాతఱణమునన్. 286

సీ॥ ఇంద్రజిత్తునితోడ నిపకులాధీశ్వరుఁ డతికాయుతోడ రామానుజుండు
దేవాంతకునితోడ వాయునందనుఁ డానరాంతకునితో నంగదుండు
కుంభునితో రణకోవిదుఁడగుసీలుఁ డానికుంభునితోడ నానలుండు
ధూమ్రాక్షుతోడ నాతోయజాప్తతనూజుఁ డాప్రహస్తుని రావణానుజుండు

గీ॥ తాకి జయకాంక్షులై మహాదారుణముగ, సమరమొనరింపసాగి రాసమయమందు
మేఘనాదుఁడు కోపించి రాఘవులయి, విపులశరతతినిగిడించి పేర్చియార్చె 287

గీ॥ అప్పుడారాముఁ డొక్కమహాద్రివోలె, నచలుఁడైనిల్చి తత్ప్రయుక్తాస్త్రతతుల
నంతరమునవె తునిమితూటాడివైచి, దనుజురథమశ్వసూతయుతముగఁ గూల్చె 288

ఆ॥ అట్లు విరథుఁడైన యాయింద్రజిత్తుపై, సౌంద్రభంగి బహుళసాయకముల
నేసి వెగడునొందఁజేసిన రావణి, తలఁకి రణముమాని తొలఁగిపోయె 289

సీ॥ ఆలోన నతికాయుఁ డాలక్ష్మణునిమీద ననలాస్త్రమేయ నయ్యదికరంబు
మింటనుగ్రక్కుచు మటి రాఁదొడంగిన దానిని వారుణాస్త్రమునఁ జేసి
ప్రతిహతంబొనరించి ప్రబలుఁడౌ లక్ష్మణుఁ డొకశరమునఁ దదీయోపచాప
ముతుద్రుంచి వేతొక్క సునిశితాస్త్రమునఁ దన్నిటలంబు గాడనేయుటయు వాడు

గీ॥ రక్తముస్రవింపఁ గనుఘయాక్రాంతు డగుచు, వీటిపెనుకను వెన్నిచ్చి వేగఁబఱచె
నానరాంతకుఁ డప్పు డాయంగదునకు, నోడి యతికాయుతోఁ దానుఁగూడఁబాఱె. 290

గీ॥ ఇట్లు రక్కసులెల్లను నేపడంగి, తగఁ బలాయనమంత్రము తారు సొంగ
ముగఁబఠించిన యప్పు డానగచరవరు, లతులితోత్సాహభరితులై ర్ట యెడల, 291

## ఇంద్రజిత్తు హోమముచేసి దివ్యరథాయుధములఁబొంది యుద్ధమునకు వచ్చుట

ఉ॥ రావణి సత్వరంబ తన రాజితమౌ మఖశాలఁజొచ్చి య
చ్చో విహితోపవాసరతి స్రుక్కక దీక్ష వహించి నెమ్మదిం
గేవలనిష్ఠలొప్ప సురకిన్నరసాధ్యులు భీతినొందఁగా
జీవబలిప్రధానముగఁ జేయఁదొడంగెను హోమ మత్తఱిన్. 292

గీ॥ అదియు సంపూర్ణమైన సందద్భుతముగ, రథ్యసారథియుతముగ రథముపుట్టె
వివిధరణసాధనంబులు వెలసియున్న, యామహాదివ్యరథమునం దాక్షణంబ. 293

కం॥ అధిరోహించినవాఁడై, ప్రధనమునకు మగుడవచ్చె 'వానరసేనాం
బుధి నే నింకించెద' నని, ప్రథితమహారోషుఁడగుచు రావణి కడిమిన్ 294

గీ॥ వానివెనువెంట నప్పుడు వసుధయాని, నట్లు దానవసైన్యంబు లగ్గలముగ
నరుఁగుదేరఁగ సంరంభమతిశయిల్ల, విపులకోపంబుతోవచ్చి కపులఁదాకి. 295

మ॥ చటులార్కప్రతిమానభీకరశరాసారంబు వర్షించి మ
ర్కటసేనానికురుంబముం గరముపీకన్ నొంచుచుం ద్రుంచుచుం
బటురావంబునఁ బేర్చి యార్చుచు సురవ్రాతంబు భీతిల్ల ను
ద్భటుఁడై వీరవిహారమున్ సలిపె శుంభద్విక్రమాటోపుఁడై 296

కం॥ అట్టియెడఁ గపులు రావణు, పట్టి ప్రయోగించుచున్న బాణంబులు బల్
దట్టముగావచ్చి కదున్, బెట్టిదముగఁదాకుచుండ భీతాత్ములై. 297

సీ॥ కోటలపైనను గోపురంబులపైనఁ గొమ్మలపైనను గోడలపయి
మఱియు నాయాచోట్లఁ దఱచుగానుండిన వానరులెల్ల రావణికి నోడి
నలుదెసలకుఁబాఱ నగరబాహ్యప్రదేశమునఁనున్నట్టి దాశరథి యపుడు
కాందిశీకులయిన కపులకు ధైర్యంబు కఱపుచు వైరివిక్రమమునకును
గీ॥ జోద్యమంది విభీషణుఁజూచి పలికెఁ, 'బసులఁదోలెడుచందాన వానరులను
దాఱఁదోలుచునున్నయా బల్లిదుండు, తలఁపనెవ్వఁడెయుండునో తెలుపుమనఘ'! 298

కం॥ నావిని విభీషణుండా, క్ష్మావరుతోనిట్టులనియె 'స్వామీ! వినుఁడా
రావణునకగ్రసుతుఁ డితఁ, డావంతయుభీతిఁజెందఁ డాహవమున్నన్. 299

చం॥ బలరిపునంతవాని మును భండనమందు జయించి మిక్కిలిం
జలమునఁబట్టితెచ్చి చెఱపాలనుబెట్టి కలంచినట్టి య
త్యలఘుపరాక్రమాఢ్యుఁ డఖిలాస్త్రవిదుం డరిభీకరుండు మా
యలును మహేంద్రజాలములు నన్నియెఱింగినదక్షుఁ డారయన్. 300

గీ॥ వినుఁడు! లంకలోపలనున్న వీరులైన, దనుజులందఱకంటెను దర్పముగను
'వీడెమొనగాడు క్రూరుఁడువీడె కాన, వీనిఁజంపిన జయముప్రాప్తించు నధిప!'. 301

కం॥ నావుడుఁ బరమోత్సాహం, బావహిలన్ రామభద్రుఁ డనుజుఁడుఁదానున్
రావణనందనుతో నని, కావించుటకపుడు వీండ్లు గ్రక్కునఁగొనుచున్. 302

చం॥ తదభిముఖంబుగా నడవఁ దాను ముఖాముఖిదానిపుండునున్
బెదరకయేగుఁదెంచి కడుభీకరలీల నెదుర్కొనన్ మహా
కదనమునంఘటిల్లె శితికంధరుఁడాదిగఁ గల్గునట్టి యా
త్రిదశులు మింటిపైనిలిచి తెల్లముగాఁగని చోద్యమందఁగన్. 303

గీ॥ అప్పు డుభయసైన్యంబులు నద్భుతముగఁ, దాకి వివిధపరస్పరతాడనములఁ
దారు నొప్పించుకొనుచు నుత్సాహమొప్పఁ, బోరఁదొడఁగిరి తద్దయు ఘోరఫణఁగి. 304

కం॥ రామునిపై లక్ష్మణుపై, భీమబలుం డింద్రజిత్తు వృష్టియపోలెన్
భీమంబుగ శితవిశిఖ, స్తోమము నిగిడింపసాగెఁ జాపము బెగడన్. 305

కం॥ ఆరామలక్ష్మణులుత, ద్ఘోరశరంబులనునడుమఁద్రుంచినవారై
ధీరులు సాంద్రముగా బహు, నారాచములేసిరపుడు నక్తంచరుపై 306

గీ॥ వారి బాణఘాతంబులవానఁజేసి, తనువు జర్జరితంబయి తద్దవెఱచి
తక్షణము స్యందనముతోడఁ దానదృశ్యుఁ, డగుచు నాపంక్తికంఠునియగ్రసుతుఁడు. 307

## ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశబద్ధులను జేయుట

చం॥ చటులపరాక్రమంబెసఁగ సంతతపుణ్యుల భానువంశ్యులం
బటుతరనాగపాశచయబద్ధులఁజేసి యనంతరంబ మ
ర్కటులనునొంచి త్రుంచియును గ్రక్కున ధీరతఁ బాఱఁద్రోలియుం
గుటిలుఁడు రావణాత్మజుఁడు కొల్వునకుంజని తంత్రితోఁదగన్. 308

చం॥ తనవిజయంబు చాలవిశదంబుగఁజెప్ప దశాననుండు నం
దనుని పరాక్రమంబునకుఁ దాఁగడుమెచ్చుచు యుద్ధభూమి కొ
య్యనఁజనుదెంచి బద్ధులయి యాకులతంగనుచున్నయట్టి యా
ఘనులను రామలక్ష్మణులఁగన్గొని మిక్కిలి సంతసించుచున్ 309

సీ॥ క్రమ్మఱఁ గొల్వుకూటమ్మునకేతెంచి రావణాసురుఁడు శీఘ్రముగ సీత
చెంతఁగావలియున్న చేడెలరావించి వారితో నిట్లను గారవమున
'సుగ్మలులార! మీ రొనరంగ నిప్పుడా క్షితిసందనను నొక్కశిబికపైన
నెక్కించుకొనిపోయి యేపటి నాగపాశములచేబద్ధులై నగముచచ్చి

గీ॥ యుద్ధభూమిలోపలఁ ద్రెళ్లియున్న రాఘ, వులనుజూపించి యిఁకనైన జలజముఖికి
వారిపైఁగల మమకారబంధమరయఁ, బాయునటుబోధ మీరలు చేయవలయు'. 310

కం॥ అనిచెప్పి పంప వారలు, జనకజ నొకశిబికపైనఁ జయ్యన నాసీ
నను గావించుకొనుచుఁ జని, ఘనముగ సమరస్థలంబుకడఁ జేర్చుటయున్. 311

ఉ॥ సీత భుజంగపాశములచే నటు బంధింతులౌచునున్న ద్వి
ట్జేతల రామలక్ష్మణుల చెంగటఁగన్గొని మానసంబునన్
భీతియు శోకముంబొడమ వెల్వెలఁబోయి 'హతాస్మి' యంచుఁ దా
భూతలమందుఁ ద్రెళ్లి వెసమూర్ఛిలి క్రమ్మఱలేచి యార్తయై 312

ఉ॥ 'హారఘువంశ్యులార! సుగణాకరులార! మహాత్ములార! యీ
తీరుననాకునై కడకుఁ దీరనియాపదకగ్గమీకు నీ
ఘోరముఁజూడఁజాల సిఁకఁ గొందలపాటుజనింపఁజొచ్చె ని
ష్కారణవైరమూని విధి కట్టా! మిముం దుదకిట్లు చేసెనే. 313

గీ॥ ఎట్లు భరియింతు నీగోడు? నేమిసేయ, నగునొ! నాయాసలన్నియు నవసిఁగలిసె
నెట్లు జీవింతు? నేనింక నెందుఁజొత్తు?, పాపిమృత్యువు నన్నేల బ్రదుకనిచ్చె?'. 314

గీ॥ అనుచునిబ్బంగి జానకి యమితముగను, దాను విలపించుచుండ నాతరుణమందు
నుత్తమోత్తమురాలయియొప్పు త్రిజట, యిట్లుపలికెను గారాబ మినుమడింప. 315

## త్రిజట సీతాదేవి నూరడించుట

ఆ॥ 'రమణి! వగవకీవు రామలక్ష్మణులకు, హానికలిగెనేని నఖిలజగము
లస్తక్రుంగిపోవె? యంభోజగర్భుఁడు, లెల్లసమసిపోరె యీక్షణంబ? 316

ఆ॥ పాపజేనిమీదఁ బవలించుశ్రీమహా, విష్ణుఁడైన రామవిభుని కీర్తి
పాప తాళ్లకటు పంకేరుహేక్షణ!, తలఁప నేమిసేయఁగలవు? చెపుమ!. 317

ఆ॥ కాన కొంతవడికి నీనాగపాశముల్, పీడిపోవఁగలవు విపులవిభవ
లొందఁగాంత్రు నృపకు లుత్పలదళనేత్ర!, నీవు చింతవీడు నెమ్మనమున'. 318

గీ॥ అనుచనూరార్చెఁ ద్రిజట యాయువనిసుతను, తాము గొనిపోయి మగుడ యథావిధిగ న
శోకవనమందునునిచి రా సుదతులెల్ల, నంతనక్కడ దానవు లార్తులగుచు. 319

గీ॥ నాగపాశబంధితులయి నవయుచున్న, సూర్యవంశావతంసులచుట్టు మూగి
చేయునదిలేక శోకంబుఁజెందుచుండ, నట్టితఱి నారదుండట కరుగుదెంచి. 320

కం॥ ఆదశరథాగ్రనందను, పాదములకు నధికభక్తిఁ బ్రణతుండగుచున్
సాదరముగ నారదముని, మోదమునందిల్లఁబలికె భూపతిలకుతోన్. 321
కం॥ 'సాకేతనిలయ! మీరిటు, ప్రాకృతజనునట్లు వగవఁబాడియె? వినుఁడీ!
లోకములఁగట్టఁగల మీ, కీకట్లాక లెక్కయే? దినేశకులేశా! 322
ఉ॥ స్వాంతములోన మీరిఁకఁ బ్రచండపరాక్రముఁడైనయట్టి నా
గాంతకునిం దలంపుడు రయంబున నాతఁడువచ్చి మిక్కిలిన్
వింతగ నాగపాశముల వేవదలింపఁగలం' డటంచు భూ
కాంతునితో వచించి ముని గ్రక్కునఁబోయె నిజేచ్ఛ నంతటన్ 323
కం॥ ఆముని చెప్పినచొప్పన, రాముఁడు గరుడునిఁదలంప రయమునఁ బక్షి
గ్రామణి విచ్చేసె మహా, ధామజవోపేతుఁడగుచుఁ దత్సమయమునన్ 324
సీ॥ ఆగరుత్మంతుని యాగమనముఁజూచి యప్పుడువెఱచి పాశాకృతులుగ
నున్న నాగాస్త్రము లొక్కుమ్మడిన్వీడి యాకారశూన్యంబు లగుచుఁజనియె
బంధనిర్ముక్తులై పంక్తిరథాత్మజుల్ కడుపిరాజిల్లి రాగరుడుఁడపుడు
తాను శ్రీరాముని యానతిఁగైకొని నిజధామమునకేగె నెమ్మితోడ
గీ॥ తరుచరులు మహోత్సాహసంభరితులగుచుఁ, గాలుఁద్రవ్వుచునుండిరి కయ్యమునకు
దశముఖుండంత నాగ్రహోదగ్రుఁడగుచుఁ, దానవికిఁబంపెఁ బదుగుర దండుదొరల 325

## రావణుఁడు దేవాంతకనరాంతకాదిరాక్షసులను యుద్ధమునకుఁ బంపుట

సీ॥ స్థిరపౌరుషుండగు దేవాంతకుండును నమితసత్త్వుండు నరాంతకుండు
సంగరవేదియౌ పింగలనేత్రుండు ధృతిమందరుండైన దీర్ఘరోముఁ
డరివీరభంజనుండైన ధూమ్రాక్షుండు సురువిక్రముండు మహోదరుండు
ప్రాకటశౌర్యుఁడౌ నాకరాళుండును దోర్బలశాలియౌ దుర్జయుండు
ఆ॥ అలఘుబలుఁడు త్రిశిరుఁ డామహాపార్శ్వుండు, ననెడువారు పదుగు రసురవరులు
వేగరథములెక్కి విండ్లమ్ములనుగొని, వెడలిరనికి సేన వెంటరాఁగ. 326
గీ॥ ఇట్లు సేనాసమేతులై యేపుమీర, నామహారథసత్తము లఖిలదిశలు
మాఱుమ్రోయంగ నార్చుచు ఘోరభంగిఁ బురముదెలువడివచ్చి వానరులఁదాకి 327
సీ॥ మేదురంబుగ గుణనాదముల్సల్పుచు నృపవరేణ్యులపైనఁ గపులపైన
బలుపిడుగులతోడి వడగండ్లవర్షమోయన శరాసార మత్యద్భుతముగ
వర్షింపసాగి రావానరులప్పుడు తామును దరుశిలాతతులఁ గొనుచు
శాత్రవులనుమోది సమయింపఁగాఁజొచ్చి రారాముఁడును దదీయానుజుండు

గీ॥ చాపదండంబులనుబూని సరభసముగ, సాయకావళిసంధించి సాంద్రముగను
వేయుచున్ దైత్యసేనలనెల్లఁ జీన్గు, పెంటలుగఁజేయుచుండిరి పెంపుదోప. 328

## దేవాంతకనరాంతకాది రాక్షససేనాపతులు యుద్ధములో మరణించుట

గీ॥ ఉభయసైన్యంబులిట్లు మహోగ్రముగను, బెద్దయగుప్రొద్దు పోరుగావించుచుండ
నంత దేవాంతకుండు నరాంతకుండు, నివకులునిదాకి శరతతు లేయుటయును 329

సీ॥ ఆబాణములనెల్ల నంతరమందె తాఖండములుగఁ ద్రుంచి ఘనుఁడు రాముఁ
డిరువదిశరములవేసి సూతాశ్వసంయుతములుగా రథంబులను జూర్ణ
మొనరించి విరథులైయున్న యాదైత్యుల మహితనానానేకమార్గణముల
నేపి నొప్పించిన విరువురుఃప్పుడు భయదకౌక్షేయకపాణులగుచు
గీ॥ వేగధరణికిలంఘించి విక్రమమునఁ, దరణికులుతోడ ఖడ్గయుద్ధమ్మొనర్పఁ
దాము చనుదేర నంగముఁ డామరుత్సు, తుండు తలపడి రసురులతోడ నపుడు 330

గీ॥ అనరాంతకుఁ డతికపికాంతరంగుఁ, డగుచు నంగదునటికె నిజాసిచేతఁ
దత్ప్రహారంబునకు శోణితము స్రవింప, దానికిన్ లెక్కసేయక తరుచడండు 331

గీ॥ ఒక్కపెనుశిలఁగైకొని యుగ్రభంగి, నానరాంతకుపైపైచె నంతవాడు
తలపగిలి లోనిమెదడెల్ల వెలికిరాఁగ, నవనిమీఁదను ద్రెళ్లి గతాసు డయ్యె. 332

గీ॥ అపుడు దేవాంతకునితోడ నంలసుతుఁడు, తరుశిలాదులచేఁ బెద్దతడవుపోరి
వానిజముప్రోలి కతిథిఁగాఁబంపి శౌర్య, తముగ సంగరవిశ్రాంతిఁ దానొసంగె 333

గీ॥ అనిలజుఁడు రామసోదరునడ్డగించి, తాను ధూమ్రాక్షుతోడ యుద్ధమ్మొసలిపి
గిరిశిఖంబెండుగొనివైవ శిరముపగిలి, చావుకేకలుపెట్టుచుఁ జచ్చెవాడు. 334

సీ॥ ఆఋషభుండు మహాపార్శ్వుఁడనువాని ముష్టియుద్ధముచేసి పుడమిఁగూల్చె
తనతోకచే మరుత్తనయుండు త్రిశిరుని గళమునకురివెట్టి కడిమిమెఱయ
గిరగిరఁద్రిప్పి వేఘరమీఁదఁబడవైవ వాడుప్రాణంబులవపలె నపుడు
భీమబలుఁడు నీలుఁ డామహోదరుఁదాకి ద్వంద్వయుద్ధము గొంతతడవుసలిపి
ఆ॥ కడిమినొడిసిపట్టి పుడమిపైజావంగ, మోదుటయును నామహోదరుండు
తనదు కుక్షిపగులఁ దద్దయుగిజగిజ, తన్నుకొనుచుఁ జచ్చె దైత్యుఁడపుడు. 335

గీ॥ జాంబవంతుఁడు కడుసాహసంబుమీర, నాకరాపునితోఁడఁ దానాహవంబు
సలిపి కొండొక్కవడికి నాఖలుని నుగ, రావసికిఁలిచేసె సురాళిపొగడ. 336

కం॥ దుర్జయుఁడనువానినిఁ గడు, నూర్జితబలుఁడైననలుఁడు యుద్ధములోనన్
నిర్జితునింగావించెను, బర్జన్యాదులు తదీయబల మగ్గింపన్. 337
కం॥ లొంగకచెంగక పనసుఁడు, సంగరమొనరించి యమితశౌర్యోజ్జ్వలుఁడౌ
పింగలనేత్రునిఁ గాలుని, చెంగటకుంబంపె లావుచేవదలిర్పన్. 338
కం॥ ద్వివిదుండనువానరవరుఁ, డవిజేయుఁడు దీర్ఘరోముఁడను రక్కసునిన్
మిపులపరాక్రమమొప్పఁగ, బవరంబొవరించి చిత్రవధ గావించెన్. 339
గీ॥ దండుదొరలిట్లు పదుగురుపఁండనమున, నపగతప్రాణులగుటయు నాక్షణంబ
వెఱచి హతశేషులెల్లరుఁ బఱచి యాయు, దంతమంతయుఁదెలిపిరి దశముఖునకు 340

## రావణుఁడు ప్రహస్తుని యుద్ధమునకుఁ బంపుట

గీ॥ తెలుపుటయు రావణుఁడువిని తెల్లఁబోయి, యుల్లమునఁ జింతనొందుచునుండఁ జూచి
యుప్ప డసురసేనాపతియగుప్రహస్తుఁ డాసనముపయినుండి చయ్యనలేచి 341
కం॥ మీసముదువ్వుచు రోసం, బీసునుదోపంగనార్చి యిట్లనిపలికెన్
'వాసవవైరి! మనంబునఁ, బ్రాసమువహియింప నిట్టి తగునే మీకున్? 342
చం॥ సరకుఁగొనన్ దిశాపతులసైతము నుక్కడఁగింతునట్టి! యా
నరులును వానరాధములునాకొకలెక్కయె? శౌర్యమొప్ప సం
గరమునవారినెల్లఁ బ్రుటికాలములోపలఁ గూల్చివత్తు స
త్వరముగ నన్నుఁబంపుడిఁక దైత్యకులాంబుధిచంద్ర!' నావుడున్ 343
గీ॥ తత్ప్రగల్భవాక్యములకు దశముఖుండు, చిత్తమునమెచ్చి పొగడుచు 'శీఘ్రముగను
రిపులనందఱఁజంపి మత్ప్రీతిఁగూర్పు' మని ప్రహస్తునిపీడ్కొల్పె నాలమునకు 344
ఉ॥ వాడుధనుర్ధరుండగుచుఁ బంతములాడుచు నించుకేనిఁ దా
నోడక పెండ్లికేగుగతి నుల్లమునన్ రణకౌతుకంబు తొ
ల్కాడుచునుండఁగాఁ బయనమయ్యె ననేక నిశాటసైన్యముల్
తోడయివచ్చుచుండఁ గడుదోరపుస్యందనమెక్కి యాజికిన్. 345
గీ॥ ఇవ్విధంబున సంరంభమినుమడింప, నాప్రహస్తుఁడు రామున కభిముఖముగఁ
దానుజని గర్జనంబులు తర్జనములు, సలిపియిట్లను గర్వంబు తలకుమీర. 346
ఉ॥ 'ఓనరనాథ! నాయెదుట నోడక యించుకసేపు నిల్వు నీ
సేనల నిన్నుయుద్ధమున సిద్ధము వేడు వధించివైచెదన్
దానవభర్తకుం బ్రియముఁదప్పకకూర్చెద నన్నెఱుంగవే?
వేన సమస్తసేనకధినేతను వేన ప్రహస్తనాముఁడన్.' 347

మ॥ అని శ్రీరామునిపైన లక్ష్మణునిపై నా కీశసైన్యంబుపై
ఘనతీవ్రాశనితుల్యబాణచయముల్ గాఢంబుగాఁ గప్పినన్
ఘను లారాఘవు లిర్వురప్పుడు ధనుష్కాండంబులంగొంచుఁ జ
య్యనఁ బ్రాభంజనియంసభాగములపై నారూఢులై యుద్ధతిన్. 348

గీ॥ ఆప్రహస్తుండు గవియించు నస్త్రతతుల, నంతరమునందె ఖండించి యగ్గలముగఁ
దాము బహుబాణములచేత దైత్యునేసి, గాసినొందింపసాగిరి, కపులుగూడ 349

గీ॥ కరిఘటలలోనఁజొచ్చి భీకరమృగేంద్ర, శాబకంబులు విహరించుచందమునను
దరుశిలాదులవర్షించి దానవులను, జంపుచుం బోరుగావింపసాగి రపుడు. 350

శా॥ హెూరాహెూరిగనట్లు వారుభయులున్ యుద్ధంబుగావించుచోఁ
దేరుల్‌గూలెను రథ్యసారధులిలంద్రెళ్లెం బ్లవంగోత్తముల్
క్రూరుల్ దానవులెందఱో యసువులం గోల్పోయి రవ్వేళలో
ఘోరంబై కనుపట్టుచుండె సమరక్షోణీతలం బంతయున్. 351

కం॥ మఱియును దత్సమయంబున, నతిముఱిరాక్షసులమీద నపశకునముగాఁ
దఱచుగనాడెన్ గృధ్రము, లఱచెశివాతతులు మండె నంబరమెల్లన్ 352

గీ॥ చిత్తమందున నాదుర్నిమిత్తములకు, నాప్రహస్తుఁడువెఱవక యగ్గలముగ
శరతతులనేయుచుండ దాశరధు లంత, రమునవానినిఁద్రుంచుచు రయముమీర 353

గీ॥ రామచంద్రుండు సాయకత్రయముచేత, రథ్యసారథులనుజంపెఁ బ్రథితయశుఁడు
రాముతమ్ముఁడు నాల్గుమార్గణములేసి, తద్రథాంగంబులనుద్రుంచి తక్షణంబ 354

కం॥ వెండియుఁ దచ్చాపం బొక, కాండముచేఁ దుత్తునియలు గావించుటయున్
మండిపడి యాప్రహస్తుఁడు చండగదాదండమపుడు చయ్యనఁ గొనుచున్. 355

గీ॥ తేరిపయినుండిక్రిందికిదిగి ప్రహస్తుఁ, డర్కకులులపై గర్జిలు చరుగుఁదేర
వానితో నీలుఁడప్పుడు తానుగూడ, గదనుధరియించి తలపడెఁ గదనమునకు. 356

కం॥ ఆయగచరరజనీచర, నాయకు లన్యోన్యతాడనములను నదులై
కాయములరుధిరమొలుక గ, దాయుద్ధముపెద్దతడవు తామొనరింపన్. 357

ఆ॥ అంతఁగొంతవడికి నాప్రహస్తునిగద, నింగికెగురఁగొట్టి నీలుఁ డమిత
విక్రమమున నసురవీరుని గదచేత, శిరముఁబగులమోది క్షితినిగూల్చె. 358

గీ॥ ఆప్రహస్తుఁడు మరణింప నటుపదపడి, వెఱచి హతశేషులందఱు వేగఁబఱచి
దశముఖునితోడ నాయుదంతంబుఁదెలుప, నతఁడు నిర్విణ్ణహృదయుఁడై యార్తినొంది 359

కం॥ ఆక్షణమె మేఘనాదుని, రక్షఃపతిపిల్వఁబనిచి రణమునకనుపన్
'శిక్షించి వత్తనిపుడే, వృక్షచరుల నరుల' ననుచు వెడలె నతండున్. 360

## ఇంద్రజిత్తు యుద్ధమునకు బయలుదేరుట

గీ॥ ఇట్లు రథమెక్కి సేనతో నేగుదెంచి, రాఘవులతోడఁ గపులతో రణముసేయ
నప్పు డిరువాగుసైనికులందనేకు, లాజిరంగమునన్ విగతాసులైరి. 361

చం॥ చలమున రావణాత్మజుఁడు శైలశరంబరివోసి యేసినం
దలఁపఁగ దానఁజేసి కడుదారుణభంగి ననేకశైలముల్
బలిముఖసైన్యసంతతులపైఁబడి హానియొనర్చుచుండ బల్
కులిశశరంబుచే నృపుఁడు గొబ్బున వానినిఁద్రుంచె నుద్ధతిన్ 362

మ॥ జ్వలనాస్త్రంబు దశాననాత్మజుఁడు తాసంధించియేయం గపి
ప్రళయంబైన మహాగ్నియుప్పతిలి కాల్పంజొచ్చె నామూకలన్
జలబాణంబునఁజేసి యప్పుడు తదస్త్రంబున్ నిమేషంబులో
జలజాతాప్తకులుండు రాఘవుఁడు తాఁజల్లార్చె నాపిమ్మటన్. 363

కం॥ దారుణతరనాగాస్త్రం, బారావణియేయ దాని నంతరమందే
భూరిబలుఁడు శ్రీరాముం, డారయఁబొడిసేసె గారుడాస్త్రముచేతన్. 364

మ॥ రిపుసందోహభయంకరుండగు దశగ్రీవాత్మజుం డత్తఱిం
జపలస్వాంతుఁడుగాక వెండియుఁ దమోస్త్రంబుంబ్రయోగించి తా
విపులధ్వాంతముఁ బర్వఁజేయుటయుఁ బృథ్వీనాథుఁడౌ రాఘవుం
డుపసంహారముఁజేసెఁ దద్ఘనశరం బుష్ణాంశుబాణంబునే. 365

గీ ఇట్లనేకదివ్యాస్త్రంబు లింద్రజిత్తు, తాఁబ్రయోగించుచుండ నాదాశరథియుఁ
బ్రతిశరములేసి వానినిఁ బ్రాకటముగఁ బ్రతిహతంబులు చేయుచువచ్చెనపుడు. 366

ఆ॥ ఇంద్రజిత్తు మఱియు నెమ్మెయినైనను, రాఘవులను గపుల రణమునందు
రూపుమాపఁదలఁచి రూఢిగామాయలు, నింద్రజాలములను నెన్నొపన్ని. 367

సీ॥ కొండొకవడి మహాగండశిలావృష్టిఁ గపులపైఁ గురియించి గాసిపఱుచుఁ
గొండొకవడి భూతకోట్లనుసృజియించి డీకొల్పిరిపులఁ బీడింపఁజేయుఁ
గొండొకసేపు ప్రచండతరవ్యాఘ్రసింహాదులను సృష్టిచేసి విడుచుఁ
గొండొకవడి బహుఘోరాహివృశ్చికతతులనుబుట్టించి వెతలఁబెట్టు

గీ॥ మఱియు నిన్నిన్నియనరాని మాయలిట్లు, తానుబన్నినవాడయి తరుచరులను
దాశరథులను నఱయించి దానవుండు, పిదపబ్రహాస్త్రమును వేగపేఁటఁ దొడిగి. 368

గీ॥ 'ఇదిగొ! కాచికొనుండు మీరెల్ల' రనుచు, హెచ్చరించినవాడయి యింద్రజిత్తు
భూరితరమంత్రపూర్వకముగనువిడిచె, నయ్యమోఘాస్త్ర మప్పుడయ్యమరు లడల. 369

ఇంద్రజిత్తు రామలక్ష్మణులను బ్రహ్మాస్త్రముచే మూర్ఛిల్లఁజేయుట

సీ॥ దిఙ్నభోవ్యాప్తదీధితిపుంజములతోడ భయదకఠోరరావములతోడ
నఖిలంబు దానయై యతివేగమునఁ బెనుమంటలుగ్రక్కుచు మహితలీల
వచ్చితాఁకుటయుఁ దద్వ్యాఘాతమునఁజేసి గాలిచేఁ దరువులకూలునట్లు
కపులును నృపులును గాయముల్ జర్ఝరితంబుల్లై రక్తంబు తఱచుపాఱ
గీ॥ సమరభూమినిఁద్రెళ్లి మూర్ఛలమునింగి, రట్టియెడ నావిభీషణుఁ డజునివరము
లందుటంజేసి తన్నుబ్రహ్మాస్త్రమించు, కంతయును నొంపఁగాఁజాలదయ్యె మఱియు 370
ఆ॥ పవననందనుండు బ్రహ్మమంత్రములను, భక్తిపూర్వకముగఁ బఠనచేసి
ప్రాకటముగఁ దానుబ్రహ్మాస్త్రమునకును, దప్పె నట్టియెడల దానవుండు 371
కం॥ హతశేషములైనదానవు, లతిముదమునవెంటరాఁగ నారావణి స
మ్మతితోడఁ బోయి దానవ, పతికిన్ సర్వంబుఁదెలియఁబఱచెం బ్రీతిన్. 372
సీ॥ ఆప్పుడు రావణుండానందభరితుఁడై యాహవభూమికినరిగి యందు
మూర్ఛితులైయున్న భూరిబలాఢ్యులఁ గపులను నృపులను గాంచివచ్చి
మేఘనాదునిఁ జాలశ్లాఘించుచుం బల్కెఁ 'బ్రకటశౌర్యాఢ్య! నీవంటిసుతుఁడు
గలుగ నాకెపుడైనఁగాని పరాజయ మనుమాటపుట్టునే యరసిచూడ?
గీ॥ నీదుప్రాపునఁగాదె నేనిర్జరేంద్రుఁ, దొల్లిరణరంగమునఁ బాఱఁద్రోలుటెల్ల?
నీదుప్రాపునఁగాదె యీనిఖిలలోక, ములకు నేనే ప్రభుండనై వెలయుటెల్ల 373
గీ॥ ఇట్టిమొనగాడవైయుండి కట్టయొక్క, సర్వసామాన్యవనితయౌ జనకసుతను
వశగతనుజేసికొనుటకు వశముగాక, యెంతయో వంతఁగనుచుంటి నింద్రజిత్తు'!. 374
ఉ॥ నావుడు నుబ్బిరావణి ఘనంబుగరావణుతోడ నిట్లనున్
'దేవమరుచ్చమూపతుల దిట్టతనంబున దానురాంద్రగా
దేవర! యేలుకొన్న కడుదీరుఁడ విట్లొక యాడుదానినిన్
నీవువశంబుఁజేసికొననేరక చింతిలుచుండు టొప్పునే? 375

రావణుఁ డింద్రజిత్తుతోఁ దనకు బ్రహ్మ శాపమిచ్చిన వృత్తాంతము దెలుపుట

కం॥ ఆగజగామిని సీతను, వేగంబగబలిమిఁబట్టి విన్నలఁబిడిగా
భోగింపుడు ప్రియుమారఁగఁ, పేగెటుటిల్లంగఁబోదు సిద్ధముతండ్రి!' 376

గీ॥ అనుచుఁ బ్రోత్సాహవాక్యంబు లాడుచున్న, కొడుకునుంజూచి దానవకుంజరుండు
పెద్దతడవువిచారించి పేర్మిఁదోప, నింద్రజిత్తుఁగనుంగొని యిటులనియె. 377

కం॥ 'వలవనివనితలఁ బట్టుచు, బలవద్రతిసేయకుండఁ బటుమోరంబౌ
నలువయొసంగినశాపము, కలదది వివరింతు వినుము! ఘనశౌర్యాఢ్యా! 378

సీ॥ అవధరింపుము! తొల్లి యసురసేనలుగొల్వ నెలమి దిగ్విజయార్థమేగి పెక్కు
లైన ప్రదేశంబులందుఁ జరించుచు వింధ్యాద్రిచెంగట విడిసియుండ
మితసఖీజనపరివృతయౌచుఁ బుంజికస్థలయను నొక్కసౌందర్యరాశి
యైన యచ్చరలేమ యాబ్రహ్మసభఁజేరఁ దత్ప్రాంతమునమండి తానుజనుచు

గీ॥ నాకు నయనగోచరయైన నాతిరూపు, రేకఁగన్గొని మన్మథోద్రేకమొదవ
బలిమిమై నాలతాంగినిఁబట్టి తనివి, దీరభోగించి విడిచితి ధీరవర్య! 379

చం॥ అదికమలాసనుండెఱిఁగి యాత్మగతంబున నాగ్రహించి తా
'నిదిమొదలెన్నఁడైన వరియింపని స్త్రీలను బల్మిఁబొందుచోఁ
బదితలలల్లెవ్రీలి వెసఁ బంక్తిముఖుండు గతించుఁగాక!' యం
చదయత నాకొసంగెను భయంకరశాపము నాటినుండియేన్. 380

సీ॥ ఆకారణంబున నంగీకరింపని భామినులనుఁబట్టి బలిమిఁగూడ
నోడుదుఁగావున నోపినయంతయు సామముచేతనె జనకసుతను
నస్మద్వశీకృతయగునట్లు గావించుకొనఁదగు నని యెడుకోర్కితోడ
నింతకాలమునుండి యెన్నెన్నొపాటులు పడితినిఁగాని లాభంబులేదు

గీ॥ ఏమిసేయువాఁడ? నింకేదికర్తవ్య?, మెట్లుపొందనేర్తు నిందుముఖిని?'
ననుచుఁ బెక్కుగతుల నార్తిఁజెందుచునున్న, పంక్తివదనుఁజూచి ప్రాకటముగ 381

ఉ॥ అప్పుడు రావణిప్రభృతు లాదివిజారి కనేకభంగులం
జెప్పి తదార్తినిందొలఁగఁజేసిరి పిమ్మట దైత్యులందఱుం
జెప్పఁగరానిసంతసము చిత్తములందునఁ దాండవింపఁగాఁ
దప్పకయోలలాడుచును దాము యథావిధినుండునంతటన్, 382

## మూర్ఛితులగు రామలక్ష్మణులఁజూచి విభీషణాంజనేయులు శోకించుట

సీ॥ అటుపదంపడి రాత్రియాసన్నమగుటయు నంతటం జీకటులావరించె
నాసమయంబున నాయుద్ధభూమిలో ననిలాత్మజుఁడు రావణానుజుండు
నెవరెవ్వ రెందెందు నేమయియుండిరో చూతముగాకనుచుం దలంచి
కొఱవులువెల్గించుకొని తాము తత్ప్రదేశంబెల్ల రోయుచో సమరతలము

గీ॥ బహుశవాకీర్ణమయ్యును బహుపిశాచ, శాకినీడాకినీభూతసమితికాల
వాలమైయుండి కరము బీభత్సమగుచుఁ, గానఁబడుచుండ మనములఁ గలతఁజెంది 383

కం॥ వారట్లువెదకుచుండఁగ, దారుణరక్తమునఁదోగి తద్దయు మూర్ఛా
వారిధిమునిఁగిన రాఘవు,లారయఁ దమకందొకయెడ నెగపడుటయునున్ 384

కం॥ ఎనలేని కొండలముపై, కొనుటయు ధృతిఁగోలుపోయి కుయ్యోమొఱ్ఱో
యని గుండెలుబాదుకొనుచు, ఘనముగ విబ్బంగినేడ్వఁగడఁగిరి వారల్ 385

కం॥ ఏపాపంబెఱుఁగని యీ, క్ష్మాపాలగ్రామణులకుఁగట్టా! నేడా
పాపపువిధిమూలంబున, నీపాటుఘటిల్లెఁగాక! యేమనవలయున్? 386

చం॥ కటకట! యేమిసేయుదుము? కాలమునెమ్మెయిఁ బుత్తుమింక? సం
కటములఁబాపికావఁగల కారుణికోత్తములెవ్వరిందు లే
రెటుభరియింతు? మీయుసురు లెట్లుధరింతుము? తోపదేమియుం
గుటిలత నిట్లుచేసెఁ దుదకుం గృపమాలినదైవ మిత్తఱిన్. 387

సీ॥ మనలఁజంపకయేల మానెనురావణి? యెటుచూతు మీఘోర మెందుఁజొత్తు?
మింకనెయ్యదిదారి యీవిపదంభోధి నెమ్మెయిదాటుదు మెట్టులొక్కొ!
'హాదైవమా!' యని యార్తులై వారట్లు పెక్కుభంగులవిలపించి రంత
నాగ్రహోదగ్రుఁడై హనుమంతుఁడిట్లను 'నీరాఘవేంద్రుల నిట్లుచేసి
గీ॥ నట్టి ఖలు నింద్రజిత్తు నేడాహవమున, హరిహరబ్రహ్మలే యడ్డమైనఁగాని
పట్టిచంపుదు నొంపుదు వానియెఱచి, వివిధభూతాళికినిఁబెట్టి విందుఁగూర్తు 388

సీ॥ అదియట్లులుండె దశాననున్ సపరివారంబుగ నాదువాలంబుచేత
పీకమై బంధించి వ్రేల్మిడిఁగొనిపోయి యాలవణాంభోధియందు ముంచి
నిరవశేషంబుగ నేనుమర్దించెద నిన్ను లంకారాజ్యనేతఁగాఁగ
జేయుదు నన్నయీశ్రీరాముప్రతిన నిరంతరాయముగఁ జెల్లింతుఁగాక!
గీ॥ తేకయుండిన రాముపై నాకుఁగలుగు, భక్తివిశ్వాసములు బూదిపాలుగావె?
కాల్పనే నాదుబాహువిక్రమమదెల్ల, నోవిభీషణ! మఱియేల జీవితంబు?' 389

సీ॥ అని రోషతామ్రాక్షుఁడై మారుతాత్మజుఁ డటువీరోక్తుల నాడుచుండ
వినియావిభీషణుఁ డనునయోక్తులచేతఁ దత్కోపమెల్ల డిందంగఁజేసి
యిట్లని వాక్రుచ్చె నీకష్టమెట్టైన జాంబవంతుఁడు పాపఁ జాలునతఁడు
మనియుండెనో లేక మ్రగ్గియుండెనొ చూతమని పావనికిఁజెప్పి యాక్షణంబ

గీ॥ రావణానుజుఁ డాసంగరస్థలంబుఁ, గలయవెదకుచు శోకంబుగడలుకొనఁగ
సర్వమెఱిఁగినప్రోడయౌ జాంబవంతుఁ బేరెలుంగెత్తి పలుమార్లు పిలుచుటయును. 390

కం॥ భీకరమగు బ్రహ్మాస్త్రపుఁ, దాకున మేనెల్లగాడ ధాత్రిని వొకచో
వీక దొరఁగిత్రెళ్లిన భ, ల్లూకవిభుఁడు దుఃఖవిహ్వాలుండగుచు వెసన్. 391

కం॥ హీనస్వరమున నాతఁడు, దానవవిభుదరికిఁ జీరి తానిట్లనియెన్
మానుగ బ్రహ్మాస్త్రముచే, హానిం జెందక విభీషణా! బ్రదికితివె? 392

కం॥ మనవార లెవ్వరెవరిఁక, మనియుండిరొ చెప్పుమయ్య! మహితయశులు స
జ్జనసుతులు రామలక్ష్మణు, లనఘా! యెటున్నవారొ యరుదుగఁ జెపుమా!. 393

సీ॥ అదియట్టులుండె మున్నంభోధిఁ బల్వలమట్లు లంఘించిన యట్టివాడు
సీతసందేశము శ్రీరాముతోఁ జెప్పి తత్ప్రేమపాత్రమై తనరువాడు
జలజమిత్రకుమారు సచివులలోపల నగ్రేసరుండయి యలరువాడు
ధైర్యశౌర్యబలప్రతాపాదిగుణముల నసమానుఁడననొప్పు నట్టివాడు
గీ॥ సాటిలేనట్టిమేటి కేసరిసుతుండు, ప్రాణములతోడనుండెనా భద్రమెయగు!
నతఁడు మరణించియుండెనా యందఱు మఱి, బ్రదికియుండియుఁ జచ్చినవారెసుమ్ము!

గీ॥ ఆమహాబలనందను క్షేమవార్త, తొలుతఁ దెల్పుము చెవులవిందుగ నటంచుఁ
బ్రార్థనాపూర్వకంబుగఁ బంక్తివదను, ననుఁగుదమ్ముని నడుగుచున్నంతలోన. 395

ఆ॥ అనిలపుత్రకుండు తనకుదేవునియట్ల, దర్శనంబొసంగఁ దానుమురిసి
రవికులేంద్రులైన రామసౌమిత్రుల, పజ్జకేగి జాంబవంతుఁ డపుడు 396

సీ॥ రామునియొక్కయు సౌమిత్రియొక్కయు నాడిఁబరీక్షించి యోడకుఁడిఁక
పీడుడుశోకంబు వీరుసజీవులైయున్నవారనుచును విన్నవించి
మఱియు నదేరీతినఱిముఱి నందలి కపియూధములఁగాంచి క్రమముగాను
నాడినిఁబరికించి యాడుచుండుటయును బ్రముదితహృదయుఁడై పలికెనిటు
గీ॥ మీరుచింతింపఁబోకుడీ! వీరికెల్లఁ, బ్రాణభయమించుకయులేదు ప్రబలమైన
మూర్ఛలోపలఁ దామిట్లుమునిఁగియుండి, రట్లగుటఁదెల్పెదన్ వినుఁడనఘులార! 397

సీ॥ ఇచటికి మున్నూటయేఁబదామడలదూరంబునఁ బ్రాగ్దిశాప్రాంతమందు
సర్వదివ్యౌషధజాలంబులకు నాలయంబైన ద్రోణాఖ్యయనునగంబు
కలదందు సంజీవకరణియు సంధానకరణియు సావర్ణకరణియును వి
శల్యకరణియునాఁజను చతుర్విధములౌ నౌషధంబులు గల వందులోన

గీ॥ నవయవంబులు తునిసినట్టైన మగుడఁ, దలఁపఁ దానతికించుసంధానకరణి
యస్థులెల్లను జూర్ణంబులైనయెడలఁ, జక్కఁ జేయంగఁగలదు విశల్యకరణి 398

కం॥ సౌవర్ణకరణియొక్కప్ర, భావంబేమందుఁ ధనువుపైసోకినచోఁ
గేవలసువర్ణమయశో, భావంతముఁ జేయఁగలదు పరికింపంగన్. 399

కం॥ మృతులనుసైతముసంజీ, వితులుగఁ జేయఁగఁగలదుప విత్రౌషధమ
త్యతులితమై ధరలోనం, చితముగసంజీవకరణి చెన్నలరారున్' 400

కం॥ అని తద్దివ్యౌషధముల, ఘనమహిమంబెల్లఁ బొగడి గ్రక్కునవానిం
గొనితెచ్చిన బ్రదికించెద, ననఘాత్మకులార! వీరినందఱ నమచున్ 401

గీ॥ అక్షణంబ ద్రోణాద్రి కాయనిలసుతుని, నర్కుఁడుదయించుటకుముందె యౌషధములఁ
దెమ్మనుచుఁ జెప్పి తానుబుత్తెంచుటయును, వెడలె నాంజనేయుఁడు మహావేగమునను

## హనుమంతుఁడు ద్రోణపర్వతమును దెచ్చుట

కం॥ ఆవిధమున ద్రోణాద్రికి, నావాయుతనూజుఁడరిగి యాయోషధులం
దావెదకివెదకి వానిని, వావిరిగుర్తింపలేక పదపడివీకన్. 403

కం॥ అమితబలోపేతుండై, విమలౌషధనిలయమగుచు వెలసెడు నాద్రో
ణమహీధరమును గాడుపుఁ, గొమరుండు పెకల్చి మోసికొనివచ్చుటయున్ 404

గీ॥ అప్పు డద్భుతహర్షంబు లావహిల్లఁ, దనమనంబున మారుతతనయుఁడోష
ధులనుగుర్తింపనేరక యెలమినట్టు, లద్రిఁగొనితెచ్చెఁగాఁబోలు ననుచుఁ దలఁచి 405

గీ॥ పర్వతమునెక్కి యాజాంబవంతుఁడపుడు, తావెదకి యందుఁగలుగు సంజీవకరణి
మున్నుగాఁగలయోషధుల్ క్రన్నఁగొని, రామలక్ష్మణులకుఁ గపిప్రవరులకును 406

సీ॥ శాస్త్రసమ్మతముగఁ జయ్యన నవిప్రయోగించి సర్వులకుఁ జికిత్ససేయ
శకలావయవములఁ బ్రకటితంబుగను సంధానంబుఁ జేసె సంధానకరణి
చూర్ణంబులైన యస్థులనువెండి విశల్యకరణిసోకిన మొల్చికరముఁబొలిచెఁ
దనువులపైనఁ దద్దయు సువర్ణచ్ఛాయఁ బ్రబలంగఁ జేసె సౌవర్ణకరణి
గీ॥ సంశయావస్థలోనున్న సత్యమూర్తు,లైన రామలక్ష్మణులను వానరులను
శీఘ్రకాలములోన సంజీవితులుగఁ, జేసె సంజీవకరణి ప్రసిద్ధముగను. 407

చం॥ ఇటులఁ జికిత్సచేయుటయు నెల్లరు మూర్ఛలఁదేరి స్వస్థులై
చటులతరప్రమోదరససాగరమందుమునింగి చివ్వకుం
బటుగతిఁ గాలుఁద్రవ్వచును బంబినవేడుకఁబొందుచున్న మ
ర్కటులను భూపనందనులఁ గన్గొని ఋక్షవిభుండు ప్రీతుఁడై. 408

కం॥ అమ్మారుతనందనునిం, గ్రమ్మఱ 'నోషధులకొండఁ గడఁగి యథాస్థా
నమ్మునను నిచి రయమ్మున, ర' మ్మని చెప్పుటయు నతఁడు ప్రమదంబెసఁగన్. 409

కం॥ కొనిపోయి ద్రోణశైలము, ఘనముగమున్నున్నచోట గ్రక్కుననిడి తాఁ
జన దెంచె వాయుతనయుం, డనిమిషసంఘములు చూచి యతిముఱిఁబొగడన్. 410

కం॥ ఇదియిటుండె నచట దశ, వదనుండనుచరులవలన వనచరులు నృపుల్
బ్రదికినవృత్తాంతమువిని మదిలోనెంతేని వగచి మఱియాపిదపన్ 411

## రావణుం డతికాయుని యుద్ధమునకుఁ బంపుట

ఆ॥ అరయఁ దానుదొలుత నాధాన్యమాలిని, వలనఁగన్నయట్టివాని దిట్ట
యైనవాని సురగణాజేయు నతికాయుఁ, బంపె సమరమునకుఁ బంక్తిముఖుఁడు. 412

ఉ॥ ఆయతికాయుఁ డట్లనికి నాయితమైచనుచున్నచో మహా
కాయుఁడకంపనుండు బలగర్వితుఁడౌ మకరాక్షుఁ డాదిగం
బాయకపెక్కుమంది భటవర్గముగొల్వ రథాధిరూఢుఁడై
పోయి ప్లవంగసైన్యములఁ బొల్పఱఁదాకెను భీకరంబుగన్. 413

చం॥ అగచరసేనలప్పుడు భయంబొకయించుకలేక తారునుం
బగతురఁదాకి యశ్మతరుపంక్తులురువ్వుచుఁ జాలనొంచుచున్
జగడముసేయసాగిరి భృశంబుగ ఖేచరులెల్లగుంపులై
గగనతలంబునన్నిలిచి గాఢముదంబునఁజూచి మెచ్చఁగన్. 414

ఉ॥ కొంతవడిం బ్లవంగభటకోటియు రాక్షసు లట్లుపోరుచో
నంతకుమున్ను వ్యోమమునఁనంటిన తద్భదధూళి యత్తఱిన్
వింతగఁ దత్పరస్పరవిభిన్నతనూద్గతరక్తవారియ
త్యంతము నారజఃపటలమంతయు వేనుడిగించె నొక్కటన్. 415

ఉ॥ అట్టియెడన్ లయాంతకునియ ట్లతికాయుఁడు పీకనార్చుచుం
గట్టులుకన్ రఘూద్వహుని గాఢరయంబునవచ్చియుద్ధతిన్
గట్టిగఁ దానదల్చి కడుఁగారులుప్రేలుచుఁదాకి మిక్కిలిన్
దిట్టతనంబుఁ జేవయును దెల్లముగాఁగను బోరుచుండఁగన్. 416

మ॥ కని యాలక్ష్మణుఁడంత రామవిభుతో క్ష్మానేత! యీతుచ్ఛునిం
దునుమాడన్ మఱి మీరుకావలయునే? దోస్సారమేపార మ
ద్ధనకోదండవిముక్తభీకరమహాకాండప్రహారంబులం
గనుఁడీ! వీని నిమేషకాలమున వీకన్ నేను మర్దించెదన్' 417

కం॥ అనిపలుకుచు లక్ష్మణుఁడా, యినకులపతిఁ గడచివచ్చి యేసెను నతికా
యునిఁ దానుదాకి సంగర, మొనరింపఁదొడంగె సమరు లోలిమతింపన్. 418

సీ॥ ఇబ్బంగిఁ దలపడి యిరువురుపోరుచో వారు ప్రయోగించు దారుణాస్త్ర
ములు జగద్భీకరంబుగ నంతరమునందు నొండొంటితోఁదాకి మండసాగె
నప్పుడు లక్ష్మణుం డతికాయుఁ బదునైదు శరములనేసి తావిరథుఁజేసి
వెంటనే వేఱొక్క విశిఖంబుసంధించి తన్నిటలంబు క్షతంబుగాఁగ
గీ॥ నేసె నేసిననాతఁడు గాసినొంది, బొంగరంబట్లు తిరుగుచు భూమిమీదఁ
ద్రెళ్లి కొండొకసేపు మూర్ఛిల్లుటయును, నదికనుంగొని దానవు లందఱపుడు. 419

కం॥ కోపించి లక్ష్మణునిపై, నేపునఁ దార్కొగవిసి యెంతయుఁ గడిమిం
దూపులగమి నిగిడించుచుఁ, జూపఱుబెగడొందఁబోరఁజొచ్చిరి దనుజుల్. 420

గీ॥ చెదచెడక లక్ష్మణుఁడంత సింగమువలె, వీరగర్జనమొనరించి విక్రమమున
మూకపైఁ దానుగవిసి యుద్రేకమునను ఘోరశరముల నసురులఁ గూల్పసాగె, 421

గీ॥ అట్లనేకులతో సుమిత్రాత్మజుండు, పోరుచుండఁగ శ్రీరామభూవిభుండు
తమ్మునకుఁదోడు తానును దరుచరులును, వచ్చిదైత్యులఁదాకి దోర్బలము మెఱయ. 422

గీ॥ తరుశిలావృష్టిచేతను దరుచరులును' బహుశితాశుగవృష్టిచే భానువంశ్యు
లటులముంచుచు నొంచుచు హతముచేసి, సన్నమొనరించి రాదైత్యసైన్యములను. 423

గీ॥ ఇంతలో మూర్ఛఁదేరి యక్షీణబలుఁడు హతరిపునికాయుఁ డతికాయుఁ డఖిలదిశలు
మాఱుమ్రోయంగనార్చుచు ఘోరభంగి, రాముతమ్మునెదుర్కొవి రౌద్రమెసఁగ. 424

## అతికాయాదిరాక్షసవీరులు యుద్ధములో హతులగుట

శా॥ 'ఓరీ! లక్ష్మణ! నిల్వునిల్వుమిఁక నీ పుర్వీస్థలింజొచ్చినం
దారాధ్వంబునకేగిదాగిన మహెూద్యద్విక్రమంబొప్ప మ
ద్ఘోరాస్త్రంబుల రూపుమాపెద నినుం గ్రూరా! నిమేషంబులో
రార' మ్మంచుఁ బ్రగల్భములఁపలుకుచున్ రౌద్రంబు శోభిల్లఁగన్ 425

మ॥ పటుకోదండగుణక్వణంబులు దిశాభాగంబుభేదిల్లఁగం
జటులామర్షణవేగసంజనిత చంచద్విస్ఫులింగంబు లు
త్కటభంగిం గనుదోయిరాలఁగ మహాధైర్యంబు సొంపార ను
ద్భటుఁడై వృష్టిఘాతి లక్ష్మణుపై వర్షించె దివ్యాస్త్రముల్. 426

ఉ॥ ఆయతికాయుఁడట్లు నిశితాశుగముల్ పరగించుచుండఁ ద
త్సాయకముల్ వడిన్ నడుమ సాహసమొప్పఁగ ద్రుంచి లక్ష్మణుం
డాయతపావకాస్త్రము రయంబున లక్ష్యముఁజూచియేయ హా
హాయనుచుం గరంబఱచి యయ్యసురుం డిలఁద్రెళ్లి చచ్చినన్. 427

సీ॥ అప్పుడు తత్సహాయార్థులౌ కంపనాకంపనులును మహాకాయుఁడాది
కొందఱు దనుజులు కోదండములుపూని మేదురశింజినీనాదములను
జేయుచు భీకరసింహనాదములతోఁ జనుదెంచి రామలక్ష్మణులపైన
వానరసేనపై బహుశిలీముఖవృష్టిఁ బరగించుటయు రామభద్రుఁడంతఁ
గీ॥ దన్మహాశరవర్ష మంతరమునందె, తానువారించె విశిఖసంతతులచేత
నామహాకాయుతో నప్పుడంగదుండు, ఘోరతరయుద్ధమొనరించి కూల్చెవాని. 428

గీ॥ అప్పు డలుకమై మకరాక్షుఁడనెడు దనుజుఁ, డినకులునిపైన బెక్కమ్ములేయసాగె
వానినన్నిఁటి నడుమనే వమ్ముచేసి, పావకాస్త్రముచేఁ జంపె వానినృపుఁడు. 429

గీ॥ బలవదరిఘోరవనదవానలుఁడు నలుఁడు, కంపనుండనువానినిఁ జంపివైచె
నశనితుల్యంబులగు ముష్టిహతులచేత, నాయకంపనుఁ బరిమార్చె ననిలజుండు. 430

కం॥ మఱియునుఁ దక్కినమూకల, నఱిముఱివానరులుపట్టి హతమొనరింపన్
వెఱచి హతశేషులప్పుడు, పఱచిరి రావణునికడకు భయకంపితులై. 431

ఆ॥ వారివలనఁ బంక్తివదనుఁ డాయతికాయు, మరణవార్తనెఱిఁగి పరితపించి
కొంతవడికిఁదేరి కోపంబుపెంపార, నసుచరులనుజూచి యతఁడుపలికె. 432

## రావణుఁడు నిద్రితుఁడైన కుంభకర్ణుని సభకు రావించుట

ఉ॥ 'సేవకులార! మీరలిఁకఁ జెచ్చెఱఁబోయి మదాజ్ఞఁదెల్పి ని
ద్రావివశాత్ము నాయనుఁగుఁదమ్ముని ధీరునిఁ గుంభకర్ణు మీ
రేవిధినైన మేల్కొలిపి యిచ్చటికిన్ మఱి తోడితెం' డనన్
రావణునానతింగొనుచు రాక్షసభృత్యు లనేకు లత్తఱిన్. 433

కం॥ రయమునఁజని ఘటకర్ణుని, శయనాగారంబుఁజొచ్చి శయ్యపయిఁ గడున్
భయదముగ గుఱ్ఱువెట్టుచు, శయనించినకుంభకర్ణు జలధరవర్ణున్. 434

గీ॥ ఆభటులు డాయఁగాఁబోయి యార్పులెసఁగ, 'లెమ్ము! లేలెమ్ము! ఘటకర్ణ! లె' మ్మటంచు
నెంతపిలిచినఁగాని యావింతరక్క, సుండు కదలక రాయియట్లుండె నపుడు 435

గీ॥ పటహకాహళదుందుభిప్రముఖతూర్య, ములను మ్రోయించియును గదాముసలముద్గ
రాదులగునాయుధములచే మోదియు మఱి, యంతకినులేవకయేయున్న నసురభటులు.

గీ॥ చెలచెలంగాచి తైలమ్ముఁ జెవులయందు, దుత్తలకొలందిపోసియు మత్తకరుల
చేతఁ ద్రొక్కించియునుఁ బెక్కురీతులనిటు, తాముహింసింపఁగాఁ గొంతతడవునకును 437

కం॥ బిట్టాపులించి దానవుఁ, డట్టే మేల్కాంచి మిగులనార్పులుచెలఁగం
గట్టలుకతోడ నాతం, డిటులనుచుఁ బలికె దైత్యులెల్లరు బెగడన్ 438

గీ॥ 'మొఱకుఁదనమున నిమ్మెయి మేలుపులేక, చెఱుపనేటికి నానిద్ర? చెనటులార!
చెప్పు' డనవుఁడు భీతిల్లి సేవకులిటు, విన్నపించిరి యతనితో వినయమెసఁగ. 439

కం॥ 'మావిన్నపమాలింపుడు, దేవర, కోపింపవలదు తెలిపెదము దశ
గ్రీవుఁడు నినుఁదోడ్తేరఁగ, వేవేగమె మమ్ముఁబంపె విచ్చేయుడిఁకన్' 440

ఉ॥ నావిని కుంభకర్ణుఁడు మనంబున మిక్కిలిసంతసించి యా
సేవకబృందముల్ గొలువఁ జెచ్చెఱఁ దా సభ కేగుదెంచినన్
రావణుఁ డప్డు సోదరునిరాకకు మోదమునివ్వటిల్ల స
ద్భావముతోడ నాసనముపైన నధిష్ఠితుఁజేసి యిట్లనున్ 441

కం॥ 'ఓతమ్ముఁడ! తెలిపెదవిను, మాతరణికులావతంసుఁడగు రామునతిన్
సీతనుజెఱఁదెచ్చితి ము, న్నాతరుణినిమిత్త మిప్పు డపరిమితంబౌ 442

కం॥ వనచరసేనలఁగొనుచున్, జననాథుఁడు తదనుజుండు సంగరమునకై
చనుదెంచి దనుజముఖ్యుల, ననేకులనుజంపివైచి రతులితబలులై. 443

కం॥ ఆరామలక్ష్మణులఁ బరి, వారయుతముగాఁగఁ బోరఁ బరిమార్చి వెసన్
రారమ్ము! పొమ్ము! తమ్ముఁడ!, బీరమ్మేపార లావుఁజెంపును దోపన్'. 444

కం॥ అని శ్లాఘాపూర్వకముగ, దనుజోత్తముఁ డనికిఁదన్నుఁ దాఁ బురికొలుపన్
విని కుంభకర్ణుఁ డగ్రజుఁ, గనుఁగొని యిట్లనుచునుడివె గరిమంబెసఁగన్. 445

## రావణకుంభకర్ణుల పరస్పరసంభాషణము

చం॥ 'వినుమసురేంద్ర! విద్యయు వివేకము గల్గినవాడ వీవెటుం
గనిమహనీయధర్మములు కన్గొనవెందునులేవు సుమ్ము! స
జ్జనములు ఛీ యటంచుననిశంబును నిందయొనర్ప నిట్టులో
ప్పనిపరకాంతలం గరము బల్మిమెయిం జెఱఁదెచ్చు టొప్పునే?. 446

మ॥ ఆదియందుండె సమస్తదైత్యకులసంహారార్థమై విష్ణువే
యుదయించెన్ రఘురాముఁడై యతనికీ యుర్విన్ సహాయార్థులై
త్రిదశుల్ పుట్టిరి కీశులై వినవె? వారిన్ యుద్ధరంగంబునన్
త్రిదశారాతికులావతంస! మనకున్ నిర్జింపఁగా శక్యమే?. 447

సీ॥ ఆరామవిభు భార్యయగు సీత సాక్షాద్రమాంశసంభూతురాలా మెనకట!
యన్యాయకృతముగ నపహరింపఁగనేల? శ్రీరాముతోఁ నిష్కారణముగ
వైరమూనఁగనేల? వలదింతయును మది వెతఁగియొకింత నీవింద్రవైరి!
కొఱవిచేఁ దలఁగోకికొనఁదలంచితివేల? యిప్పటికేని నాయినకులునకు
గీ॥ జనకభూవిభుసుతనిచ్చి సంధిసేసి, కులమదెల్లను రక్షించుకొనుట లెస్స'
యనియనేకవిధంబుల నన్నతోడఁ, గుంభకర్ణుఁడు నీతిఁ బేర్కొనుచునుండ. 448

కం॥ విని సహియింపక రావణుఁ, డనుపమకోపాగ్నికణము లమ్మృతభఁగిం
గనుఁగవరాలుచునుండఁగ, ఘను డను నాకుంభకర్ణుఁ గనుఁగొని పలికెన్. 449

మ॥ 'అనిసేయన్ మతినిన్ను నిచ్చటికి నాహ్వానించితింగాని యు
ప్పనరీతిం దగవాకు బుద్ధులను జెప్పన్ వేనువమ్మంటినే?
వినఁ జోద్యంబగు బుద్ధిశాలి! యిటునీవే నేర్చితో? యెవ్వరై
ననువేర్పించిరొ? చాలు! చాల్ భవదుపన్యాసంబిఁకం దమ్ముఁడా! 450

గీ॥ ఆహవముసేయఁగా భయమందితేని, నోదిగియుండుము మేమెచేయుదుము రణము
కాని వినుటకసహ్యంబులైనయట్టి. వెతగుమాటలు పలుకక వెడలిపొమ్ము! 451

చం॥ పగతురువచ్చి శౌర్యమునఁబట్టణమెల్లనుముట్టడించి బ
ల్మగలగుపెక్కురక్కసుల బ్రమంపఁగఁ జేయుచునుండ నిట్టిచోఁ
దగవుఁదలంప బోక యెటు దస్యులతోడను సంధిచేయుదున్?
నగరె సమస్తరాజనులు? నాప్రభుత్వము మాసిపోవదే? 452

ఉ॥ పందయు బుద్ధిహీనుఁడును బాతకియైన విభీషణుండు తా
ముందుగ దారిఁ జూపెఁగదె? పొమ్మిఁక! నీవును రామచంద్రుతోఁ
బొందొనరించి సౌఖ్యములఁ బొందఁగవచ్చునుగాని యిష్ము
ష్మంతట సంధిసేయుమనుమట్టి తలంపవియెల్లమానుమా!. 453

ఉ॥ వద్దు భవత్సహాయ మనివార్యపరాక్రముఁడైనయట్టి నా
పెద్దకుమారుఁడుండ నరివీరులఁ జీరికిఁగొందునట్టె? మే
మిద్దఱమే యరాతులజయింతుము నొంతుము మెక్కియింటిలో
నిద్దురపొమ్ము హాయిగను! నీకనియేటికిరా? సహోదరా! 454

కం॥ నామేననసుపులుండఁగ, రామునకును నీయనుమ్ము! రాజముఖిని నం
గ్రామమ్మెచేయువాడను, వేమాట లిఁకేల? పొమ్ము! ధీరుఁడవైనన్ 455

గీ॥ అదియునట్లుండె నొకపలుకవధరింపు, మానుమిత్రాత్మజుని జేరియైనఁగాని
నీవు సోదరధర్మంబునెఱుపువిధము' నేర్చుకొనిరమ్ము! ఘటకర్ణ నెమ్మితోడ'. 456

కం॥ అని యిట్లనేకవిధముల, ఘనుఁడగుఘటకర్ణుఁ బంక్తికంఠుఁడు దూరన్
విని యతఁడహివలెరోజుచు, ఎనుపమకోపంబుతోడ నత్యుద్ధతుఁడై 457

గీ॥ గద్దెపయినుండి క్రిందికి గ్రక్కునడిగి, కోఱమీసలుదువ్వుచుఁ గుంభకర్ణుఁ
డన్న దెసఁ జురచురఁజూచి యతిగభీర, భాషణంబుల నిట్లని పలుకసాగె 458

శా॥ ఏమీ! రావణ! పిద్దలంచెదుఁగదే? యీరేడులోకంబులన్
నీమాటోపపరాక్రమంబెసఁగనే భేదింపనే? తొల్లిను
గ్రామాదిత్రిదశౌఘముం గడిమిబాధల్ పెట్టి సాధించితిన్
రాముండున్ మఱివానరాధములనన్ నాకొక్కలెక్కే యికన్? 459

సీ॥ అనఁడియుఁబేదయునగురాముతోడ నిష్కారణంబుగ నీవు వైరమూన
న్యాయ్యంబుకాదంటి నంతియేకాని వెఱెమియులేదు నీకింతకోప
మేటికి? నాశక్తియెఱిఁగియెఱింగియే యెల్లిదంబుగ నెంచెదేల? వినుము!
కదనంబుసేయఁగ నిదెపోవుచున్నాడనాకాజ్ఞయొసఁగుము నాకవైరి!

గీ॥ గడియలోపలనృపులను గపులఁబట్టి, తెత్తునొండెను బరిమార్చివత్తునొండెఁ
గాకయందఱివలె నేనుగలహమందు, నోడిక్రమ్మఱఁ బఱతెంచువాడఁగాను. 460

గీ॥ ఇంతయేటికి? నాశక్తియెల్లఁ దివప, నర్కకులుఁడగు శ్రీరామునడిగినీవ
తెలిసికొందువుగాక! నేఁదెలుపనేల?', యనుచుఁ బంతముల్ పలుకుచు నాక్షణంబ 461

## కుంభకర్ణుఁడు యుద్ధమునకు వెడలుట

కం॥ ఆకుంభకర్ణుఁ డనికిం, బ్రాకటముగఁ బయనమయ్యెఁ బంక్తివదనుఁ డ
స్తోకముదంబునఁనీకనుఁ గాకజయమ్మనుచునతనిఁ గడుదీవించెన్. 462

గీ॥ పుడమిపగులంగ నార్చుచు భూరిబలుఁడు, కుంభకర్ణుఁడు దానవకోటి గొలువ
నల్లమున రణకౌతుక మ్ముల్లసిల్లఁ గదలెఁ బటుశూలహస్తుఁడై కదనమునకు 463

మ॥ అని కట్లాఘటకర్ణుఁడేగుతఱి నత్యంతంబు నిస్తేజమై
యినబింబంబదిమాసె నక్కలుకరంబెల్లెత్తిఘూసెన్ దిశల్
ధ్వనితో మండెను రక్తవారికురిసెం దద్దుర్నిమిత్తంబులం
గనియున్ వాఁడొకచీరికింగొనఁడు దుర్గర్వాంధుఁడై పోవుచున్ 464

గీ॥ ఇట్లు పురినిర్గమించి యహీనసత్త్వుఁ, డైన కుంభశ్రవణుఁడు రణావనికిని
దాను జనుదెంచుచుండ దౌదవులఁజూచి, రాముఁడాశ్చర్యభరితాంతరంగుఁడగుచు. 465

కం॥ ఘనుఁడైన యావిభీషణుఁ, గనుఁగొని శ్రీరామవిభుఁడు కరమాతురతన్
వినుమని యిట్టులఁబలికెను, మనమున నాందోళనంబు మల్లడిగొనఁగన్ 466

సీ॥ 'అసురనాయక!' చూడు మాకాంతరంబులఁ గొలతవెట్టెడు బాహువులు చెలంగ
వినువీధిపొడవింతె యనినిరూపించెడు ఘనతరౌన్నత్యంబు కలిగియుండఁ
దళతళమెఱయుచుఁ దద్దయునిడుదలౌ కోఱలునున్ మిడిగ్రుడ్డుదనరఁ
గులపర్వతములలోఁ దలఁపఁగనేదేని నొకకొండయోనాగ నొప్పమిగిలి

గీ॥ యున్నపటుభీకరాకారుఁ డొక్కరుండు, మేటిశూలముఁగొని ధరసాటిలేని
రక్కసుండిట మనపైకి రణముసేయ, వచ్చుచున్నాడు తెలుపుమా! వాడెవండొ!' 467

సీ॥ నాపుడు జానకీనాథునిఁగనుఁగొని యావిభీషణుఁ డిట్టులనుచుఁ జెప్పె
'శ్రీరామచంద్ర! మాచిన్నన్నయాతఁడు గురుబలోన్నతుఁడైన కుంభకర్ణుఁ
డీరేడుజగములం దింతటిమొనగాడులేడు మున్మాటికిలేడు చూడ
హరునొండె హరినొండె నమరులనొండెను బెంపుదీపింప జయింపఁగలఁడు

గీ॥ కాని యొకకారణమున నీదానవేంద్రుఁ, డబ్జభవుచేత వంచితుఁడగుటఁజేసి
కొంతదనుక లోకంబులశాంతియొదవె, నేలయనఁజెప్పెదన్ వినుఁ డినకులేంద్ర! 468

సీ॥ ఈకుంభకర్ణుండు లోకంబులకుఁ గీడుఁదలపెట్టి తొల్లి విధాతఁగూర్చి
తాఁగడునిష్ఠమైఁ దపముఁజేయుచునుండ నమరులు మునులును నదియెఱింగి
సభయులై యాబ్రహ్మసాన్నిధ్యమునకేగి యెంతయు నమ్రులై యిట్టులనిరి
'దేవాధిదేవ! యారావణానుజునకు వరములొసంగిన వచ్చుఁజేటు

గీ॥ కాన యోచించి మఱియొద్దియేనినొక్క, యుక్తిచేవాని సంతృప్తి నొందఁజేసి
కరుణపెంపార లోకరక్షణముసేయ, మదిఁదలంచుటలెస్స మామనవి విభుఁడ!'. 469

కం॥ అని సురలుమునులుచెప్పిన, వినివల్లెయటంచు బ్రహ్మ విబుధులఁబోవం
బనిచి ఘటకర్ణునప్పుడు, తనమదివంచితునిఁజేయఁ దలఁపొదవుటయున్ 470

గీ॥ పద్మసంభవుఁ డొకయుక్తిపన్నియపుడు, భారతీదేవిరావించి పలికెనిట్లు
'నెలఁత! లోకహితముపొంటె సిన్నొకపని, కేనియోగింపవెంచితి నిదిగో! వినుము! 471

సీ॥ ధరఁగుంభకర్ణుఁడన్ దైత్యుండు నసుఁగూర్చి తపముఁజేయుచునుండె నిపుడుకాన
తడయక నీవేగి తన్ముఖద్వారములోనఁ బ్రవేశించి నేనువాని
కగపడి 'వరమిత్తునడుగుము' నావుడు నారునెలలునిద్ర యరయనొక్క
దివసమాహారమర్థించున ట్లతనితోఁబలికింపు' మని చెప్పి పంపవాణి
గీ॥ తనవిభునియాజ్ఞ శిరమునఁదాల్చియపుడు, దానవునినోటిలోపలఁ దావసించె
నంతవానికిఁ బ్రత్యక్షమై యజుండు, వేడువరమిత్తు' ననిన నావిబుధవైరి 472

ఆ॥ బ్రాహ్మియపుడుతన్నుఁ బలికింపనారుమా, సములునిద్ర యొకదినము తలంప
భోజనంబుఁగోరె ముదమొంది నలువతా, నట్ల వరమొసంగె నాతసికిని 473

సీ॥ ఆకారణంబున నాకుంభకర్ణుండు తినుట నిద్రించుట తనకవశ్య
కర్తవ్యములుగాఁగఁ గాలంబుఁగడుపుచుఁ దక్కినపనులందుఁ దత్పరుండు
గాక ప్రమత్తుఁడై ఘనతరసంపూర్ణవైరాగ్యలక్ష్మిని బడసియుండెఁ
గావున జగములు కడుసురక్షితములై యొప్పారుచుండెను నొక్కభంగిఁ
గీ॥ దన కయిష్టమయ్యెనను దశముఖుండు, బ్రోత్సహించుటఁజేసి యీభూరిబలుఁడు
ఖండనముచేయ నరుదెంచియుండనోపు, నలఁతులంబోవఁ డీతఁడోయవనిపాల!' 474

కం॥ అని ఘటకర్ణునిచరితము, దినకరకులనాథుతోడఁ దెలిపినవాడై
ఘనుఁడు విభీషణుఁడప్పుడు, తనయన్నకు నెదురువోయి తగనిట్లనియెన్ 475

గీ॥ ఖలుఁడు కులపాంసనుఁడు దశకంధరుండు, కట్ట! కులమునుజెఱుపంగఁ బుట్టినాడు
వానిపక్షమునందుంట హానికరము, కానఁజెప్పెదం గుంభకర్ణ! వినుము!. 476

చం॥ వలదు రణమ్ముసేయ రఘువల్లభుచేత ననేకకోట్లదై
త్యులు తమప్రాణవాయువుల యుద్ధములోపలఁగోలుపోయి రా
ఖలుఁడగు పంక్తికంధరుఁడు కట్ట! రణోర్వికి సిన్నుఁగూడఁ జా
బలియొసఁగందలంచి యిటుపంపె నిజంబుగ నిర్దయాత్ముఁడై 477

కం॥ నావిన్నప మాలింపుము, రావణుపక్షంబువీడి రామునితోడన్
నీవైన సంధిసేయుము, జీవింపఁగలాడవన్న! చిరశౌర్యాఢ్యా!'. 478

సీ॥ అనియిట్లు నీతిఁబేర్కొనుచున్నయా విభీషణుతోడఁ గుంభ శ్రవణుఁడు పలికె
'నోవిభీషణ! నేను యుద్ధంబునకువచ్చి సంధిగావించుచో సర్వజనులు
ఛీ! యనరేనన్నుఁ? జెప్పకుమిపల్కు సమయంబుకాదిది సంధిచేయ
రామలక్ష్మణులను రణములోపలనేడు చంపుటొండెనులేక చచ్చుటొండె
గీ॥ జరుగెడుంగాక యస్యథాజరుగనేర, దింకమాటలువేయేల? యిదిగొ! వినుము!
మద్బలాదులు చూపఁబు మఱిపొగడగఁ, జించిచెండాడెదను గపిసేననెల్ల' 479

కం॥ అని యుద్ధతుఁడై నుడువుచు, ఘనుఁడాఘటకర్ణుఁడపుడు కపిసేనలపై
ఘనముగనార్చుచు సింగము, వనమృగములపైనదూకుపగిదిన్ దుమికెన్. 480

## కుంభకర్ణుఁడు విజృంభించి కపిసేనలతోఁ బోరుట

గీ॥ ఇవ్విధంబున ఘటకర్ణుఁ డేపుమెఱయఁ, గపులలోపలఁజొచ్చి చీకాకుపఱుపఁ
జేవచెడియును బెదరియుఁ జెదరికడకుఁ, జెనటియగుకుంభకర్ణుచేఁ జెడిరికపులు 481

చం॥ మఱియునుఁ గుంభకర్ణుఁడసమానబలంబునఁబేర్చి యార్చి చె
చ్చెఱఁ దనచేతిశూలమునఁజేసి ప్లవంగుల రూపుమాపియుం
దఱుచుగఁ బాదజానుకరతాడితదేహులఁజేసియున్ వెసం
బఱపియు నొంచియున్ వివిధభంగుల మూకను గాసిపెట్టినన్ 482

సీ॥ అప్పుడు సుగ్రీవుఁ డాయంగదుండును వాతాత్మజుఁడు జాంబవంతుఁడాది
పెక్కండ్రువానరవీరు లారక్కసుఁజుట్టుముట్టి కరంబు బెట్టిదముగ
నఖములవ్రచ్చి దంతములచేఁగఱచియుఁ జెట్లచేబాదియు శిలలచేత
మోదియు బహువిధంబుల గాసినొందింప నమరారి రోషతామ్రాక్షుఁడగుచు
గీ॥ సింగమోయన వీకమైఁజెలఁగి యార్చి, వానరులమీదదూకి దోర్బలముమెఱయ
మారిమసఁగినయ ట్లతిదారుణముగఁ, దానువధియించె వానరసేననెల్ల, 483

ఉ॥ ఇక్కరణిన్ ఘటశ్రవణుఁ డెల్లరఁజంపుచునున్నఁగాని తా
రుక్కునఁ జీరికింగొనక యూర్జితశౌర్యులు భానుజాదులా
రక్కసుమీద వెఁగవిసి రౌద్రమెలర్పఁగ నంతకంతకున్
మిక్కిలిగాసిపెట్టుటయు మేదురకోపపరీతచిత్తుఁడై. 484

కం॥ ఆకుంభకర్ణుఁ డప్పుడు, వీకమెయిం గపులఁజాల వెగడుపఱచుచున్
భీకరగతి సుగ్రీవునిఁ, బ్రాకటముగఁబట్టికొనుచు వడిఁ గదలించెన్. 485

గీ॥ అఘటశ్రవణుండట్లు హరికులేశు, దాను గబళించుటయుఁజూచి ధైర్యమేది
తరుచరులు మహాభీతచేతస్కులగుచుఁ గలఁగిహాహారవంబులు సలిపిరపుడు 486

కం॥ సుగ్రీవుఁడిటు రాహుము, ఖగ్రస్తుండైన శీతకరుఁబోలెఁ గరం
బుగ్రుఁడగు కుంభకర్ణుని, చే గ్రసితుండగుచు వంతఁజెందినవాడై. 487

గీ॥ కొంతసేపు తదీయమౌ కుక్షియందు, నట్టిటుఁ బరిభ్రమించుచు నర్కతనయుఁ
డసుర కావులింతకలుగునట్లొనర్చి, 'బ్రదుకుజీపుఁడా!' యనుచుఁ దా బయటఁబడియె

ఉ॥ అంతట భానునందనున కాపదవాయుటకున్ మనంబులన్
సంతసమందుచుం బ్లవగసైనికు లుత్కటశౌర్యమొప్ప రో
దోంతరమెల్ల బూరటిల నార్చుచు డాసి సురారిపైనబల్
వింతశిలల్ తరుప్రతతి వేఁబరగించుచు గాసిచేసినన్ 489

చం॥ బెదరొకయింతలేక యరివీరుఁడు కీశులలోనఁజొచ్చి తాఁ
బదుగురనొండె శూలమునఁబల్వురనొండెసు ప్రేల్మిడిన్ గుదుల్
గుదులుగఁగ్రుచ్చియెత్తుచును గోల్తలసేయుచుఁ గుంభకర్ణుఁడా
త్రిదశులు చోద్యమంద విహరింపఁదొడంగె రణాంగణమ్మునన్. 490

కం॥ ఆయమరవైరిధాటికి, నాయగచరులోడి పఱచి రఖిలదిశలకున్
ధీయుతుఁడు రాముఁడడిగని, పాయకతమ్ముండుఁ దాను బరవసమొప్పన్ 491

## శ్రీరాముఁడు లక్ష్మణసమేతుఁడై కుంభకర్ణునితోఁ బోరుట

ఉ॥ మూకకుఁ జేయిచీచి యిదెపోకుడుపోకుడునిల్వుఁడంచు ని
క్ష్వాకుకులుండు రాముఁడు భృశంబుగఁ బల్మరు హెచ్చరించుచున్
భీకరలీలవచ్చి యరివీరునియుద్ధతి నిల్వరించి తా
వీకమెయిం బయోధరగభీరవచఃపరిపాటి నిట్లనున్. 492

గీ॥ 'ఓరి! రావణుతమ్ముఁడ! యోడిపఱచు, వారి వెన్నాడఁదగదు దుర్వారబలుఁడు
రాముఁడిదె వేచియున్నాడు రణముసేయ, రమ్ము! నీపిచమడఁతు శౌర్యంబెలర్ప' 493

చం॥ అనవుఁడుఁ గుంభకర్ణుఁడు బలాధిను రామునిఁగాంచి యిట్లనున్
'వినుమిఁకమానవా! యనికిఁబిల్చిన నీకుభయంబుచెంది వే
వెనుకకుఁ గ్రమ్మఱంజనఁగ భీరుఁడఁగాను నిజంబు శూరుఁడం
జెనకిన వాలినైన వధచేయుదు నిన్నిఁకలెక్కగొందునే?. 494

చం॥ ఎఱుఁగవు మత్పరాక్రమము నింద్రుఁడు దొట్టి సమస్తదిక్పతుల్
వెఱతురు నాఁడు పేరనిన విక్రమసంపదమీర నే జగం
బెఱుఁగఁగ మున్ను దేవతలనెల్ల జయించి తదీయభార్యలం
జెఱనిడినాడ మిమ్ముఁ గపిసేనలఁ జీరికిఁగొందునే యిఁకన్? 495

కం॥ వేమాటలేల? వినుమిదె, మీమాంసముచేత నిచట మృతదైతేయ
స్తోమమునకుఁ దర్పణమిడి, స్వామియగు దశాననునకుఁ బ్రమదముఁగూర్తున్'. 496

సీ॥ అని యుద్ధతుండయి యాడెడుఘటకర్ణు నిదెకాచికొ మ్మనిహెచ్చరించి
సాయకంబుల వింటసంధించి వర్ష మట్లవిరళగతి రాముఁ డలిగియేయ
శూలాయుధంబుచే లీలమైనెగురంగఁగొట్టియుఁ జేతులఁదట్టియు మఱి
తద్బాణచయములు దనుజుండునడుమనే వితథముల్ గావించి వెఱపులేక
గీ॥ ప్రళయకాలమనాఘనపటలమట్లు, పీరగర్జనమొనరించి విబుధవైరి
తనదుశూలంబుచేత నాదశరథాగ్ర, పుత్రువక్షంబుపైఁ దాను బొడువఁబోవ 497

కం॥ ఆసౌమిత్రి తటాలున, నాసురరిపుశూల మప్పు డతిముతిఁ బొడిగాఁ
జేసివయిచె భల్లంబొకఁ, డేసి ధనుర్విద్యకల్మి యెల్లం దోపన్ 498

గీ॥ అవ్విధంబున దళితశూలాయుధుఁడయి, గురుతరాగ్రహోదగ్రుఁడై కుంభకర్ణుఁ
డదరుబెదరించుకయులేక యార్చి పేర్చి, కపులపైనను నృపులపైఁ గసిచెలంగ 499

కం॥ తండోపతండములుగా, గండశిలల్ వృక్షతతులు ఘటకర్ణుం డు
ద్దండుఁడయికడఁగి కరముఁబ్ర, చండతరముగాఁగ నపుడు చాలఁగవైచెన్. 500

చం॥ కడిమిచెలంగనట్లు ఘటకర్ణుఁడువైచెడు రాళ్లుఁ జెట్లు బల్
పిడుగులఁబోలెవచ్చి కపివీరులపైఁ బడుచుండ నత్తఱిన్
మడిసియు మూర్ఛనొందియుఁ మానముదూలియు బీరమేదిన
ల్గడలకుఁ బాఱిపోయియుఁ గకావికలైచెడె సేనయంతయున్. 501

ఉ॥ ఇమ్మెయిఁ గీశసైన్యత ఫరెంతయు సైన్యముకొంచుచుండ బీ
రమ్మున రాముఁడక్కఱుఁ బ్రాకటలీల శితాశుగాళి సాం
ద్రమ్ముగవేసి శీఘ్రమున దైత్యశిలాతరువృష్టిమాపి పె
క్కమ్ములు వానిపైఁబరపి రంచితబాహుపరాక్రమంబునన్. 502

ఉ॥ వాడవిలెక్కసేయ కనివార్యబలంబున నించుకేనిఁ దా
నోడక చెట్టులొండె శిలలొండె గదాముసలాదు లొండెనుం
బోడిమిదోపవేయుచు నభోమణివంశ్యులజోడఁదాకి పో
రాడఁదొడంగె మింటనమరావళి యబ్బురమొంది చూడఁగన్ 503

గీ॥ దనుజుపై నెన్నిలూపులేసినను గాని, కాలుడున్నమీఁదను వడగండ్లవాన
కురిసినట్లన్నియున వమ్మగుటయుఁజూచి, విసిగివేసారి శ్రీరామవిభుఁడు మఱియు 504

ఉ॥ ఆ సురవైరిపై రవికులాగ్రణి రాముఁడు పావకాశుగం
బేసి భయంకరాగ్ని సృజియింపఁగ నయ్యది దైత్యలోకసం
త్రాసకరంబుగా శిఖలుగ్రక్కుచుఁ జెంతకురాఁ గడున్ సునా
యాసముగాఁ దదుద్ధతి రయంబున మాపెను గుంభకర్ణుఁడున్ 505

మ॥ సలిలాస్త్రంబును రామభద్రుఁడు వెసన్ సంధించి యేయన్ రణ
స్థలమెల్లన్ జలపూర్ణమౌచు నదిచందంబొప్ప దైతేయసే
నలు తద్వారినిమగ్నమై కలఁగుడున్ నాకారితమ్మండు త
జ్జలముల్ ద్రావె నగస్త్యుఁడబ్ధిజల మిచ్చం ద్రాగునాకైవడిన్ 506

## శ్రీరాముఁడు కుంభకర్ణుని వధించుట

సీ॥ నాగాస్త్రమును మఱి యాగారుడాస్త్రము యామ్యంబుఁ గౌబేర మైంద్రమాది
బహుదివ్యబాణముల్ పగతుపై రాముండు తానుబ్రయోగింప దండిమగఁడు
కుంభకర్ణుండు సంరంభమేపార నాతూపులఁ ద్రుటిలోన రూపుమాపె
నిబ్భంగి రఘువంశ్యుఁ డెన్నిదివ్యాస్త్రముల్ పరపినఁగాని యాపలలఖాది

గీ॥ చావకయె యున్నఁజూచి యిక్ష్వాకుకులుఁడు, మఱియుమఱియును బహువిధమహితదివ్య
బాణతతులేసి కడపటవైష్ణవాస్త్ర, మసురుపైచేసె మంత్రించి యరులుబెగడ 507

చం॥ అదియు ననన్య భేద్యమయి యర్కనిభప్రభలొప్పవచ్చి యా
త్రిదశవిరోధిఫాలమునఁ దీవ్రతరంబుగనాటినం గడున్
విదళితుఁడై ప్రవాహమటు పెచ్చనిరక్తముగార వాడుకొం
తదనుకఁ దత్ప్రహారమునఁ దద్దయు సొలుచుఁ జేష్టమానఁగన్ 508

సీ॥ ఆలోన శ్రీరాముఁడైశాన్యమనియెడి మఱియొక సునిశితమార్గణంబు
గుఱిచూచి యేసిన గొబ్బునదిపోయి రావణానుజుని కరద్వయంబు
ఛేదించివైచె నాచెనటిరక్కసుఁడంతఁ దనమది నించుకంతయును గూడ
భీతినొందక మహాభీకరసింహగర్జనములు చేయుచు రామునిమీఁది

ఆ॥ కరుగుఁదేరఁజూచి యాలక్ష్మణుండప్పు, డనలతుల్యమైనయట్టి యొక్క
భల్లమేసి వానివామపాదంబును, దునిమివైచెఁ గరము దోర్బలమున. 509

గీ॥ అప్పటికిసైత మారావణానుజుండు, చలముడింపక సమరంబు సలుపఁదొడఁగె
మొండివాఁడితఁడని స్తుతిపూర్వకముగఁ, దానుబలుకుచు రామభూజాని యపుడు 510

కం॥ ఆదైతేయుని దక్షిణ, పాదంబును గూడఁదునిమె వడిభల్లముచే
రోదనముసేయుచాతఁడు, మేదినిపైఁ ద్రెళ్లె నొక్కమేటిగిరివలెన్. 511

గీ॥ ఇట్లు కరపాదములుపోవ నిలనుగూలి, యున్నఘటకర్ణుఁ డేమిచేయుటకు శక్తి
లేమిఁ గోఅలువెతికినపామువోలె, ధరణిపై రోజుచూరక పొరలుచుండె. 512

కం॥ అంతట వానరు లసురులు, వింతగ వివిధప్రహారవిదళితులగుచున్
సంతయును భయమునొందక, పంతముతోఁబోరి మృతినిఁ బడసిరనేకుల్ 513

కం॥ పదపడి రాముఁ డొకశిత, ప్రదరంబున వానిశిరము వడిఛేదించెన్
నదులై రక్తముపాఱఁగ, ద్రిదశారి గతాసుఁడయ్యె దితిజులు బెదరన్. 514

గీ॥ ఈతెఱంగున నిద్దురపోతగు ఘటకర్ణునకుఁదగినట్లె నిష్కాములైన
యోగులకు వాంఛనీయమై యొప్పునట్టి, పెద్దనిద్దుర నృపతి లభింపఁజేసె 515

కం॥ తక్కినరక్కసిమూకల, నుక్కునఁదాము బ్లవంగయోధులు కడిమిం
జక్కాడఁదొడఁగిరప్పుడు, మిక్కుటపున్ భయముఁబొంది మిగిలినదనుజుల్ 516

కం॥ వేవేగఁబఱచి సవినయ, భావంబులతోడవారు పంక్తిముఖునకున్
యావదుదంతముఁ దెలిపిరి, రావణుఁడటుపైఁ నిజాంతరంగమునందున్ 517

కం॥ ఘటకర్ణునివధమునకై, కటకటఁబడి కొంతసేపు కడుదుఃఖితుఁడై
యటుపైఁ గుంభనికుంభులఁ, బటుశౌర్యులఁబంపెఁ బంక్తివదనుం డనికిన్ 518

## రావణుఁడు కుంభనికుంభులను యుద్ధమునకుఁ బంపుట

సీ॥ ఆకుంభుఁడు నికుంభుఁ డప్పుడు తమకూర్మిజనకుఁడౌ కుంభకర్ణుని మృతికయి
తాపంబు కడిఁదియై కోపంబునుంబెంప నతిభయంకరమూర్తులగుచు నొప్పి
'కపిసైన్యయుతముగాఁ గాకుత్స్థవంశ్యుల నవలీలఁ బరిమార్తుమాజిలోన
మాతంద్రిబుణమును మఱితీర్తుమసురేంద్ర! నీవంతనార్తుము నీకుఁ బ్రీతిఁ

గీ॥ గూర్తు' మని పెక్కుభంగులఁ గొలుపులోని, వారువినఁ బ్రగల్భమ్ములు పలికి పెద్ద
తండ్రికభివందనముచేసి దనుజసైన్య, సహితముగ స్యందనములెక్కి చనిరియనికి 519

గీ॥ ఆఘటశ్రవణాత్మజు లావిధమున, సర్వసన్నాహములతోడఁ జని ప్లవంగ
యోధతతితోడఁ దలపడ నుభయులకును, నయ్యెదారుణసంగ్రామ మట్టియెడల 520

ఉ॥ కుంభనికుంభులిర్వురు రఘుప్రభురామునిఁ దత్సహోదరున్
దంభముతోడఁదాకి పటుధైర్యసువిక్రమ సాహసైకసం
రంభమెలర్పఁ దీవ్రతరమార్గణపంక్తులు కుంభవృష్టిగా
కుంభదుదగ్రలీలఁ గడుఁజోద్యముగాఁ బరగించి రుద్ధతిన్ 521

కం॥ వారుప్రవర్షించు మహా, దారుణశరవృష్టి దశరథప్రభుతనయుల్
ధీరతఁ బ్రతిశరములచే, వారించి యనంతరంబ వారిధనువులన్ 522

కం॥ చెఱియొక శితభల్లముచే, నఱిమిటిఁ జూర్ణంబుఁజేసి యసురులమీదం
గఱకుశరంబులు తఱచగ, వెఱకులునొవ్వంగసేసి నెఱినొప్పింపన్. 523

గీ॥ ఆశరాఘాతములకు నిజావయవము, లందువ్రణములు కన్పట్ట నపుడుకుంభుఁ
డానికుంభుఁడు రక్తసిక్తాంగులగుచుఁ, జూడనొప్పిరి పుష్పితాశోకములటు 524

కం॥ ఆవిధమున నొచ్చియు మది, నావంతయుభీతిలేక యంతంతకునున్
లావున జేవయు నొప్పఁగ, వేవేగమె వారు వెఱువిండ్లం గొనుచున్. 525

కం॥ వారేయు నిశితశరముల, వారించుచు నృపులపయిఁ బ్లవగులపయి శరా
పారమువర్షించుచుఁ గడు, వీరవిహారమునలిపిరి విక్రమమెసఁగన్. 526

## సుగ్రీవాంజనేయులు కుంభనికుంభులను వధించుట

సీ॥ అప్పుడు సుగ్రీవుఁ డాహనుమంతుఁ డర్కాన్వయులకు సహాయార్థులగుచు
వరుదెంచి కుంభుని నానికుంభునిఁదాకి తరుశిలాతతులచేఁ దద్రథములఁ
జూర్ణంబులొనరింప స్రుక్కకవారంత నవనికిదిగి గదాహస్తులగుచు
రవిజుతో ననిలసంభవుతోడఁ దలపడి పోరాడుచుండి రబ్బురముగాఁగఁ

ఆ॥ గొంతవడికి వారిగురుకాయములనుండి, యేఱులయి రుధిరము పాఱుచుండెఁ
గానిలెక్కగొనక కదనంబుసలిపిరి, కపికులులును గుంభకర్ణసుతులు 527

కం॥ ఇనజుం డొకగండశిలను, గొని కుంభునిమీదవైచె గొబ్బున దానిన్
దనుజుఁడువమ్మొనరించుచుఁ, దనదొగదచేఁ గపీంద్రుఁదాడితుఁ జేసెన్ 528

గీ॥ ఆగదాఘాతమునకు సూర్యాత్మజుండు, తానుగడునొచ్చి కసలుచుఁ దరువొకండు
పెఱికికుంభునిఁ బ్రహరింప వివశుఁడగుచు, ధరణిపైఁద్రెళ్లి వాడునిధనము చెందె. 529

గీ॥ అన్నమృతికి నికుంభుఁడత్యంతరోష, కలితుఁడై భానునందనుఁ గరువలినుతుఁ
దనగదాఘాతములచేత దళితగాత్రు, లుగనొనర్చుచుఁ గుతలంబుపగుల నార్చె. 530

ఉ॥ అప్పుడు గాడ్పుపట్టి కడునాగ్రహమానసుఁడై కపింగవన్
నిప్పులురాల నేలయును నింగియునుం బగులంగనార్చుచుం
దప్పక తాను గుంభునిగదంగొని విక్రమముల్లసిల్లఁగం
గిప్పగఁ గూలునట్లుగ నికుంభునిమోది వధించె నుద్ధతిన్. 531

చం॥ మఱియునుఁ దక్కుగల్గు రిపుమండలినిం గపిమండముల్ గరం
బఱిముఱిఁబట్టి యాహవమునందు వధించి రనంతరంబ చె
చ్చెఱ హతశేషులెల్ల రసపేతకునొల్లక కాందిశీకులై
పఱచి దశాస్యుతో సమరవార్త సమస్తమెఱుంగఁ జెప్పినన్ 532

కం॥ ఆకుంభనికుంభులమృతి, కైకడుశోకించి పంక్తికంధరుఁ డంతం
బ్రాకటముగ ననికంపెను, భీకరబలు నింద్రజిత్తు ద్వేషోన్మత్తున్. 533

## ఇంద్రజిత్తు మాయాయుద్ధము

ఉ॥ వాడురథంబునెక్కి పరివారముగొల్వఁగ యుద్ధభూమికిం
గూడఁగవచ్చి తీవ్రతరకోపముతో నరవానరాళిపై
నోడక సాయకౌఘము మహోగ్రముగాఁ బరగించుచుం గడుం
బోడిమిదోప సంగరముఁబూని యొనర్చఁదొడంగె నుద్ధతిన్. 534

గీ॥ రావణాత్మజుఁడేయు శరప్రతతులు, మర్మభేదనమొనరింప మఱి ప్లవంగ
సేనయెంతయు భీతిల్లి వానియెదుట, నిలువఁజాలక ప్రక్కకుఁదొలఁగి చనియె 535

కం॥ పఱచెడి కపులకుధైర్యముఁ, గఱపుచు రాముండు పంక్తికంఠునిసుతుపై
నుఱక బహుశరములేయుచు, నఱిముఱినని సేయసాగె ననుజుఁడుఁ దానున్. 536

శా॥ అంతన్ వెండియుఁ గీశులెల్ల విగతాయాసుల్ గతత్రాసులై
స్వాంతంబుల్ రణకార్యనిర్వహణదీక్షాబద్ధముల్కాఁగ న
త్యంతోత్సాహముతో మహాప్రబలరక్షోనీకముందాకి వి
క్రాంతింబోరఁదొడంగి రద్భుత శిలాక్ష్మాజప్రహారంబులన్. 537

కం॥ ఆకపులధాటికోర్వఁగ, లేకపులులఁగాంచిపఱచు లేళ్లవిధమునం
జీకాకయి భయమున నా, రాకాసులు పాఱిరపుడు రావణికడకున్ 538

ఆ॥ ఇట్లు పఱచి దైత్యులింద్రజిత్తుమఱుఁగుఁ, జొచ్చుటయును వాడు స్రుక్కకుఁడని
తనదు సైనికులకు ధైర్యంబుఁగఱపుచుఁ దానురథముతోడఁ దక్షణంబ. 539

కం॥ అంతర్ధానుండై రో, దోంతరమున వివిధగతుల సరదముతోడన్
వింతగఁ బరిభ్రమించుచు, సంతతధారలుగ నేయసాగె విశిఖముల్. 540

గీ॥ ఒక్కచో సింహనాదంబు లొక్కచోట, విపులరథనేమిశబ్దముల్ వేఱొకయెడ
భయదమౌర్వీరవము వినఁబడుచునుగాని, కనఁబడఁడు మేఘనాదుఁ డెక్కడనుగూడ 541

మ॥ ఇటు లారావణకుమారునందనుఁడు తానెందుండునోకాని యు
ద్భటుఁడై శాతశిలీముఖప్రకరముల్ తానేయుచున్ మేటిమ
ర్కటసేనానికురుంబమున్ నృపులఁద్రుక్కంజేయుచున్ దారుణో
త్కటమాయాసమరంబొనర్చెను భుజాగర్వం బఖర్వంబుగన్. 542

కం॥ ఆతూపులజడికిఁ గపుల్, భీతిల్లిరి యపుడు శబ్దభేదులు మొదలౌ
శాతశరములేసి తదీ, యాతతమాయల్హరించి రర్కకులవిభుల్ 543

గీ॥ మాయయుడిగినవాడయి మఘవజిత్తు, తానువెంటనె ధారణీతలగతుఁడయి
చేయునదిలేక మనమునసిగ్గువిడిచి, వెఱచిపఱచెను వేవేగ వీటిదెసకు. 544

కం॥ వానిపిఱుందన దానవ, సైనికులున్ వెఱచిపాఱఁ జయ్యనవారిన్
వానరులు తఱిమి రాలం, కానగరపుటుత్తరంపుగవని వఱకునున్ 545

గీ॥ అట్లు హతశేషమైనట్టి యనుచరతతి, తోడలంకలోఁజొచ్చి యాదుష్టుడైన
యింద్రజిత్తాత్మగతమున నెట్టులేని, నరుల వంచనమెయిగెల్తు ననితలంచి 546

## ఇంద్రజిత్తు మాయాసీతను రామలక్ష్మణులయెదుట నఱుకుట

శా॥ ఆతం డప్పు డమేయమైన తనమాయాశక్తినింజేసి యా
సీతంబోలినయట్టి యొక్కవనితన్ సృష్టించి శీఘ్రంబ యా
నాతింగొంచు సమీకభూమికి మహానక్తంచరానీకసం
ఘాతంబుల్ వెనువెంటరాఁగదలె దోర్గర్వంబు సంధిల్లఁగన్. 547

కం॥ ఆమాయాసీతను గని, రాముఁడులక్ష్మణుఁడు వానరప్రకరంబుల్
తాము విషాదముతో సం, గ్రామముచేయుటలుమాని కళవళపడుచున్ 548

ము॥ తమలోనిట్లనియెంచి రీఖలుఁడు సీతాదేవి నిట్లేల తా
సమరక్షోణికిఁదెచ్చియుండెనొగదా? సాధ్వీశిరోరత్నమున్
విమతుం డుద్ధతిఁ జంపఁబూనునొ! కడున్ నీచాత్ముఁడై యేమియ
క్రమకార్యంబొనరింప సిద్ధపడునో! కట్టా! విచారింపఁగన్'. 549

కం॥ అని యిటనేకవిధముల, వనచరముఖ్యులను బాసవంబ్యులు మాయా
వనితను నిక్కపుసీతగ, ఘనముగఁ దలపోసి మిగులఁ గలఁగుచునుండన్. 550

ఉ॥ రామునిఁజూచి యిట్లనియె రావణియిప్పుడు 'మానవేంద్ర! యీ
కామినికై గదా! రణముగల్గెను మీకు నమాకుఁ గావునన్
మామకఖడ్గరాజమున మానిని నిప్పుడ చంపివైతు సం
గ్రామమమాని మీరలు సుఖంబుగఁ బొందుఁడిక నాత్మభూమికిన్'. 551

చం॥ అని వచియించి యాతఁడౌరయందలి ఖడ్గమువేగదూసి యా
వనితను గొప్పఁబట్టికొని భానుకులోత్తము లాప్లవంగులుం
గనుఁగొనుచుండఁ గావుమని కామిని రామునిఁగూర్చి రోదన
ధ్వనులొనరింప నాకపటభామినినిం దెగవ్రేసి చంపినన్ 552

## మాయాసీతమృతికై రామలక్ష్మణులు వానరులు శోకించుట

కం॥ ఆమాయాసీతమృతిన్, రాముఁడువీక్షించి శోకరసమగ్నుండై
భూమిపయి మొదలునటికిన, కోమలతరుశాఖమాడ్కిఁ గూలెం దోత్రోన్ 553

కం॥ ఆరామునితోఁ బాటున్, ధీరుఁడు లక్ష్మణుఁడు మిగులధృతిచెడి శోకాం
భోరాశి తన్నుముంపఁగ, ధారుణిపై వివశుఁడగుచుఁ దానుం ద్రెళ్లెన్. 554

కం॥ ఈకరణి మూర్ఛనొందిన, కాకుత్థాన్వయుల నపుడు కనుఁగొని ప్లవగుల్
శోకముపైకొనుటయు హా, హాకారమ్ములుచెలంగ నంద అడలుచున్. 555

కం॥ ధీయుతుల రాఘవేంద్రుల, డాయంజనుదెంచి మిగుల డగ్గుత్తికతో
నాయగచరులు ధృతిఁగో, ల్పోయి మహాదుఃఖవార్ధిమునిఁగిరి పెలుచన్, 556

గీ॥ అప్పు డర్కజుఁ డంగదుఁ డాంజనేయుఁ, డాదిగాఁగల కపిముఖ్యు లరయఁ గొంద
ఱాగ్రహంబును దుఃఖంబు నతిశయింపఁ, దలఁపఁజొచ్చిరి యిట్లని తమకుఁదామె 557

గీ॥ 'పాపియై మేఘనాదుఁ డేపాపమెఱుఁగ, నట్టి సాధ్విని జానకి నక్కటకట!
తునిమివైచెను రాముఁడీతొయ్యలికయి, వెతలఁబొందుచుఁ బ్రాణముల్ వీడకున్నె?. 558

కం॥ ఈనరనాథుఁడు మృతుఁడగు, నేని మహావీరవరుఁ డీలక్ష్మణుఁడున్
దానును ముమ్మాటికినిన్, మేనుంగొరఁగుటనిజంబు మిక్కుటపువెతన్. 559

గీ॥ వీరిరువురిట్టు ప్రాణముల్ విడిచిరేని, మనము బ్రదుకుట విష్ప్రయోజనముగాదె?
కాన యీదుష్టదైత్యులఁ గలహమందుఁ జంపుటో! లేక చచ్చుటో! చాలలెస్స' 560

సీ॥ అని యివ్విధంబున నాకపుల్ తలపోసి వెంటనె యాగ్రహావేశలగుచుఁ
గొంద ఱసురభటసందోహములతోడఁ గొందఱా రావణుకొడుకుతోడఁ
దలపడి తరుశిలాతతులచేఁ బ్రహరింపఁ జచ్చియు నొచ్చియు సైన్యమెల్ల
వెన్నిచ్చి పఱచినవీక్షించి రావణి తానుసుగొండొక తడవునకును
గీ॥ విరథుఁడైను శస్త్రహీన్యుంతు విదళితాంగుఁ, డగుచు నామేఘనాదుఁ డిట్లనితలంచె
'కలవిమేగెల్వరా కెంతకైనవీరు, చాలుదురు నేడు వీరితోఁ జాలుఁబోరు' 561

కం॥ అని తలపోయుచు రావణి, యనిసేయఁగనోడి పఱచె నాలంకకుసున్
ఘనుఁడా విభీషణుండపు, డనఘుల రాఘవుల డాయనరుదెంచి వెసన్ 562

మాయాసీతమృతికై శోకించు రాముని విభీషణుఁ డోదార్చుట

కం॥ ధృతిచెడి పలవించుకపి, ప్రతతికి ధైర్యంబుగఱపి రఘువంశ్యుల కం
చితశీతలోపచారము, లతులితముగఁ దానుజేసె నధికశ్రద్ధన్ 563

కం॥ ఆతని యుపచారములకు, నాతతధర్మాత్ముడైన యారాముఁడు తాఁ
బ్రాతిగ నిజానుజన్మున, మేతంబుగ మూర్ఛఁదేరి మిక్కిలివగచేన్, 564

ఉ॥ రావణుతమ్ముతోడ రఘురాముఁడు తానిటులంచుఁబల్కె, 'నా
రావణి క్రూరుఁడైయకట! రాజముఖిన్ వధియించె నింకనా
జీవితమేల? యెరికయి చేయుదుయుద్ధము? నిక్కువంబుగా
దైవమునన్నుఁ దాఁగరముఁ దప్పఁదలంచెఁగదా! విభీషణా! 565

సీ॥ తోయజాప్తతనూజుతో వేసుసఖ్యమ్ముఁ గోరిసేయుట సీతకొఱకుఁగాదె?
యటుపైన వాలినిసరయువంచనమెయిఁ గూలచేయుట సీతకొఱకుఁగాదె?
వారాశిగిరిఁ గట్టఁగారానిసేతువు మటికట్టుటలు సీతకొఱకుఁగాదె?
రావణాసురుతోడ రణముసేతకుఁ బూనుకొనుటయెల్లను సీతకొఱకుఁగాదె?
గీ॥ ఇంకఁబడరానిపాట్లవియెల్లఁ బడుట, కువలయేక్షణయగు సీతకొఱకుఁగాదె?
అట్టి సీతయెలేనిచో నక్కటకట!, యెట్లు జీవింతునిలపైన? వెటు భరింతు?'. 566

మ॥ అనిశోకించుచునున్న రామునకు దైత్యాధీశ్వరుం డిట్లనున్
'జననాథాగ్రణి! చింతసీడుము మహాసాధ్వీలలామం బనం
జను నాజానకియేడ? నీచమతియౌ శక్రారి తానేడ? నా
వనితంజంపుటయేడ? యియ్యది మదిన్ భావింపమోసంబగున్. 567

చం॥ దినకరవంశనాథ! విను తెల్పెదఁ బాతకి యింద్రజిత్తు తా
మనమగు మాయఁజేసి జనకక్షితిపాత్మజయైన సీతఁబో
లినయొకమేటి కృత్రిమపులేమను దాన సృజించి యిమ్మెయిం
దునిమెనుగాక! నిన్ను బహుదుఃఖపయోనిధియందు ముంపగన్. 568

కం॥ ఆయింగన ముమ్మాటికి, నాయవనీతనయగామి నదినిజ మధిపా!
మాయాసీతయెయగుఁజుమ్మి!, నీయెడదన్ శోకముడుగు నెలకొల్పుధృతిన్'. 569

కం॥ అని దుఃఖోపశమనముగ, ఘనుఁడు విభీషణుఁడుపల్కి గ్రక్కున క్ష్మాసం
దన కుశలసమాచారము, వనజేక్షణయైన త్రిజటవలన విని వెసన్ 570

కం॥ ధీనిధి విభీషణుం డపు, డానయగుణధాముఁడైన యారామునకున్
జానకిక్షేమోదంతముఁ దానునివేదించి విగతతాపునిఁ జేసెన్ 571

గీ॥ అటుపదంపడి శ్రీరాముఁ డంతరంగ, మున మహోత్సాహహర్షముల్ ముప్పిరిగొన
యుద్ధమునకును వెండిసన్నద్ధుఁడయ్యెఁ, దానువానరసేన లుద్దండలీల 572

గీ॥ అంతనక్కడ రావణి యట్లు కపుల, చేఁ బలాయితుఁడై చని క్షితికుమారి
సరయ వంచింప నిజహృదయంబునందుఁ, దలఁపుపుట్టఁగ నాతఁడు తక్షణంబ. 573

## ఇంద్రజిత్తు మాయాకల్పితములైన రామలక్ష్మణుల తలలను సీతకుఁ జూపుట

సీ॥ రామునియొక్కయు సౌమిత్రియొక్కయు తలలవంటివి రెండుతలలనపుడు
తనదగు మాయిపెంపునఁజేసి సృజియించి యాశీర్షములఁగొని యాక్షణంబ
యాయింద్రజి త్తశోకారామమునకేగి యటనున్న సీతకు నాశిరద్వ
యంబునుజూపించి యబ్జాక్షి! మీవారు మృతులైరి మూర్ధంబులివిగో! చూడు!
గీ॥ మదిని నిఁకనైన నాబక్కమానవుపయిఁ, గలమమతవీడు మాదశకంధరునకు
భార్యవై యిష్టభోగముల్ బహుతరముగఁ, బడసి సుఖియింపు మనుచుఁ దాఁబలుకుటయును.

మ॥ విని యాజానకి యంత శోకరసమావేశంబుఁ గల్గింపఁ ద
ద్ఘనమాయాపరికల్పితంబులయి యుద్యద్రక్తసిక్తంబులై
చను నాకృత్రిమపుందలల్‌గని రఘుక్ష్మాపాలకుల్ వీనిచే
ననిలోఁజచ్చి రటంచునెంచి ధర మూర్ఛాక్రాంతయై త్రెళ్లినన్. 575

గీ॥ అప్పుడు సద్గుణరాశియైనట్టిత్రిజట, శీతలోపచారంబులు సేయుటయును
వసుమతీసుత కొండొక్కవడికి మూర్ఛ, దేరి యిట్లనితాను జింతింపసాగె. · 576

సీ॥ 'భూపతిలకులార! యేపాపమెఱుఁగవి మీకు నేడక్కట! నాకతమున
నీపాటు ఘటియిల్లె నెన్న మీదురవస్థఁ జూడకమున్నె నాపాడుజీవి
తముపీడనైతిని దలపోయ నావంటిమొండిజీవియొకతె భువిఁ గలదె?
'పాపీచిరాయు' వంబలుకు ముమ్మాటికి నాయందసార్థకమాయె లేక
గీ॥ యున్న నాకేలమృతిరాకయుండునొక్కొ?, నేను దొలిజన్మమందు ననూనమైన
పాపమొనరించితిని దానవనటకలిగె, నేమి సేయుదు? నాగతి యెట్టులింక?'. 577
కం॥ అని మఱియును నెడనెడఁ దాఁ, గనలున నాయింద్రజిత్తుఁ గడుదూరుచునన్
జనకజ యనేకవిధములఁ, బనవిపనవి యేడ్వసాగెఁ బటుఘోరముగన్ 578
గీ॥ ఇట్లు పలవించుచున్న యాయిందువదన, కిట్టులని చెప్పెఁ ద్రిజట 'యోయింతిమిన్న!
నీమగఁడు నీమఱందియు నిరుపమాన, శక్తిమంతులు దేవతాసములు చూవె! 579
ఉ॥ వారికిఁగీడుమూడినను వారిధులింకవె? భూమిక్రుంగదె?
తారలుడొల్లవే? గ్రహవితానగతుల్ వడిఁదప్పిపోవొకో?
వారిజగంధి! నీవిటుల వందురనేటికి? రామలక్ష్మణుల్
పోరనజేయు లన్యునకుఁ బోలునె వారినిసంహరింపఁగన్ 580
సీ॥ కాన నీమదిలోనఁ గలతఁజెందకుమమ్మ! యెంతయుఁ గ్రూరుఁడై యింద్రజిత్తు
భూపుల వంచింప మున్నావిధంబునఁ బూని మాయాసీతఁ దానచేసె
నిన్నిప్పు డిమ్మెయి నెలఁతుక! వంచింప నిమ్మాయఘటియించె విదినిజంబు
రామలక్ష్మణులశిరంబులుగావవి కృత్రిమపుందల లెంచిచూడ
గీ॥ నీకుభయమేల? మదినిఁజింతింపఁబోకు,' మనుచు దుఃఖోపశమనవాక్యములు పెక్కు
త్రిజటపలికిన నాలించి దిగులుమాని, యెప్పటివిధంబుననయుండె నిగురుఁబోడి 581

## ఇంద్రజిత్తు నికుంభిలయాగము చేయుట

గీ॥ ఇట్లు మేఘనాదుండు తావెన్నరాని, యింద్రజాలముల్ మాయలవెన్నొపన్ని
యన్నియున్ వమ్మలగుటయు నంతరంగ, మందు వగనొంది కడ కిటులనితలంచె 582
చం॥ 'దశరథభూపసూనులది దైవబలంబగుఁగాక నాది భీ
షణబలమౌనుఁగాక యిఁక వారినిభండనమందుగెల్వఁగా
భృశమగు దైవశక్తియినుపెంపునఁగాక మఱొక్కరీతిగా
వశమె జయింప నాత్రిపురవైరికి నైత?' యటంచు నెంచుచున్ 583
కం॥ తనదగు నుపాసనాబలి, మునఁజేసి యరాతిసైన్యముల నిఁకఁ బొలియిం
తు' నని కృతనిశ్చయుండై, దనుజాధీశ్వరునిసుతుఁడు తత్క్షణమాత్రన్ 584

సీ॥ ఉరుభక్తిమై నొకానొకక్షుద్రదేవతం గరమునారాధించి గడియలోన
దానినిఁ దానుబ్రత్యక్షంబుగావించుకొని వినయముదోప వినతిచేసి
'రామలక్ష్మణులను రణములోనిర్జించు ఘనశక్తినిన్వాకుఁ గరుణమెయిఁ బ్ర
సాదింపు' మని వేడ నాదేవతవచించె 'వినుము! రావణి! నేను విన్నవింతు
గీ॥ నరయఁగ నికుంభిలమ్మను యాగమొకటి, చేసితెనియు దివ్యాస్త్రసిద్ధియు నొక
దివ్యరథమును లభియించు దేవవైరి!, దానఁజేసి జయింతువు దాశరథుల. 585

గీ॥ ఆనికుంభిలయాగమో యసురవీర!, వినుము సాంగముగా నెఱవేర్చితేని
నీకు లేరెదురెవ రట్లుగాకనడుమ, విఘ్నమొదవినఁ జావుతప్పినది కాదు' 586

ఆ॥ అనుచు నానతిచ్చి యాక్షుద్రదేవత, యాక్షణమ యదృశ్యరాలగుటయు
నలరి మేఘనాదుఁడానికుంభిలయాగ, మపుడు చేయఁబూని యాతెఱంగు 587

కం॥ తనతండ్రియైన పంక్తిము, ఖునకు నివేదించి యేడుకోట్లసురభటుల్
తనుఁగొలువ నింద్రజిత్తుప, యనముంగావించెఁ బశ్చిమాభిముఖముగన్ 588

గీ॥ అట్లు పశ్చిమాభిముఖుఁడై యరిగియరిగి, యొకవిశాలప్రదేశంబు నొనరఁగాంచి
యచట యజ్ఞస్థలంబుగా నమపఱచి, యెలమిఁగ్రతుదీక్షఁబూనె నాయింద్రజిత్తు 589

సీ॥ కొందఱధ్వర్యులు కొందఱుహోతలు కొందఱుసామాజికులును జేరి
కొందఱు మంత్రముల్ గొణగసాగిరి మఱికొందఱు తత్క్రతుకుండమందు
నెడనెడ హవ్యాదులిడఁగాఁదొడంగిరి కొందఱు మేకలుగొఱియలాది
గాఁగల జంతుప్రకాండంబులనుదెచ్చి బలులొసంగిరి క్రతుపావకునకు
ఆ॥ నావిధంబుగా దురాచారములు సదా, చారములును రెండుసమముగాఁగ
ఘోరభంగిగా నికుంభిలయాగంబు, వెలమిఁజేయసాగె నింద్రజిత్తు 590

## రావణుఁడు సపరివారముగా యుద్ధమునకు వెడలుట

గీ॥ అంత నీలోపలన్ లంకయందున్న, మేటిబలవంతులైన నిశాటులెల్ల
సమరమునకేగి పెక్కండ్రు సమసిపోవ, నంత దశకంధరుఁడు భీతి నందఁబోక 591

కం॥ అప్పుడు పంక్తిగ్రీవుఁడు, తప్పక రణకుతుకమునను దనుజులుగొలువన్
గొప్పరథమెక్కి తాఁగర, మొప్పెసఁగఁగ బయలుదేరె యుద్ధంబునకున్ 592

ఆ॥ అట్లు సపరివారుఁడై రణాంగణమును, దరియవచ్చుచున్న దశవదనునిఁ
గని విభీషణుండు ఘనుడైనయారామ, భద్రుతోడనిట్లు పలికెఁదాసు. 593

కం॥ 'దేవా! చోదుండై మీ, దేవినిఁ జెఱఁబట్టికొనుచుఁ దెచ్చినఖలుఁ డా
రావణుఁడుపీడె సుమ్మీ!, వేవేగమె చంపుడితని విక్రమమెసఁగన్' 594

కం॥ అని పలుకుటయును రాఘవుఁ, డనుజుండును దాను ననికి నాయత్తంబై
ధనురాద్యాయుధములుగొని, హనుమద్వాహనముమీద నారోహకులై. 595

కం॥ దశముఖునకు నభిముఖముగ, దశరథ భూపాలసుతులు తారు నడువుడున్
భృశముగ నాయుభయులకును, బలపతిముఖ్యులుపొగడఁగ బవరంబయ్యెన్. 596

కం॥ వానరసైన్యంబులు మఱి, దానవసైన్యములు కడిమిఁదలపడి యన్యో
న్యానూనతాడనంబుల, నానావిధగతులను గదనముసేసిరొగిన్. 597

కం॥ పదికరములచే విండ్లొక, పదిగైకొని తక్కుఁగల్గు పదికరములచేఁ
బ్రదరములు దొడిగి యాదశవదనుండేసెను దినేశవంశ్యులపైనన్ 598

గీ॥ పంక్తికంధరుఁడేసెడు బాణచయముఁ బ్రతిశరంబులచేత నారామవిభుఁడుఁ
దదనుజన్ముండు వేగనంతరమునందె, చూర్ణమొనరింపసాగిరి చోద్యముగను. 599

సీ॥ మఱియుఁ బఙ్క్తిముఖుండుమారుతాస్త్రంబేయ రామభూవిభుఁడు పర్వతశరమున
దానినిఁబొడిసేసె దర్పించివెండియు రావణుం డనలశరంబునేసి
దావాగ్నినృపులపైఁ దద్దయువ్యాపింపఁజేయుటయును రఘుక్షితితలపతి
జలబాణమునఁజేసి చల్లార్చెదానిని నిమ్మెయిరావణుండెన్నరాని
ఆ॥ మహితనిశితదివ్యమార్గణనికరంబు, దానుబఱపుచుంతఁ దరణివంశ్యుఁ
డస్త్రశమమున వానినన్నింటినిన్ రూపు, మాపఁదొడఁగె విక్రమంబుదోప. 600

సీ॥ ఇట్లు దశగ్రీవుఁ డెన్నెన్నిబాణముల్ నిగిడించు వానినన్నిఁటినిఁ గూఁడ
ధ్వంసమ్ముచేసినవాడయి మఱియును బదిశరంబులచేత భానుకులుఁడు
కడులాఘవమునఁ దత్కరములయందలి విండ్లుభగ్నముచేసి వేఱొకపది
మార్గణమ్ములచేత మకుటారిమకుటముల్ మహిడొల్లనేసి యమ్మానవేంద్రుఁ
ఆ॥ డంతతోఁ దనివిసందక క్రమ్మఱ, నంపవానగురిసి యడలఁజేయ
వాడువెఱచి రథముతోడవీటిదెసకుఁ, బఱచెఁ జూపఱెల్లఁ దఱచుఁదెగడ 601

కం॥ ఆరావణుఁ డటువఱవఁగ, నారాక్షససేనయెల్ల నగచరసేనా
దారుణశిలాతరునఖని, దారితమై పఱచె విగతదర్పముతోడన్. 602

## శ్రీరాముఁడు లక్ష్మణుని ఇంద్రజిత్తుపైకి యుద్ధమునకుఁ బంపుట

చం॥ అటుపిదపన్ విభీషణుఁ డహర్పతివంశ్యులగెల్వఁబూని యా
కుటిలుఁడు మేఘనాదుఁడు నికుంభిలయాగముఁ దానుజేయుచుం
డుట విని నట్టివాడయి కడుంగడుశంకయు భీతి దోపఁగాఁ
బటుతరవిక్రమాఢ్యు రఘువల్లభు రామునిఁగాంచి యిట్లనున్. 603

ఉ॥ 'దేవ! మదీయవిన్నపము తెల్లముగావినుఁ డాదురాత్ముఁడౌ
రావణి యెల్లరన్ మనలఁగ్రౌర్యమెసంగఁగ సర్వనాశవం
బేవిధినైనఁ జేయ మదినెంచి నికుంభిలయాగముం దగం
గేవలనిష్ఠతోడఁ గడునేర్పున సల్పెడునట్టి యిత్తఱిన్?. 604

శా॥ ఆయాగంబుసమాప్తమైన ననిలో నాయింద్రజిత్తున్ వినుఁ
డీరేడుజగంబులున్ గెలువలేవిమ్మాట నిక్కంబగున్
వెయేలాపలుకుల్? విరోధివధగావింపం గ్రతుధ్వంసముం
జేయన్ నీయనుజన్ము లక్ష్మణుఁగడున్ శీఘ్రంబ వుత్తెంచుడీ! 605

కం॥ తడసినకార్యంబంతయుఁ, జెడఁగల దటుగాన మమ్ముఁ జెచ్చెఱఁబనుపం
గడులెస్స స' మ్మటంచును, నుడివిమఱియు నావిభీషణుండిట్లనియెన్ 606

ఉ॥ 'శ్రీరఘురామ' నేనొకవిశేషముఁదెల్పెద నాలకింపు డా
క్రూరుఁడు మేఘనాదుఁ డతిఘోరముగా మును బ్రహ్మఁగూర్చి తాఁ
గోరితపంబుఁ జేసి సురకోటులచే మృతిలేకయుండఁగాఁ
గోరుచు మాయయొకతనఁ గోరఁడ శేషునిఁగూర్చి యేమియున్ 607

కం॥ ఆకారణమున రావణి, ప్రాకటముగ శేషుచేతఁ బ్రాప్తమరణుఁడౌఁ
గాక మఱి చావఁడొరుచే, నేకరణినినైనఁగాని యిదినిజమధిపా! 608

గీ॥ కాన శేషాంశసంభూతుఁడైన నీదు, సోదరుఁ డవశ్య మామేఘనాదుఁ గూల్పఁ
గలఁడు పిన్నని శంకింపవలదు పంపు, పెంపుదీపింపఁ బగతునిర్జింపనేర్చు' 609

గీ॥ అని యనేకవిధంబులనావిభీష, ణుఁడు వచించిన విని శంకవిడిచి రాముఁ
డంత సౌమిత్రిసింగరమాదరమునఁ, జీరి యనికినిఁ బయనంబుకేసి పలికె. 610

గీ॥ 'ప్రబలకపిసేనతోఁబోయి భండనమున, నింద్రజిత్తును మర్దించి సాంద్రవిజయ
లక్ష్మిఁగైకొని యేతెమ్ములక్ష్మణ! నినుఁ, గాచెదరుగాక దేవతాగణములెల్ల!. 611

గీ॥ ఈవిభీషణుఁడరసి నిన్నెల్లయెడలఁ, గంటికిన్ రెప్పవోలెను గాచియుండు
స్వాంతమున సంశయింపంగవలదు పగతుఁ, బోరఁబరిమార్చి యేతెమ్ము! పోయిరమ్ము'.

కం॥ అని దీవనపూర్వకముగ, ఘనుఁడగురాముండు పలికి గ్రక్కున సౌమి
త్రిని సమరోన్ముఖుఁగావిం, చెను దదనంతరము కీశసేనలుగూడన్. 613

కం॥ రామానుజుచెంటనసికిఁ, దాముసు సంసిద్ధమైరి తరుచరులెల్లన్
ధీమణి విభీషణుండును, దాముదమునఁ బయనమయ్యెఁ దనయాప్తులతోన్. 614

గీ॥ అట్లు కట్టాయితంబయి హనుమదాది, వీరనివహంబుతోఁగూడి వెలసియున్న
యమితవానరసేన తన్ననుగమింప, రామునకుమ్రొక్కి లక్ష్మణస్వామి యపుడు. 615

కం॥ రణభేరీనివహంబుల, గణితంబుగ మ్రోయుచుండఁ గడురయమునల
క్ష్మణుఁడు మహోత్సాహముతో, రణమునకును బయలుదేరె రాక్షసులదరన్. 616

కం॥ ఆరవికులుఁ డమ్మెయిఁజని, యారయఁబొడఁగాంచె నప్పుడగణితరక్షో
వీరభటకోటిరక్షిత,మౌ రావణుకూర్మిసుతుని యజ్ఞస్థలమున్ 617

సీ॥ ఆసమయంబున నాచారనిపుణులౌ విబుధారు లాయజ్ఞవేదిచుట్టుఁ
బెక్కండ్రుచేరి గంభీరస్వరంబులఁ జాలఁగమంత్రముల్ చదువువారు
హవ్యకవ్యంబులు యజ్ఞపావకునకు హెచ్చుగానాహుతు లిచ్చువారు
గోవులుమేకలు గొఱియలుమొదలగు జంతువుల బలులొసంగువారు
గీ॥ కలిగి కడుజయప్రదముగఁ గ్రతువుసాగు, చుండె మఱియును నాయజ్ఞకుండమందుఁ
గోటిసూర్యులకాంతితో మేటియైన, తేరొకటిపుట్టుచిహ్నంబు తేటపడఁగ. 618

గీ॥ వరశతాధిక ఘోటకవాహ్యమాన, మై మహామోఘసర్వదివ్యాస్త్రకలిత
మగుచు నొప్పిన యామేటియరదమెక్క, నపజయములేదు వాని కాహవములందు. 619

గీ॥ అంత మేఘనాదుఁడు తనయాగమింకఁ, బరిసమాప్తమయ్యెడునని భావమందుఁ
దలఁచి మురియుచుఁ గడుఁబట్టుదలవహించి, స్థిరతతోనుండెను మఱింత దీక్షతోడ 620

వానరులింద్రజిత్తు నికుంభిలయాగమును జెడఁగొట్టుట

సీ॥ ఇట్లుండ వానరులెల్ల విభీషణ ప్రేరితులై కడుఁబేర్చియార్చి
యజ్ఞరక్షకులైన యామేడుకోట్లరాక్షసులనుదాకి విక్రమముమెఱయఁ
దరుశిలాప్రతతిచేఁదాడించితాడించిశితనఖాయుధములఁజీరిచీరి
బహుముష్టిహతులచేఁ బ్రహరించిప్రహరించి కఱకుదంతములచేఁ గఱచికఱచి
గీ॥ దానవులకంఠముల కురిత్రాళ్లుగాఁగ, భయదఘనవాలపాశముల్ పదిలముగను
జుట్టి వసుధపైఁదట్టించి స్రుక్కఁజేసి, పోరుగావించి రత్యంతదారుణముగ. 621

గీ॥ వానరాభిఘాతములకు దానవాళి, చచ్చినొచ్చియుబెదరక శౌర్యమెసఁగ
బహువిధాయుధములచేత వానరులను, జాలనొప్పించుచుం బోరుసలుపసాగె 622

గీ॥ అట్టియెడవారి చరణసంఘట్టనములఁ, జేసి భూరజఃపటలంబు చిత్రముగను
వెల్లిగసి భానుబింబంబు వేగఁగప్పి, ప్రబలనిబిడాంధకారంబుఁ బర్వఁజేసె 623

మ॥ తనువారుంబగవారలంచనెడు భేదంబున్ నిరూపింపలే
క మహావీరులు దైత్యులద్రిచరులుం గ్రౌర్యంబు దోపంగనా
తమ మందెల్లరు బొమ్మలాడినక్రియన్ దర్పించి పోరాడి ర
త్యమితోత్సాహసమేతులై బహువిధాన్యోన్యప్రహారంబులన్. 624

ఆ॥ కొంతవడికి వారిగురుకాయములనుండి, నిర్గమించినట్టి నెత్తురెల్ల
నారజస్సునంత సడగించి మునుపటి, ప్రబలగాఢతమము వాయఁజేసె. 625

సీ॥ ఇబ్బంగిఁదలపడి యిరువాగుసైన్యముల్ క్రతువునెమ్మెయినైనఁ గావఁదలఁచి
దానవులున్ మఱి దానిని ధ్వంసంబుఁగావింపఁబూని యాకపివరులును
బ్రాణంబులను దృణప్రాయంబుగానెంచి యన్యోన్యవిజయార్థులగుచుఁ గరముఁ
బెద్దయుఁబ్రొద్దును బెనఁగిపెనంగి యాసవనప్రదేశమ్ము సమరభూమి
గీ॥ గాఁగఁజేసిరి తదుపరిఁ గపులుకొంద, ఱురుబలోపేతులై యరివ్యూహములను
దాము భేదించుకొనుచు నుద్దండలీల, హోమకుండముదరిసి మహోద్ధతులయి 626

చం॥ చెఱచిరి హవ్యపాత్రములు చెచ్చెఱఁబూడ్చిరి హోమగుండముం
జెఱచిరి యూపముల్ వధముసేసిరి హోతల యాజకావళిం
జెఱచిరి యాగయోగ్యఘనవస్తులవస్తుసమూహమంతయుం
జెఱచిరి పెక్కుహింసలమజేసి దశాననసూతివిఘ్నయున్. 627

## ఇంద్రజిత్తు రోషావేశముచే విజృంభించి కపులతోఁ బోరుట

కం॥ వనచరులచేత నిమ్మెయిఁ, దనయజ్ఞము విఘ్నమైనఁ దద్దయుఁ గోపిం
చినవాడై రావణి యపు, డనుపమలయకాలువోలె నత్యుద్ధతుఁడై. 628

మ॥ పటురావంబుననార్చి భీకరధనుర్బాణంబులంగొంచు మ
ర్కటులారా! నిలుఁడింక మీపొగరడంగంజేసి యాకాలుచెం
గటకుం బంపెదనంచుఁ బల్కుచు శతాంగంబెక్కి గర్వోద్ధతిం
గుటిలస్వాంతుఁడు మేఘనాదుఁడనికిం గోపించి సన్నద్ధుఁడై 629

సీ॥ తనచాప మింద్రాయుధము గాఁగ దద్గుణక్వణనంబె యురుతరగర్జ గాఁగ
దనమేని భూషణతతి కాంతిపుంజంబె లాలితఘనతటిల్లతలు గాఁగ
దనలసత్సునిశితదారుణమార్గణప్రతతులె వర్షధారలును గాఁగ
దాను ప్రావృట్కాలతతమహాగంభీరభయదనీలాంబుదపటలి గాఁగ
గీ॥ ప్రబలవానరవాహినీప్రకటభూరి, భాసురక్షేత్రముల ననివార్యలీల
ముంచివైచెను గరము సంపూర్ణముగను, ననుపమైకమహౌద్ధత్యమును వహించి. 630
గీ॥ ఆశరప్రవాహముచేత నావిధమున, ముంపఁబడి వానరులు భయోత్కంపితులయి
చెదరి నలుదిక్కులకుఁ గాందిశీకులైనఁ, గని విభీషణుఁ డప్పుడిట్లనుచుఁ బలికె 631
చం॥ 'వనచరులార! పాఱకుఁ డవార్యపరాక్రమవిక్రమంబులన్
దనుజులఁ బోరఁగూల్చి లలితంబగుకీర్తిగడింపు డింక మీ
మనములయందు భీతి యనుమానముఁ బొందకు డెల్లభంగులన్
మనకె యగుం జుడీ జయము మద్వచనంబులు విశ్వసింపుడీ!' 632
గీ॥ అనివిభీషణుఁ డిటుపల్కి యగచరులను, దానఫలపైకిఁ బురికొల్పి తాను లక్ష్మ
ణసహితుండయి పంక్తికంధరసుతునకు, నభిముఖంబుగ నడచె రణార్థియగుచు 633
గీ॥ అప్పు డామేఘనాదుఁ డత్యధికరోష, కలితుఁడై లక్ష్మణవిభీషణులకుఁ దాను
నభిముఖంబుగఁ జనుదెంచె నార్పులిడుచు, బెబ్బులులమాఱుకొనవచ్చు బెబ్బులివలె 634

## విభీషణమేఘనాదుల పరస్పరప్రతారణము

గీ॥ ఇవ్విధంబున సంరంభమినుమడింప, మేఘనాదుఁడు మేఘగంభీరములగు
భాషణంబులతోడ విభీషణుదెసఁ, జూచుచు అంజూచి యిట్లనుచున్ వచించె. 635
ఉ॥ 'ఓరి! విభీషణా! తగునె? యుక్త మయుక్తమటంచు నెంచకే
దారుణకృత్యమౌ కులవిదారణముం బొనరింపఁబూని తా
వోర! దురాత్మ! యేమనఁగవా నిను? దైత్యకులాంతకుండవై
క్రూరుఁడ వీవు పుట్టితివి కూల్పఁగ నర్హుఁడ వెల్లభంగులన్ 636
ఉ॥ గౌరవహీనమంచనక గ్రక్కునఁ బోయి విరోధిపక్షముం
జేరి సమస్తభూప్రజలు ఛీ! యన మాపగు గుట్టుదంతయున్
వారికిఁ దెల్పుచుం గులముఁ బాడొనరింపఁగ సిద్ధమైతివా?
యోరి! యధర్మచిత్త! తగవొక్కక నీవిటు సేయఁ బాడియే?. 637
గీ॥ నాకుఁ బినతండ్రివయ్యు ననాన్యాయవృత్తి, నాయొనర్చెడి క్రతువు విఘ్నమ్మొనర్పఁ
గోరకుఁడవైతి వీఁక నిన్నుఁ గలుషహృదయ!, బ్రదుకనిత్తునె? నిలునిలు పాఱిపోక. 638

సీ॥ ప్రవిమలక్షీరవారాశిలోపల మహాభీకరవిష ముద్భవించినటు
లలితచందన వృక్షకలితమౌవసములో ఘోరికంటకశాఖి పుట్టినట్లు
అభినవోజ్జ్వలమనోహరసస్యరాజికిఁ జీడపురుగనుటి చేరినట్లు
కమనీయపృషభాగంబునఁ బెనురాచపుం డక్కజంబుగఁ బొడమినట్లు
గీ॥ పావనంబగు దానవవంశమందు, నీవుచెడఁబుట్టితివి పాపి! నీచహృదయ!
నిన్నిదే నిమిషంబులో నిహతుఁజేసి, కులము నిష్కలుషమ్ముగ సలుపువాఁడ 639
మ॥ క్రతువిఘ్నంబున కార్తిఁజెందను సమీకంబందునన్ నన్నిలన్
మృతునింజేయు ప్రతాపశాలికలఁడే మృత్యుంజయాదుల్ మదో
ద్ధతిమైఁదాకిన నేజయింతునిఁక రారా! క్రూర! తొల్దొల్త నిన్
హతుఁగావించి వధింతుఁ బిమ్మట రఘుక్ష్మాధీశులం గీశులన్'. 640
కం॥ అనిపలుకుమేఘనాదునిఁ, గనుఁగొని తనడెందమందుఁ గనలుజనింపన్
పనుఁడు విభీషణుఁ డపుడీ, ట్లనియెన్ ఖలుఁడైనయట్టి యారావణితోన్. 641
ఉ॥ నోరికివచ్చినట్లు నను నొవ్వఁగఁబల్కుట పాడిగాదు నం
గూరిచి భావికాలనయకోవిదులే మఱి నిర్ణయింత్రు నీ
పూరక ప్రేలినంతటఁ బ్రయోజనమేమిర? క్రూర! నీకిదే
చేరువయయ్యెఁగాలమది చెచ్చెఱరమ్ము రణమ్ముసేయఁగన్ 642
కం॥ మనతప్పొప్పులను విమ, ర్శనముంగావింప నిప్డు సమయంబటరా?
వినుమ! మునుపటి నీయాటలు, కొనసాగవు రమ్ము! పోరఁగూల్తుము నిన్నున్'. 643
కం॥ అని ప్రతివచనములాడెడి, వినయవిభూషణుని నావిభీషణుపైనన్
ఘనముగఁగోపించి దశా, ననినందనుఁ డేయఁదొడఁగె నానాస్త్రంబుల్ 644
కం॥ వాని శరాఘాతములకుఁ, దాను భయంపడక మిగుల ధైర్యముతోడం
బూని విభీషణుఁ డరిపై, నోనాటఁగఁ దూపులేసె నూఱులువేలున్. 645
గీ॥ వారుభయులిట్లు తలపడి దారుణముగఁ, దమపరస్పరబహువిధాస్త్రప్రయోగ
నిపుణతకుఁ జూపఱగ్గింప నిరుపమాన, సాహసంబునఁబోరిరి చాలతడవు 646
చం॥ పిదప విభీషణుండు ప్రతివీరుని భీకరమార్గణాహతిన్
విదళితగాత్రుఁడై కరమువేదననొందుచు నించుకంత తా
నొదిగినఁజూచి యప్పుడు మహోరుబలాఢ్యుఁడు లక్ష్మణుండు దు
ర్మదుఁడగు మేఘనాదుని నమందరయంబునఁదాక వాడునన్ 647

శా॥ 'ఓరీ! లక్ష్మణ! నీవుబాలుఁడవు నేనుద్యద్బలోపేతుఁడం
బోరా! నీకునువాకు యుద్ధమననర్హుల్ గేలిగావింత్రు నా
బారింబడ్డ త్రినేత్రుఁడున్ బ్రదికిపోవన్‌లేడు శక్రాదులం
బోరన్‌గెల్చి జయంబునొందితిని సంపూర్ణప్రతాపోన్నతిన్. 648

సీ॥ విహరించుటకు రమ్యవిపినతలముగాదు దారుణసంగ్రామతలమెకాని
తియ్యనిఫలములఁ దినుచుండుటలుగాదుతీవ్రాయుధపుఁబోట్లు తినుటెకాని
సతముమునులతోడి సల్లాపమదిగాదు ప్రకటవీరాలాపరవమెకాని
భ్రాతృసేవామహాపరిచయంబదికాదు శస్త్రవిద్యాపరిచయమెకాని

గీ॥ ముక్కుపచ్చలునారని ముద్దుబాల, కుఁడవు నీవేడ? మావోటి గురుతరైక
బలపరాక్రమధనులతో భండనంబు, సేయుటేదను? పామ్మోయి! చిఱుతవీవు'. 649

కం॥ అని యిట్లు కఠునపాలం, భనపూర్వకముగను వాడు పలికినపలుకుల్
విని లక్ష్మణుండు తనమది, వెనలేని యమర్షపొడమ నిట్లనిపలికెన్. 650

గీ॥ 'ఔనురావణి! నీవన్నదదినిజంబ, పలుపురజయించినవెకాని బంటుగాడు
ఒకరినిద్దఱఁ జంపకయుర్విలోన, నెవఁడువైద్యుఁడుగాడను టెఱిఁగినదియె. 651

సీ॥ నేనింతవఱకును నీవంటివీరాగ్రణులతోడఁ బోరాడి గెలువలేదు
ఘనవీరబిరుదంబు గడియింపఁగాలేదు కావున నోరి! రక్కసుఁడ! వినుము!
నేడువీరపరీక్ష నినుగెల్చినేఁగృతార్థుండనుగాఁగోరి భండనమున
కరుదెంచితిని గాలయాపనంబేలరా? రారమ్ము నాతోడ రణముసేయ

గీ॥ మిద్ధమర్మక్షతనిశాతమార్గణంబు, లనెడుభీకరసర్పంబు లాహరింప
నాత్రపడుచుండె నీదుప్రాణానిలముల, బ్రతుకుపైనీకుఁగలయాస వదలుమింక. 652

కం॥ నాచాలనితనమేదో, నీచాలితనమదేదొ నీకే తెలియున్
నీచాత్ముఁడ! రమ్మనికిన్, వాచాలత్వంబుతోడఁ బనిలేదింకన్. 653

శా॥ దైతేయాధమ! పాతిపోకనిలు! యుద్ధమ్మందు నస్మన్మహా
శాతాస్త్రంబులచేత నింగెడపి యుష్మద్రక్తమాంసంబులన్
భూతప్రేతపిశాచపంక్తులకు నేభుక్తిం బ్రసాదించి సం
ప్రీతింగూర్తును నన్నుదేవగణముల్ వేనోళ్లశ్లాఘింపఁగన్.' 654

గీ॥ అనుచువానికిఁ దగినట్ల యానుమిత్ర, పట్టి ప్రత్యుత్తరంబుగాఁ బలికితాను
వెంటనే వాయునందను విపులభుజశి, ఖరముధిష్ఠించి సజ్జితకార్ముకుఁడయి. 655

## లక్ష్మణ మేఘనాదుల యుద్ధము

కం॥ చండతరాశనిసన్నిభ, కాండంబులఁ దొడిగి పంక్తికంఠుని సుతుపైఁ
దండోపతండములుగాఁ, జండాంశుకులోత్తముండు చయ్యననేసెన్. 656

గీ॥ మఱియు లక్ష్మణుఁడెప్పుడు మార్గణంబు, దొడుగునో యెప్పుడిడునో తోపవయ్యెఁ
జెప్పనలవియేగాక విచిత్రమునను, వచ్చిపడుచుండె రావణిపై శరములు. 657

కం॥ ఆతూపులజడిలోపల, దైతేయాధిపసుతుండు తానుమునుఁగుచుం
జేతలుడిగి కొండొకవడిఁ, జేతమువికలత్వమొందిఁ జేర్పడి తనలోన్. 658

ఆ॥ 'అద్భుతంబుఁగొలిపె నబ్బబ్బ! విడేయు, నిశితశరము లశనినిభములగుచు
నాదుమర్మములనుభేదించి నొప్పించెఁ, ఓడుఁగుగాని వీడుపిన్నగాడు 659

గీ॥ ఇతఁడు శరములుసంధించి యేయుపట్ల, సాంద్రముగ మ్రోయు శింజినీశబ్దమరయ
యమమహిషముంటికానాదిమట్లు నాదు, వీనులంబడి భీతిఁ గల్పించుచుండె 660

చం॥ ఇతఁడు ధనుస్సుఁ గేలధరియించినయొప్పను శాతమార్గణ
ప్రతతులనేయుచొప్పుఁ గనబాపురె! పేడఖిలాస్త్రవిద్యలం
దతిమశలుండు శౌర్యధనుఁ డంతియెకాదు యథార్థ మీనరుం
డతులసమిత్కళావతురుఁ డల్పుఁడుగాడు సమస్తభంగులన్'. 661

కం॥ అని తలపోసినవాడై, దనుజాధీశ్వరునిసుతుఁడు తనయావచ్ఛ
క్తిని వినియోగించి ద్విష, జ్జనముల సాధింతునసెడు సంకల్పముతోన్ 662

చం॥ శతములువేలులక్షలును సాయకముల్ వెసవింటఁగూర్చి మా
ఘతిపయి రాముతమ్మునపయి రూఢిగవేయుచు విక్రమించినన్
వితత బలాఢ్యుఁడైన రఘువీరుఁడు లక్ష్మణుఁడంత వానియు
ద్ధతినొకచీరికింగొనక జాపిశిఖావళి నేయసాగినన్. 663

గీ॥ ఈతెఱంగున లక్ష్మణుఁ డింద్రజిత్తు, పెద్దయుసుద్బొద్దు పోరగావించునెడల
వారియన్యోన్యసాయకప్రతతినడుమ, మసలకొండొంటితోఁదాకి మండుచుండె 664

కం॥ తమశస్త్రవిద్యాలిపియు, దిమసఁడకౌశలము దేవతలుగని పొగడన్
ద్యుమణికులుఁ డింద్రజిత్తును, సమానముగ సంగరంబు సలిపిరి కడిమిన్ 665

సీ॥ గిరిబాణమొకఁడేయ సరగున దానికి భిదురాస్త్రమునఁ ద్రుంచువేఱొకండు,
అనలాస్త్రమొకఁడేయ నంబుమార్గణముచే వ్రేల్మిడిఁ జల్లార్చు వేఱొకండు,
వాయుశరంబొకడేయ దానినిసహి శిలీముఖముచే నొంచు వేఱొకండు
భుజగాస్త్రమొకఁడేయ భూరిగారుడముచే వెసరూపుమాపును వేఱొకండు

గీ॥ కడిమిమై వారలిరువు రిక్కరణివొకరి, కొకరులొంగక చెంగక యుగ్రభంగి
భండనంబుచేసిరి శరప్రతిశరముల, నోలినన్యోన్యవిజయైకలాలసులయి. 666

చం॥ పదపడి లక్ష్మణుండు పదిబాణములేసి తురంగయుగ్మముం
జదిపి శరత్రయంబునను సారథిఁజంపి పతాకనొక్కబల్
ప్రదరముచేత భూతలముపైవెసఁగూల్చి రథాంగయుక్తమి
ర్వదివిశిఖంబులన్ రథముభగ్నముచేసె గడున్రయంబునన్. 667

గీ॥ ఇట్లు విరథునిఁగావింప నింద్రజిత్తు, తక్షణమ తాను ధారుణీతలగతుఁడయి
చలముడింపక యత్యంతసాంద్రముగను, సాయకములేయఁదొడఁగిన సవితృకులుఁడు 668

కం॥ ఒక్కశిలాస్త్రముచేతన్, గ్రక్కున నామేఘనాదు కరమందలివి
ల్లక్కజముగఁ దునుమాడిన, సుక్కటి వాడంతనాజి కోడినవాడై 669

గీ॥ చేయునదిలేక కొండొకసేపు చింత, చేసి మాయలెవ్వేనిఁ దాఁజేయఁబూని
లంకదెసకాక్షణంబ పలాయమానుఁ, డైనఁ గనుఁగొని యారావణానుజుండు 670

సీ॥ రామానుజునితోడ రయమునననిట్లను 'వినుము! లక్ష్మణ! నాదువిన్నపంబు
రావణి లంకాపురంబును జొఅనెంచి యరిగెడుఁగాఁబోలు నరసిచూడ
పిటిలోవీనిఁ బ్రవేశింపనిచ్చుచో నెన్నేనిమాయలఁ బన్నఁగలఁడు
కావున నీమహోఖలుఁ జననీయక సంహరింపుము భవత్సాయకముల'

గీ॥ ఎని ప్రబోధించి మఱి వానరాళితోడ, 'విజితరిపులార! కపులార! విబుధవైరి
పిటఁజొఅనీకుఁ' డనుచు విభీషణుఁడపు, డెల్లవారినిఁ బల్మరుల్ హెచ్చరించె. 671

గీ॥ ఆవిభీషణుమాటలయందుఁగపులు, గౌరవంబుంచి గ్రక్కునఁ గాందిశీకుఁ
డై చనుచునున్నరావణి నడ్డగించి, తరుశిలాప్రహారములచేఁ దఱచునొంప. 672

ఉ॥ వాడపుడేమిసేయుట కుపాయమొకండును లేమిఁజేసి తాఁ
బోడిమియొప్ప శాత్రవులఁ బోరునఁజంపుటొ! లేకచచ్చుటో!
నేడునిజం బటంచుఁ గడునిశ్చితమానసుఁడౌచు వేగఁబో
రాడుటకత్తఱిన్ మఱలనాయితమయ్యె రథాధిరూఢుఁడై. 673

గీ॥ ఇట్లు స్యందనారూఢుఁడై చుట్టనుబహు, శతములున్వేలు దానవసమితిగొలువ
ననికిఁజనుచున్న యాసమయమున మేఘ, నాదునకు నిట్లు లపశకునములు కలిగె 674

ఉ॥ కూసెన్సృగాలముల్ మిగులఘోరముగా హరిదంతరంబులున్
మ్రోసె ధ్వజంబుమీదఁగడుభూరితరంబుగ గ్రద్దలాడెఁ దా
మాసినయట్లుదోచెరవిమండలమంతయు రక్తవృష్టి సం
త్రాసకరంబుగాఁగురిసె దైత్యవిపద్ఘనసూచకంబుగన్ 675

మ॥ తనచిత్తంబున మేఘనాదుఁ డపు డేతద్దుర్నిమిత్తంబులం
గనులారంగనియుం జలింపక భుజాగర్వంబు సంధిల్లఁగన్
ఘనకోపంబునవచ్చి లక్ష్మణునివీకందాకె వ్యాఘ్రంబుతో
డను దర్పోద్ధతిమీరఁదాకెడు ననడ్వాహంబు చందంబునన్. 676

ఆ॥ ఇట్లు దాకి శౌర్యమేపారసౌమిత్రి, పైన వానరాళిపైన నమిత
విశిఖవృష్టిముంప వెగడియాకపులెల్ల, వానిధాటికోర్వ వశముగామి 677

చం॥ ఎడనెడకుం దొలంగి యపుడెల్లరుకీశులుగూడి యొక్కటం
బుడమిచలింపఁగాఁ గరము భూరిరవంబుననార్చుచుం గడుం
గడిమియులావునొప్ప బలగర్వితదానవసేనతోడఁ దా
కుడు నిరువాగుసైన్యములకున్ భయదాహవమయ్యె వయ్యెడన్. 678

**వానరదానవసైనికులకు దారుణయుద్ధము జరుగుట**

ఉ॥ కుత్తుకలందెగన్నఱుకఁ గొబ్బరికాయలకైవడిం దలల్
గుత్తులుగుత్తులైపడియెఁ గ్రొవ్వునఁ బ్రేవులు తేలియాడఁ బె
న్నెత్తురుటేర్లుపాఱెఁ గడునెమ్మిమెయిం బలలాశనార్తమై
యుత్తటి భూతపంక్తులు రణావనిఁ గ్రమ్మఱఁజొచ్చెఁ బెల్లుగన్. 679

చం॥ శిలలు మహీరుహంబులును జేకొని భీకరదైత్యకోటినిం
దలలవియంగమోది కడుదారుణలీలవధింత్రు వానరుల్
బలితపుశూలముల్ గదలు బల్లెములాదిగఁగల్గు నాయుధం
బులఁగొని కీశసైనికులమొత్తుచు రూపడఁగింత్రు రాక్షసుల్. 680

సీ॥ పీకమై మఱియుఁ గేశాకేశియున్ భుజాభుజియునై దలపడిపోరువారు
సాలాశ్మతతులచే శస్త్రాస్త్రములచేత ఘనముగాఁ బ్రహరించుకొనెడువారు
వ్రేటునకును వ్రేటువేయుచుఁ దమయొక్క శౌర్యంబుఁ బ్రకటించి చచ్చువారు
చచ్చువారినిఁగని సంచలింపకవచ్చి సాహసంబునఁ బోరునలుపువారు

గీ॥ నై మహాదారుణంబుగ నద్రిచరులు, దానవులు ద్వంద్వయుద్ధంబుఁ దాముసేయ
వారిశౌర్యంబుధైర్యంబు వారిబలము, ఖేచరులుచూచి కరము శ్లాఘించిరపుడు. 681

గీ॥ మఱియు నొక్కెడ రథికసమాజములును, నాశ్వికులు గజారోహకులైన దనుజు
లడరి వివిధాస్త్రతతులచేఁ గడిమిమెఱయఁ, గపులనొంచుచుఁ బోరుసలుపుచునుండ. 682

గీ॥ అప్పు డగచరుల్ పలువు రత్యధికవీర, మూర్తులందాల్చి దిశలెల్ల బూరటిల్ల
నార్చుచున్ వృక్షపాషాణహస్తులగుచు, నద్దెసకుఁబోయి రణకాంక్ష యతిశయింప. 683

సీ॥ రథబృందములను జూర్ణంబునుగావించి రథికులనెల్లర వధముసేసి
గజయూథములఁ జొచ్చి గజిబిజిగామోది బలిమిఁ దదారోహకులను జంపి
యశ్వసంఘంబుల నంతంబునొందించి యాశ్వికశ్రేణుల హతమొనర్చి
కాలుబలంబుల గజిబిజిగయగునట్లు కలఁచి గ్రక్కున జముకడకుఁబంపి

ఆ॥ కొంతవడికి దనుజకోటిని సన్నంబుఁ, జేయుటయును భీతచిత్తులగుచు
నతిరయంబుమీర హతశేషులెల్లరు, పఱచి రింద్రజిత్తుమఖముఁగ్రూఁ జొరఁగ 684

ఉ॥ వారికిధైర్యముంగఱపి వాసవజిత్తు మఱుక్షణంబ యా
భీరుల సంగరోన్ముఖులవెండియుఁజేసి నితాంతకోపవి
స్తారవిఘూర్ణమానఘనతారకుఁడై యనిసేయసాగెఁ దా
వారవివంశ్యతో వనచరావళితోడఁ బరాక్రమంబునన్ 685

గీ॥ రావణాసురనందనుఁ డీవిధమున, నందఱకు నన్నిరూపులై యాహవంబుఁ
జేయుచుండఁగ వానరసేనలెల్ల, దవ్వులన తద్రథముచుట్టుఁ దాముమూగి. 686

చం॥ చలమున గండశైలములు చాలఁగ రావణిపైఁ దదీయభృ
త్యులపయి వర్షమోయవఁగఁ దోరముగా నిగిడింపసాగు ద
శ్యలముబలుండు లక్ష్మణుఁడసంతముగా సునిశాతసాయకం
బులు వెసనేసి రక్కసులముంచుచునుండెను దానుసత్తిఱిన్. 687

గీ॥ వానరుల్ వైచు బహుశిలాప్రకరములకు, లక్ష్మణుండేయు విశిఖజాలమ్ములకును
దానజలియింపఁడయ్యె నాదశవదనుని, పట్టి యద్దికిఁ జెలియలికట్టవోలె 688

గీ॥ ఇట్లవక్రపరాక్రమ మెసకమెసఁగఁ, గపులనున్ లక్ష్మణుండేయు ఘనశితాస్త్ర
తతుల నంతరమునన తాఁ బ్రతిశరములఁ, దునిమివైచుచు మేఘనాదుండు మఱియు. 689

సీ॥ పనసుఁడన్ వాని నిర్వదిమార్గణంబుల శతబలి ముప్పదిసాయకముల
నలుఁడనుకపివీరు నలువదితూపుల నానీలు నేఁబదియాశుగముల
భల్లూకవిభుని నర్వదినారసంబులఁ బ్రబలుసుషేణు డెబ్బదిశరముల
వాలినందను నెమఁబదియంబకంబులఁ బావనిఁ దొంబదిభల్లములను

గీ॥ భానుకులుఁడైన లక్ష్మణుపైన నూఱు, విశిఖముల నుత్తముఁడగు విభీషణుపయిఁ
బరగ నిన్నూటయెనుఁబది బాణములను, నేసి స్రుక్కించి వెండి యాయింద్రజిత్తు. 690
కం॥ తక్కిన చిల్లరమూకల, గ్రక్కున శరవృష్టిముంచి గాసిలఁజేయన్
స్రుక్కియు మూర్ఛలమునిఁగియు, నుక్కటి వికలాంగులయ్యు నుఱుభీతిమెయిన్ 691
గీ॥ చెదరి నలుదిక్కులకుఁ గపిసేనలెల్లఁ, బఱచుటయుఁజూచి లక్ష్మణస్వామి యపుడు
తాను రావణిమీద నుద్దండలీల, నేయసాగెను శరము లమేయముగను. 692
మ॥ ఘనుఁడౌ లక్ష్మణు చాపనిర్గతలసత్కాండాభిఘాతంబులం
దనమర్మంబులు చాలనొచ్చుటయు దైత్యస్వామిసూనుండు తా
ఘనదండాహతమైన భీకరమహాకాలాహిచందంబునం
బెనుకోపంబున మండి యేయఁదొడఁగెన్ వీకన్ శరవ్రాతముల్. 693
సీ॥ ఆగ్నేయసాయకం బంబుపృషత్కము గారుడాస్త్రంబు కౌబేరశరము
వారుణాఖ్యమవు పన్నగవిశిఖంబు నైంద్రబాణంబు యామ్యాశుగంబు
రౌద్రనామకఖగ మద్రికాండంబున మరుదంబకము తమోమార్గణంబు
సౌరాఖ్యరోపంబు సౌమ్యకలంబము నాసురపైశాచకాదులైన
గీ॥ బహుశరంబులు లక్ష్మణస్వామిమీదఁ, దాఁబ్రయోగించుచున్ మహాదారుణముగఁ
బోరుగావించుచుండె నద్భుతముగాఁగ, గగనచరులెల్లఁ గన్గొని పొగడుచుండ. 694
ఉ॥ ఈకరణిన్ దశాస్యసుతుఁ డేపునఁబెద్దయుఁబ్రొద్దు పోరుచో
భీకరమౌ నిజాస్త్రములు వ్రేల్మిడి నన్నియు వమ్ములౌటయుం
బ్రాకటశౌర్యధుర్యుఁడగు భానుకులోత్తముఁడేయు బాణముల్
దాకిక్షతాంగుఁ జేయుటయుఁ దద్దయునొచ్చి యతండుకిమ్మటన్. 695
ఉ॥ మానకయింద్రజాలములు మాయలుపెక్కులుపన్ని యుద్ధమా
దానవవీరపుంగవుఁడు దానొనరించెనుగాని యించుకం
తేనిఫలంబుగానక జయేచ్ఛపరిత్యజియించి తద్దయున్
దీనతఁబొంది యిట్లనిమదిందలపోయఁగసాగె నత్తఱిన్ 696

## లక్ష్మణుఁ డింద్రజిత్తును వధించుట

మ॥ 'అతులామోఘములౌ మదీయఘనదివ్యాస్త్రంబు లీయర్భకున్
హతుఁగావింపఁగనోపవయ్యెనుగదా యౌరౌర! వీడేయుబల్
శితకాండంబులు నాశరీరమున నక్షీణంబుగానాటి బా
ధితుఁజేయంగనుజొచ్చె వెల్గతులం దెల్లంబ చేనోడుటల్'. 697

గీ॥ అనుచుఁ గొండొక సేపునెమ్మనమునందుఁ, జింతనొందుచు నాయింద్రజిత్తువెండి
తనకు మరణంబ యింకఁదథ్యమ్మటంచు, నిశ్చయముచేసి ధైర్యమున్ పీడఁబోక. 698

మ॥ గుణరావం బతిభీషణంబయి దిశాక్షోభంబుగావింపఁగన్
రణభూమిం దనతేరుచిత్రగతులన్ సంచారముండేయ రా
వణి బాణంబులు వేలులక్షలు కపివ్రాతంబుపైనేసి ల
క్ష్మణుపై భీకరమైన శక్తిశరమున్ మంత్రించియేసెన్ వెసన్ 699

గీ॥ అదియు మంటలుగ్రక్కుచు నరుగుదేర, దానిపై లక్ష్మణస్వామి తానుగూడ
శక్తిబాణంబయేయ నాశక్తులంత, రమునరొండొంటితోడఁ బోరంగఁజొచ్చె. 700

కం॥ మండెడుపెనుమంటలతోఁ, జండధ్వానములతోడఁజదలన్ శక్తుల్
రెండును హెూరాహెూరిగఁ, గొండొకవడిఁబోరె మిగులఘోరతరముగన్. 701

గీ॥ అవ్విధమున శక్తిద్వయమద్భుతముగఁ, బోరిపోరివిరామముఁ బొందుటయును
వీరుపోవక యామహావీరులు విని, ధాస్త్రశస్త్రాళిచే సల్పిరాహవంబు 702

సీ॥ హనుమద్రథారూఢులైకొంత సేపును క్షోణిసంచారులై కొంతతడవు
నొకనిపైనొక్కఁ డత్యురుశరంబులవెల్లిఁగొల్పుచుఁ బోరిరి కొంతతడవు
బరఘగదాసిముద్గర తోమరాదులౌ ఘోరాయుధంబులఁ గొంతతడవు
ముసిభుజాభుజిఁగచాకచిఁబెనంగుచు గెల్పుగొనఁదలంతురు మఱికొంతతడవు

గీ॥ రాముతమ్ముఁడు రావణి భీషముగను, దాకియిమ్మెయి కదనంబు తాముసేయ
నుభయసైన్యంబులుంగూడ యుద్ధముడిగి, కనుచునుండిరి వారివిక్రమమునేర్పు. 703

ఉ॥ సొలుచు మూర్ఛలన్మునుఁగుచున్ వెసలేచుచు వెచ్చనూర్చుచుం
గాలువలొచు శోణితము కాయములందుస్రవించుచుండ వా
భీలపరాక్రమంబెసఁగ వృత్రబిడౌజులపోల్కి నుగ్రులై
యాలముసేసి రాదశముఖాత్మజుఁడున్ రఘురాముతమ్ముఁడున్. 704

కం॥ పిమ్మట రావణిబాహుబ, లమ్మెల్లను దఱుగఁజొచ్చె లక్ష్మణుదోస్స
త్త్వమ్మంతకంతకును నమి, తమ్ముగఁ బెరుగంగసాగెఁ దత్సమయమునన్ 705

సీ॥ ఈవిధంబున సత్త్వహీనుఁడై రావణి మాయచే లంకలో మఱిచొరంగ
యత్నించెనేకాని యదిసాగమింజేసి యూరకరోజుచునుండెఁ జేష్ట
లుడిగి యాలోపల నూర్మిళాధవుఁడు వేవేగ విభీషణప్రేరితుఁడయి
భార్గవాస్త్రము వింటఁబదిలంబుగాఁగూర్చి లక్షించి తద్వవక్షమందు

గీ॥ మంత్రపూర్వకముగనేసె మహితభుజుఁడు, తత్ప్రహారంబుచేత నాదైత్యవీరుఁ
డురముజర్జరితంబయి రురులయట్ల, శోణితముపాఱ భూమిపై సోలిపడియె. 706

కం॥ పడిగిజగిజతన్నుకొనుచు, మడిసెన్‌రావణి తదీయమరణముఁగని త
క్కిడిరక్కసిమూక కడుం, గడుభయమునఁ బంక్తికంఠుకడకుం బఱచెన్ 707

సీ॥ ఇట్లు సౌమిత్రియాయింద్రజిత్తును జంపి సురకోటితనమీద స్తుతిపురస్స
రంబుగఁ బుష్పవర్షముగురియుచునుండ వనచరాళినివెంటఁగొనుచు రామ
భూజానిచెంతకుఁబోవుటయునుఁ దమ్ముఁబ్రేమాతిశయమునఁ బెద్దతడవు
కౌగిటఁజేర్చి శిఖంబ తదీయమౌ కుశలవార్తనడిగి కువలయపతి

గీ॥ యింద్రజిత్తువధోదంతమెల్లనెఱిఁగి, హర్షపులకితగాత్రుఁడై యనుజయముఁ
బొగడి తానును వానరుల్ మిగులసాను, భూతిదోపఁగ నుపచారములు సలిపిరి. 708

మత్తకోకిల॥ అసుషేణుఁడు రాముపంపున నౌషధంబులుదెచ్చి తా
నాసుమిత్రకుమారునంగములందునున్న క్షతంబులం
జేసెవేగఁ జికిత్స దాననచేసి సత్త్వమహోజవో
ల్లాసభాసురకాంతులొప్పఁ జెలంగె లక్ష్మణుఁ డత్తఱిన్ 709

## ఇంద్రజిత్తు మరణవార్త విని రావణుఁడు దుఃఖించుట

గీ॥ అంతనక్కడ హతశేషులగు దనుజుల, వలన రావణుఁ డింద్రజివధము నెఱిఁగి
దుఃఖభరమున నఱికినఁదునిసిపడెడు భూరుహమువూడ్కి ధరఁద్రెళ్లి మూర్ఛనొందె. 710

గీ॥ శీతలోపచారంబులచేతఁ బంక్తి, ముఖుఁడు కొండొకవడికిఁ దామూర్ఛఁదేరి
వనటపైకొన నిజతనూభవునిగూర్చి, యిత్తెఱంగున వెలుఁగెత్తి యేడ్వసాగె 711

సీ 'హాసుత! నినుఁబాసి యవనిలోనిటమీద నెట్టులజీవింతు? నెటుభరింతు?
నీవంటివీరాగ్రణియగుతనూజునిఁ గటకటా! యింకనేనెటు పడయుదు?
నీవనునావలె కేవిధంబునదాటఁజాలుదు నీమహాసమరజలధి?
నరవానరులగెల్చి నాకుజయశ్రీనిఁ జేకూర్తువనుచు వాంఛించియుంటిఁ

గీ॥ గడకు నాయాసపుడమిలోఁగలసిపోయె, నేమిసేయుదు? నాగతి యెట్టులొక్కొ?
'నీపయిన్ నాకుఁగలప్రేమ నిరుపమాన, మెట్లుమఱువంగనగు నిన్ను? నింద్రజిత్తు!. 712

ఉ॥ ముప్పదిమూడుకోట్ల సురముఖ్యుల లీలయవోలెగెల్చి నీ
వప్పురుహూతుఁబట్టి యరయంజెఱఁబెట్టిననాటి శౌర్యమో
యప్ప! మఱెందుఁబోయెఁ? దుదకక్కట! యల్పునిచేతఁ గూలితే?
'తప్పదలంచెఁ బోమనలధాత కడుంగడు నిర్దయాత్ముఁడై 713

మ॥ అరయన్ నీకునదాభయమ్ముపడి పాదాక్రాంతులై నాసుద
త్పరతన్ సేవలుసేయుచున్నదివిజుల్ భావింప నాయాజ్ఞలం
బరిపాలింపర లెక్కసేయక తృణప్రాయంబుగానెంచి యీ
పరిహాసాస్పదమైన జీవితమిఁకన్ వర్జించుటే లెస్సయా'. 714

సీ॥ అని రావణుండిట్లు మనమునశోకించి యెడనెడ మఱియుఁదా నిట్లుపలికె
'నిన్నివిధంబున నిహతుఁగావించిన యారాఘవుల ససైన్యముగఁబట్టి
హతముచేయుదునొండె నట్లుగాకయెయున్న వారిచేఁబోరిలో వీరమరణ
మేనుబొందెదనొండె నీరెండుపద్ధతులందునొక్కటి సిద్ధమగు' నటంచుఁ
గీ॥ దానుగృతనిశ్చయుండయ్యెఁ దత్సమయము, నందు మందోదరీప్రముఖాంగనలగు
రావణునిభార్యలందఱు రావణిమృతి, కై కడుంగడుశోకించి రార్తలగుచు. 715

## సులోచనసహగమనము

సీ॥ మఱియు ననంతుకుమారి సులోచనయను సతీరత్నము తనపెనిమిటి
యగు మేఘనాదుఁ డాహవమునఁగూలినవార్తనాలించి తానార్తిదోప
విలపించుచుం దనవెంటఁగాంతాజనం బపరిమితంబుగా ననుసరింపఁ
గొడుకును గూతునుగొని మామయాజ్ఞచే రణభూమికేతెంచి రావణసుతు
గీ॥ మృతశరీరముఁగనుఁగొని మేదురమగు, దుఃఖముప్పొంగిరాఁగఁ దోర్దోడనటుకఁ
బద్దకోమలతరుశాఖవలె ధరిత్రిఁ ద్రెళ్లి కొండొకసేపు మూర్చిల్లటయును. 716

గీ॥ అప్పుడందలివనిత లత్యాదరమున, శీతలోపచారంబులుసేయనామె
మఱలఁదెలివొందిగ్రక్కునమగనిశవము, పైనఁబడి యివ్విధమున నేడ్వంగసాగె. 717

సీ॥ ప్రాణేశ! నన్నెడఁబాసి వీవక్కట! పరలోకమునకేగఁ బాడియగునె?
నీవియోగమునకు నేనెట్లుసహియింతు? బతిహీననై యెట్లుబ్రదుకుదాన?
వైధవ్యదుఃఖమన్ వార్ధిలోపలనన్ను నిటుముంచి చనమనసెట్లువచ్చె?
నీవులేకయెయున్న నేనీబుడుతలను నెటువలెఁబోషింతు? నేదిదారి?
గీ॥ కటకటా! కాలమేవిధిఁ గడుపుదాన? నన్నుఁగొనిపొమ్ము నీవెంట నాథ!' యనుచు
బాష్పజలములు వరదలైపాఱుచుండఁ, బెద్దతడవుశోకించె నావెలఁదిమిన్న 718

గీ॥ పిదప భర్తతోపాటడ మదిఁదలంచి, మగువ తనదుపాతివ్రత్యమహిమచేత
జీవితేశ్వరునిం బునర్జీవితునిగఁ, జేయనిద్రితుపలె నింద్రజిత్తు లేచి 719

కం॥ తన భార్యయగుసులోచనఁ, గనుఁగొని ఖేదంబు పొడమఁ గన్నులసంకుల్
ఘనముగఁ దొరఁగుచునుండఁగ, దనుజేంద్రతనూభవుండు తానిట్లనియెన్. 720

గీ॥ 'కాలగతి(ద్రోయ నెంతటి ఘనుల కైన, నలవిగాదు, సరోజాక్షి! యరసిచూడ
నెల్లరకుఁ జావుసిద్ధంబ యెఱిఁగియెఱిఁగి, యిత్తెరంగున విలపింపనేల? వినుము!. 721

చం॥ మును నజుచేతనేను వరమల్గొనునప్పుడు యక్షకిన్నరా
ద్యనిమిషకోటిచే నపజయంబు మఱెన్నఁడు లేకయుండ నె
మ్మనమునఁగోరుచున్ వినుము! మామయటంచు ననంతుఁగూర్చి యో
వనితరో! కోర కిట్టిదురవస్థను బొందితి నేమిచేయుదున్?. 722

కం॥ అదికారణముగ లక్ష్మణుఁ, డదయుండై తాను శేమనంశజుఁడగుటం
జదుపఁగలిగె లేనియెడల, మదిరేక్షణ! గెలువవశమె మనుజులు నన్నున్? 723

గీ॥ నీవు వగవంగఁబోకుమ నెలత! వీర, మరణమొందుచునుంటి నామాటవినుము!
సీతతో లంకకుంజేటు సిద్ధమింక, రామలక్ష్మణులకు జయప్రాప్తియగును 724

ఆ॥ కాన లంకలోనఁ గాపురంబుండుట, తగదు నీదుతండ్రియగుననంతు
చెంత క్షీణంబ శివులఁదోడ్కొని, చని సుఖింపుమీవు సరసిజాక్షి'!. 725

సీ॥ అని యిట్టునుడుపుచుఁ దనసతీసుతవియోగమునకుఁ జాలదుఃఖంబునొంది
ప్రాణముల్విడిచి వీరస్వర్గమునుబొందె నాపంక్తికంధరు నాత్మజుండు
ప్రాణేశశవముపైఁబడి ఘోరముగ సులోచన పుత్రికాపుత్రసహితముగను
దెద్దయుఁబ్రొద్దును విలపించి విలపించి పదపడి పతికళేబరము రాము
గీ॥ ననుమతింబొంది పురికిఁగెకొనుచుఁబోయి, నాధుతోఁగూడ సహగమనంబుసేయఁ
దలఁపుపుట్టఁగఁ దండ్రినిందలఁచుకొనియె, సుతతలఁపుతోడ నటకు శేషుండువచ్చె. 726

కం॥ వచ్చిన తండ్రికిఁబుత్రిక, యచ్చపుబత్తినతిఁజేసి యావదుదంతం
బచ్చుగఁచెలిపి శివులను, నిచ్చెంబోషింపుమనుచు నింతియతనికిన్. 727

కం॥ తనమామయైనరావణు, ననుజ్ఞఁగొని యాలతాంగి యాదశముఖునం
దనుని శవముతోఁబాటున్, ఘనముగఁ జితిపైబరుండె గ్రక్కునఁదానున్ 728

ఆ॥ చితికి నిప్పురగులఁజేయఁగా మిన్నంటి, మండసాగెను బెనుమంటలు త్రుటి
లోనఁగాలి యాసులోచనామేఘనా, దులతనువులు భస్మములయిపోయె. 729

సీ॥ ఇట్లాసులోచన యెలమిమైఁ బతితోడ సహగమనంబు తానలుపుటయును
గడుమెచ్చి యందలికాంతాజనంబులు తత్పతిభక్తికిఁ దామమిగుల
శ్లాఘించుచున్ యథాస్థానంబులకుఁబోయి రామాదిశేషుండు నాక్షణంబ
పుత్రికసుగుణంబుఁ బొగడుచు మనుమని మనుమరాలిని దోడుకొనిరయమున

గీ॥ నాత్మధామంబుఁజేరంగనరిగె నపుడు, పుత్రశోకార్తుఁడౌ దశముఖునిఁజేరి
వినుతశీల మందోదరి విపులదుఃఖ, బాష్పపూరితనయనయై పలికెనిట్లు. 730

మ॥ 'సుతులున్‌బంధులు మంత్రులాప్తులు రణక్షోణిన్‌మృతింబొందిరో
దితిజాధీశ్వర! పోరనీపు జయసిద్ధింబొందఁగాలేవు భూ
పతివంశోత్తముఁడైనరామునకు నావైదేహినర్పించి స
మ్మతితోఁజేయుముసంధి నింకనయినన్ మాన్యుల్‌నినున్‌మెచ్చఁగన్. 731

చం॥ కొనుము మదీయవిన్నపము కోరియొనర్పుము సంధిరాముతో
మనుము సుకీర్తివై రణముమానుము నీచరణంబులంటివం
దనమొనరించెదన్ వినుము! దానవనాయక! రామచంద్రుఁడా
దనుజకులాంతకుండగుట తథ్యము వీడుము తద్విరోధమున్' 732

గీ॥ అనుచు నిబ్బంగి నీతిఁబేర్కొనుచునున్న, భార్యహితవాక్యములు దానవకులభర్త
యాలకింపక యనికిఁగట్టాయితమయి, వెడలె రథమెక్కి సేనలవెంటఁగొనుచు 733

## రావణుఁడు దానవసైన్యములతో యుద్ధమున కేగుట

కం॥ ఇత్తెఱఁగునసేనలతో, నుత్తరపుసగవనికడకు నుద్యద్గర్వో
న్మత్తుఁడయి రాగ రావణు, నత్తతి వీక్షించి ప్లవగు లతిరయమెసఁగన్ 734

చం॥ 'పొడుపుడువ్రేయుఁ' డంచు రిపుపూగ మెదుర్కొని భీకరంబుగాఁ
బుడమిచలింపనార్చుచుఁ గపుల్‌వడి వప్రముపైకిఁబ్రాకి బల్
పిడుగులఁబోలు పెన్‌శిలలు వృష్టివలెం గురియింపసాగి ర
ప్పుడు మృతులయ్యుఁ గేద్పడియు మూర్ఛిలియున్ క్షతగాత్రులయ్యునున్ 735

చం॥ కలహపరాఙ్ముఖంబులయి గ్రక్కునసేనలు పాఱుచుండ నా
వలిముఖసైన్యవారిధికిఁ బంక్తిముఖుండు చలింపఁబోక తాఁ
జెలియలికట్టయై నిలిచి చేవయులావుదలిర్ప వాడితూ
పులజడిలోని వానరులపైంచుచుఁ బోరఁగఁజొచ్చె నియ్యెడన్. 736

సీ॥ తరుచరుల్‌గురిసెడు తరుశిలావర్షంబు రావణుబాణవర్షంబుచేత
వారింపఁబడుటయు వాడేయునునిశితమార్గణంబులు తమమర్మములను
నొప్పించుచుంటయు నప్పుడు భీతాత్ములగుచు బెబ్బులిఁగన్నహరిణములటు
వానరయూథముల్ పసుపిడసాగిరి పంక్తికంఠుఁడంతఁ బరవసమునఁ

గీ॥ దాను పరివారయుతుఁడయి తక్షణంబ గవనుదాటి ప్రవేశించెఁగదనతలము
పఱచునగచరసేనకు భయముమాపి, తాము వారితోఁగూడి యాదాశరథులు. 737

శా॥ 'రారమ్మోరి! దశాననా!' యనుచు శీఘ్రప్రాప్తకోదండులై
తాపున్ వారినెదుర్కొనం బ్రబలయుద్ధంబయ్యెఁ జోద్యంబుగన్
వీరల్‌వారల వారువీరిని శిలావృక్షాశుగౌఘంబులం
గ్రూరత్వంబున నొంచికొంచు నిరువాగుంబోరి రత్యుగ్రతన్ 738

సీ॥ వారిపరస్పరవీరగర్జనముల కరయదిక్కరులు బధిరతఁబొంద
వారియన్యోన్యవిహారప్రహారముల్ ఖచరులుచూచి యక్కజమునొంద
వారి పదాహతధారుణీరేణువు మార్తాండుఁగప్పి తమంబొనర్ప
వారిప్రేల్చునబోట్లు నారదమౌనికి హృదయసంతోషంబుఁ బొదలఁజేయ

గీ॥ వారివిజయాభిలాషలు మేరమీరి, కుతల మంబరతలమును గొలతవెట్ట
నుంతయైననుగాని విశ్రాంతిలేక, పోరుగావింపసాగిరి బీరమెసఁగ. 739

సీ॥ ఒక్కయోధునితోడఁ బెక్కండ్రుయోధులు తలపడిపోరాడి గెలుచునెడలు
ప్రెక్కురయోధుల నొక్కండమోడించి జయజయధ్వానముల్ సలుపునెడలు
ఒక్కనితోనొక్కఁ డురుభుజాభుజిఁదాకి భీకరాటోపతఁ బెనఁగునెడలు
కాలొండెఁగేలొండె ఖండితంబైనను నీడఁబోవకయె పోరాడునెడలు

గీ॥ నై మహాసంకులంబుగ నాహవంబు, జరుగుచుండెను నిరువాగుసైనికులకు
వారికొలఁదులు శౌర్యంబు వశమెపొగడ, శూలికైనను దామరచూలికైన. 740

సీ॥ పాఱెడురక్తంపుటేఱులు తెగిపడ్డహస్తమస్తకచరణాదులైన
యవయవభేదంబు లందందుఁ జూపట్టు చూర్ణంబులైన యస్థులునుమఱియుఁ
బ్రోవులైపడియున్న ప్రేవులకుప్పలు మాంసమస్తిష్కముల్ మండలాగ్ర
బాణముద్గర శూలపరశుకుంతాదులౌ శస్త్రాస్త్రచయముల శకలములును

గీ॥ గలిగి పీనుఁగుఁబెంటలై కడుభయంబుఁ, గొలుపుచుండెను సంగ్రామతలమదెల్లఁ
గాని వానరుల్ దానవుల్ మానసములఁ, జలముడింపక సలిపిరిసంగరంబు 741

గీ॥ అట్టిసంకులసమరంబునందుసైన్య, సహితముగఁ బంక్తికంఠుఁడు సమదలీలఁ
దావిజృంభించి వానరతతిని విశిఖ, జాలములపాలుచేసె నాసమయమందు. 742

ఉ॥ చచ్చెడువారలున్ విమతసాయకజాలవిభిన్నదేహులై
నొచ్చెడువారలుం గరమునూనపుమూర్ఛలముగ్నవారలుం
జెచ్చెఱవిచ్చి నల్దెసలఁ జెట్టులగుట్టలఁబట్టి పాఱఁగాఁ
జొచ్చెడువారలై మిగులఁజుక్కిరి వానరవీరకోటముల్ 743

గీ॥ ఇట్లుచెడిన వానరసేనవెల్లమఱలఁ గూర్చుకొని దుష్టదానవకోటితోడ
రామభూవిభుఁ డొక్కెడ భీమముగను, దానుబోరాడుచుండెను దర్పమొప్ప 744

శా॥ ఆరామానుజుఁ డావిభీషణుఁడు నుద్యద్భీకరాటోపులై
తారారావణుతోనెదుర్కొని మహోల్లాద్దామంబుగా మార్గణా
సారంబున్నిగిడించుచున్ భుజబలోత్సాహంబుదీపింపఁగం
బోరంజొచ్చిరి దారుణంబుగను వేల్పుల్చూచి కీర్తింపఁగన్ 745

కం॥ ఇమ్మెయిఁ దనతోఁబోరెడు, తమ్మునిఁగని రావణుండు దారుణతరకో
పమ్మున మండిపడి కతో, రమ్మగనిట్లనియె మేఘరావంబెసఁగన్. 746

సీ॥ 'నాకుఁదమ్ముఁడవయ్యు నాశత్రుపక్షంబు నీవవలంబింప నీతియగునె?
యదియునట్లుండె నాయాత్మజుఁడగుమేఘనాదుఁజంపించి తన్యాయ్యవృత్తి
నీచ! కులద్రోహి! నిన్నేమియనవచ్చు? ఖలుఁడవు పాపివి కావున నిను
మామకదారుణమార్గణానలశిఖాతతికిక్షణంబ యాహుతియొనర్తు'

గీ॥ నని విభీషణుపై నతఁడాశుగములు,కడఁగి పుంఖానుపుంఖముల్గాఁగ నేసి
తనకు మయుఁడిచ్చినట్టి యుద్దండమైన, శక్తినేసెను జూపఱు సంచలింప 747

గీ॥ మును వివాహకాలంబున ఘనుఁడు మయుఁడు, తనదుకూతును మందోదరినొసఁగుచు
నహితదుర్భేద్యమైన యామహితశక్తి, నరణముగనిచ్చియుండె దశాననునకు. 748

ఉ॥ ఆమయదత్తమైన యతులాద్భుతశక్తి మహోనిరంకుశో
ద్దామజవాఢ్యమై పవివితాననమాననితాంతవిస్ఫుర
ద్భీమరవంబుతోఁ బలుపిడుగునుఁబోలుచు దుర్నిరీక్ష్యతే
జోమయమౌచు రాఁదొడఁగె సూటిగ రావణుతమ్మమీఁదికిన్, 749

## రావణుని శక్త్యాయుధముచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట

చం॥ అదిగని లక్ష్మణుండు ఘనమైనతదీయమహోరుశక్తిచే
సదమలబుద్ధిశాలియనఁజాలు విభీషణుఁ డంతమొందినన్
బ్రదికినలాభమేమి యిఁక? రాముప్రతిజ్ఞయుఁదప్పునంచుఁ దా
నెదురుగఁబోయె నస్త్రమున కేపునుజేవయునొప్ప నత్తఱిన్. 750

గీ॥ అట్లు లక్ష్మణుఁ డారావణానుజన్ముఁ, గడచి చలియింపకయె పంక్తికంఠుశక్తి
కభిముఖంబుగ ముందున కరుగుఁదెంచి, యంపగమిదానిపైన నేయంగసాగె 751

ఉ॥ ఆమహనీయశక్తి కరమాశుగతింజనుదెంచి లక్ష్మణ
స్వామియురంబునాటుటయు సంగరిధాత్రిని బొంగరంబటుల్
వేమరుదిర్దిరందిరిగి వేవివశుండయిత్రెళ్లె రక్తధా
రామయగాత్రుఁడై తరుచరప్రకరంబులు విహ్వలిఁపఁగన్ 752

కం॥ ఈకరణి నచేతనుఁడై, ప్రాకటరణభూమియందుఁ బడ్డ మహాను
శ్లోకుని లక్ష్మణుఁగని హా,హాకారమ్ములుచెలంగ నందఱడలుచున్ 753

గీ॥ మఱియు లక్ష్మణుడాసి తన్మహితవక్ష, మందునాటినశక్తిని నాక్షణంబ
పట్టిపెఱుకంగఁజాలక తుట్టతుదకు, వృక్షచరులందఱుంగూడ విఫలులైరి 754

సీ॥ ఆవేళ శ్రీరాముఁడాకపిసేనల యాక్రందనధ్వనులాలకించి
తానద్దెసకువచ్చి తమ్మునిదురవస్థఁగని శోకకోపముల్ పెనఁగొనంగఁ
బ్రళయకాలాంతకుపగిది మండిపడుచుఁ గన్నులనిప్పులిఁగములురాల
నాకొన్నకోల్పులి హరిణయూధముపైకిదుమకుచందాన నాదుర్మదాంధ

గీ॥ దానవానీకములమీదఁ దానుగవిసి, కాఱడవిఁగాల్చు దావాగ్నికరణిఁ దనదు
నిశితబాణాగ్నికీలలనిగుడఁజేసి, వైరిశలభంబులను గాల్చివైవఁదొడఁగె. 755

చం॥ తెఱపియొకింతలేక పటుతీవ్రశరంబులువేగవచ్చి చి
చ్చఱపిడుగుల్ వడింబడెడుచాడ్పునఁ బైబడుచుండఁ గత్తిచే
నఱికినఁ బడ్డఘోరవిపినద్రుమపుంజముమాడ్కి యుద్ధమం
దఱిముఱిఁ బ్రాణముల్విడిచి రప్పు డనేకనిశాటసైనికుల్ 756

కం॥ హతశేషులైనవారలు, ధృతిచెడి రామునకునోడి మృగపతిఁగని లే
ళ్లతిభయమునొందిపాఱెడు, గతిఁ దాము పఱచి పురంబుగ్రక్కునఁ జొఱగన్. 757

కం॥ సీతాపతి శాతశరా, ఘాతములకునొచ్చి పంక్తికంఠుఁడు తానున్
భీతిఁ బలాయనమంత్రము, ఖ్యాతిగఁబఠియించి లంకయందుం జొచ్చెన్. 758

సీ॥ ఆవేళ నిజవంశ్యుఁడగు లక్ష్మణునిప్రతాపముఁబోలెఁ దనప్రతాపము శమింపఁ
దనబంధుపులదీనదశఁజూడనొల్లక వగచితాను మఱుంగుపడియె ననఁగఁ
దమవారియుద్ధానఁ దాఁబాలుగొనెననఁ బూర్వరక్తచ్ఛాయపొలుపుమిగుల
మూర్ఛితుఁడైన తమ్మునెరయరామున కసమాజివిశ్రాంతినొసఁగె ననఁగ

గీ॥ లోకమును నంధకారంబులోనముంచి, జారచోరాదులకు సంతసంబునించి
వారిజాప్తుఁడుగ్రుంకెను వారిజములు, నిజవియోగంబునకుఁ జాల నెగులుచెంద. 759

సీ॥ అట్లు నిశాకాలమాసన్నమగుటయుఁదరుచరు లూర్మిళాధవునిచుట్టుఁ
బరివేష్టనముచేసి పలవించుచుండిరి శ్రీరాముఁడును దనచిత్తమందు
దుఃఖాంధకారంబు ఘోరంబుగాఁబొందహాలక్ష్మణా యని యార్తుఁడగుచు
రోదనంబొనరించి సోదరుపైఁద్రెళ్లి పెద్దయుమూర్ఛిల్లి పిదపఁదెలిసి
గీ॥ తమ్ముమరమునవాటిన దారుణతర, శక్తిఁ దనవామకరముచే సత్వరంబ
యూడఁదీసి మృతుంగాఁగనూహపొడమ, నిట్లుశోకింపసాగె నాయినకులుండు. 760

## (శ్రీరాముఁడు మూర్ఛితుఁడైన లక్ష్మణునిఁజూచి శోకించుట

శా॥ 'అన్నా! లక్ష్మణ! నిన్నుఁబాసి నిమిషంబైనన్ మనన్ శక్యమే?
కన్నుల్‌విప్పుము నన్నుఁజూడు మృదువాక్యంబుల్‌దగంబల్కు నీ
యన్నందేర్పుము నీవులేనిఁబ్రదుకేలా? యుద్ధమేలా? మహా
పన్నత్వంబుఘటించినాకు నిటుపోవన్ నీకునుంబాడియే? 761

ఉ॥ అత్తరుపున్ జవాదిమొదలైనవిపూయఁగయోగ్యమైన నీ
మెత్తనిమేను నేడకట! మేదినిపైఁబడి ధూళితోడఁపె
న్నెత్తుటఁదోగఁగావలసె నిర్దయుఁడౌవిధి నేమనంజనుం
జిత్తములోనసైపనగునే భవదీయవియోగదుఃఖమున్? 762

చం॥ పుడమికుమారికిన్ సవతుఁబోల్పఁగఁజాలినయట్టి భార్యలం
బడయఁగవచ్చువేవురను బాసినరాజ్యవిభూతిఁ గ్రమ్మఱం
బడయఁగవచ్చుఁగాని నినువంటిగుణాకరుఁడైన సోదరుం
బడయఁగవచ్చునే బహుతపంబులఁ జేసిననైన? లక్ష్మణా! 763

చం॥ నిను నిటఁగోలుపోయి మఱినేనుపురంబున కెట్లుపోదు? నీ
జననిసుమిత్ర నన్నుఁగని సద్గుణశీలుఁడు నీదుతమ్ముఁడే
డని ప్రియమారఁ దానడుగ నక్కట! యేమనిచెప్పవాడఁ? దీ
రని పెనుదారుణవ్యథలు ప్రాప్తములయ్యె నికెట్లుసేయుదున్? 764

చం॥ అడవులలోన నాకునయి యమ్మెయి నీపడినట్టి కష్టముల్
నుడువనశక్య మెవ్వరికినూఱుభవంబులకైనఁగాని త
మ్ముఁడ! భవదీయమైనఋణమున్ మఱితీర్పఁగఁజాల నేనిఁకం
బుడమి నసోదరత్వమది పొల్పుగసార్థకమయ్యె నీకునన్' 765

గీ॥ అనుచు సౌమిత్రిశీలంబు జనవిభుండు, తాను గడునుగ్గడించుచు భానుజాదు
లెంతయోదార్చినను గానిసుంతయైన, శాంతమూనక శోకింపసాగెనిట్లు. 766

సీ॥ 'మాయామృగముఁదేర మతినేనుబోనేల? భూమిజతాఁ జెఱపోవనేల?
పోయినమానక పూర్వామరులతోడఁ బోరాటమునకేను బూననేల?
పూనిసంగ్రామంబులోన మత్ప్రాణతుల్యుఁడవైననిన్నుఁగోల్పోవనేల?
కోల్పోయియిబ్బంగిఁ గొఱమాలినట్టి నామొండిజీవము నిల్పియుండనేల?
గీ॥ యిన్నిఁటికి నాదుతలవ్రాత యిట్టులుండె, నేమిసేయుదు? నాగతి యెట్టులొక్కొ?
నీవులేనిచోఁ దమ్ముఁడ! జీవితంబ, దేల? జానకియేల నాకింకమీద? 767

గీ॥ స్వార్థమునకయి నినునేనుజంపుకొంటిఁ, గలఁడె నాకంటె దుష్కార్యకర్మఁరుండు?
స్వార్థపరుఁ డెంతకైనమజాలుననుట, కనఘ! ప్రబలనిదర్శనమైతిఁ జూవె'! 768

కం॥ అని యీవిధమున రాముఁడు, ఘనతరశోకాబ్ధియందుఁ గడుమునుఁగుచు నా
దినినాథనందనునిదెసఁ, గనిగద్గదకంఠుఁడగుచుఁ గడకిట్లనియెన్ 769

సీ॥ 'సుగ్రీవ! మామకసోదరుండగు లక్ష్మణస్వామిమృతుఁడయ్యె నాకు నింక
సంగరంబేటికి? జానకియేటికి? శస్త్రసన్యాసంబుసలుపువాడ
నీవును గపిసేననెమ్మిమైఁగూడి కిష్కింధకుఁబోయి సుఖింపు' ఘనుచుఁ
జెప్పి యామీదట శ్రీరాముఁడావిభీషణుఁజూచి యిట్లను సాదరమున
గీ॥ 'నోవిభీషణ! వినుము! తానొకటితలఁప, దైవమొక్కటితలఁచుట తథ్యమరయ
మనప్రయత్నమ్ములన్నియు మతివిఫలము, లయ్యె దైవంబు ప్రతికూలమగుటఁజేసి. 770

ఉ॥ రావణుఁజంపి లంకకును రాజుగఁజేసెదని న్నటంచు నా
డేవచియించినట్టి పలు కిప్పుడు వమ్మయిపోవనుండె గ
ట్టా! విపరీతదైవమిటు లద్భుతశోకపయోధిముంచి న
న్నీవిధి వైరమూని కడుహింసితుఁజేసె నిఁకేమిసేయుదున్? 771

ఉ॥ కావున మౌనివృత్తిఁగొని కాననవాసముచేసి యింకనా
జీవితశేషముంగడుపఁ జిత్తములోపల నిర్ణయించితిన్
నీపువిరోధమున్ విడిచి నీతిదలిర్పఁగ నోవిభీషణా!
రావణుతోడసఖ్యము తిరంబుగఁజేసి సుఖింపుమా! తగన్' 772

సీ॥ అనుఁడు విభీషణుం డతివిషాదముదోప వినకులుఁజూచి తానిట్టులనియె
'శ్రీరామ! నీవిట్లుసెలవీయబాడియే? నీకు శత్రువయిన నీచుఁడెపుడు
నాకునుశత్రువుగాక మిత్రుండౌనె? యస్మన్మనోగత మవధరింపు!
రావణుతోడ సజీవుఁడవైయుండ స్వప్నమందైనను సంధిఁగోర

గీ॥ వదియుఁమంగాక వెతలునీవనుభవింప, నేనుసుఖియింపఁగోరుదునే? మహాత్మ!
యరయ నీతోడిదేలోకమనుచు నెంచి, సర్వదా కొల్చియుందు నీచరణయుగము'. 773

చం॥ అనపుఁడు రామచంద్రుఁగని యర్కతనూభవుఁ డిట్టుపల్కె 'నో
యనఘచరిత్ర! నీయనుజునిట్ల రణంబునఁజత్తుమొండె దు
ర్జనులనుదాశవాధములఁజంపుదుమొండెను రిత్తువోదుమే?
వినుమదియట్టులుండె నొకవిన్నపమందగ విన్నవించెదన్ 774

ఉ॥ ఆహవదీక్షఁబూని యిటు లర్కకులాధిప! నెమ్మదిన్ నిరు
త్సాహముఁబొందఁగాదగునె? శత్రులు నింగనిసంతసింతు రు
త్సాహముఁబట్టుకొల్పుమిఁక దస్యువధవ్యవసాయశాలికిన్
దోహదమిచ్చిపంపుమిదె త్రుంతుము పోయి నిశాటసేనలన్? 775

మ॥ అని యిట్లర్కతనూభవుండనినవాక్యంబుల్ రణోత్సాహముం
బెనుపన్ వానరవీరులెల్ల 'నవిలో విద్వేషులన్ద్రత్తు మొం
డెను సౌమిత్రివలెన్ మృతింగనుదుమొండెంగాక మాకింతకం
టెనుగర్తవ్యమిఁకొండులే'దని మదిం జింతించి రాటిమ్మటన్ 776

సీ॥ మనుఁడు సుషేణుఁ డాయనమాత్యు లక్ష్మణునాడిఁబరీక్షించి నగచరాళి
వినుచుండ శ్రీరామవిభుఁజూచి యిటుపల్కె 'ధరణీశ! నీసహోదరున కరయఁ
బ్రాణభయములేదు పటుదేహకాంతియు నొప్పారుచున్నది యుడుగువంత
బలితంపుమూర్చలోపలఘుస్థినాడు నామనవినిదయచేసి మఱి వినఁదగు
గీ॥ వేగసంజీవకరణిఁ దెప్పించిచేసి, నేనుబ్రదికింతు సౌమిత్రినిన్ మహాత్మ!'
యనినవిని రామభూకాంతుఁ డాజ్ఞనంబ, యాంజనేయునిఁబిల్చి యిట్లనివచించె. 777

మ॥ 'పరిరక్షించితివెన్నొసారులు విపద్వారంబులంబాపి కే
సరిపుత్రా! విను యీజగంబున మదింజర్చింప నీకంటెనుం
బరమాప్తుండిఁక లేడునాకు నినునాప్రాణంబుగానెంచితిన్
గరిమన్ నాదగువంతఁబాపుట భవత్కర్తవ్యమౌ నిత్తఱిన్ 778

కం॥ పావని! యెటులైననుసం, జీవకరణిఁదెచ్చి నీవు శీఘ్రంబ మదీ
యావరజలక్ష్మణుని సం, జీవితుఁగాఁ జేసి రక్షసేయుమ' యనినన్ 779

ఆ॥ తరణికులునియాజ్ఞ తనకుశిరోధార్య, మగుటఁజేసి వల్లెయనుచు నప్పు
డంజనీసుతుండు సంజీవకరణినిఁ, దేరఁబయనమయ్యె ధీరవరుఁడు. 780

సీ॥ ఆసుషేనుండంత ననిలాత్మజునిఁ గాంచి యీవిధంబునఁ జెప్పెఁ 'బావని! విను
మొకవిన్నపంబు నీవొనరఁ ద్రోణాద్రికిఁ బోయి వారిజబాంధవుండు తూర్పు
మలపైనలంకరింపకమున్నె సంజీవకరణినిఁ గొనచు శీఘ్రమునరమ్ము!
తడవు సేసితివేనిఁ జెడునుగార్యంబెల్ల సౌమిత్రిమనుట దుస్తరముసుమ్ము!'
గీ॥ నావుఁ డంజనీసుతుఁడు 'సంజీవకరణిఁ, బ్రొద్దుపొడువకమున్నె నేఁబోయితెత్తు
నట్లుగానిచో హనుమంతుఁడనుచునన్నుఁ, బిలువబోకుమ నీ' వనిపలికియపుడు. 781

ఆ॥ రవికులోద్వహుఁడగు రామభూజానికి, రవిసుతునకుఁ మ్రొక్కి, పవనసుతుఁడు
సర్వకపులచేత సాదరలీలమై, వీడుకోలువడసి వేగవెడలె 782

## కాలనేమి వృత్తాంతము

సీ॥ అట రావణాసురం డాంజనేయుఁడుపోవు టనుచరుల్ చెప్పఁగ నాలకించి
తత్కార్యవిఘ్నంబుఁ దాఁజేయఁగా నెంచి మాయావియును గ్రూరమానసుఁడగు
కాలనేమియనెడు ఘనరాక్షసునిఁ జీరి కార్యపుఁదెఱఁగెల్లఁ గ్రమతవాని
కెఱిఁగించి పుత్తేర నింద్రారిపీడ్కొని యాకాలనేమి తానాక్షణంబ
గీ॥ పవనతనయుండు చనియెడు పథమునందు, ఘనకుటీరము నిర్మించుకొని ముదమునఁ
దాను మునివేషధారణ మూనియుండె, శిష్యజనములు పెక్కండ్రు చేరికొలువ 783

మ॥ హనుమంతుం డతి శీఘ్రయానమునఁ దానాదారినింబోవుచుం
గనియెం గృత్రిమమౌనియున్నయెలవుం గందోయికిన్ విందుగం
గని యాశ్చర్యమునొంది 'యేఘనులొకో కల్పించి రిద్దానినిన్!
మును నేవచ్చినయప్డు లేదుగద! యీమున్యాశ్రమంబిచ్చటన్'. 784

చం॥ అనుచు నిజాంతరంగమున నాపవమానతనూజుఁ డెంచుచుం
దనకును నీరువట్టొదవఁ దక్షణమే కపటంపుమౌనియై
తనరెడు కాలనేమిని ముదంబునఁ జేరి నమస్కరించి 'యో
యనఘ! జలంబులిచ్చి తగనార్పుము దాహ' మటంచు వేడినన్ 785

మ॥ కపటాత్ముండగు కాలనేమి తనదౌ కాపట్యమింతేనిఁ దా
నపు డస్యుల్ గ్రహియింపనట్లు వినయం బత్యంతముందోపఁగా
నుపచారంబులు శిష్యసంఘములచే నొప్పారఁ జేయించి గా
ఢుషపట్టిం గుశలప్రసంగములఁ ద్తోత్రోఁబ్రీతుఁ గావించుచున్. 786

ఉ॥ మంచిజలంబులున్నవి కమండలువందునఁ ద్రాగుమీ! నివా
రించు భవత్పిపాస మఱియించుకసేపిట విశ్రమించి పొ
మ్మంచు విషాంబుసంభరితమైన కమండలువాక్షణంబ యా
వంచకుఁడందియాయ నది పావనికెకొనవొల్ల కిట్లనున్. 787

ఆ॥ 'మీదు వరికమండలూదకంబు మదీయ, మౌ పిపాసఁదీర్ప నోపదనఘ!
కూపమొండె మేటికొలనొండె! జూపించి, పుణ్యఫలముమీరు పొందుడింక' 788

ఆ॥ అనుడుఁ గాలనేమి యసతిదూర్తంబున, నొక్క మేటిమొసలియున్న కొలను
దనకుఁ జూపుటయును దరుచరుఁ డాదుష్టు, వీడుకోలువడసి వెడలెనటకు 789

కం॥ ఈవిధమునఁజని యచ్చటఁ, బావని పొడఁగాంచె స్వచ్ఛవారిభరితమై
కేవలనయనానందముఁ, గావించుచు నొప్పుచున్న కమలాకరమున్. 790

## హనుమంతుడు మకరిని వధించుట

కం॥ కాంచి పిపాసాతురుఁడై, యంచితముగఁ గొలనిలోని కనిలజుఁడు ప్రవే
శించి పయఃపానంబొన, రించుచునుండంగ గపివరేణ్యునిఁగడిమిన్ 791

కం॥ అందుండినమకరి మరు, న్నందను నశనార్థియగుచు నలిఁబట్టుటయున్
డెందంబున బెదరక ధృతి, మందరుఁడై దానితోడ మారుతియంతన్ 792

సీ॥ కొండొకవడి మాంసఖండముల్ తెగిపడ వాడియౌగోళ్లచే వ్రచ్చివ్రచ్చి
కొండొకసేపుబల్ కుంతమ్ములుంబోని కఱకుదంతములచేఁ గఱచికఱచి
కొండొకవడి మహాగురుతరానూనపున్ ముష్టిఘాతములచే నొంచినొంచి
కొండొకసేపు ప్రచండవిక్రమమొప్పఁ దఱచుగాఁ గాళ్లచేఁ దన్నితన్ని

గీ॥ తనను వాలంబుచేఁ గొంతతడవు మకరి, కంఠమునకురివెట్టి యాఁగాడ్పుపట్టి
కొలనిగట్టులపైపైచి కొట్టికొట్టి, పోరుగావింపఁగాసాగె బీరమెసఁగ 793

గీ॥ పెద్దతడవిట్లు గ్రాహితోఁ బెనఁగిపెనఁగి, దానిఁబరిమార్ప నెట్లును దనకువశము
గామిఁ జిత్తములోపలఁ గడుసుశివ్వి, ధమునఁ దలపోయఁదొడఁగె నాతరుచరుండు 794

చం॥ 'అరుదుగ నిప్డు మామకమహాజవసత్త్వము లంతకంతకుం
దరుగఁగఁజొచ్చె గ్రాహి బలదర్పములారయ నంతకంతకుం
బెరుగఁగసాగె దీనినిఁకఁ బీచమడంపఁగ నాకునక్కటా!
భరముగఁదోచె నీమకరిబారికి నెమ్మెయి నేనుదప్పదున్? 795

అదియు 'నట్టులుండె' నధిపునకీవార్త, నెఱుఁగఁజెప్పనార' లెవ్వరింక?
విభునికార్యమెల్ల విఫలమైపోయె మ, తేమిసేయువాఁడ?' నేదిదిక్కు?' 796

అనివగచుచు నున్నంతట, ననిలజువెన్మమింగె మకరి యద్భుతలీలన్
వనజారాతినిఁ గబళన, మొనరించెడు సైంహికేయునోఁజఁ దలిర్పన్ 797

చేవదొరంగియామొసలిచేఁ గ్రభళీకృతగాత్రుఁడై యిటుల్
పావని తాను గొంతవడిఁ బాయక తద్ఘనకుక్షిలోపలన్
వావిరిఁజిక్కియుండి మది వందురివందురి యెట్టకేలకుం
గేవలదిక్రమంబెసఁగఁ గీలివిధంబున మండుచుద్ధతిన్. 798

ఆమారుతి యప్పుడు తా, న్నామకరి యుదరముప్రవచ్చి యసమానజవో
ద్దాముండై వెల్వడె సు, త్రామాదులు తన్నుఁజూచి ప్రస్తుతిసేయన్ 799

అదియును దద్రూపముడిగి, పదపడి స్త్రీరూపమూని భావములోనన్
మదమువిడిచి యాకపివరు, నెదుటనిలిచి నమ్రభావ మెసఁగం బలికెన్ 800

'కపివర! నాదువిన్నపముఁగైకొను నిన్నిటఁబంపినట్టి యా
తపసిని విశ్వసింపకుము! దానవనేత దశాస్యుఁడంపినం
గపటపుమౌనియౌచు నిను ఖండితుఁజేయఁగఁ గాలనేమియం
గపటనిశాటుఁ డీకరణి గర్వితుఁడై చనుదెంచెఁ గావునన్ 801

ఆ కాలనేమి వధ్యుఁడు, పీకం బరిమార్పు వాని, వేఁగొనిరమ్మా!
ప్రాకటసంజీవకరణి, నీకున్ శుభమొదవు నాంజనేయా!' యనుడున్ 802

విని మహాబలసూనుఁ డిట్లనుచుఁబలికెఁ, 'దొలుత మకరివైయుండి యోతోయజాక్షి!
పిదపఁ బొడసూపితెట్టులు వెలఁదివౌచు?, దీనికిన్ హేతువేమొకో? తెలియఁజెపుమ!' 803

## హనుమంతునకు ధాన్యమాలిని తన శాపకారణ మెఱింగించుట

అనవుఁ డాయింతి యిట్లను ననిలజునకు, 'ధాన్యమాలిని నాపేరు తరుచరేంద్ర!
యొక్కమునిశాపమునఁజేసి యక్కజముగ, మకరినై పడియుంటి నీమడువులోన. 804

నీకృపవలనన్ నేటికి, నాకున్ మునిశాపమోచనంబది కలిగెన్
నీకుం గృతజ్ఞురాలను, నాకథ వినిపింతు వినుము! నగచరవీరా! 805

సీ॥ కపివర! సుమతియన్ గంధర్వునకును నే నాత్మతనూభవ నగుదుఁ జూవె!
ప్రియమార శంభుని పేరోలగంబున నిత్యకృత్యంబుగా నృత్యసేవ
సలుపునిమిత్తమై చనుచు నీకొలనిలో నరయ జలక్రీడ లాడుచుందు
నెలమిమై నొక్కనా డిందు నేనేతేర నాదిత్యసమతేజుఁ డనఘమూర్తి
గీ॥ ఘనుఁడు శాండిల్యుఁడను తపోధనుఁడు నాదు, లలితసౌందర్యమున కాత్మ నలరి మిగుల
రాగరసమగ్నుఁడై నన్ను రతికిఁజీర, మునిపతికి నిట్టులంటిని వినయమెసఁగ. 806
కం॥ 'పరమతపోధనులరు నను, సురతమునకుఁ గోరదగునె? సుదతులపొం దా
నరకమునకుఁగారణమగు, నరయఁదపోవిఘ్నకారి యదియని వినరే?'. 807
గీ॥ అని ప్రబోధింపఁగా నియ్యకొనఁగవొల్ల, కనఘుఁ డమ్మౌనియిట్లను 'నతివ! నీదు
పొందు మత్తపఃఫలమని మోక్షదమని, యెంచినాడను రమ్ము! నన్నేలుకొమ్ము!' 808
చం॥ అనుచు బలాత్కరించి కవయందమకించెడు మౌనితోడ 'నో
మునివర! నే రజస్వలను ముట్టఁగరాదిపు' డంచుఁబల్కి వె
మ్మనమున నియ్యకొంచు మునిమండనుతోఁ బ్రియమొప్ప గంధమా
దనగిరికేగి యచ్చటను దన్మునిమందిరమందు నుండితిన్ 809
గీ॥ అతఁడు నన్నట్లు తనయాలయమునఁజేర్చి, తానుగార్యార్థియగుచు నెందేనిఁ జనఁగ
నట్టియెడ రావణాసురుఁ డటకువచ్చి, యేకతంబుననున్న నన్నెలమిఁగాంచి. 810
సీ॥ కామాతురుండయి గ్రక్కుననను(జేరి తనవైభవం బదంతయును నాకుఁ
గరముగ్గడించచుఁ గంతుకేళికిఁ బిల్వ వానితో వినయసంభ్రమములొప్ప
'నేనురజస్వలంగాన నన్నంటఁగఁదగదంచుఁ జెప్పితి ధర్మయుక్తిఁ
గాని నాపలుకులుగైకొన కసురుండు పాపచిత్తుండయి బలిమినన్నుఁ
గీ॥ బట్టి భోగించుటయుఁ గడుబల్లిదుండు, పుట్టె నతికాయుఁడను నొక్కపుత్రకుండు
దశముఖుండంత నన్పాలుఁ దానుగొనుచుఁ, జరియె లంకాపురంబున కనిలతనయ! 811
గీ॥ అంతనేనును శాండిల్య దాంతరంగ, మందు నాస్థితియెఱిఁగిన నలిగి శాప
మిచ్చుననియెడుభయ మదిపెచ్చుపెరిగి, దైన్యమొదవింపఁ బొగులుచుఁ దక్షణంబ 812
కం॥ స్నానాదికములచేతన్, చేసశుచిత్వమ్ముమాసి నెఱినున్నంతన్
మౌనికులతిలకుఁ డంతట, మానుగఁజనుదెంచె ముదితమానసుఁ డగుచున్ 813
కం॥ వచ్చి తనచిత్తమందున, మచ్చర్యనెఱింగి కినుక మదిజనియింపన్
హెచ్చుగ రూక్షేక్షణముల, నచ్చుగ నాపైఁబఱపుచు యతిపుఁడనియెన్. 814

ఉ॥ 'ఓసి! దురాత్మురాల! తగవొల్లక నీవిటు నన్నువంచితుం
జేసి మదాంధురాలవయి చేసితిసంగము మన్యుతోడ నీ
దోసముపండె నోకులట! ద్రోహి నిన్ శపియింతు' నంచుఁ దా
రోసమెలర్పఁగా మునివరుండపు డగ్నివిధాన మండుచున్. 815

కం॥ ఈకమలాకరమందునఁ, బ్రాకటముగ మొసలివగుచుఁ బడియుండు' మటం
చా కరినాత్మకుఁడగు ముని, భీకరశాపంబొసంగెఁ బేరలుక మెయిన్. 816

గీ॥ ఇట్లు నన్నుశపించి మునీశ్వరుండు, పంక్తికంఠునిఁ బదపడి బంధుమిత్ర
పుత్రసహితంబుగాఁ బోరఁబొలియునట్లు, శాపమిచ్చెను భరితోరుకోపుఁడగుచు. 817

గీ॥ తపసిశాపంబునకు మదిఁదలఁకి యపుడు, నేను దత్పదాంబుజములపైన వ్రాలి
కావు డని వేడికొనుటయుఁ గరుణతోడ, నిట్లనియె నన్నుఁజూచి మునీశ్వరుండు 818

మ॥ 'వినుమోకామిని! పెద్దకాలమునకున్ విష్వంశజుండొచు న
య్యినవంశంబునఁ బుట్టు రామవిభుఁ డాపృధ్వీశుకార్యార్థియై
హనుమంతుండను కీశుఁ డౌషధయుతంబైనట్టి ద్రోణాద్రికిం
జనుచో దర్శనమిచ్చు నీకపుడు మచ్ఛాపంబు నిర్ముక్తమౌ' 819

సీ॥ అని ముని శాపమోచనమార్గమెఱిఁగించి తపముఁగావింపఁగఁ దానుజనియె
నేనంత మకరినై యానాటినుండియు ననుహాత్మ! యీకమలాకరమున
నివసించుచున్ మఱి నీరాకకుం గాచికొనియుంటి నదినమకూరె నేడు
ధన్యురాలనయితిఁ దగ నాకలోకమునకుఁబోదు' నని చెప్పి నళిననేత్ర

గీ॥ యైనధాన్యమాలిని యపు డాంజనేయుఁ, డాను వీడ్కొని దివికేగెఁ దక్షణంబ
యామరున్నందనుఁడు కాలనేమియాశ్రమంబునకుఁ బోవుటయును నామాయతపసి 820

హనుమంతుఁడు కాలనేమిని వధించుట

చం॥ అనిలసుమారుఁజూచి వినయంబును సంభ్రమమొప్ప నిట్లనున్
'వనచరవీర! నీవు జలపానముచేసితె? యింతసేపటన్
వినుతఁదవేలనిల్చితౌకొ? నెమ్మిని నీకిఁక దాహశాంతి య
య్యెనె? యుపదేశవాంఛకలదేని వచింపుమ! నేనొసంగెదన్ 821

కం॥ కలదేనియు గురుదక్షిణ, నెలమి సమర్పింపు' మనిన 'నిదెకొ' మ్మంచా
యలఘుబలుఁడు హనుమంతుఁడు, తల చూర్ణముగాఁగఁజేసె దారుణముష్టిన్ 822

ఆ॥ తక్షణంబవాడు తక్కాయమునవీడి, పక్షియగుచు మింటఁ బఱవసాగె
తడయ కనిలసుతుఁడు కడుజవంబేపార, దానిఁబట్టికొనియెఁ దోనవెగసి. 823

ఆ॥ పట్టికొని తదీయపక్షంబు లతిముతిఁ, బెటికి యాప్లవంగవీరుఁ డంత
కంధరంబునులిమి కరమవలీలగా, నావిహంగమమును హతముఁజేసె. 824

ఉ॥ వెండియుఁ గాలనేమి పటుభీకరసింహనినాదమొప్ప ను
ద్దండత సింహరూపమునఁ దాఁ బవనాత్మజు నార్చితాకినం
గొండొకసేపు యుద్ధ మతిఘోరముగా జరిగెన్ సమమ్ముగాఁ
బండపరస్పరప్రకటసాంద్రనిపీడన తాడనంబులన్ 825

గీ॥ అట్లు సింహంబుతోడ నాయనిలసుతుఁడు, పోరిపోరి తదుదరంబు ఘోరలీలఁ
జించి తల చూర్ణమొనరించి చేవఁజెటిచి, కడకువధియించెఁ దానినిఁ గడిమిమెరయ 826

గీ॥ పిదప హర్యక్షరూపంబువదలి కాల, నేమి బహువిధాకారముల్ స్వర్పుమీరఁ
దాను ధరియించి మారుతతనయుతోడ, సంగరంబునుగావించెఁ జాలతడవు. 827

కం॥ వాయుజుఁ డసురుఁడుపన్నిన, మాయారూపముల రూపుమాపఁదొడఁగినం
జేయునదిలేక వాడును, మాయోపాయమున హనుమమరలుతు ననుచున్ 828

సీ॥ సుగ్రీవుఁడై పొడసూపి వాడిట్లను 'పవమానపుత్ర! పావనచరిత్ర!
యింతసేపిచట నీవేటికిఁ దడసితి? లలితయశంబైన లక్ష్మణుండు
సంజీవితుండయ్యె సంజీవకరణితో నవనరమిఁకఁదీరె నరుగుఁదెమ్ము!'
నావిని తనమదిఁ బావని తొలుత నర్కజుఁగాఁగ దలఁచెనేకాని పిదప
గీ॥ నిట్లు తలపోసె 'సుగ్రీవుఁడేడ? తనదు, భటులనంపక తానిందు వచ్చుటేడ?
యిదియపోహంబ మిధ్యయౌ వెల్లగతులఁ, నితఁడు దనుజుండయని నిశ్చయించియపుడు.

మ॥ కడుఁగోపించి సమీరనందనుఁడు వీకన్ మిట్టిసారించి తాఁ
బొడిచెన్ దైత్యునిపేరురంబపియ నాపూర్వామరుండంతఁ జే
డ్పడి సుగ్రీవునిరూపుఁ వీడి నిజరూపంబూని గర్జిల్లుచుం
గడిమిన్ మార్కొని పోరఁగాదొడఁగె దోర్గర్వం బఖర్వంబుగన్ 830

కం॥ అకాలనేమి పావని, భీకరముగనిట్లుదాకి వివిధాన్యోన్యా
నేకప్రహారములఁ గడు, వీకమెయిన్ సలిపిరాజి పెద్దయుబ్రొద్దున్. 831

కవిరాజవిరాజితము.
అఱిముఱినల్గి పదంపడి మారుతి యాదనుజాధముఁ బట్టుచుఁ జె
చ్చెఱఁ బుడమింబడవైచి శిరంబును జేతులఁగాళులు వీకమెయిన్
విఱిచి తదీయమహోదరమందున వ్రేల్మిడిఁజొన్పి విచిత్రముగన్
మఱిపెనుముద్దగఁజేసి వధించె నమానుషవిక్రమ మొప్పెసఁగన్. 832
ఆ. కాలనేమినిట్లు కడుఁబూర్ణముగఁజంపి, యనిలతనయుఁడంత నచటువాసి
కొలఁది పయనములకు లలితదివ్యౌషధ, భరితమైన ద్రోణగిరికిఁ జనియె. 833

హనుమంతుడు ద్రోణపర్వతమునం దౌషధముల వెదకుట

కం. చనియచ్చట నౌషధముల, హనుమంతుఁడు తిరిగితిరిగి యన్వేషింపం
దనకవి పొడసూపమిచే, మనమున భేదంబుఁజెంది మఱియిటు తలఁచెన్. 334
ఉ. 'ఇయ్యది యేమిమాయయొకొ! యెంతొ శ్రమించితి రోసిరోసి నా
కియ్యెడ నౌషధంబు లొకఁడేనియునుం బొడసూపవయ్యె వే
దయ్యముమాయయౌనొయిది! దాశరథీ! కరుణాపయోనిధీ!
యెయ్యదిదారియింక? ఘటియిల్లెమహాపద యేమిసేయుదున్'. 835
మ. అనుచున్ వెండియు మారుతాత్మజుఁడు తా నాద్రోణశైలంబుఁ బే
ర్కొనిపల్కెన్ 'విను! సావధానముగనో క్షోణీధరోత్తంసమా!
ఘనుఁడౌ రాముని కేనుభక్తుఁడను తత్కార్యార్థినై వచ్చితిం
జనునే నాపయి నింతపంతము? కృపాసాంద్రుండవై ప్రోవవే! 836
మ. నిను నేవేఁడెదఁ బల్మరుల్ గిరివరా! నీలోనునున్నట్టి పా
వనదివ్యౌషధజాలముల్ గరుణదోపన్ నాకుఁ జూపించి కై
కొనుమా కీర్తియుఁ బుణ్యసంపదల నో క్షోణీధరశ్రేష్ఠ! నా
మనమందెప్పుడు నీదుమేలు మఱువన్ మజ్జీవితాంతంబునన్'. 837
మ. అని తానెంతగవేడికొన్నను నగం బత్యంతకారిన్యభా
వనిరూఢంబయి యుండుటంగనుచు నావాతాత్మజుండల్గి తాఁ
'గన దుష్టాళికి రాళ్ళకేటిదయ?యీ గ్రావాదముండౌర' నే
వినయంబెక్కుడు చూపుచున్నకొలదిన్ ద్వేషించి గర్వించెడున్. 838
ఉ. దేవరకేనియున్ గుఱుతు దెబ్బయెయందురు కానయింక నా
చేవయు లావుఁజూపి యిదె చెచ్చెఱ నేఁ బెకలించికొంచుఁ గొం
పోవుదు నీనగాధముని భూధవుపాలికి' నంచు నెంచి యా
పావని తాఁబెకల్చెఁ బటుబాహుబలంబున నగ్గిరీంద్రమున్. 839

గీ॥ అప్పు డగ్గిరిరాజు భయాకులత్వ, మొంది యాక్రోశమొనరించుచున్నదాయన
నందు నివసించుచుండినయట్టి ప్రాణి, కోట్లయార్తధ్వనులు పర్వెఁ గుతలమద్రువ. 840

## హనుమంతుఁడు ద్రోణాద్రినిఁ గొనిపోవుచుండ గంధర్వు లడ్డగించుట

గీ॥ ఇట్లువక్రపరాక్రమ మెసఁగ నాంజ, నేయుఁ డవలీల ద్రోణావనీధరంబు
నెలమిఁ బెకలించుకొని మింటికెగయుటయును, గాంచి తద్రక్షకులు మహా గర్వితులయి.

ఉ॥ ఉర్విపడంకనార్చుచు మహోరుబలాఢ్యులు కూడవచ్చి గం
ధర్వులు పల్వు రాపవననందనుఁదాకి ప్రచండదోర్బలా
ఖర్వనిధానులైనిబిడకాండపరంపరఁ గప్పిరంత స
ప్తార్వునిఁగప్పు నాహిమమునల్లు నిరర్గళఘోరభంగినిన్ 842

కం॥ వారట్లు ప్రయోగించిన, దారుణశరతతిని హనుమ దాహరియించెన్
ఘోరబడబానలం బా, వారిధిజలములహరించువడుపునఁ దలఁపన్ 843

శా॥ గంధర్వుల్ చెలరేగి వాయుసుతుపైఁ గాండాద్యనేకాస్త్రముల్
సంధానంబొనరించి యేయుటయు నాసామీరి తావానినె
ల్లం దీరుండయి వాలచాలనసముల్లాసక్రియాదక్షతా
సంధుండై యుపసంహరించెను మహాశౌర్యం బవార్యంబుగన్. 844

కం॥ ప్రతివీరుల శరముల నిటు, ప్రతిహతములుచేసి వీతభయుఁడౌచు మరు
త్సుతుఁడు వెసన్ గంధర్వ, ప్రతతిపయిం గవిసెను బులివలె గర్జిలుచున్. 845

చం॥ కపిసి రథావళిందునిమి కాల్బలముందెగటార్చి యాశ్విక
ప్రవరులరూపుమాపి హయవారణసంతతిఁగూల్చి వీరపుం
గవుల యమాంతికంబునకుగ్రక్కునఁబంపి నిమేషకాలమం
దవిరళశౌర్యశాలి పవనాత్మజుఁ డంతముఁజేసెఁబెక్కురన్ 846

గీ॥ పిదప హతశేషగంధర్వవీరవరులు, పావనికినోడి పఱచిరి ప్రాకటముగ
విజయలక్ష్మీసమేతుఁడై వృక్షచరుఁడు, ద్రోణగిరిమోసికొనుచు రాఁదొడఁగెనంత. 847

## రావణుఁ డాంజనేయునిపైకి మాల్యవంతుని యుద్ధమున కంపుట

మ॥ అట లంకేశ్వరుఁ డంతయుందెలిసి తా నామాల్యవంతుం గురం
గటకుంజేరి ప్రణామపూర్వకముగా నమ్రోక్తిలొప్పారఁగా
నిటువల్కెన్ 'వినుమయ్య! మారుతసుతుం డెట్టైన ద్రోణాద్రినిం
బటుసత్త్వంబునఁదెచ్చుఁ గావునఁ గడున్ వైలంబ నీవిత్తఱిన్. 848

ఉ॥ పొమ్మిఁక సేనతోఁ బవనపుత్త్రునిఁజంపి తదీయకార్యవి
ఘ్నమ్మొనరించి వేజయముఁగైకొనిర మ్మెటులైనఁగాని' యం
చమ్మనుజాశనుం డతని నాదరమొప్పఁగ వీడుకొల్పినన్
నెమ్మది మాల్యవంతుఁ డతినిర్భయుఁడై యమరారి కిట్లనున్. 849

సీ॥ 'వినుమసురేంద్ర! నా విక్రమంబెఱిఁగింతు నామహావిష్ణువునంతవానిఁ
గదనంబులోఁ దొల్లిగడగడలాడించినాడ ముజ్జగముల నాకునెదురు
మున్నాటికినిలేరు నెమ్మదినమ్ముమీ! యిప్పని నాకెంత తప్పకచని
యావానరాధము హతుఁజేసివచ్చెదఁ బ్రాణంబుతోనుండ ద్రోణగిరిని

గీ॥ నేనుగొనిపోవనీ నిదినిశ్చయంబు, పోయివచ్చెద' నంచు నాపొలసుఁదిండి
కరము గర్వోక్తులాడి యాక్షణమె వెడలె, బలిసి బహువీరదానవభటులుగొలువ. 850

ఉ॥ ఈకరణిం బ్రయాణమయి యేపువఁదాఁజని మాల్యవంతుఁ డ
స్తోకపరాక్రమంబెసఁగ ద్రోణగిరింగొనివచ్చుచున్న ద్వి
ట్భీకరుఁడైన వాతసుతు వీకఁ బయోనిధిమధ్యమందునం
బ్రాకటసింహగర్జనరవంబులతో నెదిరించి యిట్లనున్. 851

సీ॥ 'నిలు! నిలు! వానర! నీపీచమడఁచెద మాల్యవంతుఁడ నన్ను మఱియెఱుఁగవె?
చావకనీవింకఁ జనలేవురా క్రూర! పర్వతంబిటడించి పాఱిపొమ్ము!
నాబుద్ధిఁగైకొమ్ము!' నావిని హనుమంతుఁ డాదానవునితోడ నలిగిపలికె
'నోరి! దైత్యాధమ! యుడుగుము గర్వోక్తులేల ప్రేలెదు నన్ను నెఱిఁగియెఱిఁగి?

గీ॥ మూఁడులోకంబు లొక్కటఁగూడివచ్చి, నన్నుగెలువంగలే విది నమ్ముమదిని
నీవు నీసేన లెక్కయెనిముసమునను, బోర మిముఁగూల్చి గిరిఁగొనిపోవగలను' 852

మ॥ అనుచున్ మారుతి రోషభీషణమహోగ్రాకారుఁడై పేర్చి త
ద్దనుజానీకముపైకి దూకి కడిమిం దాఁబోరసాగెం దగన్
ఘనవాలాహతులన్ లసచ్చితనఖాఘాతంబులన్ దంతపీ
డనపాదద్వయతాడనంబులఁ బ్రచండస్ఫూర్తి నొప్పించుచున్. 853

మహాస్ర॥ దనుజానీకంబు లావాతసుతున కపు డత్యంతభీతాత్మలౌచున్
ఘనపంచాస్యంబు లేళుల్ కని పఱచినటుల్ గర్వమున్వీడి పాఱం
గని రౌద్రాకారుఁడై మూకలను రయమునం గ్రమ్మఱం గూర్చుకొంచున్
మనమందుం గిన్కదీపింప ననిలసుతునిన్ మాల్యవంతుండు దాకెన్. 854

కం॥ ఈకరణిఁ దాను రక్కసి, మూకలు హనుమంతుఁడాకి భూరిశితాస్త్రా
నీకములు ప్రయోగించుచుఁ, బ్రాకటముగ క్షతునిఁజేసి బాధించుటయున్. 855

గీ॥ ఆంజనేయుండు రక్తసిక్తాంగుడగుచుఁ, బుష్పితాశోకవృక్షంబువోలె నొప్పి
రోషమెదనగ్గలింపఁ దాభీషణలయ, కాలుఁడోయన మండుచుఁ గడఁగియపుడు. 856

కం॥ అనివార్యోద్ధతి మారుత, తవయమహాసింహమంత దానవసేనా
వనగజములఁ జంపఁదొడఁగె, ఘనవీరవిహారగాఢకౌతూహాళియై 857

లయగ్రాహి॥ ప్రీలెడిశిరంబులును గూలెడుశవంబులును రాలెడువిభూషలును సోలెడుభటాళుల్
తూలములటుల్ దునిసి వ్రాలెడుగదాసిశరశూలముసలాదులును గాలువఁరీతిన్
లీల ఘనమౌ రుధిరజాలములు వానిపయిఁ దేలినపలాదులును జాలదళమై యా
భీలముగ భూతగణఖేలనములొప్ప నతివేలమయిచెల్లె నపుడాల మసమంబై 858

### హనుమంతుఁడు మాల్యవదాదులను జయించుట

ఉ॥ దానవసేన లిక్కరణిఁ దాము గతించుచునుండఁజూచి కా
లానలులీలమండి ప్రళయాంబుధరప్రతిమానసింహగ
ర్జానినదంబెసంగ హతసైనికుఁడయ్యును మాల్యవంతుఁ డా
వానరవీరు నప్పు డనివార్యమదోద్ధతుఁడై యెదుర్కొనన్. 859

ఆ॥ మాల్యవంతునకును మఱి బాసటగవచ్చి, యాంజనేయుమీద నగ్గలముగ
సాయకంబు లేయసాగిరి హతశేషు, లపుడు కలితరోషులగుచుఁ గడఁగి. 860

ఉ॥ ఆహనుమంతుఁడంత నమరారులకందఱు కన్నిరూపులై
సాహసమొప్ప దంతనఖజాలములం గడులీల వ్రచ్చుచున్
బాహుపదప్రహారముల భంజితగాత్రులఁ జేయుచున్ మహో
త్సాహముతోడఁ జిత్రవధసల్పఁదొడంగె నిశాటవీరులన్. 861

కం॥ కొండొకసేపున కందఱు, గండడఁగి సురారి భటులు కడతేరుటయున్
మొండియయి మాల్యవంతుఁడు, భండనమొనరించుచుండెఁ బావనితోడన్ 862

సీ॥ అటుపదంపడి మారుతాత్మజుం డనివార్యశౌర్యపరాక్రమధుర్యుఁడగుచు
గంధసింధురముపైఁ గనలిలంఘించెడి భయదహర్యక్షంబుభాతి మెఱసి
మాల్యవంతునిపైకి మఱితాను వెసఁదూకి బాహులచేవానిఁ బట్టికొనుచు
'నక్తంచరాధమ! నన్నెఱిఁగితె? యింక నుడిగెనే నీదు గర్వోక్తు?' లనుచుఁ
గీ॥ గరము మల్లసమాడి యాగాడ్పుపట్టి, కాలఁగేలనుమర్దించి గాసిపెట్టి
వధముసేయక జీవచ్ఛవముగఁజేసి, వానిఁబడవైచె నమ్మహావార్ధియందు. 863

ఆ॥ ఇవ్విధంబున బలహీనుఁడై కడలిలో, పలను(దెళ్లి మాల్యవంతుఁ డాత్మ
'బ్రదుకుజీవుఁడ!' యని పాతాళలోకంబు, నందుఁజేరఁబోయె నపుడుతాను 864

ఉ॥ మారుతనందనుండిటుల మాల్యవదాదులరూపుమాపి జం
భారియు నాడఁగాఁగల సురావళు లెంతయుమోద మొందుచున్
బోరనఁ బుష్పవర్షమును బూర్ణముగాఁ గురియించుచుండఁ దా
నారయ నౌషధాద్రిఁగొన యప్పుడురాఁదొడఁగెన్ రయంబునన్. 865

కం॥ అంతనిట రామచంద్రుఁడు, చింతాభరభుగ్నమైన చిత్తము తోడన్
వంతలపాలయి ధృతిచెడి, యెంతయుఁదలఁపులకుఁజొచ్చి యిట్లని పలికెన్. 866

ఉ॥ 'ఓకపివీరులార! వినుఁ డొక్కఁడొకండె క్రమక్రమంబుగా
నాకసమందుఁ జుక్కగమియక్కట! మాయుట కానయ్యెడున్
వేకువజామునాఁదొడఁగె వేగమెయోషధులన్ గ్రహించి తా
నాకునిధానమ ట్లనిలనందనుఁ డింకను గానుపింపఁడే!. 867

తరువోజ॥ ప్రొద్దుతాఁ బొడువకమున్నె సామీరి తెచ్చునో యోషధుల్ దెచ్చి సుమిత్ర
ముద్దులపట్టికి మోదంబుమీరఁ బ్రాణదానముసేసి పరికింప నా వి
పద్దశవాపి కాపాడునో! లేదా! యెద్దియుఁదోప దింకేమిసేయుదును?
సుద్దులింకేటికి? శోకాబ్ధిముంచి దైవంబ యిటుచేసె దానికేమందు?. 868

ఆ॥ తడవొనర్చిన మఱి చెడునుగార్యంబని, యాంజనేయుఁ డెఱుఁగఁడయ్యె నకట!
కాలహరణమిట్లు కావింపనేల? నన్, ఘోరదుఃఖవార్ధి ముంపనేల?. 869

కం॥ ఆవాయుసుతుఁడు తానం, జీవకరణిఁదెచ్చి యింద్రజిద్వైరిని సం
జీవితునిఁ జేయగలఁడని, భావించితి నాతలంపు భగ్నంబయ్యెన్'. 870

మధ్యాక్కర॥ అనుచు నూహాపోహలంది యారాముఁడిట్లను మఱల
'నినుఁడుదయింపకమున్నె యెట్టైన నోషధుల్ గొనుచుఁ
జనుదెంచు' నని కొంతదనుక సామీరిరాతని కొంత
దనుక మనంబునఁ దాను దర్కించి దుఃఖింపసాగె. 871

## ఆంజనేయుఁడు ద్రోణాద్రిని మోసికొని వచ్చుట

సీ॥ ఇంతలో నాహనుమంతుడు ద్రోణాద్రిఁ గొనివచ్చుచుండ నాకొండయందు
నున్న యౌషధలత లుష్ణాంశుసన్నిభకాంతిపుంజము తోడఁ గ్రాలుచు మఱి
భానూదయభ్రాంతిఁ బార్థివునకుఁ బుట్టఁజేయుటయును దనచిత్తమందు
'నినుఁడుపొడుచుచుండె' ననియెంచి యావిభీషణుతోడ శ్రీరామచంద్రుఁడనియె

గీ॥ 'రావణానుజ! వినుము! రాజీవబంధుఁ, డుదయగిరిమీదఁ నుదయించుచున్నవాడు
కిరణములకాంతు లవిగొ! విస్ఫురితలీలఁ, గనఁబడెడు సందియములేదు కాంచుమీవు. 872

కం॥ ఎక్కడి హనుమంతుండిఁక?, నెక్కడి సంజీవకరణి యెక్కడిబ్రదుకుల్?
నిక్కువముగఁ జెడుకాలం, బక్కటసంప్రాప్తమయ్యె నదియెట్లుండెన్. 873

శా॥ మావంశానకుఁ గర్తయయ్యు నిటులన్ మాపై లవంబైనఁ గా
నీ వాత్సల్యముఁజూపఁడయ్యెనుగదా నీరేజబంధుండు దు
ర్భావాంధుండయి జ్ఞాతిమత్సరము నాపైఁజూపుచున్నా డిదే
నేవీసిన్ వెనరూపుమాపెద శరానీకప్రహారంబులన్ ' 874

మ॥ అనుచున్ దిగ్గనలేచి రాముఁడతి రోషావేశదుర్దాంతుఁడై
ఘనకోదండముఁగేలనంది గుణటంకారధ్వనుల్ మీర గ్ర
క్కున బ్రహ్మాస్త్రము వింటఁగూర్ప నపుడా క్షోణీధరంబుల్ చలిం
చెను సప్తాంబుధులింకె భూమివడఁకెం జేటొందె ముల్లోకముల్. 875

గీ॥ ఆవిభీషణుఁ డర్కాత్మజాదులంత, సభయులై 'రామ! లోకముల్ సంచలించె
మానుమలుక బ్రహ్మాస్త్రసంధానమింక, నుడుగు' డని వేడఁజొచ్చి రప్పుడమితేని. 876

చం॥ అపుడు సుషేణుఁ డొక్కఘనమైన మహోన్నతవృక్షమెక్కి తూ
రుపుదెసనిక్కిచూచి వెసద్రోణగిరింగొనివచ్చుచున్న గా
డుపుసుతుఁ దానెఱుంగుచుఁ గడుంగడువేగమె క్రమ్మనుడిగ్గి యా
నృపతినిడాసి మిక్కిలి వినీతిదలిర్పఁగ నాతఁడిట్లనున్. 877

మ॥ 'నరనాథాగ్రణి! చిత్తగింపుము మదిన్ వావిన్నపంబొండు దు
ర్భరకోపంబుపసంహరింపుము లసద్బ్రహ్మాస్త్రసంధానమున్
విరమింపందగు ద్రోణపర్వతముతో విచ్చేయుచున్నాడు భీ
కరశౌర్యాఢ్యుఁడు మారుతాత్మజుఁడు శంకాలేశ మింకేటికిన్? 878

మ॥ జలజాతాప్తకులావతంస! వినుమా! చర్చింప ద్రోణాద్రియం
దలిదివ్యౌషధజాలముల్ తరుణమార్తాండప్రతీకాశరో
చులతో మిక్కిలివెల్గుచుం దమకిటుల్ సూర్యోదయభ్రాంతినిం
గొలిపెంగాని మఱొండునాదు మదిలోఁగ్రోధంబు చాలింపుమా!' 879

గీ॥ అనిసుషేణుండు రామున కాగ్రహోప, శమనవాక్యఁ బులనుబల్కి, శాంతచిత్తుఁ
జేయుచున్నంతలో నాంజనేయుఁ డద్రి, తోసమీపించెఁ బతికి సంతోషమొదవ. 880

సీ॥ అప్వు డావానరు లానందభరితులై యరుదెంచుచున్న యాయనిలజునకుఁ
దారెదురేగి తద్ధారుణీధరభారవహనంబునందునఁ బాలుగొనెడు
వారును వివిధోపచారమ్ములను సల్పువారును కుశలసంప్రశ్నములను
గావించువారును గరముఁగీర్తించెడువారునునై వారు పలువిధముల
గీ॥ గాడ్పుపట్టి మనఃకాయకష్టములను, దగనివారించుచుండిరి తక్షణంబ
గిరినిఁగొనివచ్చి రామునికింకరుఁడది, యందునొకచోటడించె రామాజ్ఞచేత. 881

ఉ॥ మెచ్చినృపాలుఁడప్పుడు సమీరసుతుం దగఁగౌగిలించి తా
నచ్చపుఁబ్రేమతోఁబలికె 'నార్య! నినుం గొనియాడశక్యమే?
చచ్చెడునాసహోదరుని సాదరభావముతోడ నోషధుల్
తెచ్చి సజీవుఁజేసితటె ధీమణి! నీకు సమానులుండిరే?. 882

కం॥ భవదీయఋణము నేనీ, భవమునఁ దీర్పంగఁజాలఁ బలుకులికేలా?
రవివంశోద్ధారకుఁడవు, పవనజ! నిను దైవమనుచు భావింతుమదిన్'. 883

కం॥ అని యిమ్మెయి హనుమంతుని, దినమణికులుఁడైన రామదేవుఁడు మిగులం
గొనియాడుచు నతనిఁ బునః, పునరాలింగనముచేసెఁ బూర్ణప్రేమన్. 884

కం॥ అనిలజుఁడప్పుడు ముదమున, జనపతికభివందనంబు సలిపినవాడై
తనపోయివచ్చినకథను, వినిపించె సవిస్తరముగఁ బృథ్వీశునకున్. 885

గీ॥ అప్పుడు సుషేణుఁ డధికరయమున ద్రోణ, శైలమారోహణముచేసి చాలవెదకి
తెచ్చె సంజీవకరణియాదిగఁగలట్టి, నాల్గువిధముల యోషధుల్ నయగుణుండు 886

## లక్ష్మణుఁడు మూర్ఛదేరుట

సీ॥ ఆసుషేణుం డిట్టు లౌషధంబులఁదెచ్చి రామానుజున్మ శీఘ్రమున దరిసి
శాస్త్రసమ్మతముగ సలిపెఁ దానుజికిత్స తక్షణమాత్రఁ దత్తనువునందుఁ
జూర్ణంబులైన యస్థులు పూర్వవిధమునఁ జక్కఁబఱచెను విశల్యకరణి
సడలిపోయినయట్టి సంధిబంధముల సంధానమ్ముఁజేసె సంధానకరణి
గీ॥ లలితఘనసువర్ణచ్ఛాయ నలరునట్లు, ప్రాకటముగఁ గావించె సౌవర్ణకరణి
జీవములొసంగి కాంబునర్జీవితునిగఁ, బరఁగనొసరించె సంజీవకరణి యపుడు. 887

గీ॥ నిద్రితుఁడుమేలుకొన్నట్లు నిరుపమాన, పుణ్యనిధియైన సౌమిత్రి మూర్ఛఁదేరి
తాను భద్రంబుగానంతఁ దరణికరణిఁ, దేజరిల్లె రాముని మనోంభోజమలర. 888

కం॥ ఇమ్మెయి స్వస్థుండగు తన, తమ్ముని గౌఁగిటను జేర్చి దశరథి ప్రమో
దమ్మెదఁ బొదలఁగఁ బ్రియవా, క్యమ్ముల నిట్లనుచుఁ బలికె నాదరమెప్పన్ 889

సీ॥ 'చిన్నితమ్ముఁడ! నీవు జీవింపఁగలుగుటఁ జేసి నిల్చినవాఁడ జీవములను
లేనిచో నీవలెనే నేను నీవియోగమునకై కుంది ప్రాణములఁ బాయ
వలసినవాఁడనే తలపోయనయ్యది దైవకృపవలనఁ దప్పెఁగాక!
మరణతుల్యంబైన దశవస్థఁ బొందియు మనపూర్వకృతమది మంచిదగుట

గీ॥ మఱల మనఁగంటి వనఘాత్మ మనమునందుఁ, దలఁపఁ ద్వత్ప్రాణదాతయై తథ్యముగను
భానుకులముద్ధరించె మహానుభావుఁ, డీసుషేణుండు వశమౌనె యితనిఁ బొగడ!'. 890

కం॥ అనుచు సుషేణునిఁ బొగడుచు, ననుజనకున్ రామభద్రుఁ డాదరమెసఁగన్
వనచరసేనలుఁ దానును, ఘనముగ నుపచారములను గావించెనొగిన్. 891

గీ॥ అట్లు లక్ష్మణుఁ డభ్యుదయంబునొంద, రాముఁడు విభీషణుండును రవిసుతాదు
లాత్మగతముల సంతోషమావహిల్లఁ, దారుగడఁ గిరి భావికర్తవ్యమునకు 892

గీ॥ అంత రామలక్ష్మణుల ముఖాబ్జములు వి, కాసమొందఁగ నాదశకంఠువదన
కైరవము వాడిపోవ నాకమలమిత్రుఁ, డుదయగిరిశిఖరంబుపై నుదయమయ్యె. 893

కం॥ రామాజ్ఞచేత వెండియు, నామందులకొండఁ గొనుచు నరిగి రయమునన్
సామీరియునిచివచ్చెను, దాముదమొప్పారఁగా యథాస్థానమునన్. 894

గీ॥ అయ్యనంతరమున రామునానతిఁ గొని, సకలవనచరసైనికుల్ సంగరంపు
వేడ్కదోపఁగ రావణువీడు నాల్గు, గవకులన్ ముట్టడించిరి కడిమిమెఱయ. 895

ఇంద్రవజ్రా॥ శ్రీరామసౌమిత్రుల సేనమార్తిన్, ఘోరంబుగాఁ బెంపగఁ గొంతసేపా
క్రూరాత్ముఁ డౌ పంక్తిముఖుండు చింతా, వారాశిలో మున్గినవాఁడయొచున్. 896

గీ॥ ఎట్టకేలకు మది ధృతిఁ బట్టుకొల్పి, వైరులనురూపుమాపుటో వారిచేతఁ
దాను బరిమార్పఁబడుటయో తగును గాని, వగవరాదని తలఁచి రావణుఁడు పిదప. 897

రావణుఁడు తనమూలబలములను యుద్ధమునకుఁ బంపుట

గీ॥ రావణాసురుఁ డేపుమై నీవిధమునఁ, దాను గృతనిశ్చయుఁడయి తక్షణంబ
జయమెకాని యెన్నడు నపజయమెఱుఁగని, మూలబలమంతరప్పించి యాలమునకు 898

చం॥ పయనముచేసిపంపుటయు భండనకౌతుకముల్లసిల్లఁగా
హయరథవారణావళులయం దధిరోహకులై మహాస్త్రసం
చయములుగొంచు నార్చుచును సాహసమొప్పఁగ విస్ఫురద్గతిన్
దయమున వత్తఱిన్ వెడలె రావణుమూలబలంబు పోరికిన్ 899

కం॥ గణియింపవచ్చుఁజుక్కలు, గణియింపఁగవచ్చునిసుముఁ గానీయారా
వణునిమహామూలబలము, ఫణిపతికైనను గణింపవశమే? తలఁపన్. 900

గీ॥ వికృతనేత్ర వికృతకర్ణ వికృతపాద, వికృతనాస వికృతహస్త వికృతవక్త్ర
లాదిగాఁగల బహువికారాకృతులగు, వారు కలరంద అమ్మూరబలమునందు. 901

గీ॥ ఇట్లనన్యభేద్యంబు నేపుమీరి, దేవతలకైననున్ మతి తేరిమాత
రానిదై దిశాచక్రంబు రహిఁబగులఁగ, నార్చు నన్ మూలబలమప్పు డరికిఁగదలె 902

కం॥ నాలుగుగవకులనుండియు, మూలబలము వెల్వడుటయు భూరిబలాఢ్యుల్
లీలమెయి సకలకపులా, భీలముగాఁ గురిసిరపుడు వృష్టివశిలల్. 903

ఉ॥ గండమరంగ నిట్లు దశకంఠుని మూలబలంబుతోడ నా
దండిమగల్ వనేచరులుకాకి భయంకరలీల నార్చుచు
ద్దండపరాక్రమంబెసఁగ దంతనఖాంఘ్రివిదారణంబులన్
గండశిలాప్రహారముల గాసిఁజేయుచు విక్రమించినన్ 904

సీ॥ వానరుల్ రువ్వెడు పాషాణతతులచే క్షతులయికూలు రాక్షసవసులు
దనుజాస్త్రశస్త్రవిదారితగాత్రులై కోటులపైనుండి కూలుకపులు
కూలువారినిఁగని కొంకక కడువిజృంభించి పెనఁగు కీకపీరవసులు
వ్రేటునకును వ్రేటువ్రేయుచుఁ బ్రాణముల్లెక్కసేయకపోరు రక్కసులును
గీ॥ నై యుభయసైన్యములు కంబద్ధృతముగ, సంగరముసేయఁజొచ్చిరి చదలనిలిచి
విబుధసంఘముల్ వారిదోర్వీర్యశౌర్య, ధైర్యములఁజూచి వేనోళ్లఁ దామపొగడ 905

ఉ॥ మూలబలంబుఁ గీశలిటు పోడిమియొప్పఁ బరస్పరంబు తా
మాలమొనర్ప వారిచరణాహతిరేణువుగప్పె భానునిన్
వ్రీలెను వారియార్పులకుఁ బృధ్వియు దిగ్గగనంబు లత్తఱిం
గాలువలై తదీయఘనకాయములందు స్రవించె నెత్తురుల్ 906

వనమయూరవృత్తము॥ వారిటు పరస్పర మవార్యముగఁ బోరన్
భూరిచతురంగబలముల్ ధరణిఁ ద్రెళ్లెం
దోరముగ శోణితపుఁదోయ మది పాఱెన్
ఘోరపిశితాదు లటఁ గుప్పలుగఁ దోచెన్. 907

కం॥ మఱియును మూలబలమువా, రతిముఱిఁ జెలరేగి వానరావళియందుం
జొఱఁబడి త్రుంచియు నొంచియుఁ, బఱపిరి నానాదిశలకుఁ బటుశౌర్యమునన్. 908

గీ॥ రావణునిమూలబలమిట్లు చేవతనర, నొంచుచుం ద్రుంచుచున్ విక్రమించుటయును
దనబలములోడి పఱచుటయును గనుఁగొని, రావణానుజుతోఁ బల్కె రామవిభుఁడు. 909

గీ॥ 'చూచితె? విభీషణా! కడుఁ జోద్యమయ్యె. ధరణియానినచందాన దైత్యసేన
లంతకంతకసంఖ్యమై యాలమునకు, రాఁదొడఁగె నెందఱున్నారొ రక్కసులిఁక 910

కం॥ రిపుసేనకోడి మనదగు, కపిసైన్యము పాఱఁజొచ్చెఁ గనుఁగొన మనకే
యపజయమగునని తోచు గె, లుపువారిదె సుమ్ము! దైత్యలోకాధిపతి! 911

కం॥ నావిని విభీషణుండా, భూవరుతోఁ బలికె 'రామభూపతి వినుమా!
రావణుని మూలబలమిది, దేవతలక నైనఁగాదు దీనిజయింపన్ 912

గీ॥ ఇంతదనుకను రణములో నీల్గినట్టి, రక్కసులొకెత్తు తలపోయ రామచంద్ర!
ప్రబలమై యొప్పు నీమూలబలమొకెత్తు, వీరిఁ జంపక జయము చేకూరఁబోదు. 913

గీ॥ మూలబల మాహవంబునఁ గూలెనేని, విగతబలదర్పుఁడై దైత్యవిభుఁడు తాను
వేగఁ గోఱలుపెఱికిననాగమట్లు, సులభముగ నిర్జితుండగు క్షోణినాథ! 914

కం॥ భూతలనాయక కావున, శాతాశుగ తతులచేత సమయింపుడు ప్ర
ఖ్యాతఘనమూలబలమును, భీతకపివ్రాతములను వేఁబ్రోవ' ననన్ 915

మ॥ విని శ్రీరామనృపాలుఁ డాకపులకున్ వేవేగ నాపిమ్మటన్
ఘనధైర్యంబును దాఁదగంగఱపుచున్ శస్త్రాస్త్రజాలంబులం
గొని సౌమిత్రిసమేతుఁడై తలపడెన్ ఘోరాజిదుర్భేద్యమై
చను నామూలబలంబుతో విపులదోశ్శౌర్యం బవార్యంబుగన్. 916

గీ॥ ఇట్లు తలపడి రాఘవు లేపుమీర, నతినిశితకాండవృష్టిచే నరిసమూహ
ములను ముంచుచు నొంచుచు భూరిబలులు, తాము విహరింపఁజొచ్చిరి దర్పమెసఁగ.

సీ॥ ఆలోన రాముదివ్యాస్త్రపాతంబున క్షోణితలంబునఁ గూలువారు
కూలి క్రమ్మఱలేచి కొంకొకింతయులేక చలమున యుద్ధంబు సలుపువారు
క్షతగాత్రులయ్యును ధృతిపెంపుసొంపార మడమఁద్రిప్పకపోరి మడియువారు
భూరిమూర్ఛలలోన మునిఁగివెండియుఁదేరి భీకరాహవము గావించువారు

గీ॥ నై మహాఘోరసంగ్రామమయ్యె నట్టి, యెడలఁ బ్రవహించె శోణిత మేఱులగుచు
వానిపైఁ దేలియాడెను బహుళదనుజ, శవము లందలిమాతసంచయము లలర 918

ఉ॥ మఱియును రామభూవిభుఁ డమానుషవిక్రమమొప్పఁ దూపులం
దఱచుగనేయఁగం బ్రబలదానవవాహిను లొక్కపెట్ట న
త్తఱి దళితాంగులై సమరధారుణిఁ బీనుఁగుఁబెంటలై పడెన్
నఱుకఁగఁబడ్డ ఘోరవిపినంబుతెఱంగున నొప్పిచూడఁగన్. 919

శా॥ శ్రీరాముం డమరేంద్రుకోనసకరించెం దన్నిశాతోల్లస
ద్ఘోరాస్త్రంబులు వజ్రసన్నిభములై క్రూరంబుగాఁ దాకినన్
వీఁకల్ దానవులాహవస్థలమునన్ వేఁగూలి రద్రుల్‌బలెం
దోరంబై ఝరులోయనన్ రుధిరపుందోయంబు పాఱెంగడున్. 920

## శ్రీరాముఁడు మూలబలముపై సమ్మోహనాస్త్రముఁ బ్రయోగించుట

క॥ ఈవిధమున దనుజాలెందఱు మడిసినఁ, గాని తఱుగకున్న భానుకులుఁడు
సత్వరంబ తాను సమ్మోహనాస్త్రంబుఁ, గడఁగి మంత్రపూర్వకముగ నేసె. 921

ఆ॥ సమ్మోహనాస్త్రమహా, త్మ్యమ్మునఁ గోటానకోటు లారాములు తా
రిమ్ముగఁదోఁచిన వికల, త్వమ్మునఁ నామూలబలము తత్సమయమునన్. 922

మ॥ వీనికివాడు వానికినివీడు రఘూద్వహునట్ల కన్పడన్
దానవులెల్లరుం గరముదర్పితులై పటుకోపభీషణా
మానతఁబేర్చి యార్చుచుఁ గనుంగవ నిప్పులురాల నొండొరుల్
పీనుఁగుఁబెంటలై పడఁగ బీరమునం గలహించి రుద్ధతిన్ 923

ఉ॥ నిమిషార్ధములో నిమ్మెయి, నమరుల కవిజేయమైన యామూలబలం
బమలయశుఁడైన శ్రీరా, మమహీవిభుచేత నని సమసెఁ బూర్ణముగన్ 924

ఉ॥ మొరసెను దేవదుందుభులు మోదముఁబొందె సమస్తలోకముల్
మురిసి రఘుప్రవీరు జయముంగొనియాడుచు మింటనిల్చి వేఁ
గురిసిరి పుష్పవృష్టి సురకోటి మనోహరలీల దేవతా
తరుణులు పాడియాడిరిముదంబునఁ దత్సమయంబునందగన్. 925

ఉ॥ పదపడి హతశేషులచేఁ, ద్రిదశారికరంబుఁ దేటతెల్లముగాఁ దా
హృదయంబునందు జరిగిన, యుదంతమునువెఱిఁగి వంతనొందినవాడై. 926

## రావణుఁడు పాతాళహోమము చేయుట

గీ॥ దశముఖుండంతఁ దాను బాతాళహోమ, మెలమిఁగావింపసమకట్టి యెమ్మంత్రి
హితపురోహితసామంతవితతితోడఁ, దగవిచారించి పురబహిర్ద్వారములను. 927

కం॥ మాయించి పెక్కురన్ద్రె, తేయుల రిపులం బురంబు ధృతిఁజొఅకుండం
బాయక తద్రక్షణమున, కాయసురకులేంద్రుఁడునిచి యటుపిదప వెసన్.

చం॥ మితపరివారముంగొనుచు మేటిపరాక్రమశాలి రావణుం
డతిరయమొప్పనేగి యపు డారయఁదానొక భూగృహంబునం
దతులితహర్షసంభరితుఁడై తగఁజొచ్చెను మృత్యుదేవతా
యతముఖగహ్వరంబున మహద్భుతలీలను జొచ్చుకైవడిన్

చం॥ కడుఁగుతుకంబుతోడ దశకంధరుఁడిట్టుల భూగృహప్రవి
ష్టుఁడగుచు యోగ్యవస్తువులఁ జొప్పడఁ దానమకూర్చికొంచు న
ప్పుడు ఘనహోమమున్ సలుపఁబూనె నిశాటభటుల్ తదాజ్ఞనుం
బడసి యనేకు లాగృహపు ద్వారముచెంగటఁ గాచియుండఁగన్.

గీ॥ దశవదనుఁడిట్లు తాను బాతాళహోమ, మెలమి నిర్విఘ్నముగ మఱి సలుపు
దన్మహోద్భుదధూమంబు దశదిశలను, గప్పి తమముగావించె నాకాశమెల్ల

సీ॥ ఆహోమధూమంబునంతయుఁ దిలకించి ర్కామవరుతో విభీషణుఁడు నుడివె
'నవనీశ! చూచితె? యాఁకలోపల ఘనధూమజాల మక్కజముగాఁగఁ
దఱచుగానగపడెఁ దద్విధంబునజూడ నొకశంక నాకిప్పు డొదవుచుండె
దశకంధరుండు పాతాళహోమముఁజేయఁ దాఁబూనెఁగాఁబోలు దధ్యముగను
గీ॥ దత్క్రతువు సమాప్తంబయి తనరెనేని, వానిగెలువంగరా దెంతవారికైనఁ
గాన హోమంబువేగ విఘ్నఁబొనర్పఁ, బంపుడిఁక వెల్లవానరవాహినులను'.

చః॥ అనవుఁడు రామచంద్రుఁడు రయంబునఁబొండని యానతిచ్చినం
బనసనుషేణమైంద శరభద్వివిదాంగద జాంబవన్మరు
త్తనయ గవాక్షనీలనల తారగజానిలవేగగంధమా
దన గవయాదివానరులు తా రపుడేగిరి లంకకున్ వెసన్.

ఉ॥ పోయి కవాటముల్విఱిచి పోడిమిఁ గావలివారినెల్లఁ బో
నీయక పట్టికొట్టివధియించి సరంకుశవృత్తి చీటిలోఁ
బాయకచొచ్చి వప్రములు భాసురగోపురమండపాదు లె
ల్యాయి చుహోగ్రహోమపవనుఁడన్నియుఁ బాడొనరించి దాకపుల్.

చం॥ మఱియును దానవాంగనలమానము దూలఁగఁబట్టికొంచు వా
రఱిమఱి భీతచిత్తలయి యార్తిమెయిన్విలపించుచుండఁ జె
చ్చెఱఁ గపివీరు లాదనుజశేఖరుఁడౌ దశకంఠుఁజాడ 'మీ
రెఱుఁగఁగఁజెప్పు' డంచుఁ బలుహింసలఁబెట్టఁదొడంగి రత్తఱిన్ 935

గీ॥ పదపడి విభీషణునిభార్య పరమసాధ్వి, సరమయనుకాంత కపులకు సంజ్ఞచేతఁ
దానుదెలియంగఁజేసెను దశముఖుండు, చెలఁగి పాతాళహోమంబు సలుపుచోటు. 936

గీ॥ అక్షణమె వానరోత్తము లతిరయమున, సరమసంజ్ఞచేఁ దెలిసినసరణిఁ బోయి
కనిరి పాతాళమంబోని ఘనగభీర, బూబిలము రావణుండున్న భూగృహంబు. 937

## వానరులు రావణుని పాతాళహోమమును నాశనము చేయుట

మ॥ కని కీశోత్తము లాగుహాముఖమునం గాపున్నదైత్యాళి ను
ర్విని వేఁగూలిచివేసి లోపలఁగడున్ వీకం బ్రవేశించి యా
దనుజగ్రామణిహోమమున్ దరిసి యుద్యత్కోపమేపారఁగన్
ఘనశౌర్యాఢ్యులు తన్మహాసవనవిఘ్నప్రక్రియాలోలురై. 938

సీ॥ హోమానలంబును నొయ్యనఁజల్లార్చి పౌరి హోమకుండమ్ముఁ బూడ్చివైచి
హవ్యకవ్యంబుల నవనిపాల్గావించి యూపసంతతులను నురులఁద్రొక్కి
గంధపుష్పాక్షతల్ గజిబిజిగాఁజేసి బలులన్నియునునేలఁ బాఱవేసి
క్రతుయోగ్యసంభారవితతిఁ జెడఁగొట్టి పాత్రసంచయములఁ బాడొనర్చి
గీ॥ యాజకులు ఋత్విజులును సామాజికులును, హోతలధ్వర్యులాది యజ్ఞోపకర్త
లను బిఋకుమార్చి యాస్థలంబును మలాది, కములచే రోతయొనరించి కపులు మఱియు.

శా॥ కాలంపన్నియు దంతసంతతులచే గాటంబుగా వ్రచ్చియుం
గేలన్వ్రేసియు డాసియుం గినుకతోఁ గేశంబులన్లాగియున్
వాలాగ్రంబులఁగొట్టియున్ మకుటరత్నశ్రేణులన్ రాల్చియున్
రాలన్రువ్వియుఁ జాలఁగాఁగలఁచిరా రక్షోధిపున్ వానరుల్. 940

గీ॥ ఇవ్విధంబున వనచరు లింద్రవైరి, నిష్ఠచెఱుపంగఁదలపోసి నిగ్రహగతిఁ
దారు బాధించుచుండ నాదశముఖుఁ డపు, డచలుఁడైయుండెఁ దా మేటియచలమునఁగ.

కం॥ ఆరావణు నురునిష్ఠను, దారెట్టులుఁ జెఱుపలేక తద్దయు వంతం
గూరుచు వేఱయుపాయము, వేరక యందఱును గపులు నెఱిమన్నంతన్. 942

## అంగదుఁడు మందోదరిని రావణునికడకుఁ దెచ్చుట

మ॥ అతిశౌర్యోజ్జ్వలుఁడైన యంగదుఁడు తా నారావణాంతఃపురం
బతిశీఘ్రంబునఁజొచ్చి హారచయమల్లాడం గురుల్వీడ నా
తతభీతిన్ బహుపుత్రశోకపరితప్తంబైన చిత్తంబుతో
మతిఁగోల్పోయి విలాపమున్సలుపు నామందోదరీదేవినిన్. 943

కం॥ వేవేగడాసి యాతఁడు, వావిరి వాపోవుచున్న వరవర్ణినినిం
దావేణివట్టిలాగుచు, రావణుచెంతకునుదెచ్చె రాజసమొప్పన్. 944

కం॥ ఈవిధమున మందోదరి, రావణుకట్టెదుటనిలిపి ప్రావృణ్మేమా
రావమున నిట్టులనియెన్, దేవేంద్రుని మనుమఁ డధికధీరత్వమునన్. 945

ఉ॥ 'రావణ! నీవు నా దరివిరాముఁడు రాముఁడులేనివేళఁ ద
ద్దేవిని దొంగవోలెఁ జెఱఁదెచ్చితి నేడటుగాదు విన్ము! నీ
దేవిని నీవచూడఁగొని దిట్టతనంబునఁ బోవువాఁడ! రా!
చేవగలాడవేని ననిసేసి సతిన్ విడిపించుకొ మ్మిఁకన్'. 946

కం॥ అనవుఁడు మందోదరి తన, కనుఁగవనశ్రూదకంబు గ్రమ్ముచునుండన్
ఘనముగశోకించుచు ని, ట్లనిచెప్పఁదొడంగె దానవాధిపుతోడన్. 947

మ॥ 'దితిజాధీశ్వర! నిర్దయుండయి భవద్దేవిన్ సుశీలం బతి
వ్రత నిబ్బంగి వనేచరుండకట! ధూర్తత్వంబునం గొంచురా
హతుఁగావింపక యీమహాఖలుఁ గ్రతువ్యాజంబునన్ ధైర్యహీ
నతమై దాగఁగఁ బౌరుషంబె? యిదియున్ న్యాయ్యంబె? వీరత్వమే? 948

చం॥ తగదిటు లూరకుండ మదిధైర్యముఁబూనుము! లెమ్ము! పోరనీ
మగతనమింకఁజూపు మవమానముకల్గినఁ బ్రాణమేల? యీ
యగచరునిం ద్వదీయ నటులాస్త్రపరంపర రూపుమాపి ము
జ్జగములుమెచ్చ నన్ను ఘనశౌర్యమునన్ విడిపింపు రావణా! 949

ఉ॥ త్రాసమొకింతలేక నను దానొకకీశుఁడు పట్టిఖరఁగా
రోసముకల్గలేదొ? మఱి రూఢిగ మీసముపేసులేదొ? కై
లాసమునెత్తినట్టి కడులావవినేమయిపోయెె? నాథ! నీ
వీసరణిన్ మునీంద్రువలె నేమియుఁజెప్పవు? జేయ వక్కటా? 950

ఉ॥ త్రాసముఁబొందితో రిపులఁదాకి రణంబొనరింప నీవు? నీ
దోసమువండియే యిటుల దోర్బలవిక్రమసంపదల్ కడున్
మాసెనొ? లేక యాకరుణమాలినదైవము తప్పనెంచెనో?
నీసతిబన్నముం దలఁగనేరక చూచుచునుండఁ బాడియే?. 951

చం॥ సుతులును బంధులాప్తులును జోద్యముగా రణభూమిలోపలన్
మృతులయినారు నీవొకఁడవేయిఁక నుంటివిపో శవంబటుల్
ధృతిమెయి శత్రుసేనల వధించుటొ! చచ్చుటొ! యెప్పుఁగాక! యీ
క్రతువులఁ బూజలేల? నినుఁగాల్పనె? పూడ్చనె? రాక్షసేశ్వరా!' 952

మ॥ అని మందోదరి కోపతాపములు తన్నావేశమొందింపఁగాఁ
దనప్రాణేశ్వరుఁడైన రావణుని నత్యంతంబుగున్ దూరియున్
ఘనవీరోచితధర్మముం గఱపియున్ గాటంబుగా రోదన
ధ్వనిగావింపఁగసాగెఁ దాఁ గురరిచందానం గడున్ దీనయై. 953

## రావణుఁడు హోమముచాలించి కపులతోఁ బోరాడుట

ఉ॥ అప్పుడు రావణుండు తనయాలివిలాపము వీనులంబడం
దప్పక కన్నులందెఱచి తద్దురవస్థనుజూచి మేటిబల్
సప్పముఁబోలె మండుచు వెసన్ ఘనహోమపునిష్ఠమాని తా
గొప్పగనార్చిలేచెఁ బటుకోపము రూపముఁబూనెనో యనన్. 954

మ॥ ఇటులా పంక్తిముఖుండులేచి తనలో నెంతేని శౌర్యాగ్ని మి
క్కుటమై ప్రజ్వలితంబుగాఁగ నొరలో ఘోరాసివేదూసి మ
ర్కటవీరుండగు వాలినందనుని వీకన్డాసిప్రేసెన్ సము
త్కటమూర్ఛాగతుఁడై మహాశనినిపాతగ్రావమోనాఁ బడన్, 955

ఆ॥ ఇట్లు పంక్తివదనుఁ డింద్రునిమనుమని, గాఢమూర్ఛమునుఁగఁ గనలిప్రేసి
తనసతీలలామ ఘనవిపత్తునుబాపి, కినుకగదుర వెంటియును నతండు. 956

మ॥ కపియూథంబులమీఁద సింహమువలెన్ గర్జిల్లుచున్రాఁగ గా
డుపునూనుండవు డాత్మలోఁగినిసి తోడ్తోముష్టిసారించి దై
త్యపతిన్ వక్షముగాడఁగాఁబొడిచె రక్తంబేఖులైపాఱ కా
శ్యపిపైఁద్రెళ్లెదశాస్యుఁ, డంగదుఁడు మూర్ఛంచేరెఁ దాసింతలోన్ 957

ఉ॥ పిమ్మట నంగదప్రముఖవీరులు ధీరతదోప నొక్కమొ
త్తమ్ముగఁదాకి పాదములదాచియు దారుణవాలముష్టిఘా
తమ్ములఁద్రుక్కఁజేసియును దంతనఖాహతులంగలంచియుం
బమ్మినకిన్కఁగూలిచిరి పంక్తిముఖానుచరాళి నత్తఱిన్. 958

గీ॥ అంత గ్రక్కనలేచి నిజానుచరుల, లొచ్చునుం గపివీరులహెచ్చుఁజూచి
యచ్చుగాఁ గోపతాపముల్ పెచ్చుపెరుగఁ, జిచ్చువలె రావణుఁడుమండి యచ్చెరువుగ.

చం॥ పరశుమహాగదాముసల పట్టిసతోమరభిండివాల ము
ద్గరకరవాల శూలపరిఘాప్రముఖాదిసమస్తహేతి సమి
త్పరికరసంచయంబులను బంక్తిముఖుండు రయంబుమీరఁ దా
నిరువదిచేతులందు ధరియించి ప్లవంగులఁదాకె వీకమై 960

సీ॥ ఇట్లు విజృంభించి యింద్రారితలపడఁ గపిసమూహంబులు కసిమసంగి
తామపుడతనిపై దారుణతరమహావర్షమోయన శిలల్ వైవసాగి
రవి యంతరమునంద యారావణుండు తుత్తుమురుగావించి తోత్తోడ మఱియు
గదచేత మోది ముద్గరముచేవాది ప్రాసముచేఁబొడిచి పరిఘమునదఁచి
గీ॥ భిండివాలముచే వ్రేసి భీకరాసి, చేతనఱికియు శూలముచేతఁగ్రుచ్చి
పరశుతోమరపట్టిసప్రముఖములగు, బహుతరాయుధములచేత వ్రచ్చివ్రచ్చి. 961

కం॥ దండిమగఁడు దశకంఠుఁడు, కొండొకసేపుసకుఁ గపుల గుహవెలుపలికిన్
గండమరవెడలఁగొట్టినఁ, గొండంతభయమ్ము తమ్ముఁ గొందలపఱుపన్. 962

గీ॥ భీకరమృగేంద్రునసు నోడి భీతిఁబఱచు, నామృగమ్ములువోలె శాఖామృగమ్ము
లోడి గుహవీడి పఱచుటయుచు దశాన, నుంచు తఱిమెచు లంకలోనుండి కపుల. 963

కం॥ ఆవాసరు లీవిధమున, రావణునకుఁనోడి పఱచి రామునితోఁ ద
త్పావనహెూమముఁజెఱిచిన, యావృత్తాంతంబుఁ దెలిపి రామూలముగన్. 964

మ॥ దనుజగ్రామణి రావణుండు పిసపన్ దస్యుప్రకాండంబుచేఁ
దనహెూమం బది యమ్మెయింజెడుటయుం దాపంబు పెంగాటమై
ఘనకోపంబునుబెంప రాఘవుల సంగ్రామస్థలిం గూల్చుటొం
డెను దావారలచేత.గూలుటయునొండెన్ నిక్కమం చెన్నుచున్. 965

చం॥ పటపటపండ్లుగీటుచును బంకిముఖుండు సటావిలుంచనో
త్కటపటురోషభీషణమృగప్రభుపోలిక మండుచున్ దిగా
తటములు వ్రీలనార్చుచు నుదాత్తపరాక్రమవిక్రమంబులం
జటులరయోద్ధతిన్ సమరసన్నహనం బొనరించె నత్తఱిన్. 966

గీ॥ పంక్తికంధరుఁ డిమ్మెయి బహువిశాల, వాహినీసమేతంబుగఁ బ్రధనమునకుఁ
దాను సన్నద్ధుఁడై చనుతఱిఁ దన సతి, యైన మందోదరికి నిట్టులనుచుఁ దెలిపె 967

శా॥ 'ఓరామామణి! విన్ము! నీకిదె మదీయోద్దేశముం దెల్పెదన్
శ్రీరామున్ మఱివానిసోదరుని దత్సేనాసమూహంబుసుం
గ్రూరాస్త్రంబులఁగూల్చునొండెను రఘుక్ష్మోణీశుచేఁజచ్చి యా
వీరస్వర్గముఁగాంతునొండెఁ బలుకుల్ వేయేల నేఁడాజిలోన్? 968

శా॥ బోటీ! నాతుదివిన్నపంబు వినుమా! భూమీశుఁడౌ రాముఁ బో
రాటంబందు జయింతునా? జయరమారామాలలామంబుతోఁ
బాటున్ జానకినేలుకొందునతిగా భావింప నేనేయిఁకం
జేటుంబొందిన నీవు తక్షణమ యాసీతన్ వధింపం దగున్ 969

కం॥ నీవగ్నిలోఁ బ్రవేశముఁ, గావించి పరంబునందుఁ గలియుము నన్నున్
నావచనంబిది మఱువకు, మోవెలఁది!' యటంచుఁ జెప్పి యుత్సాహముతోన్ 970

రావణుఁడు రాక్షససేనలతో యుద్ధమునకు బయలుదేరుట

కం॥ ఆయసురవిభుఁడు చాపా, ద్యాయుధసన్నద్ధుఁడగుచు నరదంబెక్కెం
బాయక తనవెంటన్దై, తేయభటానీకమరుగుఁదేరం గడిమిన్. 971

సీ॥ ఇబ్బంగి రావణుండెలమియుద్ధార్థియై యరుగుచునుండునా యవసరమున
హయహేషలును దంతిచయఘీంకృతులు భటహుంకృతులుం జాపటంకృతులును
పటహకాహళశంఖపణవభేరీముఖభాంకృతుల్ నింగినిఁ బగులఁజేయ
భయదాట్టహాసనిస్వనబధిరీకృత సర్వదిక్కుంజరశ్రవణుఁడగుచుఁ

గీ॥ బ్రళయకాలాంతకసహస్రభానుసమాన, రౌద్రరసమయాకారనిర్నిద్రచటుల
నిటలతటఘటద్వికటభ్రుకుటితలుఁడయి, నడచె నుత్తరద్వారంబుకడకు నపుడు 972

గీ॥ దశముఖుం డిట్టు లుత్తరద్వారమెలమిఁ, దాఁగడచిపోయి సంగరస్థలముఁ జేరి
చూపఱు తనదు వైభవాటోపమునకుఁ జోద్యమొందఁగఁ గపులను జూచిపలికె. 973

చం॥ 'నిలునిలుఁడింక వానరులు! నింగికినేగిన నేలడాగినన్
జలములయందుఁజొచ్చినను జావదితప్పదు మద్ధనుర్విము
క్తలసదమేయ శాతశరదారుణవహ్నిశిఖావిదగ్ధదే
హులనొనరించి నేడు సమరోర్వినిఁ జంపుదు మిమ్మునందఱన్' 974

కం॥ అని పలికి శరాసారము, వనచరసైన్యములమీదఁ బరగించి కలం
చినవాఁడై ప్రళయఘనా, ఘనమోఘా ఘోరభంగి గర్జించెఁ దగన్. 975

ఉ॥ చండతరోగ్రరావణ నిశాతమహావిశిఖానిలాహతిం
గొండొక సేపులోనఁ బటుఘోరరణాభ్రపథంబదెల్ల ను
ద్దండవనాటసైనికవితానపయోధరశూన్యమౌచు నం
దుండిన రాఘవేంద్రునకు నుల్లమువ్యాకులమొందఁ జేసినన్. 976

ఉ॥ భానుకులేశుఁ డట్లు చెడిపాఱెడుమూకకుఁ జేయివీచి 'యో
వానరులార! యుద్ధమునఁబాఱుట యిమ్మెయి వీరధర్మమే?
పూనుడు ధైర్యముం బగఱఁ బోరవధింపుడు! నొంపు దంచితం
బైనయశంబు మీరుగనుఁ డంద' అటంచువచింప వత్తఱిన్. 977

శా॥ శ్రీరామప్రభువీరబోధ తమకుం జిత్తంబునన్ ధైర్యమున్
వీరావేశముఁ గల్గజేయుటయు దోర్వీర్యాధికుల్ వానరుల్
ధీరోదాత్తతఁ బేర్చియార్చి మఱలన్ దేవద్విషత్సేనతో
ఘోరప్రక్రియఁదాకి భూరుహశిలాకోటుల్ ప్రవర్తించినన్. 978

## వానరరాక్షససైన్యములకు ఘోరసంగ్రామము జరుగుట

ఉ॥ అప్పుడు రావణానుచరులంచలు నొక్కటఁగూడి యార్చుచుం
దప్పకతారునుం గపులఁదాకిన నయ్యిరువాగుసేనకున్
గొప్పరణంబుకల్గె సురకోటికమంగొని యక్కజంపడం
గుప్పలుగా ధరాస్థలినిఁగూలిరి పెక్కురు వారువీరునున్ 979

ఉ॥ ఒక్కొకసారి వృక్షచరు లుగ్రరణాంగణమందు మేటిబల్
రక్కసిమూకకోల్తలకుఁ ద్రాసితులై కడులొంగిపోదు రిం
కొక్కొకతూరి రాత్రిచరు లుద్ధతవానరసైనికాళిచే
ద్రుక్కుచు వీతధైర్యులయి రూఢిగలొంగుచునుంద్రు తాముమన్. 980

మ॥ దనుజౌఘంబులు కాలమేఘములచందానన్ మహోగ్రంబుగా
ఘనశాతాశుగవృష్టినిం గురిసినన్ క్ష్మాభృన్నిభస్థైర్యలాం
ఛనులై యాకపులించుకేనిఁ జలియించంబోక తాఁకింగడుం
గినుకన్ వైరులపైనవైతురు ద్రుమానీకంబు లద్రుల్ శిలల్. 981

మ॥ ఘనవృక్షాద్రిశిలాప్రహారములకుం గాండప్రకాండాద్యనే
కనిశాతాస్త్రమహాభిఘాతములకున్ గాఢక్షతాకీర్ణమై
తనుఖండంబులు గూలుచుండినను రక్తంబేఱులై పాఱుచుం
డిన లెక్కింపక పోరి రాదనుజులుం గీశల్ ప్రచండంబుగన్. 982

ఉ॥ కూలెడుయోధులంగనుచు గొంకకజంకక శోణితంపుఁ బెం
గాలువలందుఁ దోఁగుచును గ్రచ్చఱఁ బీనుఁగులమీదఁద్రొక్కికొం
చాలమొనర్తు రత్యధికులైన వనాటనిశాటవీరులా
వేలుపుమూక వారివనవిక్రమసంపద కద్భుతంపడన్. 983

సీ॥ బాకులు బల్లెముల్ ప్రాసంబులాదిగాఁగల రణసాధనంబుల ధరించి
పొడిచియు నడఁచియుఁ బూర్వామరులు కపివీరులఁ గలఁచిన వామవారి
వ్రేటులకును వారిపోటులకును లెక్కసేయక వృక్షముల్ శిలలుగొనుచుఁ
దాముసు వారినిఁ దఱచుగా మోదియుబాదియుఁ జీకాకుపఱుచుచుండి
ఆ॥ రివ్విధమునఁదాకి యిరువాగుసైన్యముల్, సాహసంబుతోడఁ జాలప్రొద్దు
పటుకచాకచియును జటులబాహాబాహిఁ, బెనఁగి రభ్రచరులు వింతనొంద. 984

ఉ॥ ఒక్కొకదైత్యుతోఁ బదుగురొండెను లేకపదుండ్రతోడఁ దా
మొక్కొకఁడొండెనుం గడఁగి యుద్ధముచేసి నిజప్రతాపముల్
గ్రక్కునవెల్లడించి రిపు వ్రతురు చతురుగాని వెన్నకం
దొక్కరుఁడైన రిత్తచననొల్లరు పో కపివీరు లత్తఱిన్. 985

ఉ॥ చిక్కరుపో సమీకమున సిగ్గఱి తారొకవేళఁ జిక్కిరా
మ్రొక్కరుపో నిశాటపటముఖ్యులకుం గడుదీనభావులై
మ్రొక్కిన యాజిభీరులను ద్రుంపకనొంపక సత్కృపావతిన్
నిక్కము కాచిపుత్తురు వనేచరవీరులు రోషదూరులై. 986

సీ. మఱియు నారణభూమి మర్కటసైనికుల్ తగ నెందుఁజూచినఁ దామెయగుచు
సంచరించుచు దైత్యసముదాయములలోనఁ జొఱఁబడి విక్రమస్ఫురణమెరయఁ
గరులనుదెగటార్చి హరులనుబరిమార్చి రథములఁద్రుంచి సారథులనొంచి
కాలుబలంబులఁ గాలుప్రోలికిఁబంపి హయరథదంతివాహకులఁ జంపి
గీ. పెక్కుతెఱఁగుల నిమ్మెయిరక్కసులను, బలుపురన్ రూపుమాపినఁ బంక్తిముఖుని
సేననొచ్చియుఁ జచ్చియుఁ జేవచెడియు, విచ్చి నలుదిక్కులకుఁ బాఱఁజొచ్చె నపుడు 987

మ. హతశేముల్ ధృతిఁగోలుపోయి తమశస్త్రాస్త్రంబులున్ సైతమున్
నతులై వైరులకప్పగించి రణసన్న్యాసంబునుంబూని బా
ధితులై చూపఱు గేలిసేయఁగ 'నమస్తే' యంచుఁ బ్రార్థించి తా
మతిభీతింబఱతెంచి వేగ శరణంబర్థించి రారావణున్ 988

గీ. ఇట్లు భయపడి రాక్షసులెల్లఁ దనదు, మఱుఁగుఁజొచ్చిన ధైర్యమ్ము మఱికఱపుచు
దశముఖుం డప్పు డాగ్రహోదగ్రుఁడగుచుఁ, దలపడియెఁదాను రామునిదండతోడ989

మ. పరివారంబులు వెండి రావణునితోఁబాటుం బ్రగల్భోరువా
గ్వరివర్షించుచుఁ దారుసంగవులతో సంగ్రామముంజేయఁజొ
చ్చిరి యాతుచ్ఛుల కెన్నిసారులనిలోఁ జేటొందినంగాని సం
గరవైముఖ్యముఁబూన రించుకయుసిగ్గా? యెగ్గ? యవ్వారికిన్. 990

ఉ. న్యాయముపట్లనే విజయమందెడునన్న బుధోక్తి యాపశు
ప్రాయులు దుష్టచిత్తులగు రక్కసిమూక లెఱుంగనేర్తురే?
న్యాయవిదూరులై పశుబలాదులనమ్మి రణంబుసల్పి వా
రాయువుఁగోలుపోదురు యథార్థమ! యెంతటిశూరులైననున్ 991

ఉ. సేనయుఁదాను నిట్లు కపిసేననుఁదాకి మహోగ్రభంగి నా
నానిశితాస్త్రవృష్టిని ననంతముగానిగిడించుచుం బటు
ధ్వానముతోడి మేటిజలదంబనఁ బంక్తిముఖుండు ఘోరగ
ర్జానినదంబులన్ సలుపసాగె దిశావలయంబు భేదిలన్. 992

కం. ఆరావణుండు తనపరి, వారములుందాను వేయ బాణౌఘంబుల్
క్రూరత వోనాటినఁ గడుఁ, జీరికినింగొనక ప్లవగసేనలు కడిమిన్. 993

మ॥ తరుశైలాదులఁగొంచుఁ బంక్తివదనుం దత్సేనలం గీశుల
త్యురుకోపంబున మొత్తుచుండుటయు నాయుగ్రాసురానీకముల్
శిరముల్ వ్రీలియుఁ బాదముల్ తునిసియుం జేతుల్ కడుం ద్రెస్సియుం
దరువుల్ గూలినయట్లు కూలిరి భుజాదర్పంబుఁ గోల్పోవుచున్. 994

ఉ॥ రక్కసులిమ్మెయిన్ వనచరప్రకరంబులకోడిపోయి తా
రిక్కఱి నాల్గుదిక్కులకు నొయ్యనఁ బాఱెడువారునుం గడున్
గ్రక్కునఁ గాలుపీటికి దిరంబుగనేగెడువారుమన్ మదిన్
స్రుక్కి దశాననున్ మఱుఁగుఁజొచ్చెడువారును నైకలంగినన్ 995

మ॥ నిజసైన్యంబులు దైన్యమొందుటయునున్ వీక్షించి దైత్యేంద్రుఁ డా
భుజగేంద్రుండుబలె మిక్కిలిం గసలుచుం బుంఖానుపుంఖంబుగాఁ
ద్రిజగద్భీకరలీల శాతశరముల్ తీవ్రంబుగా నాకపి
వ్రజముల్ నొవ్వఁగనేయసాగెఁ బటుశౌర్యప్రాభవోద్దండుఁడై. 996

శా॥ ఆనక్తంచరనాథుఁడేయు ఘనశాతాస్త్రంబు లాత్మాంగముల్
నోనాటం గడులెక్క సేయక మహానూనప్రతాపంబునన్
నానావృక్షశిలాప్రహారములచే నాకారినిన్ వానరుల్
వేనొప్పించుచుఁ బోరసాగి రమరుల్ వేనోళ్ల శ్లాఘింపఁగన్ 997

సీ॥ మఱియు సుషేణుండు మారుతసూనుండు గజుడు గవాక్షుఁ డంగదుఁడు గదుఁడు
శరభుండు శతబలి జాంబవంతుండును బనసుండు గంధమాదనుఁడు నీలుఁ
డానలుండాదిగా వానరముఖ్యనాయకులు శిలాతరుహస్తులగుచుఁ
జెలరేగి దానవసేనయందలి మహానాయకులనుమోది నామమడఁచి

గీ॥ మదగజముపైకి సింగపుంగొదమలట్లు, దశముఖునిమీద లంఘించి తచ్ఛిరంబు
లవియఁగా బాది మిక్కిలి నవయఁజేసి, యార్చిపేర్చిరి దిశలెల్ల నద్రిప్రీల. 998

## రావణుఁడు కపిసేనలపై విజృంభించి పోరాడుట

సీ॥ విపులరౌద్రాకృతిఁ ద్రిపురసంహారంబుగావింప సిద్ధమైపోవువేళఁ
గల్పాంతమున జీవగణము నొకేతూరి నంతంబుసేయంగ నరుగువేళఁ
గులపర్వతంబుల గురుపక్షయుగళంబు ఖండింపఁ బగఁబట్టి కదలువేళఁ
దారకాసురవిమర్దన మహాకార్యదీక్షాపరతంత్రతఁ జనెడువేళ

గీ॥ శంకరునిభాతి జమురీతి శక్రుమాడ్కిఁ, గార్తికేయునిపోలిక గరముఁ గినిసి
ఘనతరైకవీరావేశకలితుఁడగుచు, దశముఖుండగుపించె నాతరుణమందు. 999

గీ॥ భీకరాకారుఁడై యిట్లు భీకరగతి, నందఱకు నన్నిరూపులై యసురనాథుఁ
డస్త్రములు ప్రయోగించుచు నాత్మరక్ష, వైరిశిక్ష విధిగనెంచి పోరసాగె. 1000

మ॥ పరిఘంబున్ ముసలంబు శక్తి గదయుం బ్రాసంబు శూలంబు ము
ద్గరముం దోమరముం బరశ్వధమునున్ ఖడ్గాది సర్వాయుధో
త్కరముల్ గైకొని మొత్తె భల్లుకపతిం దారేయు నీలున్ నలున్
శరభున్ గోముఖు గంధమాదను గజున్ సామీరి మైందాదులన్. 1001

మ॥ మఱియున్ రావణుఁ డస్త్రపంక్తులు నభోమార్గంబునుం గప్పఁగాఁ
దఱచుం జీకటులావరించుటయునుం దారొండొరుం గానకం
దఱు కీశుల్ వికలాత్ములై రయమునన్ ధాత్రీధవున్ రామునిన్
మఱుఁగుంజొచ్చిరి 'కావవే రఘుపతీ! మాంపాహి' యం చత్తఱిన్. 1002

చం॥ క్షతములఁ బెల్లుగాఁదొరఁగు సాంద్రతరారుణరక్తపూర మ
ద్భుతముగ మేనలందడుప ఘూరితనుశ్రమచేత నమ్మెయిన్
ధృతిచెడి యాత్మసన్నిధికి దీనతదోపఁగ వచ్చినట్టి గీ
శతతులఁగాంచి భూవరుఁడు చాలఁగృపామతి వానికిట్లనున్ 1003

కం॥ 'అఁసినవారలు మీరిఁక, వఁదు రణముసేయఁ గొంతవడి విశ్రాంతిన్
బలిముఖులార! కొనుండిదె, తిలకింపుడు రావణుండు త్రెళ్లను నాచేన్'. 1004

కం॥ అనిపలికి వానరులకున్, పినీతిపోపంగనపుడు విశ్రాంతినొసం
గినవాడై శ్రీరాముఁడు, దనుజాధిపుతోడ సమరతత్పరమతియై. 1005

## రామరావణులపరస్పరసంవాదము

కం॥ దశముఖునకు నభిముఖుఁడై, దశరథనందనుఁడు నడచెఁ దక్షిణమ ధను
ర్విశిఖంబులుకొని తన్నుం, బశుపతిముఖ్యులు కరంబుఁ బ్రస్తుతిసేయన్. 1006

మ॥ అల రామావనినాథు నక్షయమహోద్యత్తూణవల్మీకమం
దలి ఘోరాస్త్రపరంపరాహితతులా దైత్యేశజీవానిలం
బుల భక్షింపఁ దిమంతవెల్వడువిధంబో నా బహిర్గోచరం
బులుకాఁజొచ్చెను దన్ముఖాగ్రము లరివ్యూహంబు భీతిల్లఁగన్ 1007

గీ॥ ఇట్లు కట్టాయితంబయి యినకులుండు, రావణునికట్టెదుటనిల్చి ప్రావృడంబు
దంబుకైవడి సింహనాదంబుచేసి, తానుబలికెను సమయోచితముగ నపుడు. 1008

కం॥ 'ఓరావణ! నీవిఁక నా, బారింబడి బ్రమకవశమె? పాటకు మనిలో
రారమ్ము! మచ్చరానల, ఘోరశిఖావగ్ధుఁజేసి కూల్తును ద్రుటిలోన్. 1009

కం॥ సమరమునల్పినల్పి జవసత్త్వములన్నియుఁ గోలుపోయి తా
రమితముగా శ్రమించిన వనాటభటాళినిగెల్చు టొక్కమే
టిమగతనంబె? యయ్యది కడిందిజయంబగునేతలంప? వి
క్రమమున నన్నుగెల్వు! మొనగాడవెయోదువయేని రావణా!.

ఉ॥ నాతోయుద్ధమొనర్పఁగ, భీతిల్లితివేని నిపుడ వేవేగ ధరా
జాతనొసఁగి శరణమిఁక, గాతునవశ్యంబు పంక్తికంధర! నిన్నున్ 1011

॥ వారినివీరినిన్ గెలువవచ్చు రణాంగణమందుఁ గాని దు
ర్వారమదీయశాతఘనబాణపరంపర వెల్లిఁగొల్పి ని
న్నారయమూంచి నొంచి తెగటార్పకమానను సర్వభంగులన్
ధారుణిదూరినన్ దెసలదాగిన నాకసమందుఁజొచ్చినన్. 1012

॥ సీతాపహరణదోషము, పాతకి! నినుఁగుడుపనీకవదలదు సుమ్మీ!
నీతొల్లిఁటి దుర్మార్గపుఁ, జేతలు కొనసాగవింకఁ జిక్కితి నాచేన్'. 1013

॥ అనవుఁడు రావణుండనియె నారఘురామునితోడ 'భూపనం
దన! విను! మత్పరాక్రమము త్వద్భుజవిక్రమమున్ రణాంగణం
బునఁ ద్రుటికాలమందె పరిపూర్ణముగాఁ దెలియంగవచ్చు! రా!
మనమునశంకవీడి పలుమాటలుపల్కిన లాభమేమొకో? 1014

। మాటలకేమొకొ! కోటలు, దాటఁగమాటాడవచ్చు దానికిఁదగఁగం
బోటుసకునిలిచినంగద, మేటివనందగును మీదుమిక్కిలి నిన్నున్. 1015

సీతోఁ బోరొనరింపనెంచి బలిమిన్ సీపత్నినిందెచ్చితిన్
నాతిం గ్రమ్మఱ నీకొసంగుటకు మేనంబ్రాణముల్కల్గ నా
చేతంబందున సమ్మతింతునె? నినుం జెండాడుటో! లేకనీ
చేతన్ నేనువధింపఁగాబడుటయో సిద్ధంబు యుద్ధంబునన్. 1016

నిను శరణంబువేడఁ గడునీచతముండు విభీషణుండుకా
డనిమిషకోటులన్ బవరమందుజయించి యశంబుఁగొన్న య
క్కనుపమశౌర్యధైర్యమహిమాన్వితుఁడైన దశాననుండను
మ్మినకులనాథ! చక్కనిలు మించుకసేపు వధించివేయుదున్. 1017

వెఱవను దిగధీశులకున్, వెఱవను సురసిద్ధసాధ్యవిహగాదులకున్
వెఱవను విద్యాధరులకు, వెఱవను యక్షోరగులకు వెఱతునె నీకున్? 1018

ఉ॥ ఉన్నదినీకు నొక్కతల యున్నవినాకుఁ దలల్పదేసి నీ
కున్నవి రెండుబాహువులె యున్నవిహస్తములిర్వదేసి నా
కెన్నఁగ వానరుల్ నరులువెంతవధించెద మిమ్మునందఱం
బన్నుగమానివుల్ మనుజభక్షకులౌ దనుజాళికుద్ధియే?. 1019

చం॥ అవనిప! యుద్ధమందున జయాపజయంబుల నిర్ణయింప నీ
వెవఁడవు? నాదొనీదె జయ మెల్లను గంగనువచ్చు ముందుగన్?
బవరమునందు నాయెదుటఁ బాలకనిల్వుము! నీక తెల్లమౌ
నెవరికినైనఁగాని దిగకెమ్మెయిలోతెఱుఁగంగనౌ నదిన్?. 1020

కం॥ వగవ బహుసేపలేదని, వగవను నపజయమునకును వగవను మృతికిన్
నగచరుల మిమ్ముఁ జంపుటొ!, జగడములోనేమడియుటొ! సత్యంబధిపా!'. 1021

కం॥ అనిపంక్తికంధరుం డా, ఘనుఁడగు నాపంక్తిరథుని గాదిలిసుతుతోఁ
దసివాక్శూరత్వంబిటు, ఘనముగ విదితంబుచేసెఁ గడుగర్వమునన్. 1022

శా॥ ఆరాముండును రావణుండిటుల నన్యోన్యంబు నక్రోధులై
వీరాలాపములాడికొంచు ననిగావింపం బ్రయత్నంబుతోఁ
దారున్నంతఁ దదీయయుద్ధముఁ దగన్ దర్శించఁపొంటెన్ సురల్
తారాధ్వంబున నిల్చియుండిరి ప్రమోదంబాత్మలన్ నిండఁగన్, 1023

ఆ॥ 'పాదచారియగుచుఁ బంక్తిముఖునితోడఁ, దగవుగాదుపోరఁ దన' కటంచు
రామవిభున కమరరాజప్పుడొక దివ్య, రథముఁ దానుబంపెఁ బ్రథితమగను. 1024

కం॥ మాతలిసారథికంబగు, నాతేరపుతధిపుచెంత కరుదెంచె ద్విష .
చ్చేతోభయజనకంబును, ఖ్యాతలపతిహర్షదాయకంబును నగుచున్. 1025

గీ॥ ఇట్లుమాతలి రథముతోనేగుదెంచి, రామునకు నమస్కారపురస్సరముగ
వినయసంభ్రమయుక్తుఁడై విన్నవించెఁ, బ్రాకటంబుగ మృదువచోరచన దోప 1026

కం॥ 'రథహీనులరగు మీకలు, రథస్థుఁడైయున్నయట్టి రావణుతోడం
బ్రథనంబుసేయ నోఁ॥శ, రథసుత! తగ' దనుచు దివిజరాజు ప్రియమునన్. 1027

కం॥ పంపెను దమకీరథమును, బెంపొప్పఁగ దీనినెక్కి విబుధవిరోధిం
జంపుడు! సదృశమును బ్రా, కింపు' డనుచు నతఁడు విన్నవించుటయు వెసన్. 1028

కం॥ ఆమాతలిచెప్పినటుల్, తామదినంగీకరించి తద్రథమునకున్
వేమమున భానువంశ, స్వామిప్రదక్షిణము భక్తిసలిపినవాడై. 1029

శా॥ ఆరోహించెను రామచంద్రుఁడు సహస్రార్క ప్రతీకాశశో
భారమ్యంబును భూరిరత్నఖచితప్రఖ్యాతముం గింకిణీ
వారాభీలరవాభిసంకలితమున్ భాస్వత్సువర్ణాంచితా
కారంబున్ బహుసుందరంబగు శతాంగంబున్ ముదంబొప్పఁగన్. 1030

## రామరావణుల యుద్ధము

సీ॥ ఇట్లు రథంబెక్కి యింద్రారి నారాముఁ 'డిదెకాచికొ' మ్మని హెచ్చరించి
తండోపతండముల్ చండకాండంబుల నోనాటవేసిన దానవపతి
కరముఁగ్రుద్ధుండయి శరతతిఁదానును బరగింపసాగెను భార్గవపయి
వారిపరస్పరాంబకము లంతరమున నొండొంటితోఁదాకి మండునవియు
గీ॥ వర్మములఁజించి తద్ఘనవక్షములను, గాఢభేదించునవియును ఖండితంబు
లగునవియు సంధులన్ దూరియరుగునవియు, నైమహాఘోరశరయుద్ధ మపుడుజరిగె 1031

సీ॥ ఆగ్నేయశరమును నరివోసి రావణుం డినకులేశ్వరుపైన వేసె నేయ
జలబాణమునఁజేసి చయ్యనదానిని నడుమన చల్లార్చి నరవరుండు
వాయవ్యవిశిఖమా పంక్తిముఖునిమీదఁ దానుబ్రయోగింప దానినసురుఁ
డహిమార్గణంబుచే నరయమాయించె చానివిగారుడంబుచే నృపుఁడడంచె
గీ॥ రామరావణులిట్లు శరప్రతిశర, ములఁ బ్రయోగించుకొనుచును బోరుసలిపి
రొకరికొక్కరులొంగక యుగ్రభంగిఁ, జాలతడవు నిలింపులు సంస్తుతింప. 1032

కం॥ 'ఆమాతలి సారథియట!, రాముఁడు రథికుఁడఁట! యింక రావణుఁ డనిలోఁ
దామనుట దుర్లభం' బని, వేమరు తలపోసిరపుడు వేల్పులు మింటన్ 1033

ఉ॥ రాముఁడు రావణుండు సమరంబొనరించుచునుండఁ దొల్లి సు
త్రాముఁడు వృత్రుఁడున్ గుహుఁడుతారకుఁడున్ శివుఁడంధకుండునున్
భీమపరాక్రమంబెసఁగఁ బెద్దగఁబోరినయట్లుతోచె న
చ్చోమతి చూచుచూపఱకుఁ జోద్యముఁగూర్పఁగ నత్తఱిందగన్. 1034

ఉ॥ ఇద్దఱివర్మముల్చినిగె నిగ్గతిమేనులనాటెఁదూపు ల
య్యిద్దఱిమర్మముల్కలఁగె నిద్దఱురక్తములోనఁదోఁగి ర
య్యిద్దఱుమూర్ఛలన్మునిఁగి రిద్దఱునున్క్షతులైరి కానియ
య్యిద్దఱునీడఁబోక కలహింపఁదొడంగిరి విక్రమంబునన్ 1035

కం॥ వారి రథచిత్రగతులకు, వారి మహాస్త్రప్రయోగబహుకుశలతకున్
వారి బలశౌర్యములకున్, సారసభవముఖ్యదేవసమితి నుతించెన్. 1036

కం॥ ఇద్దఱి ధనుర్గుణధ్వను, లిద్దఱి రథనేమిరవము లిద్దఱి యార్పుల్
బ్రద్దలుగఁజేయసెంబర, 'మద్దిర' యనిపొగడఁ బోరి రాయిద్దఱునున్. 1037

కం॥ ఇరువాగుసేనలప్పుడు, సరభసగతిఁ దారుగడఁగి శౌర్యంబొప్పన్
దురమొనరింపఁగఁజొచ్చిరి, పరస్పరవిజయధనైకవాంఛారతిమై 1038

ఉ॥ అంత రఘూద్వహుండు చటులార్కనిభంబగు భార్గవాస్త్రముం
బంతముతోడఁ దాఁగరము బాగుగలక్ష్యము చూచి యేసి య
త్యంతరయంబునందునిమె నాదశకంఠు దశోత్తమాంగముల్
వింతగఁ దచ్చిరంబులుడుపీధికినేగె దరస్మితంబుతోన్ 1039

ఉ॥ గ్రక్కున వెండియున్ మొలిచి కానఁగనయ్యె సురారిశీర్షముల్
మిక్కిలిచోద్యమంది యొకమేటిశరంబరివోసియేసి యా
రక్కసితేలిపెందలలు రాముఁడువ్రేల్మిడిఁదున్మెఁ దున్మినన్
గ్రుక్కక రావణుండు పొడసూపె శిరంబులతోడఁ గ్రమ్మఱన్. 1040

మ॥ శితభల్లంబులచే శిరంబులఁ బలెన్‌ఛేదించె నాదైత్యువిం
శతిబాహుల్ పటువిక్రమంబెసఁగ రామక్ష్మాధవుండప్పు డ
ద్భుతభంగిం బొడసూపెవెండియుఁ గరంబుల్‌సైతమున్ దానికిన్
క్షితినాథుండు మతింతవింతపడియెం జితాంబుజాతంబునన్. 1041

చం॥ జగదధినేత రాముఁడిటు శాతశరంబులవేసి త్రుంచుచో
జగతిపయిం గపిత్థఫలసంచయముంబలెఁ ద్రెళ్లునవ్వి పై
కెగసెడునవ్వియుంగలిగి యెందునుజూచిన సందులేకభూ
గగనములున్ శిరోమయముఁగాఁగను దోచెను జూచువారికిన్ 1042

లయగ్రాహి॥ అసురవిరోధితల లీసునరఘూత్తముఁడు భాసురశితాస్త్రములనేసి వెసఁద్రుంపన్
రాసులుగభూమిపయి వాసిచెడికూలునవి వాసవనిభుండయిన రాసుతునిమీదన్
రోసమిను దెల్పు చపుడాసురపథంబునకు వేసముదయంబగుచు హాసములతోడన్
వాసమొనరింపఁజను నాసరణినేగునవియై సురలకద్భుతముఁ ద్రాసమును గొల్పెన్. 1043

కం॥ ఆరాముఁడు ఖండించిన, నారావణుతలలుచేతు లంబరమునకున్
బారులుగనెగయుచునుండెను, నారయఁ జోద్యంబుగాఁగ నాతరుణమునన్. 1044

మ॥ విపులానాథుఁడు రామచంద్రుఁడు కడున్ వేడ్కన్ నభోలక్ష్మికిన్
విపులాలక్ష్మికిఁ దుల్యగౌరవముఁ జూపింపంగగాఁబోలుఁ దా
నపుడుత్కృష్టములైన రావణశిరోహస్తాలు హారాలుగా
నుపహారంబులొసంగెఁ బూర్ణములుగా నుత్కంఠదీపింపఁగన్ 1045

చం॥ మఱియు సమిద్ధ్వవాహఘనమందిరరాజ మలంకరించిస
ట్లఱిముఱి దైత్యమూర్ధసముదంచితతోరణపంక్తు లెల్లెడం
దఱచుగ నిర్మితంబులయి తద్దయుఁదెల్పుచు నొప్పె రాముఁడ
త్తఱి విజయైకలక్ష్మిని ముదంబునఁ దానువరించెనో యనన్. 1046

ఉ॥ అప్పుడు భూతపంక్తులు తదద్భుతసంగరరంగమందునం
దప్పకచేరి రక్తమున్ద్రాగుచు మాంసముఁదించు మత్తతన్
గొప్పగ హస్తతాళములుకొట్టుచు రామజయైకగీతముల్
మెప్పుగఁబాడియాడిరి సమిద్ధదశాననశీర్షహారులై 1047

మ॥ ఘనుఁడారాఘవుఁ డెన్నితూరులనిలో ఖండించినన్ వెండి త
ద్ఘనశీర్షంబులు హస్తముల్ మొలుచుచుం గాన్పించినన్ నెమ్మనం
బున భూరిశ్రమదోప నుస్సురనుచున్ భూమీశ్వరుం డా దశా
స్యుని తమ్ముండగు నావిభీషణునితో నొప్పారఁగా నిట్లనున్ 1048

కం॥ 'వినుమయ్య! యోవిభీషణ!, తునుమాడెడుకొలఁదిఁ దలలుఁ దోర్తోఁ గరముల్
ఘనముగ మొలిచెడుమఱలం, గననియ్యది యేమిమాయగానగునొక్కో?. 1049

ఉ॥ ఏమితపంబుచేసి యితఁ డిట్టిమహాద్భుతశక్తిఁబొందెనో
రాముని! లేకయుండినను దథ్యముగాఁ గరముల్శిరంబులున్
వేమరు లిట్లుపుట్టుటలు వింతగనున్నది! వీనినింక సం
గ్రామమునందుఁ జంపుట భరంబయితోఁచెడు నాకు నిత్తఱిన్ 1050

సీ॥ భీకరబలుఁడైన యాకబంధునిఁబట్టి యేపుమీరఁగ వధియించునాడు
దుర్వారపటుశౌర్యధుర్యులయిన ఖరదూషణులను నాజిఁ దునుమునాడు
మేటిమగలకెల్ల మేటిమగండైన కుంభకర్ణుని ధరఁ గూల్చునాడు
హరిహరాదులకైన వనిలోననోడని మూలబలముఁ బడమోదునాడు
గీ॥ మఱియు వీరాధివీరులౌ మానవాశ, నులను బెక్కండ్రవధమును సలుపునాడు
నిట్టిశ్రమమును బొందలే దేమిచెప్ప?, వారికంటెబలాఢ్యుఁ డీపంక్తిముఖుఁడు 1051

చం॥ వికలుఁడుకాడు భీతియును విహ్వలభావముఁ బొందఁబోఁడు! మ
త్ప్రకటనిశాతమార్గణపరంపర మేనున నుచ్చిపోవ నిం
చుకయును స్రుక్కఁ డచ్చముగ నొప్పియు డప్పియుఁ గల్గినట్లు లే
దిఁక దశకంఠునిం దునుమ నెద్దియుపాయమొ? తోఁచ దేమియున్' 1052
కం॥ అని యీవిధమున రాముఁడు, తనతోఁ జింతించిపలుకఁ దత్సమయమునన్
మనుఁడు విభీషణుఁడిట్లని, వినిపించె దశాస్యుమరణవిధ మంతయునున్ 1053

## విభీషణుఁడు రావణుని మరణరహస్యమును రామునకుఁ దెలుపుట

చం॥ 'నలువవరంబుచేత నరనాయక! రావణు నాభియందునుం
గలదమృతంబుచూవె! యదికల్గుటఁజేసి మృతుండుగాడు వీ
డలఘుశితాస్త్రఖండితములయ్యును గ్రమ్మఱ నక్కణంబుగా
మొలుచుచునుండు వీనికరముల్ శిరముల్ వినుఁ డట్టుగావునన్. 1054
ఉ॥ తావకపావకాస్త్రమునఁ దన్మహితోదరభేదనంబు రా
మావనినాథ! చేయుమిఁక నప్పుడు దానవచేసి యంతయున్
భూవిదితంబుగాఁ గరగిపోవు సుధామయభాండ మంతతో
దేవవిరోధి తాఁమడియుఁ దెల్లముగా బలదర్పహీనుఁడై. 1055
చం॥ అదియటులుండె నాభిగతమౌ సుధయెల్ల నదృశ్యమై చనం
బదపడియున్ దశాననుని బాహువులున్ దశమూర్ధముల్ దగన్
మొదలిటియట్ల చోద్యముగ పుట్టుచునుండుఁ దలంప నూటతొ
మ్మిదియగుతూర్లు త్రుంపఁదగు మేటినిశాటుని చేతులుందలల్. 1056
కం॥ ఆపిమ్మట నొకశీర్షము, దోపఁగ బాహుద్వయంబుతోఁ బొడసూపుం
బాపాత్ముండగు రావణు, నేపునబ్రహ్మాస్త్రమేసి యిలఁగూల్పఁదగున్' 1057
మ॥ అని యిబ్బంగి విభీషణుం డసురవంశాధీశమర్మంబుఁ దె
ల్పిన నాలించి రఘూద్వహుం డపుడు తావింటన్ వెసంగూర్చియె
పెను దుర్వారమహానలాస్త్రమును నక్షీణప్రతాపంబునం
గని ముల్లోకములెల్ల బెగ్గడిల వీకన్ మంత్రపూర్వంబుగన్ 1058
ఉ॥ ఆయనలాస్త్రమంతఁ జటులార్కసహస్రసమప్రచండతే
జోయుతమౌచుఁ బిడుగులె జాడ్కులకున్ మిఱుమిట్లుగొల్పుచుం
బాయక మింటమంటగమిపర్వఁ జటచ్చటయన్రవంబుతో
వాయుసమానవేగమున వచ్చె దశాననుమీది కుద్ధతిన్ 1059

కం॥ ఈకరణిన్ వచ్చి మహా, భీకరపావకశరంబు విబుధారివరుం
దాకి తదీయోదరము ను, వీకన్‌భేదించె దనుజవీరులు బెగడన్ 1060
ఉ॥ అంతఁ దదస్త్రపాతమున నాదశకంఠుని కుక్షిలోపలన్
వింతగ భాండమంతయును వ్రీలినఁ దక్షణ మగ్నికీల ల
త్యంతమునోకఁగా నమృతమాహుతియౌచు నదృశ్యమయ్యె న
శ్రాంతము చండభానుఘనరశ్మికిమాసెడు మంచుచాడ్పునన్, 1061

## రావణుఁడు విభీషణుని దూషించుట

ఉ॥ అప్పడు రావణుండు తనయాత్మగతంబున దైన్యమొందుచుం
'దప్పక నాదుమర్మమును దాయవిభీషణుఁ డిట్లు రాముతోఁ
జెప్పినవాడుకావలయుఁ జేసెడిదేమిఁక? మించిపోయెనే.
చొప్పననైనఁ జచ్చుటయె సుమ్ము! నిజ' మ్మనుచుం దలంచుచున్. 1062
గీ॥ ఆవిభీషణుపై నమితాగ్రహంబు, పొడమ నాతనిఁగని పంక్తిముఖుఁడుపలికె
'వెంతహానిగావించితోరీ! విభీషణ! కులదూషణ! రిపుభూషణా! దురాత్మ! 1063
గీ॥ నానుననుజుండవయ్యును నాదుమర్మ, మధిపుతోఁజెప్పి చంపింప నాత్మఁదలఁతె?
'యింటిలోవాడెపెట్టెరా కంటిలోనఁ, బుడక' యను సామెతకు నిన్నుఁ బోల్పఁదగుర!.
సీ॥ చుట్టంబులొండెను సోదరులొండెను దమలోనఁదమకు వైరములుకలుగఁ
గలహించుకొనువారు కలరనేకులుభువిఁ గ్రమ్మఱఁగొందఱు కలసికొంద్రు
కొందఱు తమలోనఁ బొందొల్లకయె వేఱయుండిన నొకవేళనుందురు మఱి
కాని నీవలెఁ బగవానిపక్షముఁజేరి యాత్మీయులను నిట్టు లదయవృత్తిఁ
గీ॥ గలహమందున జంపింపఁదలఁచునట్టి, నీచు లెందైనఁగలరొకొ నీవుదక్క!
నిజము గృహశత్రుఁడవటంచు నేనెఱుంగ, నైతి గోముఖవ్యాఘ్రంబ వగుదువధమ!1065
శా॥ నాకుం దమ్ముఁడవయ్యునుం గుమతివై నాశత్రుపక్షంబులో
నీకుంజేరఁగఁబాడికాదని తగన్ వేధర్మయుక్తంబుగా
నీకన్ దండితుఁజేయ దానికిఖిదిన్ ద్వేషించి నామర్మమీ
కాకుత్థాన్వయుతోడఁదెల్పి ననుఁ జక్కాడింపఁగా నెంచితే? 1066
ఉ॥ పొంచియెయుండితీవు మఱి పోచిరకాలమునుండి నన్నుఁ జం
పించుసుపాయమొందెఱుఁగమిం దఱినేటికిరాఁగ నీవిధిన్
వంచితుఁజేసి నీదయిన వాంఛితమంతయుఁ దీర్చుకొంటి నీ
మంచితనంబదెక్కడిది మచ్చునకైనను? భ్రాతృహంతకా!. 1067

చం॥ తెలియనివారు నిన్ను భువిఁదెల్విగలాడనియంద్రుగాని నీ
తెలివికరంబుఁ గృత్రిమము తెల్లము దుష్టుఁడవెంతయేని మా
కులమువినాశనంబు మదిఁగోరి యొనర్చితివోరి! దుర్మతీ!
తలఁపఁగ నీవు వధ్యుఁడవుతథ్యముగా నిఁక నిన్నుఁ జంపెదన్. 1068

ఆ॥ కులమువీడి తాను దొలఁగిపోవుటకద్దు!, కులముఁజెఱుచువాడు ఘోరపాపి
కాన వంశనాశకారివై చనునిన్నుఁ, జంపికులము రక్షసలుపువాడ' 1069

చం॥ అని పరుషోక్తులాడెడు దశాననుఁగన్గొని శాంతభావుఁడై
వినయవిభూషణుండగు విభీషణుఁడిట్లను 'నోయి! రావణా!
మనకులమెల్ల నీకరణి గ్రుగ్గుటకుంగలకారణంబు నీ
వ! నను నిదర్శనంబుగను బల్కుట పాడియె? మాను మానుడుల్. 1070

ఉ॥ ఎప్పుడు నీవు బల్మిని మహీతనయం జెఱఁదెచ్చినాడవో
యప్పుడె యన్వయంబుచెడెనంచుఁ దలంపక యిప్పుడిమ్మెయిం
దప్పది వాపయిన్వయిచి దాయ! పదేపదె దూరన్యాయ్యమే?
తప్పికనీదొ! నాదొ! మఱి తప్పకతేలు భవిష్యమందునన్. 1071

శా॥ నీకుందమ్ముఁడనౌట నిక్కువమె! కానీ నీయసద్వర్తనం
బే కాకుత్థ్సవరేణ్యుపక్షమునఁ జేర్పించెన్ భవత్పక్షమున్
నాకారీ! నను మానిపించెను సుమీ! నాతప్పిదంబేమి? యు
ద్రేకింపన్ మఱియేల? దూరఫలమేదీ? తెల్పుమో రావణా!. 1072

చం॥ కులమునవారు దుష్టులను గ్రూరులునేనియు నన్నెనొండెనుం
దలఁపఁగఁ దమ్ముఁనొండెఁ దగవారసుతాదులనొండెఁ బాయుచోఁ
గలుషములేమిఁజెప్పుదురు కావున నిన్ను మహాపరాధివిన్
ఖలునిఁ ద్యజించి యుండితి నకార్యముగామి నెఱింగియే సుమీ! 1073

చం॥ అదియునుఁగాక యగ్రజుఁడవైనను నిందునిమింపఁ బాపమం
టదు నను సుమ్మి! యేలయన న్యాయవిదూరులయేనిఁ దండ్రినొం
డెఁ దనయునొండెనుం దునుమ నేరమిగాదనిరాజధర్మము
న్నదికద? యింకఁదప్పిదము నాదెటులౌనొ? వచింపు రావణా!. 1074

శా॥ ఆదిన్ శ్రీహరిచేత భక్తుఁడగు ప్రహ్లాదుండు చంపింపఁగా
లేదే ధర్మవిదూరుఁడౌజనకునిన్? లేశంబు పాపంబురా
లేదేయాతని? కింక దుష్టు నిసుఁగూల్పింపగ నాకెట్లఘం
బోదైత్యేశ్వర! సంభవింపఁగలదో? యూహింపుమా నీమదిన్ 1075

ఆ॥ సీత నిమ్మటంచు నీతిచెప్పిననన్నుఁ, దగవుమాలి కాలఁదన్నితీవు
దానికోర్వఁదగినుగాని నీచేసిన, పాపకార్యమునకు సైపకేను 1076

గీ॥ మీదుమిక్కిలిఁ బరినుండరాదటంచు, వచ్చిశ్రీరామశరణంబుఁ జొచ్చినాడ
రాముఁడే నాకునిఁకమీద రక్షకుండు, తన్మహాజ్ఞను శిరమునఁదాల్తు నెపుడు. 1077

కం॥ రామునిక్షేమమె విను! నా, క్షేమంబుగఁ దలఁతుఁ గాన చిత్తములోనన్
నీమర్మకర్మములమతి, భూమిజునితోడఁ జెప్పఁబోలదె నాకున్? 1078

ఉ॥ నీవిఁక నన్నుదూరినను నిక్కములాభములేదు నీకు నో
రావణ!దైవమాత్రుఁడగురామునిపక్షమునందుఁ జేరితిం
గావునఁ దద్ధితార్థమగు కర్మముధర్మమె కాకపాపమే?
భావివిమర్శకుల్ దురితభావుగ నన్ననకుంద్రు గావుతన్' 1079

చం॥ అనవిని రావణుండు భయదాహివిధంబునమండి యొక్కశ
క్తినిఁ గదుమంత్రపూర్వముగఁ 'ద్రెళ్లితిపో దురితాత్మ!' యంచుఁ దా
ననుజునిపైనవేయుటయు నయ్యది మంటలుగ్రక్కుకొంచుఁ దీ
ప్తినిగుడఁగన్ విభీషణునిదిక్కునకుం జనుదెంచె సూటిగన్ 1080

గీ॥ అట్లు రావణప్రేరితమైన శక్తి, ఘను విభీషణుజీవమ్ములను హరింపఁ
దీవ్రగతిరాఁగఁ జూచి పృథ్వీవిభుండు, దానిపై శక్తిమంత్రించి తానువిడిచె 1081

కం॥ ఆశక్తిద్వయమపుడా, కాశమునఁ బరస్పరంబుఁ గదునుద్ధతిమై
నాశాచక్రముప్రీల మ, హాశనులటు ధ్వనులెసంగ నతిమతిఁ బోరెన్ 1082

గీ॥ అంతఁ గొంతసేపునకు రామావనీశు, శక్తిచే రావణునిశక్తి నమసిపోయె
దానికెంతయుఁ గోపించి దనుజవిభుఁడు, మనుజవిభుపైని వేయసాగెను శరములు 1083

ఉ॥ మాతలిపైనఁ గొన్నియును మానుగవాజులమీదఁ గొన్నియున్
పీతభయుండు రావణుఁడు విక్రమమొప్పఁగ నొవ్వనేసి తా
శాతశరప్రకాండఘనసాగరమందు రథాన్వితంబుగా
క్ష్మాతలనాథుముంచెఁ బెనుమంచు నగంబును ముంచుకైవడిన్ 1084

కం॥ సురరిపుభీకరసునిశిత, శరశరధినిమగ్నుఁడయ్యెఁ జలియింపక దా
శరథిహరించెను ద్రుటిలో, శరబాడబమునఁ దదీయశరశరనిధిః స్ 1085

కం॥ ఇమ్మెయిఁ బ్రతివీరుని ప్రద, రమ్ముల శ్రీరామవిభుఁడు ప్రతిశరములచే
వమ్మొనరించినవాడై, క్రమ్మఱ నొక మేటిశరము గ్రక్కునఁ గొనుచున్. 1086

ఉ॥ వింటనుగూర్చి రామపృధివీపతి రావణుకంధరంబులన్
బంటుతనంబుదోపఁ గడుబాగుగఁ దాగుఱిచూచివేగఁ బె
న్మంటయుఁబోని మార్గణము మంత్రయుతంబుగనేసి రక్కసుం
దొంటివిధంబునం దలలుద్రుంచిన వెండియుఁబుట్టె నవ్వియున్ 1087

కం॥ పదపడి మఱియొకశరమున, విదితయశుఁడు రాముఁడతని వింశతికరముల్
త్రిదశులుమెచ్చఁగఁ దున్మినఁ, బదిలంబుగ మొలిచెమఱల బాహువులెల్లన్ 1088

చం॥ మొలిచినఁజూచి రాఘవుఁడు భూరిశరంబులనేసి చేతులుం
దలలునుద్రుంచెఁ గ్రమ్మఱను దద్దయువింతగమొల్చె నవ్వియున్
మొలిచినవెల్ల నీకరణి భూపతి తున్మగసాగెఁ దున్మచో
మెలుచుచు నుండసాగెశిరముల్ కరముల్ మఱి తొంటికైవడిన్. 1089

సీ॥ నూటతొమ్మిదిమార్లు మేటిదశాననుచేతులుతలలును జెండివైవఁ
గడపటిసారి తద్ఘనశిరంబులుతెగి హాహారవములతో నవనిఁగూలెఁ
గరములునుం దమకర్తవ్యమంతతో ముగియుట దెలుపుచుఁ బుడమిఁద్రెళ్లెఁ
బదపడి యొకతల బాహులురెండునై పొడసూపి యాపంక్తిముఖుఁడు తాను
గీ॥ జలముడింపక ఘనమేరుశైలమట్లు, సుస్థిరుండయి నిలిచి యార్చుచుఁగడంగి
సాహసోద్రేకములుదోప సరభసగతి, నినకులేశ్వరుగనుఁగొని యిట్లనియె 1090

ఉ॥ 'భూతలనాథ! నాదు కరముల్‌శిరముల్ దెగిపోయినంత నే
భీతిలలేదుసుమ్ము! బలవిక్రమసంపదపోదులె మ్మిఁకం
జేతులురెండునుం దలఁపశీర్షమొకండును నున్నఁజాలు నే
ఖ్యాతిగ నిన్ను నీయనుజు నందఱఁగీశుల రూపుమాపెదన్'. 1091

గీ॥ అని ప్రగల్భోక్తులెన్నేని నాడియాడి, రావణుండంతఁ గోపసంరంభమెసఁగఁ
దానుగడువిజృంభించి యాదాశరథినిఁ దదనుజునిఁ గపులను బాణతతులముంచె 1092

సీ॥ అప్పుడు శ్రీరాముఁడతనిపైగోపించి యొకశరంబునఁ గేతువుర్విఁగూల్చి
మఱియు నెన్మిది శితమార్గణంబులచేత సూతునొవ్వఁగనేసి స్రుక్కఁజేసి
దారుణతరబాణదశకంబుచేఁ దేరిహరులను బటుగతి నదరఁగొట్టి
తత్కరమందలి తతకార్ముకము మేటితూపులురెండేసి తుమురొనర్చి
గీ॥ బహుళసాయకపంక్తులా పంక్తిముఖుని, పైనఁబరగించి క్షతగాత్రుఁ గానొనర్ప
నాక్షణమ యాతఁ డురురక్తమందుఁదోఁగి, మిగుల మూర్ఛితుఁడై తేరిమీఁదఁ బడియె 1093
ఉ॥ దారుణమూర్ఛితుండయిన దానవనాథునిఁజూచి రక్కసుల్
శారపు డాతఁడీల్గెనని తప్పకయెంచి భయార్తులౌచు హా
హారవముల్ బొనర్చిరివనాటులు మిక్కిలిసంతసించి గ
ర్జారవముల్ కడున్ సలుపసాగిరి తత్సమయంబునందునన్. 1094
గీ॥ అంతఁ దత్సూతుఁ డరదంబు నచటినుండి, యెడకుఁ గొంపోవుటయుఁ గొంతవడికిఁదెలిసి
రణతలముపీడి యెడకును రథముఁదోలఁ, దగమిఁ బేర్కొని సూతునిఁ దఱుచుధూరి
కం॥ త్వరితగతి రణముఖంబున, కరదముఁదోలించి మఱల నారామునితో
నురుబలుఁడు రావణుఁడు భీ, కరయుద్ధము చేయసాగెఁ గరముద్ధతుఁడై. 1096
ఉ॥ ఈపగిదిన్ నరేంద్రుఁ డసురేంద్రుఁడు పోరుచునుండ వారిబల్
తూపులు భానుపుల్ వలెనుదోచెను నయ్యుభయుల్ తలంపఁ బూ
ర్వాపరభానులోయనఁగ నారయినొప్పిరి రక్తసిక్తులై
చూపఱుచూచి చిత్తములఁ జోద్యముఁబొందుచునుండ నత్తఱిన్. 1097
సీ॥ ఐంద్ర మాగ్నేయము యామ్యంబు రాక్షసం బావారుణంబు వాయవ్యశరము
కౌబేర మైశాన్య ఘనమార్గణంబులు గారుడంబాదిగాఁ గలమహాస్త్ర
ములుప్రయోగించె నాభూపాలకునిపైన నసురుం డవన్నియు నంతరమునఁ
బ్రతిశరంబులచేత భంజించి శ్రీరాముఁ డసదృశశౌర్యసాహసములొప్ప
గీ॥ ద్విషదభేద్య మమోఘము దివ్యతమము, నైన బ్రహ్మాస్త్రమప్పుడు తానువింటఁ
దొడిగి మంత్రపూర్వకముగవిడిచె దనుజ, లోకభీకరలీలఁ ద్రైలోక్యవిభుఁడు 1098

## శ్రీరాముఁడు రావణుని సంహరించుట

మ॥ హతదైత్యేంద్రుఁడు రామచంద్రుఁ డటుబ్రహ్మాస్త్రప్రయోగంబు చే
యుతఱిన్ భూమివడంకె నాకులగిరివ్యూహంబుక్రుంగెన్ దిశా
తతియల్లాడెఁ బయోనిధుల్కలఁగె దిగ్దంతావళశ్రేణి మ్రొ
గ్గతిలంగూలెఁ జరాచరాశితలఁకెం గంపించె బ్రహ్మాండముల్. 1099

సీ॥ కోటిదివాకరాకుంఠితఘనదుర్నిరీక్ష్య ప్రభాతతిఁ గ్రిందుపఱచి
బహుసహస్రాశనిభైరవాద్భుతకలనమ్బూరితరధ్వానములహసించి
ప్రకటభూమహచమూపతనక్రియాచంపవనము హెూరుజవంబుఁ దెగడి
ప్రళయాంతసముదగ్ర భయదపావకశిఖాసందోహములఁ గడుడిందఁ జేసి
గీ॥ మహితతేజంబును నిరుపమానరవము, పటుతరానంతజవమును బ్రబలశిఖలు
కలిగి బ్రహ్మాస్త్ర మాదశకంఠుదెసకు, సూటిగావచ్చెఁ జూపఱు చోద్యమంద 1100

మ॥ అనివార్యోత్కటధాటివచ్చి యిటు బ్రహ్మాస్త్రంబు దుర్భేద్యమై
మునుదేవాసురముఖ్యులైనను సమిద్భూమిం బ్రభేదింపరా
ని నిశాటాన్వయచక్రవర్తియురమున్ భేదించి తజ్జీవముం
గొని తాఁగ్రమ్మఱ రామునంపహాదియందుంజొచ్చెఁ జోద్యంబుగన్ 1101

గీ॥ ఈవిధంబున లోకవిద్రావణుఁడగు, రావణుఁడు మరణింప భూదేవి మిగులఁ
దాను హర్షించె నిజసుతయైన జాన, కి కడగండ్లన్నియునుదీరె నికఁకపటంచు. 1102

గీ॥ అంతరావణుమృతదేహ మవనిమీద, వింతగాఁద్రెళ్లె నెత్తురువెల్లి మునిఁగి
చండతరవజ్రహతిఁజేసి ఖండితమయి, కూలు తతసమున్నతమహాకుధరమట్లు. 1103

చం॥ కురిసెను పుష్పవృష్టి సురకోటిముదంబున రామచంద్రుపై
మురిసిరి సిద్ధసాధ్యమునిముఖ్యులు రాముజయంబుఁగూర్చి కి
న్నరులును పాడియాడిరి ఘనంబుగ లోకములెల్ల హాయినిం
బొరసె జగద్విరోధి మృతిఁబొందుకంతంబునఁజేసి యత్తఱిన్. 1104

కం॥ ఎప్పుడు రావణుఁ డీల్గెనొ, యప్పుడ హతశేషులైన యమరారిభటుల్
గొప్పగ వెఱచినవారై, తప్పక తారాజివిముఖతను బఱచిరొగిన్. 1105

కం॥ విమలయశుఁడు శ్రీరాముఁడు, సమస్తకపివరులుఁ దాను స్వాంతమ్ముల మో
దముపొదలనుండె నప్పుడు, సమరవిరామైకసుఖము సంధిల్లంగన్. 1106

విభీషణుఁడు రావణుని శవముపైఁబడి శోకించుట

చం॥ అపుడు విభీషణుండు తనయన్నదశాననుఁ డట్లు పోరిపో
నపగతజీవుఁడై పడుటకార్తిజసంపుఁగఁ జేరఁబోయి త
ద్విపులశవంబుపైనొఱగి విహ్వలుఁడై వగనాపలేక తా
నపరిమితంబుగా నిటులనాఘనుఁడేడ్చెను గోడుగోడునన్. 1107

సీ॥ 'రక్షోవధార్థమై రవికులంబున నాదివిష్ణుఁడే రాముఁడై వెలసెనంటిఁ
దద్దేవి శ్రీదేవి కుధినాఁజను సీత బలిమిమైఁ జెఱఁదేరఁ బాపమంటిఁ
గాకుత్థ్సుతోడ నిష్కారణవైరంబుఁ గొనిదెచ్చుకొనుటది కూడదంటి
జానకినిచ్చి భూజానితోసంధిగావింపుము నీవుజీవింతువంటిఁ
గీ॥ గాని నాహితవాక్యముల్ కర్ణములను, జొనుప కిబ్బంగి రాముని సునిశితాస్త్ర
మునకు బలియౌచు విగతజీవుండవైతె?, యకట! రావణ! విధి కసాధ్యంబుకలదె?1108

కం॥ పరవనితను జెఱఁదెచ్చిన, దురితంబది పంటపండి దురమున నిన్నున్
నరవరుఁడను నెపమిడి తాఁ, బరిమార్చెఁ గదన్న! నేడు పంక్తిగ్రీవా! 1109

గీ॥ చందనాగురుచర్చితసుందరమగు, నీదుదేహంబు కటకటా! నేడు రుధిర
పంకిలస్థలమున మున్గవలసివచ్చె, నావిధాతృనిచేత కేమందునింక? 1110

ఉ॥ ఆలమునందు దిక్పతులనందఱగెల్చిననాటి నీమహా
ధీలపరాక్రమంబు పురభేదివసించెడి వెండికొండనున్
లీలయపోలెనెత్తిన చలింపనిలావది మాసిపోవ నే
డాలరిచావు చచ్చితకటా! యెటుసైపఁగనేర్తు? రావణా! 1111

ఉ॥ కన్నులువిచ్చి నాదెసనుగన్గొనుమన్న! త్వదర్థమై మహా
పన్నతనొందు నీయనుజు వత్సలతందగఁ దేర్పవేలొకో?
నిన్ను నృపాలుచేత ననినేఁదునిమించితినంచు నల్గఁబో
కన్న! ననున్క్షమింపుము దశానన! దైత్యచమూభటావనా!'. 1112

కం॥ అని యీపగిది విభీషణుఁ, డనుపమశోకాబ్ధిమునుఁగ నాతరుణమునన్
ఘనుఁడా రామనృపాలుం, డనునయవచనముల నిట్టులనియె నతనితోన్. 1113

శా॥ 'ఓయీ! విన్ము విభీషణా! దశముఖుం డుత్కృష్టబాహాబల
శ్రీయుక్తుం డసమానసాహసమునన్ జేజేలకీర్తింప నా
తోయుద్ధంబొనరించి కీర్తిదిశలందున్ నిల్పి వీరోచిత
న్యాయంబౌ మరణంబునొందె వగవంగానేల నీవిమ్మెయిన్? 1114

గీ॥ తాను దుర్మార్గుఁడయ్యు దశాననుండు, వీరమరణంబునొందెఁ దత్కారణమునఁ
గలతలామలకములయ్యెఁ గదసుగతులు, వగవఁ బనియేమి యితనికై? వరగుణాఢ్య?

కం॥ అని యిమ్మెయి దుఃఖోపశ, మనవాక్యము లెన్నొచెప్పి మానవనాథుం
డనఘు విభీషణు నోదా, ర్చెను దదుపరి భర్తృమరణచింతాకులలై. 1116

కం॥ ఆదశముఖుభార్యలు మం, దోదరిమొదలైనవారు దుఃఖితలగుచున్
రోదనములుగావించుచు, మేదురశవమయమయిన సమిద్భూమికినిన్. 1117

సీ॥ విచ్చేసి రక్తంబువెల్లియై ప్రవహింపఁ దత్ప్రవాహముపైనఁ దఱచుఁదేలు
బహువిధమేదోస్థిపలలఖండములయు ఖండితహస్తాదికమ్ములయును
గూలిన కరిరథ ఘోటకంబులయును రాలినశస్త్రాస్త్రజాలములయు
చూర్ణంబులైపడ్డ సుందరకేయూరహారకిరీటాదులగు విభూష

ఆ॥ ణావళులయు మఱియు నఖిలభూతప్రేత, ములయు కాకగృధ్రములయుతోడఁ
గరము భీకరమయి క్రాలెడునమ్మహా, కదనతలముఁగాంచి కాంతలపుడు 1118

కం॥ తమమనముల వెఱగందుచుఁ, గ్రమముగ బహుదానవులయుఁ గపులయు మృతదే
హములను జూచుచుఁ గడపట, నెమకికనిరి భర్తృశవము నెలఁతుకలెల్లన్. 1119

## మందోదరి మొదలైనస్త్రీలు విలపించుట

గీ॥ చూచి దుఃఖంబుపొంగిరా క్షోణిమీద, వివశలై కూలి రసిచేత విదళితంబు
లవుచుఁద్రెళ్ళెడు కదళీతరువులపగిది, నందఱతివలు తత్సమయంబునందు. 1120

గీ॥ ఇట్లు మూర్ఛిల్లి క్రమ్మఱ నింతులెల్లఁ, దెలిసి నిజనాథశవముపైఁద్రెళ్లి పనవి
పనవియేడ్వంగసాగిరి వక్షములను, బాదుకొనుచును దుఃఖాశ్రువారి కురియ 1121

గీ॥ రావణాసురుపట్టపురాణి పరమ, సాధ్వి మందోదరీదేవి సాంద్రశోక
తప్తయై యిట్లు విలపించెధవునిఁగూర్చి, వేణిచెదర విరులురాల పేరులూడ 1122

ఉ॥ 'దేవుఁడు రాముఁ డంటిని దదీయకళత్రము సీత యిందిరా
దేవిసుమంటి! నామెఁజెఱఁదెచ్చుట హానికరంబటంటిఁ గా
నీ వినవైతి నాడు రజనీచరనాయక! నేడు రాముచే
జీవముఁగోలుపోయితివె చేవయులావుఁదొరంగి యక్కటా?. 1123

ఉ॥ తోలితి వష్టదిక్పతులఁ దోలితి సిద్ధులసాధ్యులాదిగం
దోలితి యక్షకిన్నరులఁ దోలితి సర్వనిలింపకోటినిం
జాలిననాటి నీదుభుజశౌర్యము వమ్మయిపోవ నేడనిం
గూలితె రామభూవిభుని కోలలకున్ బలియౌచు? రావణా! 1124

ఉ॥ మృత్యువు నిన్నుఁజూచినను మిక్కిలిజంకుచునుండుఁగాదె తా
నిత్యము? మృత్యుభీతిఁ గననేరని నింగబళింపనెమ్మెయిన్
మృత్యువుసాహసించె నొకొ? యెంతయుఁ జోద్యముగాఁగఁ దోచె నో
దైత్యకులేంద్ర! కాలగతిఁ దారెవరైనను ద్రోయశక్యమే?. 1125

ఉ॥ నాగతి యెట్లు లక్కటి? యనాథనుజేసి పరంబుఁజేర నీ
వేగుటనాథ! న్యాయ్యమగునే? యెటఁబోదును? నీవియోగమన్
సాగర మేవిధింగడవఁజాలుదునో యిఁక? యుష్మదీయసం
యోగములేని నాదుతనువున్ మఱియేటికిఁ? బ్రాణమేటికిన్?. 1126

ఆ॥ భానుకులునితోడఁ బగఁబూనవలదంటి, సీతనిచ్చి సంధిసేయుమంటిఁ
గాని నాపలుకులు కర్ణముల్ చొరనీక, యిటు చావవలసె నింద్రవైరి!. 1127

ఉ॥ కన్నులువిప్పవేమి? నను గన్గొనవేమి? ప్రియంబు దోపఁగం
దిన్నగఁ బల్కవేమి? మఱి తేర్పవదేమి? మదీయమౌ మహా
పన్నతఁ బాపవేమి? ననుఁ బాసిచనంగను నీకుఁబాడియే?
నిన్నెడఁబాసి భూమిపయి నేనెటులన్ మనియుందునో? పతీ!' 1128

గీ॥ అనుచు శోకించుచున్న యాయమలచరిత, యైన మందోదరీదేవి ననఘయశులు
రాముఁడు విభీషణుండు గౌరవమెసంగ, ననుపయోక్తుల నూరార్చి రట్టియెడల. 1129

## మందోదరి రావణునితో సహగమనము చేయుట

కం॥ తనపతితోడిదెలోకం, బనియున్నలతాంగి యప్పు డాత్మేశునితో
ఘనముగ సహగమనంబును, బొనరింప నిజాంతరంగమునఁ దలపోసెన్. 1130

గీ॥ పిదప శ్రీరాముఁ డాదశవదనుశవము, దహనసంస్కారమొనరింపఁ దగననుజ్ఞ
యిచ్చినన్ విభీషణుఁడు తానచ్చుగఁ జితి, సత్వరంబుగ నిర్మించి సాదరముగ. 1131

కం॥ తన యగ్రజున్మృశవమును, ఘనముగ బహులలితపుష్పగంధాక్షతలన్
వినయవిధి యావిభీషణుఁ, డనుపమలీలఁ గయిసేసి యాసమయమునన్. 1132

గీ॥ ఆ దశగ్రీవు మృతదేహ మావిభీష, ణుండు చితిమీదఁజేర్చె మందోదరియును
ధవుని శవముతోఁబాటును దానును జితి, పైఁబరుండె మహోత్సాహభరితయగుచు.

చం॥ అపుడు విభీషణుండు చితియందనలంబిడ మండఁజొచ్చెఁ ద
ద్విపులశిఖాసమూహముల ప్రేల్మిడిఁ బెన్మిటితోడ దగ్ధమై
కపులును రామలక్ష్మణులు గాటపువిస్మయమొందఁగా నిలిం
పపురికినేగె రావణునిభార్య కడుంగడుమెచ్చ నెల్లరున్. 1134

కం॥ మందోదరిపతిభక్తికి, నందఱుశ్లాఘించి రవ్వ డమరులు మింటం
బొందుగఁ గురిసిరి సతిపై, దుందుడిసుమవృష్టిఁ గరముఁ దారుపొగడుచున్. 1135

చం॥ మఱియు విభీషణుండు గుణమండనుఁడౌ రఘురామునాజ్ఞచే
నఱిముఱి రావణాదులకు నంచితరీతిఁ దిలోదకాదులౌ
తఱచుగ నుత్తరక్రియలు తానొనరించెను నెమ్మనంబునం
దఱకొఱలేక సౌహృదము నాదరముం గనుపట్ట నత్తఱిన్ 1136
చం॥ తదుపరి రామభద్రుఁడు ముదంబున లక్ష్మణుఁజూచి యిట్లనుం
'త్రిదశవిరోధి తానుమరణించె విభీషణునింక లంకకున్
విదితముగా నధీశ్వరుని వేనొనరించుటలెస్స కాన పెం
పొదవఁగఁ దత్ప్రయత్నమిపు డున్నది చేయుటపోలుఁ దమ్ముఁడా! 1137

## విభీషణుని లంకారాజ్యపట్టాభిషేకము

ఉ॥ కాఘన నాయనుజ్ఞఁగొని గ్రక్కునలంకకు నీవిభీషణున్
నీవధినేతగా నిలిపి నెమ్మిమెయిం జనుదెమ్ము! పొమ్మిఁకన్'
నావుడు లక్ష్మణుండు నరనాథుప్రతిజ్ఞను దీర్చపొంటెఁదా
రావణుపీటికేగెఁ గపిరాక్షసనాయకు లేగుఁదేరఁగన్ 1138
ఆ॥ ఇట్లు లంకకేగి యింద్రారినగరుఁ జె, చ్చెఱనలంకరింపఁజేసి సకల
సింధుజలముఁ గపులచేతనుదెప్పించి, యొనర నొక్కశుభముహూర్తమందు 1139
కం॥ రావణుసింహాసనమున, రావణసోదరునినునిచి రమ్యములగు నా
నావిధమంగళవాద్యము, లావహిల రవికులుఁ డతని నభిషేకించెన్ 1140
గీ॥ ఆవిభీషణు నిట్లు లంకాధిపతిగఁ, జేసి లక్ష్మణుఁ డంత నాశీర్వదించె
'రామకీరితి యెందాక భూమినిలుచు, నంతవఱకీవు జీవింతువార్య!' యనుచు. 1141
ఉ॥ అప్పుడు రావణానుజుఁడు హర్షమునెమ్మదిఁ దాండవింపఁగాఁ
దప్పక యాత్మసేవకులుఁ దానును లక్ష్మణువెంటవచ్చి పెం
పొప్పఁగ నాయహస్కరకులోత్తము రామునిఁగాంచి మ్రొక్కుచున్
మెప్పుగనిచ్చె స్వామికి నమేయములైన విభూషణాదులన్ 1142
గీ॥ ఆవిభీషణుఁడిచ్చిన నావిభూష, ణాదికంబులు మాతలి కాదరమునఁ
గానుకగానిచ్చి యాశతక్రతుపురమునన, కతనువీడ్కొల్పె శ్రీరాముఁ డట్టియెడల 1143
ఉ॥ భూతలనాయకుండు రఘుపుంగవుఁ డిట్లు సగౌరవంబుగా
మాతలిఁ దేరుతోడ శతమన్యునివీటికి సాగనంపి తా
వాతతనూజుతో విజయవార్తను సీతకుఁదెల్పి రమ్మనం
బ్రీతిగనేగి యాతఁడు ధరిత్రికుమారికిఁ జెప్పివచ్చినన్. 1144

చం॥ ఇనకులనాథుఁ డిట్లు వచియించె విభీషణుతోడ నత్తఱిన్
'దనుజవరేణ్య! నీవరిగి తామరసేక్షణయైన జానకిన్
ఘనముగ నిందుఁదోడికొని గ్రక్కునరమ్మ సగౌరవంబుగా'
ననవుఁడు నాతఁడానృపుని యాజ్ఞను దాశిరసావహించుచున్. 1145

## విభీషణుఁడు శ్రీరాముని కడకు సీతను దోడ్కొని వచ్చుట

ఆ॥ తాను విజ్ఞులైన దైత్యోత్తములు కొంద, అనుగమింప హర్షితాత్ముఁడగుచు
రావణానుజుండు రయమునఁజని సర, మాదిస్త్రీల కధిపునాజ్ఞఁ దెలిపి. 1146

కం॥ 'మీరిఁకఁ ద్వరితముగ నశో, కారామంబునకునేగి యవనీతనయన్
గౌరవపురస్సరంబుగ, నారయఁగొనితెం' డటంచు నాతఁడు చెప్పన్, 1147

గీ॥ సరమమొదలైనవనిత లాక్షణమెపోయి, భక్తిపూర్వకముగ సీతపాదములకు
వందనశతంబులర్పించి భానువంశ, తిలకుఁడగు రామునాజ్ఞను దెలియఁజేసి 1148

శా॥ అన్నక్తంచరకాంతలప్డు తదీయాజ్ఞాను సారంబుగం
బన్నీటన్ జనకక్షితీశతనయన్ స్నానంబు జేయించియుం
జెన్నారన్ బహుభూషణాంబరములన్ శృంగారముం జేయుచుం
గన్నున్‌దోయికి సీతతారతివలెం గాన్పించెఁ బోనత్తఱిన్. 1149

ఆ॥ ఇట్లలంకరింప నిందీవరాక్షియౌ, సీతనప్పుడొక్క శిబికమీద
నధివసింపఁజేసి యావిభీషణుఁడును, దదనుచరులు వేత్రధారులగుచు 1150

ఆ॥ శిబికచుట్టుఁదాము చేరి బరాబరుల్, సేయుచుండ నపుడు క్షితికుమారి
రామచంద్రుకడకు రయమునవిచ్చెసె, బలిసి దనుజనతులు కొలిచిరాఁగ. 1151

గీ॥ ఎప్పుడాసీతవచ్చునో యెపుడు కమల, పండుపుగఁజూతుమో యని పరమకుతుక
భావులైయున్నయట్టి యాప్లవగులంద, అప్పుడు పరస్పరాహూతు లగుచువచ్చి. 1152

సీ॥ 'ఈసాధ్వికైకదా కౌసల్యకొమరుండు పడరానియిడుమలు పడుటయెల్ల
ఈపతికైకదా యినవంశతిలకుండు మనచేతవెదకింపఁ బనుచుటెల్ల
ఈదేవికైకదా మేదినీరమణుండు కడలికిసేతువుఁ గట్టుటెల్ల
ఈరామకైకదా శ్రీరామచంద్రుండు దురమునరావణుఁ దునుముటెల్ల'
గీ॥ అనుచుఁ దమలోనఁ దాము మాటాడుకొనుచు, నందఱగచరుల్ గుంపులై యరుగుదెంచి
శిబికచుట్టును మూగిరి చిత్రములను, జానకీదర్శనోత్కంఠ సందడింప. 1153

ఉ॥ మేలిముసుంగుమాటునను మేఘముచాటున దాగియున్న యా
బాలశశాంకరేఖయన భాసిలుచుం దనరారునట్టి సీ
తాలలనాశిరోమణినిఁ దారెవరుం గననేర కొండొరుల్
చాలఁగఁ ద్రోసికొంచు మఱి సల్పఁదొడంగిరి ముష్టియుద్ధముల్. 1154

గీ॥ అటు పయోధిఘోషంబునా ననుకరించి, కపిపయోధి ఘోషించుచుఁ గరముఁబొంగి
శిబికచుట్టునువేష్టింప శీఘ్రముగను, వేల్పయై దానినాపి విభీషణుండు. 1155

గీ॥ తానుఁ దనసేవకులు వేత్రతాడితులుగఁ, జేయు చెడఁగల్గఁ ద్రోయుచు సేననెల్ల
గాసినొందించుచుండ నాకమలమిత్ర, వంశ్యుఁ డదిచూచి దానవేశ్వరునకనియె 1156

ఉ॥ 'ఎందులకీప్లవానరుల నిమ్మెయిఁగొట్టెద వేమిచేసిరా?
రిందునిభాస్యఁ జూడఁదగదే? యిదితప్పగునే? తలంప వీ
రందఱుచూడవచ్చు జనకాత్మజమేలిముసుంగుఁదీసి తా
నిందులకందలంబుడిగి యిత్తఱిరమ్మనుమో విభీషణా! 1157

కం॥ ఉత్సవకాలంబుల నా, పత్సమయములందు మఱియుఁ బరిణయమగుచోఁ
దల్పమయములందును యో, షిత్సమితికి మఱుఁగువలదు శిరసుగుణాఢ్యా! 1158

కం॥ అదియట్లుండెను వినుమా!, తదితరసమయంబులందుఁ దరుణులఁజూడం
గఁదగ దిది మహాహవ, ప్రసమగుసమయంబు చూడవచ్చును సీతన్. 1159

కం॥ కావున నీవిఁకగాసిం, గావింపకుమయ్య! కపుల ఖండితరిపులన్'
నావిని విభీషణుండా, క్ష్మావరునానతిని మస్తకంబునఁ దాల్చెన్ 1160

కం॥ అప్పుడు రాముఁడు కపులను, చప్పుకకూర్చుండఁజేసి ధరణీసుతమీ
రొప్పుఁగఁజూడఁ డటంచను, జెప్పెను దదనంతరంబ క్షితినందనయున్. 1161

చం॥ తనవిభునానతిం దనకు దైత్యవిభుండెఱిఁగింప దానినె
మ్మనమున భక్తితోడ నిజమస్తకమందు ధరించినట్టిదై
జనకజయందలంబుడిగి చయ్యన మేలిముసుంగుఁదీసి వ
చ్చెను బతిచెంతకుం బ్లవగసేనలు కన్గొని హర్షమొందఁగన్ 1162

కం॥ వచ్చిన మహీతనూజను, నచ్చుగవీక్షింపనొల్ల కధిపతియుండెన్
పచ్చరితురాలు జానకి, తచ్చేతోవృత్తినెఱిఁగి తప్తమువంతన్. 1163

ఉ॥ అక్కట! నాపయిన్ విభుఁడనాదరభావముచేతఁ బ్రేమపున్
దృక్కులఁజూడనొల్లకయె తేర్పకయే నిరసించెఁ దొంటియా
మక్కువలేమియయ్యెనొకొ! మత్పతి కేనొనరించినట్టి యా
మిక్కిలినేరమేమియొకొ! మేటివిచారముకల్గె నిత్తఱిన్'. 1164

గీ॥ అనుచుఁ దనయాత్మగతమున నార్తిఁజెంది, యెట్టకేలకుఁ బతి కింతి యిట్టులనియెఁ
'ప్రాణనాయక! మత్పాపఫలముకతన, నిన్నుఁబాసితి నన్ను మన్నింపవలయు 1165

ఉ॥ తావకనామకీర్తనముఁ దప్ప నితఃపరచింతలెవ్వియున్
భావములోననొల్లక భవత్పరిచర్య యొనర్చుపొంటె నా
జీవితమిన్నినా ళ్లసురశేఖరుపీటను బుచ్చితిన్ భవ
త్సేవకురాలనైన ననుఁ జేకొని కావుము జీవితేశ్వరా!' 1166

చం॥ అనవుఁడు రాముఁడిట్లనియె 'నాజి దశాననుఁజంపివైచి యో
వనితరొ! నేను నీచెఱనుబాపితి మాపితి దుర్యశంబునున్
ఘనముగ నీవిభీషణుని గ్రక్కునలంకకురాజుఁజేసి పెం
పుననెఱవేర్చితిం బ్రతిన పూర్ణమనోరథసిద్ధి నొందితిన్. 1167

ఉ॥ కావున నాదుపల్కువిను! క్రమ్మఱ నిన్ను గ్రహించుపొంటె నే
రావణుఁజంపలేదు! వరరాజనిభానన! మత్పరాభవం
బేవిధినైనఁ బాపుకొన నిమ్మెయిసల్పితిఁగాని యొండుగా
దీవు యథేచ్ఛ నొండెడకునేగఁగవచ్చును నిం ద్యజించితిన్ 1168

ఉ॥ క్రూరుఁడు రావణుండెపుడు కోరెడువాడు పరాంగనారతిన్
నీరజనేత్ర! తప్పురిని నీవువసించితి పెద్దకాలమె
ట్లూరక నిన్నుఁ దాఁగవయకుండఁగలండని లోకులంద్రు! నే
నారయ స్వీకరింతునెటు లక్కట నీతివిరుద్ధమౌ నటుల్? 1169

ఆ॥ కాన నిన్ను నేను గైకొననొల్ల నీ, యిష్టమైనచోటికేగు' మనిన
రామచంద్రుపల్కు రమణికి ములికియై, చెవులనాట వంతచెంది యపుడు 1170

చం॥ పెదవులుసంచలింప మదిభీతియుఁ దాపము సందడింప మే
నదరుచునుండ భూరిపులకాంకురముల్పొడసూప నశ్రువుల్
నదులయిపాఱుచుండ నిజనాథునితోడ స్వరంబునందు గా
ద్గదికముదోప నిట్లనియెఁగంజదళేక్షణ సీత యార్తయై 1171

ఉ॥ 'రాక్షసరాడ్విరామ! రఘురామ! ధరాంబరదిగ్వితానముల్
సాక్షి! సమస్తదేవనరసంఘములెల్లను సాక్షి! యా జగ
చ్చక్షువు తారలున్ శశియు సాక్షి! భవత్పదపంకజాతముల్
సాక్షి! మదంతరాత్మయును సాక్షి! యెఱుంగను దోసమెద్దియున్. 1172

ఉ॥ నన్నుఁ బరీక్ష సేయఁదగు నాథ! యిఁకన్ భవదాజ్ఞయైనచోఁ
బన్నుగ నగ్నిఁజొత్తుఁ! బొరపాటొకఁడుండిన నట్టిచత్తుఁబో
నిన్ను మదీయదైవముగ నేను దలంచినసాధ్వినేనియుం
గ్రన్నన వహ్నికుండమునఁ గాలకవత్తు సజీవురాలనై!' 1173

## శ్రీరామాజ్ఞచే సీత తనశీలపరీక్షకై యగ్నిప్రవేశము చేయుట

కం॥ అనిపలికి సీత యాత్మవి, భునిఁ దన యగ్నిప్రవేశమున కనుమతిఁ గో
రిన నియ్యకొనియెనందుల, కనఘుఁడు రాఘవుఁడు పిదప నగ్రజునాజ్ఞన్, 1174

మ॥ ఘనుఁ డాలక్ష్మణుఁ డగ్నికుండ మతిశీఘ్రంబొప్పఁ గీలాళిచే
తను ద్రవ్వించి యనంతరంబ సమిధల్ దాఁబెక్కుఁదెప్పించి చ
య్యనసగ్నిన్ రగిలింపఁజేయుటయు నత్యంతంబు మండందొడం
గెను బెన్మంటలతోడఁగుండము కడున్ బీభత్సమై యత్తఱిన్ 1175

గీ॥ సీతయగ్నిప్రవేశ మీక్షించుకొఱకు, నమరగణముండె మింట స్వర్గముననున్న
యజతనూజుండు కోడలికగుపరీక్షఁ, జూడవిచ్చేసియుండెఁ దాఁగూడ నపుడు. 1176

చం॥ 'నరవరుఁడేల యింతకఠినంబగునట్టి మహాపరీక్ష యీ
ధరణిజకున్ విధించెనొకొ? దానఁచేసి యపాయమేమియుం
బొరయకసీతయున్న మనపుణ్యముమంచిదె లేకపోయినన్
శరణమికెద్దియొక్కొ? మనసల్పినదంతయు నిష్ఫలంబగున్'. 1177

గీ॥ అనుచు సుగ్రీవుఁడాదియౌ వనచరులును, రావణానుజుఁ డాదియౌ రాక్షసులును
గరము దుఃఖింపఁదొడఁగి రాతరుణమందు, మూగిరావింతఁగన వేలుపులునుమింట 1178

ఉ॥ శ్రీరఘురామచంద్రునకు సీత కడుంగడుభక్తితో నమ
స్కారముచేసి యప్పుడతిగౌరవమొప్పఁగ నగ్నిదేవునిం
గూరిచివేడి తద్భయదకుండముచుట్టుఁ బ్రదక్షిణంబుతాఁ
గోరియొనర్చి యిట్లనియెఁ గొంకును జంకునులేక ధీరయై 1179

ఉ॥ 'శ్రీరఘురాముఁదప్ప మఱి చిత్తములోపల నన్యపూరుషం
గోరినదాననేని నను గొబ్బుననీపుదహించివైతు గా
కారయనేను శీలవతినైతిన యేనియు శీతలుండవై
కారుణికత్వమొప్పెనఁగఁ గాల్పక(బ్రోవెదుగాక! పావకా!'. 1180

గీ॥ అని నుడివి జానకీదేవి యాక్షణంబ, యగ్నికుండమ్ములో దూకె నద్భుతముగఁ
గపులు దానవు లదిచూచి కలఁగి రఖిల, భూతసంఘమ్మాక్రోశించె భీతితోడ 1181

ఉ॥ ఇంమనిభాస్య క్షోణిసుత యిట్లనలంబునయందుఁజొచ్చినం
గందదు కాయమించుకయుఁ గాలదు తొల్లిఁటికాంతిసుంతయుం
గుందదు లేశమాత్రమును నొప్పియుడప్పియులేదు చావదా
చందముఁజూచి ప్రేక్షకులుచాలఁగ విస్మయమంది రత్తఱిన్ 1182

## శ్రీసీతారాముల పునస్సమాగమము

ఉ॥ ఆయనలుండు తాను మనుజాకృతితోడ సుంక్షితంబుగాఁ
దోయరుహాక్షి జానకినిఁ దోడ్కొనివచ్చి వినమ్రుఁడై ధరా
నాయకుఁజూచిపల్కె 'రఘునాధ! పతివ్రత దోషహీన నీ
జాయ పరిగ్రహింపుమిఁక సంశయమెల్లనువీడి నెమ్మదిన్' 1183

మ॥ అని యాసీతను రామచంద్రునకుఁ దానర్పించి వైశ్వానరుం
డినవంశోత్తము వీడుకొంచుఁజనె నాయింతిన్ గ్రహించెన్ విభుం
డనఘుల్ వానరులున్ విభీషణముఖుల్ హర్షించిరవ్వేళ బో
రనవర్షించిరి దేవతల్ కుసుమవర్షంబుం బ్రమోదించుచున్. 1184

కం॥ ఆమాన్యులైన సీతా, రాముల సంయోగమపుడు రమణీయంబై
నేమమునఁ జూపఱకుఁ గరమామోదముఁగూర్చె నప్పు డతిశుభదంబై. 1185

కం॥ తనకొడుకులఁగోడలిసిన్, ఘనముగ శ్లాఘించుకొనుచు ఘనుఁడు దశరథుం
డనుపమహర్షాంబుధినిన్, మునిఁగినవాడయి నిజేచ్ఛఁ బోయెన్ దివికిన్, 1186

## బ్రహ్మాదిదేవతలు శ్రీరాముని స్తుతించుట

మ॥ దివిజజ్యేష్ఠుఁడు గోత్రభిత్ప్రముఖులౌ దిక్పాలకుల్ రామభూ
ధవునింగానఁగ వేగుఁదెంచి నతులై దండంబులర్పించి సం
స్తవముల్ చేసిరి పెక్కురీతుల ఘనశ్యాముం బరంధాము శా
శ్రవసందోహవిరాము రాము మిగులం దాత్పర్యభావంబులన్ 1187

శా॥ ఆలోనన్ ముకుళీకృతాంజలిపుటుండై బ్రహ్మ శ్రీరామభూ
పాలుం దాను నుతింపసాగె నిటులన్ భక్తిప్రపూర్ణాత్ముఁడై
'లీలామానుషవిగ్రహుండవు భవల్లీలల్ గనన్ శక్యమే?
యాలోకంబులకాదిదేవుఁడవు నీవేకావె? సీతాపతీ!. 1188

గీ॥ ఆవికుంఠాధిపతియైన యాదివిష్ణు, దేవుఁడవునీవు శ్రీరామదేవ! నీదు
దేవి జానకి యిందిరాదేవిసుమ్ము!, ఆదిదంపతుల్ మీరిర్వు రరసిచూడ 1189

ఉ॥ రావణుఁబోరిలోఁదునిమి రాజనిభాననయైన జానకీ
దేవిఁ బరిగ్రహించి జగతీపరిరక్షణమాచరించి తో
దేన! మహానుభావ! భవదీయలసన్మహిమంబు సెన్నఁగా
నావశమా? దినేశకులనాథ! రఘూత్తమ! పద్మలోచనా! 1190

ఉ॥ పెంపున సీతహృద్విమలవృత్తి మెఱింగినవాడవయ్యు భా
వింపఁగ లోకనిందకెదభీతిలి నాతిని నగ్నిలోఁ బ్రవే
శింపఁగఁజేసి శీలపరిశీలనమెల్లరెఱుంగఁ జాటి హ
ర్షింపఁగలోకముల్ సతినిఁ జేకొనియున్న నినున్ స్తుతించెదన్ 1191

చం॥ యుగయుగమందు నీవు మఱియొక్కొకయాకృతితోడఁ బుట్టి యీ
జగతిఁగలట్టి దుష్టసురశాత్రవకోటినిసంహరించి శి
ష్టగణములం గృపాపరత సంధిల సంతతముద్ధరింతు వో
సుగుణపయోధి! రామ! రిపుసూదన! దైవలలామ! ప్రోవవే! 1192

ఉ॥ నీవ వికుంఠనాథుఁడవు నీవ చరాచరసృష్టికర్తవున్
నీవ సమస్త విద్యలును నీవ జగంబులకెల్లభర్తవున్
నీవఖిలాత్మరూపుఁడవు నీవువినా మఱియెద్దిలేదు పో
దేవుఁడవీవు నిక్కముగ దివ్యకళామయ! రాఘవేశ్వరా! 1193

ఉ॥ నీవు మనుష్యమాత్రువలె నిక్కముగా నటియించుపాఁటె నా
నావిధభేదమోదములు నాఁజను ద్వంద్వములందుఁ జిక్కిత
ద్భావవికారచేష్టలకుఁ బ్రాపయి లొంగితివాక! లేనిచో
దైవలలామ! రామ! నిను ద్వంద్వవికారము లంటనేర్చునే? 1194

గీ॥ తండ్రులకుఁ దండ్రివయ్యు నీతండ్రిమాట, నిలిపి పుత్రధర్మము నీవు నేర్పితికద!
అనఘ! నీకంటెఁ బుడమిలో వధికులెవరు?' రామ! శ్రీరామ! వైకుంఠధామ! రామ!. 1195

ఉ॥ ఏనరుఁ డాత్మ నీస్మరణ మేమరకెప్పుడు సల్పుచుండునో
యానరుఁ డెల్లలోకములయందు సుఖించు నిరస్తపాపుఁడై
దీనశరణ్య! రామ! మునిదేవగణస్తుత దివ్యనామ! మ
న్మానసవీథినిం దలఁతు మన్నుము మమ్ము! దయామయుండవై'. 1196
కం॥ అని యిట్లనేకవిధముల, వనజాతభవుండు రామభద్రుని స్తోత్రం
బొనరించె మఱియుఁ దక్కిన, యనిమిషముఖ్యులు నుతించి రారాఘవునిన్. 1197

## ఇంద్రుఁడు మృతులైన కపులను బ్రదికించుట

చం॥ తదుపరి నింద్రుఁడిట్లనియె దాశరథింగని 'రామచంద్ర! దు
ర్మదుఁడగు రావణాసురుని మర్దితుఁజేసి మహోపకారమున్
సదయతమాకునల్పితివి సంతసమయ్యెను గాన నీకునె
య్యెదివరమిష్టమో యడుగు మిత్తు నవశ్యము దానినిత్తఱిన్' 1198
ఉ॥ నావుడు రామచంద్రుఁడను 'నాకపురీశ్వర! నానిమిత్తమై
రావణుసేనతోడ సమరంబొనరించి యనేకవానరుల్
జీవములం ద్యజించిరి విశేషకృపామతి పీరినిం బున
ర్జీవితులం బొనర్పుము ప్రసిద్ధిగ నాయభిలాషఁ దీర్పుమా! 1199
గీ॥ మఱియు నెందుండి వారెంచి మర్కటులకు, స్వాదుఫలములు జలములు సంతతంబుఁ
గడుసమృద్ధికరంబులై కలుగునట్లు, దగఁ బ్రసాదింపుమయ్య! శతక్రతుండ!'. 1200
కం॥ నావిని వరమొసఁగుచు, దైవతవిభుఁ డమృతవృష్టిఁ దాఁగురియింపన్
జీవచ్యుతులగు వానరు, లావేళ సజీవులైరి హరికులుఁడంచిన్. 1201
కం॥ పరపతి శ్రీరామునిఘని, మురమునపిక్కొంచు బ్రహ్మపురుహూతాది
త్రిదిశగణంబులు తమతమ, సదనంబులకపుడు చనిరి సంతోషమునన్. 1202
ఉ॥ అప్పుడు రామచంద్రుఁగని యాదశకంఠునితమ్ముఁ డిట్లనుం
'దప్పకమాపురంబునకుఁ దాముముదంబున నేగుఁదెంచి మే
మొప్పగసల్పునట్టి వివిధోచితసత్కృతులన్ గ్రహించి మా
యప్ప! రఘూత్తమా! యిఁకఁ గృతార్థులఁజేయవె మమ్ము సత్కృపన్' 1203
సీ॥ అనవిని శ్రీరాముఁ డతనితో నిట్లను 'వినుము! విభీషణ! విన్నవింతు
భరతుఁడక్కడ జటావల్కలధారియై మునివృత్తితోనుండఁ బురికివచ్చి
నీవుగావించెడు పావనసత్కారముల స్వీకరించుటపోల దిప్పు
డాపుణ్యధనుఁజూచు పౌత్సుక్యమొదవెడు మాకింకనిచ్చట మనలరాదు

ఆ॥ పదియునాలుగేండ్లు వనవాసమునఁ జేసి, కడపినారమింక గడువుదీరఁ
బౌరజనములెల్ల మారాక కైవేచి, యుండువారు పోవుటొప్పు నేడు 1204
ఉ॥ ఓరజనీచరేంద్ర! విను మొక్కటితెల్పెద నీవుచేయు స
త్కారవిధుల్ యథార్థముగ గౌరవరీతిని మాకునన్నియుం
జేరినయట్లె యెంతుము విశేషరణశ్రమఁ బొందియున్న యీ
పీరులవానరోత్తముల వేగ సపర్యలఁ దృప్తిపెట్టుమా!' 1205
కం॥ అనవుఁడు విభీషణుఁడు తా, ననూనమణిభూషణంబు లాహారాదుల్
ఘనముగనొసంగి కీశుల, ననుపమముగ సత్కరించి యాతఁడు మఱియున్ 1206
ఆ॥ రామలక్ష్మణులకు రమణిభూజాతకు, రమ్యభూషణాంబరములఁ గాన్క
నిచ్చి సత్కరింప నెంతయుహర్షించి, యసురవిభునిఁజూచి యధిపుఁడనియె 1207
గీ॥ 'అనఘ! యిచటికి మాయయోధ్యాపురంబు, కలదు బహుదూరమునఁ బోవవలయునేడె
కాన కావలయును మాకు యానమొకఁడు,' నావుఁడిట్లను దైతేయనాథుఁడపుడు. 1208
చం॥ 'కలదు కుబేరుఁ దొల్లిదశకంధరుఁ డాజిజయించితెచ్చుకొ
న్నలలితపుష్పకంబను ఘనంబగు దివ్యవిమానమొండు తా
రెలమిని దానినెక్కి చనుడీదినమే పురమందుఁజేరఁగాఁ
గలుగుదు రోనృపాల!' యని క్రమ్మఱ నాతఁడుచెప్పె రాముతోన్ 1209
ఆ॥ 'రామ! సుగుణధామ! రమణీయమగు తమ, పురముఁజూడ బుద్ధిపొడమెనాకు
తాము నాదుమనవిఁ దగఁజిత్తగించి మ, దాగమనమునకును నాజ్ఞయిండు' 1210
కం॥ నావుడు శ్రీరాముఁడు స, ద్భావముతో నిట్టులనియెఁ 'బావనచరితా!
నీవు సపరివారంబుగ, మావీటికివచ్చితేని మఱిలెస్సయెగా' 1211
గీ॥ అనుచుఁ బ్రియపూర్వకంబుగ నర్కకులుఁడు, చెప్పి యాతనిరాకకు నొప్పుకొనియెఁ
దనసతీసుతబాంధవజనులతోడ, నావిభీషణుఁ డపుడు ప్రయాణమయ్యె 1212
కం॥ మఱియును విభీషణుం డ, త్తఱిఁ బుష్పకయానమటకుఁ దాను గరముఁ జె
చ్చెఱఁ దెప్పించెను దానిని, నతిముఱి వర్ణింపఁదరమె యాబ్రహ్మకునున్? 1213

## శ్రీరాముఁడు పుష్పకవిమానముపై నెక్కి యయోధ్యకుఁ బోవుట

సీ॥ దిగిభేంద్రతతికర్ణయుగవిదారణశబ్ద కలితనానాఘంటికలుచెలంగఁ
బ్రవిమలోజ్జ్వలరమ్యభర్మవినిర్మిత బహుసుందరస్తంభపంక్తులొప్పఁ
జిత్రాతిచిత్రవిచిత్రితాశేషభాసిత మణిసాలభంజికలు దనరఁ
గోటిప్రభాకర గురుతరచ్ఛవి తిరస్కృత మహనీయదీధితు లెసంగ

గీ॥ వివిధమణిమయవేదులు విలసితబహు, చామరంబులు సులలితసాంద్రకుట్టి
మములుఁ బలువన్నెలుఁగలట్టి మహితకేత, నాళి చెలువారఁ బుష్పకయానమలరె. 1214

గీ॥ అదియుఁ బూర్వము సురశిల్పియైన విశ్వ, కర్మచే నిర్మితంబయి క్రాలుచుండె
దానికెనయైనయట్టి విమానమెందుఁ, గనఁబడకయుండె నౌర! యాకాలమందు 1215

కం॥ దానిపయి నెందఱెక్కినఁ, గాని మఱేపురకుఁ దావుకలదై యుండుం
దానావిమానమహిమం, బానరవరుఁ డనిలమెఱిఁగి యద్భుతమందెన్ 1216

ఉ॥ దక్షత రామభూవిభుఁడుఁ దత్సహజన్ముఁడు సీత గంధపు
ష్పాక్షతలర్చలిచ్చి వినయంబునమ్రొక్కి ప్రదక్షిణించి తా
రాక్షణమే ప్రమోదమెసలారఁగఁ బుష్పకమెక్కిరా సహ
స్రాక్షుఁ డుపేంద్రుఁడున్ శచియు నాకనకాద్రిని నెక్కునైవడిన్. 1217

కం॥ మానవపతియగురాముని, యానతి శిరసావహించి యర్కతనయుఁడా
వానరులుఁదాను బుష్పక, యానముపైఁ బ్రియముదోప నారోహించెన్ 1218

గీ॥ దనుజపరివారములతోడఁ దక్షణంబ, రాఘవానుమతంబున రాక్షసకుల
భూషణుండైనయట్టి విభీషణుండు, తాను బుష్పకమెక్కె ముదంబెసంగ 1219

గీ॥ పుష్పకవిమానమంతట భూమినుండి, దివికెగసిపోవసాగెను బవనుకంటె
మనసుకంటె శీఘ్రంబున మఱితదీయ, వేగమునకు వియచ్చరుల్ వింతనొంద 1220

## శ్రీరాముఁడు తానుజూచిన స్థలములను సీతఁకు జూపించుట

కం॥ శ్రీరాముండిట్లు విమా, నారూఢుండగుచు బహువనాబ్ధిగిరిసరి
ద్వారములుగడచిపోవుచు, నారయ నాయాస్థలంబులన్నియుఁ గ్రమతన్. 1221

ఉ॥ సీతకుఁజూపు చందలివిశేషములెల్లను వేఱువేఱ యా
భూతలనాథశేఖరుఁడు పూర్ణముగా వచియించుచుండ నా
భీతమృగాక్షి జానకి సవిస్తరభంగి నవన్నియుం గడుం
బ్రీతిమెయిం గనుంగొనుచు వించుచునుండెఁ గుతూహలంబునన్ 1222

గీ॥ మఱియు వైదేహితోడ నామనుజవిభుఁడు, మున్నుఁదాను సందర్శించియున్నయట్టి
స్థలవిశేషంబులెల్ల నీచందమునను, స్పష్టముగఁజూపి చెప్పంగసాగె నపుడు. 1223

కం॥ 'వినుమతివ! యిది త్రికూటం, బనుగిరి యిద్దానిమీద నారయలంకన్
మునువిశ్వకర్మనిర్మిం, చెను లావణ్యనిలయమయి చెలువారంగన్. 1224

కం॥ కని రవికులపతి యప్పుడు, ఘనపుష్పకయాన మచట గ్రక్కునడిగి స
న్మునికులతిలకు భరద్వా, జుని బరివారములు దాను జూచివినతుడై. 1245

గీ॥ తాను దమ్ముడు సీతయు దాపసేంద్రు, పాదపద్మంబులకు భక్తివందనములు
సేయుటయు మౌనిపతి రాముసేమమడిగి, సముచితోపచారంబుల సత్కరించె. 1246

కం॥ మునిపతి సత్కారములకు, జనపతిహర్షించి వినయసంభ్రమయుతుడై
తన మృదుమధురోక్తుల ని, ట్లనిపలికెను గౌరవాదరాతిశయములన్ 1247

ఉ॥ 'సేమమెమీకు? మౌనికులశేఖర! మీతపముల్ జపంబులున్
హెూమములెల్లనున్ జరుగుచున్నవెవిఘ్నములేక నిచ్చలున్?
నేమమునం ద్రికాలముల నిర్మలపుష్పఫలంబు లాశ్రమా
రామములిచ్చుచున్నె? మృగరాక్షసబాధలు లేవుగా సదా'. 1248

చం॥ అనవుడు మౌనియిట్లులను 'నర్కకులాధిప! నీదు పాదుకల్
వినుI భరతుండుకొంచ జని విశ్రుతభక్తిదలిర్ప గొల్చుచున్
ఘనముగ దత్పరోక్షమున క్ష్మాతలమేలెడునట్టె! మాకిక న్
వనమృగబాధలెక్కడివి? భద్రముసర్వము జూవె నేటికిన్ 1249

గీ॥ అదియునట్లుండె రావణాద్యసురసమితి, నీవు మర్దించుటంజేసి నృపవరేణ్య!
మాకు రాక్షసబాధయు మాసిపోయె, సుఖులమైతిమి మాతపస్సులుఫలించె. 1250

గీ॥ కోరికొనుమిత్తువర' మన గోరెరాము, డాత్మనగరోపవనులెల్ల నన్నికాల
ములను బుష్పించి ఫలియించి యలరునట్లు, మునిపతియునట్లె కావించె మురిసియపుడు.

శ్రీరాముడు తమరాక భరతునకు దెలుప హనుమంతుని బంపుట

సీ॥ తదనంతరంబ యాదశరథాగ్రసుతుండు హనుమంతుజూచి యిట్లని వచించె
'బావని! నీవేగి పరమభక్తాగ్రణీ యగుగుహుదర్శించి యతనితోడ
మామకాగమనసమాచారమెఱిగించి మఱితదీయవిదితమార్గుడవయి
చనుము నంది గ్రామమునకు మారాకను సద్గుణభరితుండు సాధుచరితు

గీ॥ డైన భరతునకునుదెల్పి యతిరయమున, రమ్ము!' నాపుడు కరము శీఘ్రముననపుడు
ఘనబలుడు పవమాననందనుడు తాను, బయనమైపోయె నాగుహుపజ్జ కెలమి 1252

గీ॥ పోయి గుహునితో రామభూనాయకుండు వచ్చినయుదంతమెఱిగించి వాయుసుతుడు
తన్నివేదితమార్గుడై తక్షణంబ, ముదముతోడ నందిగ్రామమునకుజనియె 1253

॥ చని ధర్మించెను వీతరోషు వినిరస్తద్వేషు నిర్దోషు స
న్మునివేషున్ మృదుభాషు సాధుచరితుం బుణ్యున్ జటావల్కలా
జినధారున్ భరతున్ వినీలజలదశ్రీమచ్ఛుభాకారుఁ బా
వనరామప్రభుపాదుకార్చనరతున్ భవ్యాత్ము శాంతోజ్జ్వలున్ 1254
చూచి పదిఁ దదాకారతేజోవిశేష, ములకు నచ్చెరువొంది గాడ్పుకొమరుండు
రామునాకృతిఁబోలిన రామసోద, రునకు భక్తి వినమ్రుఁడై మ్రొక్కి నిలిచె 1255
॥ నిలిచిన హనుమంతునిఁగని, పలికెను భరతుండు వినయభరితుండగుచుం
'దెలుపుము నీవెవఁడవు? కపి, కులశేఖర! నీదు రాకకుం గతమేమో?' 1256

## హనుమంతుఁడు భరతునకు శ్రీరామునిరాకను దెలుపుట

నావిని యావాయుదేవకుమారుండు భరతునిఁజూచి తాఁబలికె నిట్లు
'వినుమయ్య! భరత! సద్వినుతచరిత్రుఁడౌ రాముఁ డనుజునితో రమణితోడఁ
బదునాలుగేడులు వనవాసమొనరింపఁ జనుదెంచి యడవిలో జనకసుతను
రావణాసురుఁడను రాక్షసనాథుండు చెఱఁగొనిపోవ నాసీతకొఱకు
రోయుచున్వచ్చి యాయిష్వాకురఘుకులులు, మానవచరేంద్రుడైన సుగ్రీవుతోడఁ
జెలిమిగావించి తద్భ్రాత నలఘుబలుని, వాలినొకకోలచే రఘువరుఁడుచంపి. 1257
॥ పదపడి కపిరాజ్యమునకు, ముదమున సుగ్రీవుఁ బట్టమునుగట్టె మహా
సదయుఁడు రాముఁడు దానికి, బదులుగ నుపకారబుద్ధిఁ బాటించిమదిన్. 1258
మారాజు సుగ్రీవుఁ డారామదేవిని నన్వేషణముసేయ నఖిలదిశల
కాత్మీయకపిసేన నంపె నందునునేను నంగదప్రముఖులౌ నద్రిచరులు
యామ్యదిక్కునకేగి యంభోధితరిసితి మటువారినుంచి నేనబ్ధిదాటి
లంకలోపలఁజొచ్చి లంకిణిఁబరిమార్చి జానకిఁబొడఁగాంచి దానవులను
బలువురనురూపుమాపి తత్పట్టణంబు, వీకదహియించివైచి వేవేగవచ్చి
రామవిభునకు వైదేహిక్షేమవార్త, సర్వమును విన్నవింప భూజానియపుడు 1259
అమితకపిసైన్యపరివృతుండగుచుఁబోయి, కడఁగి సేతువుఁగట్టించి కడలిదాటి
లంకలోఁ జొచ్చి రావణుబింకముడచు, సపరివారంబుగాఁ బోర సంహరించి 1260
ఆదశాననుసోదరుఁడైన విమల, గుణవిభూషణుఁ డగు విభీషణుని లంక
కంచితంబుగ రాజుఁగావించి తాను, బ్రతినదీర్చినవాఁడయి భానుకులుఁడు. 1261
జానకీసహితుఁడయి లక్ష్మణుఁడుఁ దాను, గడువుదీరిచి యేతెంచి విడిసె రాముఁ
డాభరద్వాజునాశ్రమమునను నేఁడు, వీటికరుదెంచువెల్లి సద్వినుతచరిత! 1262

కం॥ శ్రీరామాగమనసమా, చారము తఘతోడఁదెలుపఁ జనుదెంచితి నా
పేరాంజనేయుఁ డనిలకు, మారుఁడ సుగ్రీవుబంట మహితగుణాఢ్యా'. 1263

భరతుఁ డయోధ్యాపురవాసులకు శ్రీరాముని రాకసు దెలుపుట

సీ॥ అనవుఁడు పోయినయసువులు క్రమ్మఅవన్చినక్లెన్నుచు భరతుఁడపుడు
హర్షసాగరమగ్నుఁడై యిట్టులనియెను 'వానరోత్తమ! రామభద్రురాక
యెఱిఁగించి నీవు నన్నెలమిఁ గృతార్థునిఁజేసితి నీమేలు చెప్పఁదరమె?
నీకుఁ బ్రత్యుపకృతి నేనేమిచేయుదు? మత్ప్రాణదాతవై మనిచినట్టి

గీ॥ సుకృతివరయఁగ నిన్నుసంస్తుతియొనర్ప, శక్యమే' యనిపల్కుచు సకలములగు
దనకనకవస్తువాహనతతులొసంగె, భానుకులుఁ డప్ప డామరుత్సూనునకును, 1264

మ॥ ఘనుఁడౌ మారుతపుత్రుతోడ మఱియుం గైకాత్మజుం డిట్లనున్
'హనుమంతా! విను! నేడు భాస్కరకులక్ష్మాధీశుఁడే రాకయుం
డిన ఘోరానలమందు దూకి యసువుల్ నిక్కంబుగాఁ వీడనుం
టిని శ్రీరామకృపావిశేషమున మంటిం గంటి వేధన్యతన్' 1265

కం॥ అని ఏరతుండు ప్రభంజన, తనయునితోడన్ వచించి తక్షణమాత్రం
దనసోదరుఁడగు శత్రు, ఘ్నుని గని యిట్లనియెఁ దాననూనముదమునన్. 1266

గీ॥ 'తమ్ముఁడా! నీవుచని యయోధ్యాపురంబు, నందుఁ జాటఁగఁబంపు రామాగమనము
మనవసిష్ఠాదులగు గురుజనులకెల్లఁ, దెలుపువేర్వేర నీవార్త తెల్లముగను. 1267

కం॥ మనసామంతులకెల్లను, ఘనముగఁ బ్రభురాకఁదెలిపి గ్రక్కునవారిన్
జనపతికెదురుగఁజన ర, మ్మనిచెప్పుము గౌరవంబు నాదరమొప్పన్. 1268

గీ॥ చెలువుమిగులంగఁ బురముఁగైసేయఁబంచి, రామునాస్థానగృహమున రమ్యములగు
సేతుబంధనాదికములౌ చిత్రకథలు, వ్రాయఁబంపుము కరముఁ జిత్రములుగాఁగ 1269

గీ॥ సకలసామంతహితభృత్యసచివపౌర, జనములాదిగఁగల పెక్కురనుగమింప
వితతమంగళవాద్యంబు లతులితముగ, మ్రోయుచుండఁగ రమ్మిందు మోదమెసఁగ'.

కం॥ అనవుఁడు భరతునియాజ్ఞను, దనమస్తకమునధరించి త్వరితగమనుఁడై
ఘనముగ సాకేతపురం, బునకున్ శత్రుఘ్నుఁడపుడు పోయి ముదమునన్. 1271

కం॥ సర్వులకు రాముురాకను, సర్వంబెఱిఁగించి పురము శత్రుఘ్నుఁడు దృ
క్పర్వంబౌరఁ హర్ష మహా, ఖర్వాలంకారసహణిఁ గైసేయించెన్ 1272

సీ॥ మఱియు రచ్చలు రాజమార్గంబులన్నియుఁ బెల్లుగఁ గలయంపిఁ జల్లువారు
సకలగృహంబులఁ జందనాదికములనలికి ముత్యాలముగ్గులిడువారు
కుడ్యముల్ వేదికల్ గోపురంబులవెల్లఁ బొలుపార రంగులఁ బూయువారు
భాసురమణిమయబహుతోరణావళుల్ ఘనముగ నెల్లెడఁగట్టువారు
గీ॥ నై మనోహరముగ నయోధ్యాపురంబుఁ, బౌరజనులు గైసేసి ధూపముమొదలగు
వాసనాద్రవ్యములు పెక్కు వాసిగాను, నుంచి రఖిలస్థలంబులం దంచితముగ 1273

గీ॥ అంతఁ బురిఁజాటఁబంచి సామంతమంత్రి, హితపురోహితపౌరాళి యేగుఁదేర
నాసుమిత్రయుఁ గైకేయి కోసలసుత, వెంటఁగొని వసిష్ఠాదులు జంటరాఁగ

గీ॥ వివిదమంగళవాద్యంబు లవిరళముగ, మ్రోయుచుండఁగ వైభవస్ఫూర్తిమెఱయ
బయలుదేరె శత్రుఘ్నుండు భరతుకడకుఁ, బ్రమదమున నొక్క శుభముహూర్తంబునందు

గీ॥ అప్పు డమ్మల కావసిష్ఠాదులకును, మ్రొక్కి యెల్లర సత్కారములను దనిపి
భరతుఁడు సపరివారుఁడై బయలుదేరెఁ, దమకు వాతాత్మజుఁడు మార్గదర్శిగాఁగ 1276

మ॥ పరివారంబులుఁదాను నిల్చుచని శశ్వత్కీర్తిధాముం బురం
దరముఖ్యామరవందితాంఘ్రితలు సీతాలక్ష్మణోపేతునిన్
హరకోదండవిదారు రావణముఖోద్యద్దైత్యసంహారు భా
స్కరవంశ్యున్ భరతుండుగాంచె నెదుటం గంజాక్షు నారామునిన్ 1277

గీ॥ ఇట్లు సపరిచ్ఛదంబుగానేగి భరతుఁ, డినకులేశ్వరుఁ దావెదుర్కొనఁగ మురిసి
పుష్పకము నిల్పఁబనిచి యాపుడమిఱేఁడు, తానుదిగె దైత్యవానరసేనతోడ. 1278

గీ॥ అప్పు డర్కాన్వయోత్తంసుఁడైన రాముఁ, డమితసద్గుణభరితుఁడౌ నాభరతుని
గూర్మిమైఁ గౌగిటంజేర్చికొని తదీయ, కుశలసంప్రశ్నమొనరించెఁ గుతుకమునను. 1279

గీ॥ అటుపిదప లక్ష్మణునిఁ బ్రియమారఁ గైక, కొమరుఁ డాలింగనముచేసికొని తదీయ
కుశలమడిగి సద్భక్తితోక్షోణిసుతకు, మ్రొక్కి యామెచే దీవనల్పొందెఁ దాను. 1280
గీ॥ మఱియు సుగ్రీవుదరిసి నెమ్మదినిమురిసి, తానుగౌగిటఁజేర్చి యీతరుచరపతి
చేతనాలింగితుండయి ప్రీతితోడ, నాతనింగని పల్కెఁ గైకాత్మజుండు 1281

కం॥ 'ఓసుగ్రీవా! రణమున, నీసాయముగలుగుకతన నృపకులమణి రా
కాసులనెల్లరఁబొరిగొని, భాసురజయలక్ష్మిఁ దాను బ్రాప్తించెఁగదా'. 1282

చం॥ అని రిపుసూనునింబొగడి యాభరతుండటుపై విభీషణుం
గని ప్రియమారఁ దానతనిఁగ్రక్కునఁ గౌగిటఁజేర్చి యిట్లనున్
'దనుజవరేణ్య! మిక్కిలిగఁ దాము సహాయులరౌటఁజేసి యీ
మనుజవరేణ్యుఁ డాజిఁబరిమార్చెఁ బ్రసిద్ధిగ రావణాదులన్'. 1283

గీ॥ అని విభీషణునగ్గించె నాభరతుఁడు, పిదప శత్రుఘ్నుఁ డత్యంతవినయమెసఁగ
రామునకు లక్ష్మణునకును భూమిసుతకు, మ్రొక్కి వారిచేదీవనల్ పొందెనెలమి. 1284

చం॥ ఇనకులభర్తరామవిభుఁ డెంతయుభక్తి మదిన్‌జనింపఁగం
దనజనయిత్రికిన్ భరతుతల్లికి లక్ష్మణుమాత కత్తఱిన్
ఘనముగసాగిమ్రొక్కి కడుగౌరవమొప్పఁగ వారిచేత న
త్యనుపమదీవనల్‌వడసి హర్షపయోనిధియందు మున్గుచున్ 1285

గీ॥ తనకులగురుండయిన వసిష్ఠునకుఁ బిదప, సీతయును లక్ష్మణుఁడుఁ దాను జేరిమ్రొక్కి
బహుతరాశీస్సులారామభద్రుఁ డందె, ననఘుఁడైయొప్పు నాతపోధనునిచేత 1286

చం॥ అలికులవేణియైన జనకాత్మజ పిమ్మటఁజేరి మువ్వుర
త్తలకును దాను గేల్మొగిచి తద్దయుభక్తి వినమ్రయౌచు సా
గిలఁబడి మ్రొక్కఁ గోడలినిఁ గేవలసాదరభావమొప్ప వా
రెలమిఁ గౌఁగిలించుకొని యిట్లనిపల్కిరి గారవంబునన్ 1287

సీ॥ 'పదునాలుగేడులు పతివెంటఁజని వనవాసమేవిధమునఁ జేసితమ్మ?
అటఁ గాయగసరులే యాహారముగ నారలే చీరలుగఁదాల్చి తెట్టులమ్మ?
పంక్తికంఠునివీటఁ బడరానియిడుమలు పడి శీలమెట్లు గాపాడితమ్మ?
వహ్నిఁబ్రవేశించి బస్మంబుగా కెటువలె నీవు జీవింపఁగలిగితమ్మ?

గీ॥ సహజసౌజన్యశీలాదిసద్గుణంబు, లరయ మణిభూషణములు నీకగును సుమ్మ!
సాధ్వులకుసాధ్విని రమాంశజనితవీవు, సాటియెవరమ్మ! సీతమ్మ! జగతినీకు?. 1288

గీ॥ మగఁడు రామచంద్రుఁడు వీరుఁడగుటఁజేసి, వీరపత్నిసమాఖ్యచే వెలసితమ్మ!
వీడలసుపుత్రులంగని వీరమాత, వసుదువింక మాయమ్మ! సీతమ్మ! నీవు'. 1289

కం॥ అని ప్రేమపూర్వకంబుగఁ, గొనియాడి సుమిత్ర కైక కోసలసుతయున్
ఘనముగదీవించిరి భూ, జనవినుతచరిత్రయైన జనకతనూజన్ 1290

గీ॥ రాముఁడంతట సపరివారముగఁబోయి, ముదముతోడ నందిగ్రామపురముఁజేరి
తాను బుష్పకమర్చించి ధనదుకడకుఁ, దలఁచినప్పుడురమ్మనిదానిఁ బంపె 1291

గీ॥ అపుడు భరతుండు తాన కృతాంజలియయి, భక్తివినయాధికత రామభద్రునకును
దగఁ బునశ్చరణాభివందనముసలిపి, యిట్టులనిపల్కె సౌహృదమినుమడింప 1292

ఉ॥ 'దేవరయాజ్ఞమీరక ధృతిన్ శిరమందిడి యిన్నినాళ్లు త్వ
త్పావనపాదుకాద్వయము భక్తిమెయిం దగఁగొల్చి నేను స
ర్వావనిఁ ద్వత్పరోక్షమున నారయనేలితి నెట్లొ! యింక నీ
క్ష్మావలయంబునేలుకొనఁగాఁదగు నీవ రఘుక్షితీశ్వరా!. 1293

కం॥ కొమ్మిఁక రాజ్యమునీయదె, వెమ్మనమునఁదలఁపు నన్ను నీదాసునిగా
నిమ్మహిభారముఁదాల్పగ, నిమ్ముగ యోగ్యుండవీవె యేనోపుదునే?' 1294

కం॥ అని శ్లాఘాపూర్వకముగ, మనుఁడా భరతుండుపలికి కడుభక్తిమెయిం
దనయన్న రామునకుఁ బా, వనపాదుకలొసఁగి మఱియు వచియించె నిటుల్ 1295

కం॥ 'విచ్చేయుమింకఁ బురమున, కిచ్చగదయచేసి రఘుకులాంబుధిసోమా!
నిచ్చలును బురజనంబులు, హెచ్చుగసంతోషమొంద నెంతయువేడ్కన్ 1296

## భరతుఁడు శ్రీరాముని సపరివారముగ నయోధ్యకుఁ దోడ్కొనిపోవుట.

కం॥ తరణికులేశ్వర! మీరిఁక, వరమునివేషములువీడి బహువిధవస్త్రా
భరణానులేపనాదుల, దరియించి మనోజ్ఞులీలఁ దనరుం' డనినన్ 1297

ఉ॥ శ్రీరఘురాముఁ డాభరతుచెప్పినమాటకు వశ్యుఁడై దా
ధారుణిపుత్రి లక్ష్మణుఁడు తాపసవేషములుజ్జగించి పెం
పారఁగఁ దానమాడి వివిధాంబరభూషణవస్త్రమాల్యముల్
కోరిధరించియొప్పె బహుకోటిదివాకరకాంతిగేరుచున్ 1298

గీ॥ ఇట్లు శ్రీరమ్యవేషులై యినకులులిరు, వురును గంతువసంతులుంబోలె నొప్పి
రఖిలభూషణాంబరశోభితాంగియగుచుఁ, దేజరిల్లె జానకిరమాదేవిపగిది 1299

గీ॥ దైత్యవానరనాయకుల్ తమతమపరి, వారములుఁ దారు బహువిధవస్త్రమాల్య
భూషణాదులధరియించి పొలుపుమిగిలి, రెల్ల రిట్లు ప్రయాణమై యెలమినుండ 1300

గీ॥ అనిలజుండంతఁ దోడ్తేరనాగుహుండు, సపరివారుఁడై మౌనివేషమునవచ్చె
నతనిఁ దమయట్ల రాజచిహ్నములఁ దాల్ప, దగనియోగించె శ్రీరామధరణివిభుఁడు. 1301

చం॥ భరతునియాజ్ఞచే నపుడు భాసురదివ్యరథంబొకండు స
త్వరితగతిన్ సుమంత్రుఁడు ముదంబునఁగైకొనివచ్చి యుంచినం
దిరముగ రామభూవిభుఁడు తేరధిరోహణమాచరించె సో
దరులును ముప్పురాక్షణమె తాముఁ బ్రహర్షముతోడ నెక్కఁగన్. 1302

సీ॥ స్యందనారూఢుఁడై రామచంద్రుఁడపుడు, భరతలక్ష్మణశత్రుఘ్ను లిరుగెలఁకులఁ
జేరి సేవించుచునఁ రాఁగఁ జిత్రమందుఁ, బరమహర్షంబుసంధిల్ల బయలుదేరె 1303
గీ॥ లలితవాహనారూఢులై కులగురువువ, సిష్ఠుఁ డాభరద్వాజఋషి ప్రవరుఁడు
మొదలుగాఁగల మునివరుల్ ముదముతోడ, దీవనలొసంగుచు బయలుదేరిరపుడు 1304
కం॥ దానవపతి వానరపతి, దానవవానరబలములు తమ్ముఁగొలువఁగా
మానవపతివెంట నుచిత, యానంబులనెక్కి చనిరి హర్షముతోడన్ 1305
కం॥ తరణికులురామువెంటను, బరివారముతోడ రామభక్తాగ్రణిస
చ్చరితుఁడు గుహుఁడు వెడలెఁ దా, నరుసంబున నుచితవాహనారూఢుండై 1306
కం॥ ఒక్క మహాందోలికపై, నెక్కి మహీతనయవెడలె నిరుగెలఁకులయం
దక్కజముగ స్త్రీబృందము, మిక్కిలిఁ దనుఁగొలిచిరా నమేయవిభూతిన్ 1307
గీ॥ దశరథుని భార్యలప్పుడు తారు ముగురు, జానకీదేవిచెంతనే సముచితైక
వాహనంబులపైనెక్కి బయలుదేరి, రతులితోత్సాహభరితలై యతిముదమున 1308
గీ॥ సద్యశస్సాంద్రుఁడౌ రామచంద్రుఁడిట్లు, తానుబరివారములు చను తరుణమందు
వివిధమంగళతూర్యముల్ దివియుభువియుఁ, బ్రతిరవములీయ మ్రోగె వైభవమెసంగ
గీ॥ ఇట్లు పరివారములతోడ నినకులపతి, యైన శ్రీరామభూవిభుఁ డలకఁబోలి
లలితసౌందర్యవిభవైకనిలయమగుచుఁ, దనరుచున్న యయోధ్యను దానుజేరి 1310
గీ॥ రామచంద్రుఁడు సపరివారముగ బురజ, నులకుఁ గనువిందుఁగూర్చుచు నెలమిఁదాను
రాజమార్గానఁ బయనించి రాజభవన, మందుఁ గడువైభవోపేతుఁడగుచుఁ జేరె. 1311

## సీతారామలక్ష్మణుల రాక కానందించి పౌరు లుత్సవముచేయుట

ఉ॥ అప్పుడు తత్పురీజనములందఱు గుంపులుగూడి వచ్చితా
రొప్పుగ రామలక్ష్మణుల నుత్పలలోచనయైన జానకిం
దప్పకచూచి యాత్మనయనద్వయపర్వముఁగూర్పఁగం గడుం
జెప్పఁగరానిమోదమును జెందిరి పొందిరి సార్థకత్వమున్ 1312
కం॥ మఱియుఁ బురాంగనలెల్లరు, నతిముఱి సేసలనుజల్లి యర్కాన్వయులం
దఱచుగ జానకినింబలు, తెఱఁగులఁ గొనియాడిరపుడు స్థిరభక్తిమెయిన్ 1313
సీ॥ వందిమాగధసూతవైతాళికులుచేరి చాలఁగస్తోత్రముల్ సలుపుచుండఁ
గవినటగాయకుల్ కవితాదిఘనవినోదములు గావించుచుఁ దామునడువ
నచ్చరలనుమించునట్టి వారాంగన లాడుచుఁబాడుచు నరుగుఁదేర
బుధపురోహితవృద్ధభూసురాశీర్వాద మేదురనాదముల్ మిన్నుముట్ట

గీ॥ బహునరాసురవానరభటులు ముందు, వెనుకలన్ వేత్రధారులై చనుచునుండ
బహుళమంగళతూర్యరావములు చెలఁగ, జానకీరాములకు మహోత్సవముజరిగె 1314

గీ॥ సర్వులకు భోజనాదివసతులు రామ, భద్రుచేతను గల్పింపఁబడియెఁ బౌర
జనము లాబాలగోపాల మనుపమైక, హర్షసాగరమున నోలలాడి రపుడు 1315

చం॥ రవికులభర్తయైన రఘురాముని భర్తగఁబొందగల్గు నా
దివసములేగుఁదెంచెనని తెల్పునిమిత్తమునా నవీనవై
భవసము పేతురాలగుచు బాపురె! యేమిటలోటులేక తా
నవిరళభంగిఁదేజరిలె నప్పురకన్య మఱింతధన్యయై 1316

గీ॥ అతులితానందనిలయమై యలరుచున్న, యాయయోధ్యానగరరామణీయకంబుఁ
గపులు దైత్యులుకాంచి యక్కజముఁబొంది, యపుడు తలపోయసాగి రన్యోన్యమిట్లు 1317

గీ॥ 'బాపురే! చూడ నీయయోధ్యాపురమున, కేపురంబులుసాటిరా వీపురంబు
నిక్క మాస్వర్గపురమగు, నిర్జరేంద్రుఁ, బోలె నెల్లప్పు డీరాముఁ డేలుగాత!' 1318

గీ॥ అనచు భానుపుత్రవిభీషణాదులైన, తరుచరులు రాత్రిచరులు తద్దయునుబొగడి
రఖిలజనములు రాముపట్టాభిషేక, దర్శనోత్కంఠులైరి యాతఱిణయందు 1319

## శ్రీరాముని పట్టాభిషేకప్రయత్నములు

శా॥ ఆరామాగమనోత్సవంబిటుల నుద్యద్వైభవస్ఫూర్తి యే
పారంజెల్లె ననంతరంబ బరతుం డత్యంతయత్నంబునన్
ధీరస్వాంతు వసిష్ఠుఁడాదిగమహాధీశాలురం బెక్కురం
దారప్పించి సభాంగణంబునకునుం దాత్పర్యభావంబునన్, 1320

గీ॥ ఎల్లసభ్యులు వినుచుండ నెల్లిరామ, భద్రుపట్టాభిషేకోత్సవ మనిచెప్పి
యవ్వసిష్ఠాదులగు పెద్దలనుమతింపఁ, దాముహూర్తముఁబెట్టించి తక్షణంబ 1321

గీ॥ శ్రీరఘూత్తముపట్టాభిషేకవార్త, పట్టణంబాతటను జాటఁబంచి భరతుఁ
డామహోత్సవమునకు నత్యవసరమగు, వస్తుజాలముల్ తెప్పించెఁ బ్రముదితుఁడయి

గీ॥ మఱియు బంధుహితాప్తసామంతనృపుల, కపుడ యాహ్వానపత్రములంపి రామ
భద్రుపట్టాభిషేకోత్సవంబునకును, గైకకొమరుండు రావించె గౌరవమున 1323

కం॥ రాఁదగినవారలిమ్మెయి, మోదముసంధిల్లవచ్చి పురినిండుటయున్
సాదరమున వారుండఁగఁ, దాఁదగువిడుదులనొసంగెఁ దగభరతుఁడొగిన్ 1324

గీ॥ సాధుజనసమ్మతంబయి చల్లగాను, నెగడుగావుత! తావకనిరుపమాన
నయసహితరాజ్యపరిపాలనక్రమంబు, సంతతముదావహంబయి క్ష్మాతలేంద్ర! 1346

గీ॥ అని వసిష్ఠమునీంద్రుఁ డాయర్కవంశ్యుఁ, డైనరామునితోఁ జెప్పి యతులితముగ
దీవనలొసంగెనామునిదేవునాజ్ఞ, ననుసరించియేలుదుధర ననియెనృపుఁడు. 1347

గీ॥ ఈకరణి రాముపట్టాభిషేక మతుల, వైభవోపేతముగసాగె బంధుమిత్రు
లాప్తులాదిగఁగలజనుల్ హర్షితాత్ము, లగుచు నిజనివాసములకు నరిగిరపుడు. 1348

మ॥ వనజాప్తాన్వయుఁడైన రాముని మహాపట్టాభిషేకోత్సవం
బును వీక్షించి విభీషణార్కతనయుల్ మోదంబునన్ రామచం
ద్రునియాజ్ఞంగొని యాత్మదేశములకుం దోడ్తోడ సైన్యాళి చ
య్యనరానేగిరి యోగ్యవాహనములం దారూఢులై యత్తఱిన్ 1349

గీ॥ శ్రీరఘూద్వహుపట్టాభిషేకవైభ, వంబుఁ గనులారఁదిలకించి ప్రముదితుఁడయి
గుహుఁడు రామునియాజ్ఞఁగైకొని నిజాను, చరులతోఁ బక్కణంబున కరిగెఁదాను 1350

గీ॥ భరద్వాజుఁడాదిసంయములు రామ, భద్రుపట్టాభిషేకవైభవముఁ గాంచి
చాలహర్షించి రామువీడ్కోలువడసి, చనిరి శిష్యులతో నిజాశ్రమములకును 1351

గీ॥ అటుపదంపడి యావసిష్ఠాదులైన, గురుజనులయాజ్ఞఁ బాటించి పరమధర్మ
మార్గమున రాముఁడనిశంబు మహినినేల, సాగె సర్వప్రజానురంజకముగాఁగ 1352

గీ॥ రామరాజ్యమునందలి ప్రజలనూన, సౌఖ్యసంతోషములతోడ సంతతంబు
శాంతియుతముగజీవింత్రు సుంతయైనఁదమకునేలోటునన్‌లేక ధార్మికులయి. 1353

## ఆయోధనకాండముతో గ్రంథము సమాప్తము



